ఇందు **'జయ'** శబ్దం సంఖ్యా (18) సూచి.

ఈ పుస్తకంలోని వ్యాసాలు కొన్ని వివిధ పత్రికలలో ప్రచురించబడినాయి. ఆయా పత్రికాధిపతులకు నా నమస్సులు.

కొన్ని వివిధ సాహితీ సంస్థలలో నేను చెప్పిన ఉపన్యాసాలు. నన్ను ఉపన్యాసకుడుగా ఆహ్వానించిన ఆయా సంస్థల నిర్వాహకులకు ధన్యవాదాలు.

రెండు వ్యాసాలు రేడియో ("కర్నూలు దర్శనీయ స్థలాలు" - కడప ఆకాశవాణి; మనుచరిత్ర భారతీయ సంస్కృతి - కర్నూలు ఆకాశవాణి) ప్రసంగాలు. సంబంధిత ఆకాశవాణి అధికారులకు కృతజ్ఞతలు.

-రచయిత

# విషయ సూచిక

# 1. 'ప్రజావాఙ్మయ' పరిచయం

## (రాయలసీమ ప్రాంతం)

### I. విషయ పరిచయం :

ప్రజాశబ్దం సామాన్య జన బాహుళ్యానికి ఉపలక్షకం. ప్రజావాఙ్మయమంటే సుమారు వంద సంవత్సరాలుగా జానపద సంబంధమైనదిగానే ప్రసిద్ధిలో వుంది. అందువల్ల ప్రజావాఙ్మయమంటే సామాన్యజనులకు అందుబాటులో వుండే వాఙ్మయం అని అనుకోవాలి. ప్రజాకవి, దే కని లాంటి ప్రయోగాలు ఈ అర్థాన్నే లక్షించాయి. వేమన వంటి కవుల్ని ప్రజాకవులుగ సమాజం గుర్తించింది. కనుక ప్రజావాఙ్మయ నిర్వచన విషయంలో విప్రతిపత్తి లేదు. ప్రజావాఙ్మయమంటే జానపద వాఙ్మయమనే భావం

జనపదం అన్నదానికి నగరంకానిది అన్న అర్థం సర్వసమ్మతమే. కాగా జనపదం అన్నపదం గ్రామప్రాంతానికి చెందుతుంది. అనుకోవాలి. జానపదులు పగలెల్లా శ్రమించి రేలల్లో (రాత్రుల్లో) విశ్రాంతి సమయాల్లో జానపద సాహిత్య ప్రక్రియల్ని తమకిష్టమైన వాటితో ఆనందిస్తుంటారు. పదానికి, జనపదానికి అవినాభావ సంబంధముంది. జానపదులు పదం పాడుతూ, కదం త్రొక్కుతూ వెన్నెల రాత్రుల్లో ఎన్నో వినోద కాలక్షేపాలు చేస్తుంటారు. ఏ భాషలోనైనా తొలికవిత పదమే అన్నది నిశ్చితార్థం. కాగా మార్గకన్నా దేశీయమైన జానపద కళారూపాలు ప్రాచీనాలనే సిద్ధాంతం. అందువల్ల జానపద వాఙ్మయంతో ఎంతో వైవిధ్యంతో అనేక సాహితీ ప్రక్రియలు వున్నాయి. అవి ప్రతిదేశంలోను వుంటాయి. తెలుగు విషయంలో ప్రాంత భేదాన్ని బట్టి ఆయా ప్రక్రియల విధానాల్లో, పేర్లలో కొంత తేడా కనిపించినా వాటి లక్ష్యం ఒక్కటే.

శిష్ట సాహిత్యానికి ఆలంకారికులు లక్షించిన పరమానంద ప్రయోజనమే ప్రజావాఙ్మయానికి కూడా వర్తిస్తుంది. ఆంధ్ర విషయంలో రాయలసీమ ఒక ప్రత్యేకమైన చారిత్రక ప్రాధాన్యమున్న ప్రాంతం. ఆచార వ్యవహార వేష భాషా వైఖరుల్లో యితర తెలుగు ప్రాంతాలకన్నా యిక్కడ కొంత వైలక్షణ్యం ద్యోతకమవుతుంది. తీరాంధ్రప్రాంతం, తెలంగాణా ప్రాంతం జీవన విషయంలో

గాని, సంస్కృతి సంప్రదాయాల విషయంలోగాని, ఆహారాదుల్లోగాని రాయలసీమకన్నా కొంత భిన్నంగా వున్నాయి. ఈ విభిన్నత ఎలావున్నా జానపద వాఙ్మయ ప్రక్రియల్లో సారూప్యత లేకపోలేదు. భాషా ఉచ్చారణల్లో రాయలసీమకు, మిగిలిన ప్రాంతాలకు 'యాస'లో తేడావున్నా జానపద ప్రక్రియల లక్ష్యం మాత్రం ఒక్కటే.

కట్టమంచి రామలింగారెడ్డి గారన్నట్లు రాయలసీమ వాసులు పార్వతీయులు, కోస్తావారు సాగరేయులు. కనుక పర్వత ప్రాంతాలకు సంబంధించిన సంస్కృతి, నాగరికత తీరాంధ్ర ప్రాంతానికి సంబంధించిన సంస్కృతి, నాగరికత వేరువేరుగా వుండడం సహజమే. ఆయా ప్రాంతాల్లోని జీవన విధానం కూడా వేరుగా వుంటుంది. అందువల్ల సామాన్య ప్రజలు అంటే జానపదుల జీవన విధానాన్ని బట్టి వారి వాఙ్మయం కూడా జాలువారుతుంది. దీనివల్ల ఆయాప్రాంతాల్లోని భిన్నంగా కన్పించే జానపద వాఙ్మయానికి హేతువు (తల్ తత్) ఆయా ప్రాంత వాసుల జీవన విధానమే అని అనుకోవాలి. కనుక జానపద వాఙ్మయం జానపదుల జీవన సరళిని బట్టే ఆవిర్భవించిందని చెప్పాలి.

యావదాంధ్రం రాయలవారి పాలనలో వున్నా చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి జిల్లాలకు రాయలసీమ అనే పేరు స్వతంత్రానికి ముందునుంచే వుంది. కొన్ని రాజకీయ కారణాల వల్ల బళ్ళారి కన్నడంలో చేరింది. కాగా మిగిలిన నాలుగు రాయలసీమ జిల్లాలుగా నిలచిపోయాయి.

ప్రజావాఙ్మయం ఒక జీవనది. ఈ నది ప్రవహించని చోటేలేదు. ఇది ప్రవహించినంత దూరం పరుగెత్తి పరిశోధించడం సాధ్యంకాదు. ఇది దేశంలో ఏఏ ప్రాంతాల్లో ఎలా ప్రవహించి ఉరవళ్ళు తొక్కిందో ఆయా ప్రాంతాల పరిశోధకులు అందులో మునకలు వేయాల్సిందే. అప్పుడే తెలుగు దేశీయమైన జానపద వాఙ్మయ సంపద ఎంతో అభివ్యక్తమవుతుంది.

ప్రస్తుతం పరిశోధనకు ఎన్నుకొన్న ప్రాంతం రాయలసీమ. రాయలసీమ ప్రాంతంలో నాలుగు జిల్లాలున్నాయి. చిత్తూరు తమిళనాడును, అనంతపురం కర్నాటకను సరిహద్దు ప్రాంతాల్లో స్పృశించాయి. అందువల్ల చిత్తూరు ప్రాంతంలో కొంత తమిళ జానపదశైలి, అనంతపురం కర్నాటక సరిహద్దుల్లో కొంత కన్నడశైలి ఆయా ప్రాంత ప్రజావాఙ్మయ ప్రక్రియల్లో కనిపించడం ప్రధానంగా గమనించాల్సిన విషయం. అందువల్ల అచ్చమైన జానపద వాఙ్మయ శైలితోపాటు, సరిహద్దు ప్రాంతాల మిశ్రమ జానపద శైలికూడా మిళితమై

కన్పించడం గుర్తించదగ్గ అంశం.

పై విషయం ఎలావున్నా రాయలసీమ ప్రజావాఙ్మయంలో ఏకరూపతను సాధించిన కొన్ని ప్రక్రియలు పరిశీలించదగ్గవి. ఒక పదంకాని, గేయంగాని, పాటకాని అవతరించేదానికి ఒక పండుగో, ఒక జాతరో, ఒక దేవతో ఏదో ఒకటి కారణంగా కన్పిస్తుంది. పై అంశాన్ని బట్టి ప్రజావాఙ్మయం అవతరించేదానికి కారణం వుంది అని తేలింది.

నిరంతర శ్రమజీవనులైన రాయలసీమ గ్రామికజనులు శ్రమాపనయార్థం గీతాలను పాడుకుంటారు. అవి శ్రమ విస్మృతిని వారికి కలిగిస్తాయి. అలా పుట్టినవే నాట్లపాటలు, కోత పాటలు, దంపుళ్ళ పాటలు, విసుర్రాళ్ళ పాటలు మొదలైనవి.

ప్రజావాఙ్మయంలో ఎన్నోశాఖలు బయలుదేరాయి. దానికి ఎన్నో హేతువులు. హేతువులు ఎన్నైనా వాటి పరమలక్ష్యం ఒక్కటే. అది గ్రామిక జనజీవనాన్ని పరమానందమయం చేయడమే!

హరికథలు, బుర్రకథలు, జంగం కథలు, కూచిపూడి ప్రదర్శనలు, వీధిభాగవతాలు, బొమ్మలాటలు, భారత కథలు, గంగిరెద్దులాట, కోలాటలు, చెక్కభజనలు, బుడబుక్కల ప్రదర్శనలు, కాటిపాపల, విప్రవినోదుల వింత వింత ప్రదర్శనలు, పురాణ శ్రవణం ఇలా ఎన్నో శాఖలు ప్రజావాఙ్మయ సౌందర్యానికి పట్టుకొమ్మలై జానపద జీవన సరళిలో అంతర్భాగాలైనాయి. వాటి సంగ్రహ పరిచయం-

## 1. హరికథలు :

ఇవి అన్ని ప్రాంతాల్లో ఈ పేరుతోనే వ్యాప్తిలో వున్నాయి. పూర్వం పురుషులే కథకులు. ఈ కాలంలో స్త్రీలు కూడా కథకురాండ్రు కావడం స్త్రీవిద్యాప్రగతికి సంకేతం. పురుష కథకుల్ని భాగవతారులు అని, స్త్రీ కథకురాండ్రని భాగవతారిణి అని అంటారు. 'తౄ' - తరణె ధాతువు నుండి వ్యుత్పన్నమైన పై పదాలు తరింపజేయడం అనే అర్థంలో వాడుకలో వున్నాయి. భాగవతారు అనగా తరింపజేసేవాడు అని భావం.

ముందుకాలాల్లో భగవత్‌పరమైన కథల్నే హరికథలు అనేవారు. తరువాత కొంతకాలానికి భగవద్భక్తుల కథలు కూడ హరికథలుగా యోగ్యతను పొందాయి. నాటి హరికథ కథన విధానం వేరు, నేటి హరికథా కథన పద్ధతి వేరు. నేటి సామాజికుల అభిరుచిని బట్టి సినిమాబాణీ హరికథల్లో అధికంగా వుంది. ఏమైనా హరికథల్ని గూర్చిన ఒక సమగ్ర పరిశీలన అవసరం.

2. బుర్రకథ :

ముందుతరాల్లో ఇది కరుణ, వీర రసాలకే పరిమితంగా వుండేది. బాల నాగమ్మ కథ, సన్యాసమ్మ కథ, బొబ్బిలి యుద్ధం లాంటివి రాయలసీమ ప్రాంతాన్ని ఉర్రూతలూగించాయి. వంతపాటతో కథకుడు యిద్దరిమధ్య నిలుచుండి ఉచితమైన ఆహార్యకంతో రసానుగుణమైన హావభావాలతో చేసే ఈ కథాప్రదర్శన జానపదుల్లో ఒక చైతన్యాన్ని కలిగించేది. బుర్రకథా విస్తృతి రాజకీయాల్లో కూడ కన్పిస్తుంది. మొట్టమొదట ఈ ప్రక్రియను ఎన్నికల ప్రచారానికి వాడింది భారత కమ్యూనిస్టు పార్టీవారు. ఇది పుచ్చలపల్లి సుందరయ్యగారి ఆలోచన. తరువాత తెలుగుదేశం పార్టీవారు దీన్ని విరివిగా వాడుకున్నారు. ఇలాంటి ప్రజావినోదకరమైన వాఙ్మయ ప్రక్రియను ఆదరించడం చాల అవసరం.

3. జంగం కథ :

జంగాలు చెప్పేకథ జంగం కథ. రాయలసీమ ప్రాంతంలో బుడిగి జంగాలు అనే ఒకజాతి వుంది. మొదట్లో వీరే ఆ కథల్ని చెప్పేవారు. ఇపుడు జాతి వివక్షారహితంగా ఆ కథలు ప్రదర్శితాలవుతున్నాయి.

జంగాలు సహజంగా శైవులు. ఇంచుమించు వారి కథలన్నీ శివ కథాత్మకాలే. కథ ప్రదర్శన వేళలో వారు తప్పక ఆహార్యకంలో ఒక భాగంగా విభూతి ధారణ చేస్తారు. ఇది రాయలసీమ పల్లె ప్రాంతాల్లో విరివిగా సాగే ప్రజావాఙ్మయ ప్రక్రియ.

4. కూచిపూడి ప్రదర్శన :

కూచిపూడి ఒక అగ్రహారం. ఇది కృష్ణా జిల్లాలో వుంది. వీరు బ్రాహ్మణులు. వీరిని కూచిపూడి భాగవతులు అంటారు. యావదాంధ్రములో వీరి ప్రదర్శనలు జరిగాయి. రాయలసీమ వాసులు కాకపోయినా రాయలసీమ సామాన్య ప్రజాహృదయాల్లో కూచిపూడి వారి ప్రదర్శన ముద్ర బలంగా వుండడం వల్లా ఈ ప్రక్రియ గ్రహించబడింది. ఇది భరత నాట్యానికి ప్రతిద్వంద్విగా సాగిన ప్రక్రియ. అది మార్గ, ఇది దేశి. ఇదే రెండింటికి తేడా.

5. వీధి భాగవతం :

మిగిలిన ప్రక్రియలకన్నా యిది మరీ ప్రాక్తనమైన ప్రజావాఙ్మయ కళారూపం.

భక్తిని పామరుల్లో కలిగించేదానికి ఇది అవతరించింది. భాగవత శబ్దంతో ఇది పవిత్రకర్మగానే వ్యవహృతమైంది.

## 6. బొమ్మలాట :

దీనికి తోలు బొమ్మలాట అనిపేరు. భారత రామాయణ కథల్ని వీరు ఎక్కువగా ప్రదర్శిస్తారు. ఆయాపాత్రల రూపాల్ని తోలుబొమ్మలుగా తయారు చేసుకుంటారు. దాసరి కులంలో ఒక తెగకు చెందిన వీళ్ళు కోడికూసిన ప్రతి పల్లెలో కూడ ప్రదర్శనలిచ్చారు. దాసరి సుబ్బారావు, లక్ష్మమ్మవంటి తోలుబొమ్మలాటగాళ్ళు రాయలసీమ ప్రాంతాల్లో మంచిపేరులో వున్నారు. బొమ్మలు చేసికోవడం, రంగులు పూయడం వంటి కళలు కూడ వీరికి కుల క్రమాగతాలే. వీరు రామాయణ ప్రదర్శనలో రంగనాథ రామాయణ ద్విపదల్ని పాడుతూ, ఆయా కథా ఘట్టాల్ని ప్రదర్శించేవారు. ఆయా రసస్ఫూర్తిని గొంతు మార్పుతో జానపదుల్లో కలిగించడంలో వీరు సిద్ధహస్తులు. ఇది మొదట జావాలో పుట్టినా, తెలుగుదేశానికి సొంతమైంది. మరుగున పడుతున్న దీని పరిశీలన అత్యవసర కర్తవ్యం.

## 7. భారత కథలు

రాయలసీమ ప్రాంతాల్లో చిత్తూరు తప్ప మిగిలిన జిల్లాల్లో భారతం హరి కథలుగా, పురాణంగా చెప్పబడుతుంది. కాని చిత్తూరు ప్రాంతంలో భారత కథల్ని చెప్పించే పద్ధతి వేరు. అర్జునుడు తపసుమాను ఎక్కడం చిత్తూరు జిల్లాలో మాత్రమే వుంది. చిత్తూరు జిల్లాలో భారత కథా ప్రదర్శన విధానం మీద ప్రత్యేక వ్యాసం వ్రాయాలి.

ఈ విషయంలో చిత్తూరు ప్రత్యేకతను ఇతర ప్రాంతాలకు తెలియజేయాల్సిన అవసరముంది. కంగుంది కుప్పానికి చెందిన ఒక వర్గం వారికి ఈ భారతకథా ప్రదర్శన కులవృత్తి. ఇది చిత్తూరుజిల్లా సంస్కృతి-చరిత్రలో ఒక అంశంగా పరిగణించదగ్గది.

## 8. గంగెద్దులాట :

ఇది రాత్రివేళల్లో ముఖ్యంగా వెన్నెలకాలాల్లో ఎక్కువగా జరపబడే ఒక వినోదం. ఆవును సీతమ్మగా, కోడెదూడను రామయ్యగా లక్షించి తద్వారా రామభక్తిని ప్రాకృతుల్లో ప్రాకృతులే వ్యాప్తిచేసే విధానం. వందలాదిమంది

రామయ్య, సీతమ్మకు పెళ్ళికి గుడ్డలు, డబ్బులు, గింజలు తెచ్చివేస్తూ వుంటారు. తెల్లవారేసరికి ఆ పెళ్ళి జరిగిపోతుంది. పెళ్ళితంతు అంతా సంప్రదాయబద్ధంగా సాగుతుంది. ఇది పాతికేళ్ళ కిందటివరకు ఎక్కువ జనాదరణ పొందిన ప్రజాప్రదర్శన ప్రక్రియ.

## 9. కోలాటం :

ఉగాది, శ్రీరామనవమి మొదలైన పర్వదినాల్లో జానపదులు కోలాటాన్ని వేస్తారు. దీని అర్థం దీని పేరులోనే వుంది. కోలతో ఆడే ఆట కోలాటం. ఇందులో పురుషులే ఎక్కువగా పాల్గొంటారు. కారణం ఇది ఎక్కువ శారీరక శ్రమతో కూడింది. కాళ్ళకు గజ్జెలు కట్టుకొని భక్తిభావనాభరితాలైన పదాల చరణాన్ని పల్లవి, అనుపల్లవి మర్యాదతో గట్టిగా పాడుతూ ఎగురుతారు. అది లయబద్ధంగా వుంటుంది. "రామలాలి-మేఘశ్యామలాలి" వంటి పదాలు ఆధారాలు. ఇది అచ్చంగా దేశీయమైనదే అయినా రాయలసీమలో, అందులోనూ కడప, కర్నూలు జిల్లాలలోనే ఎక్కువగా ప్రదర్శిస్తున్నట్లు కన్పిస్తుంది. తాళం వేసేవాడు మధ్యలో వుంటాడు. ఆటగాళ్ళు వలయంగా తిరుతారు. ఇది విశేష జనాదరణ పొందిన ప్రజాప్రదర్శన.

## 10. చెక్కభజన :

చెక్కభజన భక్తిపారమ్యాన్ని కలిగించే ఒక విశిష్ట ప్రక్రియ. ఏపె, టేకు, జిట్టేగు, బిల్లు మొదలైన కొయ్యలతో చేయబడిన చిటికెలు (పలకలు) చేతబట్టి, గాత్రమాధుర్యమున్న కొందరు పాడుతూ, ఎగురుతూ వెమటోడుస్తూ వుంటారు. నిజానికి ఇది కోలాటానికి అనుబంధమే. ఇది కడపజిల్లా గ్రామసీమల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ప్రక్రియలన్నీ భక్తిభావనాత్మకాలే. వీటిద్వారా జానపదుల్లో భక్తిభావాన్ని కలిగించడమే ఇందులోని ఆంతర్యం.

## 11. బుడబుక్కల ప్రదర్శన :

దాసర్లలో వీరిది ఒక తెగ. ఈ కులం ధ్వన్యనుకరణాన్ని బట్టి ఏర్పడింది. డమరుకంలాంటి చర్మనిర్మితమైన సాధనాన్నిబట్టి వేకువనే ప్రతి యింటి గడపలో భావిఫలాఫలాన్ని చెప్పిపోతారు వీరు. దాన్నిబట్టి 'బుడబుక్కల జోస్యం' అన్న పేరు నిలిచింది. అజ్ఞానులైన జానపధులకు భావిఫల సూచకాలైన వీరి వాక్యాలు ఎంతో ఆనందాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తాయి.

## 12. కాటిపాపలు :

వీరు మాలకులంలో ఒక తెగవారు. మంత్రతంత్రాదులు తెలిసినవారు. కనికట్టు అనే విద్య వీరివద్ద ఉంటుంది. పూర్తిగా నల్లటివేషంలో వుంటారు. ఎన్నో వినోద ప్రదర్శనలు చేస్తూ ఆశ్చర్యావహకులైన కనికట్టు విద్యల్ని ప్రదర్శిస్తారు. పామరుల్లో తాత్కాలిక భయోత్పాహాల్ని కలిగించడంలో వీరు నిపుణులు. యాచనలో వీరి మొండితనం ఇంతా అంతా కాదు. ఇపుడు ఈ జాతి అంతరించిందనే చెప్పాలి. అందుకే ఈలాంటివారి విషయాన్ని గుర్తించాల్సిన అవసరముంది.

## 13. విప్రవినోదులు :

వీరందరు బ్రాహ్మణులు. పౌరాణిక, చారిత్రక పురుషుల వేషధారణతో పల్లీయుల్లో విశేషమైన ఆసక్తిని కలిగిస్తారు. కొద్దిరోజుల పాటు పగటిపూట ఎన్నో వేషాలువేసి ఇంటింటివద్ద ప్రదర్శనలిస్తారు. చివరలో గ్రామీణులు తృప్తితో ఇచ్చినదానిని తీసికొనిపోతారు. అర్థశతాబ్దం క్రిందటివరకు వీరి కళాప్రదర్శనలు రాయలసీమ జిల్లాల్లో ఎక్కువగా జరిగేవి. ఇది అధిక జనాదరణ పొందిన ప్రక్రియ. ఆహార్యకం వల్ల, చిత్రలేఖనం, వేషధారణ వల్ల నాటకం, వారి వాచకం వల్ల కవిత్వం, గానం వల్ల సంగీతం పామరులకు అనుభవానికి వస్తాయి. మొత్తానికి ఇది ప్రతిభావంతమైన ప్రదర్శన.

ఇట్లే పురాణశ్రవణం, పాములవాళ్ళ ఆట, జక్కులాటలు, కొరవంజులు మొదలైన ప్రక్రియలు పరిశీలనార్హాలు.

# 2. యక్షగానం - సమాహారకళ

ప్రకృతి ఒడిలో పసిబాలునిలా పెరుగుతూ, కాలానుగుణంగా వచ్చే మార్పుల్ని తట్టుకుంటూ, తన అస్తిత్వం కోసం పోరాడుతూ,ఆలోచించడం నేర్చుకొని, ప్రకృతిని అర్థం చేసుకొని, తనలో సృజనాత్మక శక్తిని పెంపొందించుకొని తక్కిన ప్రాణికోటి కన్న భిన్నంగా బ్రతకడం నేర్చుకున్నాడు మానవుడు. మాట నేర్చాడు, పాట కట్టాడు, ఆట ఆడాడు, ఆమాట, పాట సాహిత్యస్థాయికి ఎదిగి అభినవ కళారీతుల్ని సంతరించుకున్నాయి.

ప్రాచీన మానవులు తమలో కలిగిన స్పందనను, అనుభూతుల్ని తమకు తోచిన రూపంలో నాటకీయంగా మలచుకొని ఆనందాన్ని అనుభవించారు. అట్లా ఆవిర్భవించినవే ఒరియావారి ఒడిస్సీ, మణిపురి, కేరళీయుల-కథకళి; మార్వారు వారి-గంధర్వ నృత్యం, నేపాలు వారి-గంధర్వ గానం, ఆంధ్ర, తమిళ, కన్నడీగుల-యక్షగానం.

తియ్యని తెలుగుదనాన్ని ప్రదర్శించే తెలుగు సాహిత్య ప్రక్రియల్లో యక్షగాన ప్రక్రియ ముఖ్యమైంది. సాహిత్యం, సంగీతం, నృత్యం, అభినయం, గానం, వాచికం, అలంకరణ, దుస్తుల వేషధారణ మొదలగు వానిని తనలో విలీనం చేసికొని సర్వకళల సమాహారంగా చక్కని-చిక్కని పరపూర్ణతను పొందినదృశ్య రూపక కళ యక్షగానం. మన దేశీయ సంస్కృతికి కాణాచిగ నిలిచి, తెలుగుదేశం పురిటిగడ్డగా గల ఈ యక్షగాన ప్రక్రియ మార్గసరణికి భిన్నంగా, ఆబాల గోపాలానికి అనుభవ గమ్యంగా రాణించింది. యక్షగాన ప్రక్రియ ఎటువంటి ఛందోబంధాన్నైనా తనలో ఇముడ్చుకోగలదు. సంగీత నాట్యాల కేర్పడిన వికాస వ్యాప్తుల ఆధారంగా, కవుల ఆసక్తిననుసరించి ప్రయోక్తల అవకాశాల బట్టి యక్షగానం అనేకానేక రూపాలు చెందింది. అట్టి యక్షగానం నేడు వికాసం చెంది సమాహార కళ అయ్యింది.

"యక్ష"-"గాన"పదాలు రెండూ సంస్కృత పదాలే కాని "యక్షగానం" మాత్రం సంస్కృత సంబంధి గాదు, జక్కుల పాట ఆధారంగా వచ్చిందని పండిత పరిశోధకుల అభిప్రాయం. "యక్షగాన" మనగానే 'యక్షుల పాట' అని స్ఫురిస్తుంది. కాని యక్షులకు-ఆంధ్రులకు, యక్షులకు-తమిళులకు,

యక్షులకు-కన్నడీగులకు గల సంబంధమేమిటో తెలియరాదు. జైమినీ భారతం (III.203-272) ఆధారంగా 'యక్ష' శబ్దానికి విచిత్ర వస్తువనే అర్థం స్ఫురిస్తుంది. బౌద్ధ సారస్వతం పరిశీలిస్తే, యక్షులకు రక్షక భటులుగా నీతి ప్రవక్తకులుగా పేర్కొనబడ్డారు.

మనకు 12వ శతాబ్దినుండి యక్షగాన ప్రస్తావన కనిపిస్తుంది. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర పర్వతప్రకరణంలో

"ఆదట గంధర్వ యక్ష విద్యా ధరాధరులై
పాడెదు నాడెదు వారు....

అని పేర్కొన్నాడు.

యక్షగాన చరిత్రను నిశితంగా పరిశీలిస్తే మూడు దశలుగా విభజించవచ్చు గేయరూపంలో ఉండే యక్షగానాలు మొదటి దశకు చెందినవి ఈ మొదటిదశకు చెందిన యక్షగానాల్లో వచనం స్వల్పంగా ఉండేది. సూత్రధారుడు వుండేవాడు కాదు. ఒక స్త్రీగాని, పురుషుడు కాని హావభావాలలో పాటపాడి వినిపించేవారు.

ెయ దశలో యక్షగానాలు సంవాద రూపాన్ని పొందాయి. కవితా ధోరణికి గంధర్వుల గాంధర్వం తోడై కనక ప్రసూనాలకు చక్కని తావి అబ్బినట్లైందని కట్టా వరదరాజు "శ్రీరంగమహాత్మ్యం"లో తెలిపాడు.

యక్షగానం ః నాటకాల్లో అభేదం చెందడం యక్షగాన వికాసంలో మూడవ దశ 17వ శతాబ్దంలో నాయక రాజుల కాలంలో ఏర్పడిందని చెప్పవచ్చు.

"సర్వ శాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రదర్శకమ్
నాట్య సంజ్ఞమిమం వేదం సేతిహాసం కరోమ్యహం
ఏవం సంకల్ప్య భగవాన్సర్వాన్వేదా ననుస్మరన్
నాట్యవేదం తతశ్చక్రే చతూర్వేదాజ్ఞ సంభవమ్
జగ్రాహ్య పాఠ్య మృగ్వేదా త్సామభ్యోగీత మేవచ
యజుర్వేదా దభినయా న్రసానాథర్వణాదపి
వేదోపవేద సంబద్ధో నాట్యవేదో మహాత్మనా
ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా లలితాత్మకమ్
ఉత్పాద్య నాట్యవేదంతు బ్రహ్మావాచ సురేశ్వరమ్"

ఋగ్వేదాన్నుంచి వాచకాన్ని, యజుర్వేదాన్నుంచి అభినయాన్ని అథర్వణ

వేదాన్నుంచి రసాన్ని, సామవేదాన్నుంచి సంగీతాన్ని గ్రహించి బ్రహ్మ పంచమ వేదంగా నాట్యవేదాన్ని ప్రవచించినట్లు భరతముని తెలిపాడు. వీథినాటకాలకు చాల వయస్సు ఉన్నట్లు శాతవాహుని గాథాసప్తశతి సాక్ష్యం. వీథినాటక లక్షణాలు, దేశివాద్య విశేషాలు రెండు వేలసంవత్సరాలకు పూర్వమే వున్నట్లు ఆనాటి శిల్ప రూప అవశేషాలాధారంగా తెలిసికోవచ్చు.

నన్నయ్య "ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కుసూచిత" అని రాజరాజు నోట అనిపించాడు. అంటే నన్నయ్య నాటికి నాటకాలు ప్రచారంలో వున్నట్లు గుర్తించవచ్చు.

వీథుల్లో ఆడే నాటకం కాబట్టి ఇది వీథి నాటకం అయ్యింది. సహజంగా వీధి నాటకాలకు రంగస్థలాలు ఉండవు. దేశం రాజుల ఏలుబడిలో నున్నకాలంలో సంస్కృత భాష, సంస్కృతనాటకాలు రాజస్థానానికి పరిమితమయ్యాయి. ఆరోజుల్లో ప్రజలకోసం ప్రజల భాషలో ప్రజానాటకాలు అవసరమయినాయి. ఆవిధంగా ఏర్పడిన ప్రజానాటకాలే వీధి నాటకాలు, జానపదులు సామాన్యంగా ప్రాచీన కాలంలో ఎక్కువగా విశ్రాంతివేళల్లో గ్రామంలో ఏమ్రిచెట్టు క్రిందో, రావిచెట్టు క్రిందో గుంపులుగా చేరేవారు. రాత్రిపూట భోజనానంతరం వీథుల్లోకి తప్పకుండా వెళ్ళేవారు. ఆవిధంగా 'వీథి' అనేది సామాన్య ప్రజంకు సంకేతమయింది. కాబట్టి ప్రజానాటకాలు వీథినాటకాలయ్యాయి.

వీథి నాటకానికి రంగస్థలం వీథి. నడివీథిలో ప్రజలమధ్య నాటకం ప్రదర్శించేటపుడు మైకులు లేని కాలంలో మాటలు స్పష్టంగా వినబడక పోవచ్చు. అందుకే మాటకన్నా వీథి నాటకాల్లో పాటకు ప్రముఖ్యం ఏర్పడింది. హావ భావ విలాసాలు స్పష్టంగా కనిపించవు కాబట్టి హస్తముద్రలు నృత్యాభినయాలు అధికమయినాయి. ఈ ఆట, పాటకూడ ఏ ఒక్కరో ఆడినా కూడా స్పష్టంగా ఉండదు, అందుకని వంతపాటగాళ్ళు ఎక్కువైనారు హంగుదారులు అధికమయినారు. ఈ విధంగా వీథినాటకాల్లో ఆటపాటల ప్రాముఖ్యం పెరిగింది.

ఇట్టి వీథి నాటకంతో యక్షగానం క్రమవికాసం చెంది అభేదాన్ని పొందింది. యక్షగానాల్ని ఈనాడు దేశి సరణికి చెందిన నాటకంగా పండితులు, పరిశోధకులు పరిగణిస్తున్నారు.

యక్షగాన నాటక ప్రక్రియ సంస్కృత రూపక, ఉపరూపకలక్షణాల కంటె విలక్షణంగా ఉంటుంది. ఈ విలక్షణమే యక్షగానం యొక్క దేశిత్వాన్ని నిరూపిస్తుంది. దేశీయ ఛందోబద్ధమైన నాటకం యక్షగాన నాటకం ప్రాంతాన్ని

బట్టి ప్రదర్శనల ననుసరించి పేరులోను, రూపంలోనుకొద్ది తేడాల్ని కలిగి వీథినాటకం, వీథిభాగవతం, కూచిపూడి భాగవతం, తూర్పు భాగవతం, గంటె భాగవతం మొదలగు కళారూపాల్తో యక్షగాన నాటకం సామ్యాని కలిగి ఉంది.

'యక్షగాన నాటకం' అనే సమస్త పదం నాయక రాజుల కాలంలో ఏర్పడింది. యక్షగానం-వీధినాటకంతో అభేదం చెందిన ఈ దశను తిరిగి రెండు దశలుగా విభజించవచ్చు. అందు మొదటి దశ యక్షగానం వీథినాటక గుణాల్ని గ్రహించడం, రెండవది యక్షగాన వీథినాటకం ఒకటే కావడం.

యక్షగాన నాటకానికి ప్రధానాంగాలు రేకులు, దరువులు, ద్విపదపద్యం, గద్యం, పదం మొదలగునవి. వీటి నడక తాళనిబద్ధం. ముఖ్యంగా ఆట తాళం, రూపకతాళం, ఏకతాళం, జంపెతాళం, త్రిపుటతాళం మొదలయినవి. "రేకులు""దరువులు" నాటకానికి విశేషాలని ఒక వాదం ఉంది. కాని క్రమంగా యక్షగానాలు, వీథి నాటకాలు రెండూ ఒకేరూపక ప్రక్రియగా పరిణతి చెంది రెండింటి లక్షణాలు అల్లుకుపోయి అవి ఒకే కళారూపంగా మారిపోయాయి.

యక్షగానంలో అధికం పౌరాణిక ఇతివృత్తాలే. యక్షగాన నాటక ప్రదర్శనల్లో రంగం విషయంలో అభివృద్ధి నేటికీ శూన్యం. ఊరి ముందరో, ఊరిలోని గుడిముందరో లేక అప్పటికప్పుడు నిర్మించిన చిన్నపందిరి క్రిందనో ఈ యక్షగాన నాటక ప్రదర్శన జరిగిపోతుంటుంది. కటిక నేలయే రంగస్థలం. అటు, యిటు మనుష్యులు పట్టుకొన్నదో లేక రెండు కర్రలకు వేలాడగట్టిన తెల్లని వస్త్రమే తెర. తెర లోపల హంగుదారులు, వంతపాటకులు ఉంటారు. యక్షగాన నాటకానికి ప్రధానంగా కావలసింది తిత్తి, మద్దెల, తాళపుచిప్పలు.

యక్షగాన నాటకానికి ప్రాణం సూత్రధారుడు. ఈ సూత్రధారుడే ప్రదర్శనా ప్రవర్తకుడు. సామాన్యంగా ఈ యక్షగాన నాటకాల్ని రాత్రులందే ప్రదర్శించేవారు. క్రమక్రమంగా ఇపుడు ముఖ్యంగా తెలంగాణా ప్రాంతాల్లో పగలుకూడ ప్రదర్శిస్తున్నారు.

యక్షగాన నాటకాల్ని ప్రదర్శించి తరువాత ప్రదర్శకులు డబ్బు అడుక్కునేవారు. ఆ నాటకాన్ని తిలకించినవారు వారికి తోచింది ఇచ్చేవాళ్ళు.

పాత్రల సమ్మేళనం నాటకం, నాటకేతివృత్తంతో పాత్రలకు పూర్తిగా ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. కాని కొన్ని దేశ జానపదరూపకాలల్లో కొన్ని సాంప్రదాయక పాత్రలుంటాయి. ఉదా : తోలుబొమ్మలాటలో బంగారక్క, జుట్టుపోలిగాడు, బోడిగాడు మొదలగునవి. అలాగే యక్షగాన నాటకంలో

అనేక ప్రాంతాల్లో కనిపించే సాంప్రదాయక పాత్రలు "మాధవి", "సుందరి కొడుకు", "సింగి", "సింగడు", "మంత్రసాని" పాత్రలు. ఇవి ఆషామాషా పాత్రలు కావు. కథతో పూర్తిగా కలసిపోయి నడిచే పాత్రలు ఒకరకంగా ఇవి కథను నడిపించే పాత్రలు. హాస్యరస ప్రధానమైన ఈ పాత్రలు యక్షగాన నాటకానికి పట్టుగొమ్మలు. ఇవి సూత్రధారుని వంటివి. ఈ పాత్రలలో ఏదో ఒకటి మొదట ప్రవేశించి కథానుగత పాత్రల్ని ప్రేక్షకులకు పరిచయంచేస్తుంది. పాత్రల స్వగతాన్ని ప్రేక్షకులకు తెలుపుతుంది. నాయికా నాయకులకు శృంగార సహాయకపాత్ర ఉంటుంది. ఆ పాత్ర పోషించే నటునికి వీలైనంతవరకు ఆ నాటకం పూర్తిగా వచ్చిఉండాలి. సామాన్యంగా ఈ పాత్రకు ప్రత్యేక వేషధారణ ఉండదు. కండువా పంచెకట్టు ఉంటుంది.

యక్షగాన వీథినాటకాల్లో పాత్ర ప్రవేశం ఒక ప్రత్యేకతను కలిగిఉంటుంది. ప్రవేశించు పాత్ర తనను తానే పరిచయంచేసికోవడంగాని లేక సూత్రధారునివలె నుండు మాధవాదుల పాత్రలు పరిచయంచేయడంగాని ఉంటుంది.

ఉదా : దుర్యోధనుని ప్రవేశం అప్పుడు దుర్యోధన పాత్రధారి తెరలో నుండియే

"రాజు వెడలె రవి తేజము లలరగ
సుయోధన సార్వభౌముడు వెడలె"

అని పాడుకుంటూ ప్రవేశిస్తాడు. లేకపోతే మాధవాది పాత్రలు ప్రవేశించే పాత్రను ముందుగానే తెలియజేస్తాయి.

ఉదా : 'ద్రౌపదీ కళ్యాణము' అనే యక్షగాన నాటకంలో ద్రుపదుని ప్రవేశానికి ముందు 'కటిక'వాడు ప్రవేశించి

"వినవోయి భాగవతులారా మా ద్రుపదమహారాజు కొలువునకు వచ్చుచున్నాడని డెబ్బదిరెండు వినియోగాలవారికిని హెచ్చరిక" అంటాడు. తరువాత "వేత్రకరునిచే కొలువుకూటాలు శృంగారింపబడిన వార్త విన్నవాడై ద్రుపద ధరణీ మండలాఖండలుండు సకల భూషణభూషితుండై తన నిత్యకొలువునకు వచ్చెడి మార్గంబు" ఎట్టిదనిన

"ద్రుపదరాజు వెడలె నిండుకళలమీరు
చెంగల్వరాయని కైవడిని
కనకాంబరము గట్టి - నవలు సిగనుజుట్టి
కినిసి వంకి చేతఁబట్టి - గిలుకుపావలు మెట్టి

ఘనమైన వాలుగేలుc - గాంతి మీఱcగcజాల
గనకొని జగమెల్లc - గొండాడcగా నీవేళ"

అని పాడుతాడు. అప్పుడు ద్రుపదమహారాజు పాత్ర ప్రవేశం జరుగుతుంది. ఈ పాత్రల ప్రవేశంలో మనం మరొకచిత్రాన్ని గమనించవచ్చు. పాత్రలు తమను తామే పరిచయంచేసుకొనేటపుడు కొన్ని పాత్రలు తమ ఆహార్యాన్ని గూడ విశదంచేస్తాయి.

ఉదా : ఒక రాజు పాత్ర ప్రవేశిస్తుందనుకుందాం, ఉపుడా పాత్ర

సింధురాజు సభకు వెడలెనూ
సైంధవుడనంగా సింధురాజు
సింధురాజు సభకు వెడలె - సింధురాడ్జ భీరుడగుచు
బంధుర పరివంథి గంధ సింధుర మృగరాజుడనుచు ||సింధు||

సాటిలేని నీటు మెరయుగా
కోటీరప్రభలు - కోటిసూర్యుల నోటు సేయగా
హాటక నవరత్న ఖచితహార యుగళరుచులు దిశల
నాటి వెల్గుచుండ కొల్వుకూటమునకు వాటముగను ||సింధు||

దండనాథులు పొగడుచుండగా
విభవంబు త్రిదశ మండలేంద్రు ధిక్కరింపగా
మండిత నవరత్న ఖచిత కుండలముల కాంతి
గండమండలంబు నిండ కైదండ భటులొసగుచుండ |సింధు||

వందిమాగధులు గొల్వగా ముందర నాట్యకుంద
రదనలాడుచుండగా"

అని పాడుకుంటూ ప్రవేశిస్తుంది.

సూత్రధారుల వంటి పాత్రలు పాత్ర ప్రవేశాన్ని తెలిపేటపుడు కూడ పాత్ర ఆహార్యాన్ని వర్ణించే సందర్భాలు అనేకం కనిపిస్తాయి.

ఉదా : "రతి కళ్యాణము" అనే యక్షగాన నాటకంలో పాత్ర ప్రవేశాన్ని మనం గమనించవచ్చు.

"నెజీ కురులును విరి - సరములు మెఱయును
నరయెదc బయ్యెద - జాఱగను |
పరువడి నేక న్ప - పాల శాహేంద్రుని
హరువు మీఱగొని - యాడుచును ||

అటే

"మైలవన్నె చీరగట్టి కోయిల - పుక్కిట
మాసిన విడెము పెట్టి కోయిల
చాల హెచ్చు కోయిల - శ్రీరతీదేవి
యేలినదాది వచ్చె"

మన విమర్శకులు కావ్య ప్రయోజనాల్ని గూర్చి విపులాతి విపులంగా చర్చించి ఆనందాన్ని కలిగించడం కావ్యం ప్రధాన ప్రయోజనంగా ఎక్కువమంది అంగీకరించారు. ఆనందం అనేక విధాలు. ముఖ్యంగా శారీరక ఆనందం, మానసికానందం. శారీరకానందం క్షణికమయింది. మానసికానందం శాశ్వతమైంది కాకపోయినా మళ్ళీ మళ్ళీ తలచుకొని అనుభవించడానికి ఉపయోగపడేది. ఈ మానసికానందం ల మానసికస్థితిపై ఆధారపడి ఉంటుంది. ఒక కి అత్యంత సంతోషాన్ని కలిగించే విషయం మరొకరికి చాల సహజంగా ఉండవచ్చు. వేదాంతులకు కావ్యాలలోని నిగూఢార్థం ఆనందాన్ని కలిగించవచ్చు. కొందరికి కావ్యాల్లోని శృంగారరసం ఆనందదాయకం కావచ్చు. మరికొందరికి వీరరసం, వేరుకొందరికి శాంతరసం ఆనందదాయకం కావచ్చు. కాని అందరికీ ఆనందాన్ని కలిగించేది హాస్యరసం. పండిత పామరజనాల్ని సంతోషింపజేసి తాత్కాలికంగానైనా కష్టనష్టాల్ని మరిపించి మనసారా నవ్వుకొనేట్లు చేసేది హాస్యం. నాటకాల్లో ఈ హాస్యం ముఖ్యం.

యక్షగాన నాటకాల్లో హాస్యముదే పైచేయి. దానికి కారణం మనం ఊహించవచ్చు. యక్షగాన నాటకాలు సామాన్య ప్రజలకు ఉద్దేశింపబడ్డాయి. పామరులైన వీరికి వేదవేదాంతాల నిగూఢార్థాలు, వీరశృంగారాది వర్ణనలు తృప్తిని కలిగించలేవు. నలుగురు కూర్చొని చూస్తున్న నాటకంలో హాస్యమే వీరిని కదిలిస్తుంది. ఉత్కంఠను రేకెత్తించే సర్కస్సులో సహితం 'బఫూన్' వీరిని ఎక్కువగా ఆకర్షిస్తాడు.

నాటక ప్రదర్శనను చూడవచ్చిన వీరిని నాటక కథవైపు మళ్ళించడానికి ఉద్దేశింపబడిన పాత్రలే 'మాధవి', 'సింగి', 'సింగడు', మొదలగునవి వీరి ప్రవేశంతో నాటకం మొదలవుతుందని ఈ ప్రేక్షక జనం భావిస్తుంది. ఇంతలో వీరి హాస్య సంభాషణ వారిని మరింత ఏకాగ్రతకు తీసుకెళుతుంది.

ఉదా : "పార్వతీ పరిణయము" యక్షగాన నాటకంలోని విషయాన్ని ఉటంకించవచ్చు.

నాటకారంభంలో వినాయకుని ప్రవేశం జరుగుతుంది. అంత సూత్రధార వచనం - ఎవరోయి భాగవతులారా! విఘ్నేశ్వరుండు వచ్చినాడు. పూజ

చేసేటందుకు పూజారిగారిని పిలవరోయి" అంటాడు. తెరలో "అలాగే పిలుస్తా" అని వినిపిస్తుంది. పూజారిని పిలవడం జరుగుతుంది. పూజారి వచ్చి నేను వచ్చాను పరిచారకుని పిలువమంటాడు. అపుడు :

"ఎవడురా పరిచారక గాడిదముండా కొడకా
విఘ్నేశ్వరుండు వచ్చి చాల తడవాయెనే,
పూజారి వచ్చి కాచుకొని యున్నాడే,
ఇంతసేపు స్వయంపాకం సేయక
ఎక్కడికి పోయి వుంటివిరా."

పరిచారకుని వచనము :- దినము సద్దివంటకము పిడిచి తళిగె సేనుకొత్తును. ఈ ప్రొద్దు సద్ది మిగులలేదు. కాబట్టి వండికొంచు వచ్చేటందుకు ఇంతసేపు పట్టెను.

సూత్రధారుని వచనము :- ఓరి తిష్టన్మాత్ర ముండాకొడక! ఓరి దేవునికి సద్దివంటకం నైవేద్యం పెట్టుదురటరా!

పరిచారకుని వచనము :- ఇప్పుడు పదినాళ్ళనుంచిన్ని ఃళ్ళారికిన్ని, పూజారికిన్ని కడుపు సెగ ఎత్తింది. అందునుంచి సద్దివంటకం నైవేద్యం పెడుతున్నాం.

ఇటువంటివే అన్ని యక్షగానాల్లో మనం చూడవచ్చు.

హరిదాసులు హరికథ చెబుతూ సందర్భాన్ని కల్పించుకొని మధ్యలో 'గోవిందలు' పెట్టిస్తారు. దానికి కారణం హరికథ సహజంగా రాత్రుల్లో ఉంటుంది. నిద్రకు తాళలేని నిద్రాదేవి ఒడిలో చేరబోవువారిని మేల్కొల్పడానికి "గోవిందలు" ఒక ఆయుధం. అట్లే పూర్వం రాత్రుల్లో ప్రదర్శించే ఈ యక్షగాన నాటకాల్లో 'హాస్యం' అనేది ప్రజల్ని మేల్కొలిపేదానికి బాగా ఉపయోగపడేది. యక్షగాన నాటకాల ప్రసిద్ధికి ఎక్కువగా హాస్యం దోహదంచేసింది. ఒక గ్రామంలో ప్రదర్శించిన యక్షగాన నాటకాన్ని గూర్చి పశువుల్ని, గొర్రెల్ని, మేకల్ని మేపుకొనేవారు ఇతర గ్రామాలవారితో తరచు కలిసినపుడు అందలి హాస్యాన్ని గూర్చి, వారి వేషభాష చమత్కారాల్నిగూర్చి చెప్పేవారు. విన్నవారికి కూడ ఆ యక్షగాన నాటకాన్ని చూడాలనే కోరిక కలిగేది. యక్షగాన నాటకంలోని హావభావాలకన్నా, సాహిత్యాది విషయాలకన్నా, నృత్యం, గానం, హస్తముద్రలు, హాస్యం మొదలగునవి యక్షగాన నాటకాల వ్యాప్తికి దోహదం చేశాయి.

పేరుకు తగినట్లుగా మొదట గానరూపంలో ఉన్న యక్షగానం గానానికి

తోడుగా అభినయాన్ని, దానితోపాటు మిగిలిన కళలు తనలో లీనం చేసికొని ఒక విశేషమైన ప్రక్రియగా పరిపూర్ణతగం సమాహారకళగా యక్షగాన నాటకం రూపుదిద్దుకొంది.

లభించిన యక్షగాన గ్రంథాల్లో కందుకూరు రుద్రకవి 'సుగ్రీవ విజయమే మొదటిద'ని చెప్పవచ్చు. ఇది ప్రదర్శనాయోగ్యం కలిగి ఉంది. చక్రపురి రాఘవార్యుని 'విప్రనారాయణ చరిత్రము' మొదటిదని కొందరి అభిప్రాయం. ప్రోలుగంటి చెన్నశౌరి 'జక్కుల కథ' ప్రాచీనతరమని కొందరి ఊహ. కాని లభించిన యక్షగ్రంథాల్లో ప్రదర్శనాయోగ్యతగల మొదటిది 'సుగ్రీవ విజయం.'

యక్షగాన నాటకాలు చాలవరకు పౌరాణిక సంబంధాలు. ఇందలి ఇతివృత్తాలు పురాణాలకు సంబంధించి ఉంటాయి. అట్లని ఇతరములు లేక పోలేదు. భిన్నభిన్న ఇతివృత్తాలు కలిగినవి అనేకాలు ఉన్నా దానిలో పౌరాణిక సంబంధం గలవి ఎక్కువ. సాహిత్యం యొక్క ప్రయోజనాన్ని ఈ యక్షగాన నాటకాల్లో తప్పక మనం గుర్తించవచ్చు. 'పారిజాతాపహరణము' కావ్య ప్రయోజనం ఏదైతే ఉందో 'పారిజాతాపహరణము' యక్షగాన నాటకంలో కూడ ఆ ప్రయోజనం సాధించబడింది. అట్లే ప్రహ్లాద చరిత్ర ఏ ప్రయోజనమైతే కోరిందో యక్షగాన నాటకమైన ప్రహ్లాద చరిత్ర దాన్ని సాధించింది. కావున సాహిత్య విషయంలో యక్షగాన నాటకాలు సంపూర్ణ ప్రయోజనాన్ని అందించగలవని చెప్పవచ్చు.

సాహిత్యం పండితులకు, సంగీతం పండిత పామరులకు ఆనందాన్ని కలిగిస్తాయి. "యక్షగాన నాటకం" అనే పదంలోనే సంగీతం యొక్క ప్రాధాన్యం గోచరిస్తుంది. ఇందలి సంగీతం ముఖ్యంగా పామరజనుల్ని ఆనందింపజేసేది. తాళం ప్రధానంగా గల ఈ సంగీతం ఆబాలగోపాలాన్ని ఆనందింపజేస్తుందనడంలో సందేహంలేదు.

యక్షగాన నాటకాల్లో సాహిత్య సంగీతాలతోపాటు నృత్యం ప్రధానంగా ఉంటుంది. ఈ నృత్యం కూచిపూడి భరతనాట్యంమొదలగు నృత్యాలకు భిన్నంగా ఉంటుంది. కథకు అనుగుణంగా పాత్ర స్వభావానికి అద్దం పట్టేటట్లు ఈ నృత్యం ఉంటుంది. రాజు కోపంతో కదం తొక్కేందుకు యుద్ధానికి బయలుదేరేటపుడు, ఆస్థానానికి బయలుదేరేటపుడు, రాణీవాసానికి వెళ్ళేపుడు నృత్యం (కదం) చేస్తాడు. కాని అందులో భిన్నత్వముంటుంది.

యక్షగాన నాటకాల్లో అభినయం తక్కువగా ఉంటుంది. ఇందులో హావభావ ప్రకటనకన్నా హస్తముద్రలకు ప్రాధాన్యం ఎక్కువ. హావభావాల్ని కూడ వీలైనంతవరకు మాటల్లో వ్యక్తం చేస్తారు.

ఉదా: రాణి చింతించవలసిన సందర్భంలో 'అయ్యో రాణి చింత నొందినాది' అని వాచ్యంగా తెలియజేస్తారు.

యక్షగాన నాటకాల్లో వాచికానికి చాల ప్రాధాన్యము వుంది. ప్రతి విషయాన్ని వాచికంగా తెలియజేస్తారు. పాత్ర స్వభావాన్ని పాత్ర ధరించిన దుస్తుల్ని, పాత్ర చేయబోయే కార్యాల్ని చాలవరకు వాచికంగానే తెలుపుతారు.

యక్షగాన నాటకాల్లో ఆహార్యానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. ఎందుకంటే ప్రేక్షకుల్ని ఆకట్టుకొనేది ముఖ్యంగా వీరి ఆహార్యమే. రాజు అనగానే అందుకు సంబంధించిన ఆహార్యం సంపూర్ణంగా వీరు నిర్వహిస్తారు.

ఈ విధంగా యక్షగాన నాటకం సర్వోపభోగమైన సమాహార కళారూపమని చెప్పవచ్చు.

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గారి పరిశోధన ప్రకారం యక్షగానానికి కృషిచేసినవారు సుమారు 465 మంది కవులు. లభ్యమయ్యే యక్షగానాల సంఖ్య సుమారు 542. అలభ్య యక్షగానాలు సుమారు 260 యక్షగానాలు ముఖ్యంగా కురవంజి, తోలుబొమ్మలాటలు, ఏకాంతసేవ, హరికథ, జంగము కథ మొదలగు జానపద కళారూపాలకు మార్గదర్శకమైంది అని చెప్పవచ్చు.

జానపదులనుంచి పుట్టిన ఈ విశిష్టమైన కళారూపాన్ని పీడితజనాన్ని చైతన్యవంతం చేయడానికి ఉపయోగించవచ్చు. ప్రజల సమస్యల్ని తీసుకుని ప్రజలభాషలో ప్రజలకు అర్థమయ్యే రీతిలో యక్షగాన వీథినాటకాల్ని తయారుచేసి ప్రదర్శించవచ్చు. ఇందులో పాత్ర తన స్వభావాన్ని తానే చెపుతుంది కాబట్టి ప్రజల్లో ఇది ఎక్కువగా రక్తికడుతుంది. ఒక రాజకీయ నాయకుని పాత్రను తీసుకొని అతని దుష్టస్వభావాన్ని ఆ పాత్రగుండా చెప్పిస్తే ప్రజలకు మరింత బాగా రాజకీయాలు అర్థం అవుతాయి. మిగిలిన కావ్య ప్రక్రియలకన్న ఎక్కువగా ప్రజల దగ్గరికి సాహిత్యాన్ని తీసుకొనివెళ్ళడానికి ఈ యక్షగాన నాటకప్రక్రియ సులభంగా ఉంటుంది. సాహిత్యంతోపాటు హాస్యాన్ని, జ్ఞానాన్ని ప్రజలకందించవచ్చు.

చక్కని చిక్కని తెలుగుదనాన్ని ప్రదర్శించే ఈ యక్షగాన నాటక ప్రక్రియ దినదిన ప్రవర్ధమానం చెందాలంటే విజ్ఞానవేత్తలు నేటి సామాజిక విషయాల్ని దృష్టిలో వుంచుకొని యక్షగాన నాటకాల్ని రచించాలి.

# 3. భారత రామాయణాలపై కొన్ని సామెతలు-పరిశీలన

ప్రజా జీవితాలకు ప్రతిబింబాలు ఒనదగిన భారత రామాయణాల్ని గూర్చి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఈ కావ్యాలలోని ఇతివృత్తం సర్వజన సువిదితం. భారత నాయకులైన పాండవుల్ని గూర్చి, రామాయణ నాయకుడైన రాముణ్ని గూర్చి, భారత రామాయణ కథల్ని గూర్చి తెలుగులో అనేక సామెతలు వెలువడినాయి. అందుకొన్ని ఆ గ్రంథాల, ఆ నాయకుల ప్రాశస్త్యాన్ని తెలియజేస్తున్నాయి. మరికొన్ని అందలి లోపాల్ని తెలియజేస్తున్నాయి. కాని ప్రాశస్త్యాన్ని గూర్చి తెలుపు కొన్ని సామెతలు కాలం గడిచేకొలది లోకంలో ఆ గ్రంథాలకు, ఆ నాయకులకు అప్రతిష్ఠను చేకూరుస్తున్నాయి. ఇందుకు ప్రధాన కారణం ఆ సామెతల అర్థాన్ని గ్రహించుటలో గల లోపంగా భావించవచ్చు.

'సామెత' అను వైకృత విశేష్యానికి 'లోకోక్తి' అని అర్థం. అది ప్రకృతి శబ్దార్థం కంటే భిన్నంగ అర్థాన్ని తెలియజేస్తుంది. విద్వాన్ ముసునూరి వేంకట శాస్త్రిగారు తన 'విద్యార్థి కల్పతరువు' ద్వితీయ సంపుటంనందు "తెలుగు సామెతలు" అను శీర్షిక క్రింద కొన్ని సామెతలు ఉదహరించి యున్నారు. తరవాత "తెలుగు లోకోక్తులు" అను శీర్షిక క్రింద కొన్ని లోకోక్తులు తెలియజేసారు. ఆ తరువాత "నీతులు-ఉపదేశములు" అని మరియొక శీర్షికను గ్రహించినారు. దీన్ని బట్టి సామెతలు వేరు లోకోక్తులు వేరు అని తెలుస్తుంది.

సామెతలు కొన్ని లోకంలో లోకోక్తులుగా చెలామణి ఎవుతున్నాయి. ముసునూరి వేంకట శాస్త్రిగారే "అందని మ్రాని పండ్లకు అర్రులు చాచునట్లు" అను దానిని సామెతగా గ్రహించాడు. "మ్రాని పండులకు అర్రులు సాతురే" అని లోకోక్తిగా గ్రహించాడు. ఈ రెండింటిలో భావం ఒక్కటే. కాబట్టి పరిశీలించగా సామెతలకు లోకోక్తులకు దగ్గర సంబంధం ఉందని నిస్సంశయంగ నిశ్చయింపవచ్చు.

కావ్యాలలోని ఎన్నో సూక్తులు లోకంలో సామెతలుగను, లోకోక్తులుగను నిలచిపోతున్నాయి. "గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్"అను నన్నయ ప్రయోగం, "ఈ తుచ్ఛ సుఖంబులు మీసాలపై తేనియల్"అను పెద్దన ప్రయోగం లోకంలో ఎంత వ్యాప్తిని పొంది యున్నవో సహృదయులకు

సువిదితం. కావ్యాలలోని ప్రయోగాలు లోకంలో నిలచిపోయినట్లే ఆ కావ్యంపై, ఆకావ్య నాయకులపై వచ్చిన కొన్ని సామెతలు గ్రంథస్థం గాకపోయినా లోకంలో అధిక ప్రచారంలో ఉన్నాయి.

సామెత (1) "రామాయణమంతా విని
రామునికి సీత ఏమౌతుందన్నట్లు"

ఈ సామెత తెలుగులో అధిక ప్రచారాన్ని పొంది యుండడం గమనింపవచ్చు. ఏదైన ఒక విషయాన్ని గూర్చి విపులంగ విశదీకరించిన పిమ్మట అంతా విని తిరిగి సమస్య లేవనెత్తు వారిని గూర్చి తెలియ జేసేటప్పుడు మనం సామాన్యంగా పై సామెతను ఉదహరిస్తాం. నిజానికి అట్టి పరిస్థితిలో ఈ సామెతను ఉపయోగించుట సబబుగా దోచుటలేదు.

ఒక హరిదాసు రామాయణ కథను తెలియజేస్తూ రాముడు శ్రీమహావిష్ణువు అవతారమని స్పష్టం చేసాడు. మహావిష్ణువును గూర్చి తెలియజేస్తూ అతనికి శ్రీదేవి, భూదేవి అనువారు భార్యలని చెప్పాడు. ఆపైన సీత, భూదేవి కూతురు అని తెలిపాడు. సీత సాక్షాత్తు శ్రీదేవి అవతారమను విషయం అట్లుంచితే ఎవరికైన భూదేవి కూతురు సీత రామునకు భార్య ఎట్లవుతుంది అనే సందేహం రాకమానదు. భగవంతుని అవతారాల్ని గూర్చిన విషయాలు ప్రక్కన నెట్టితే "సీత, రామునికి ఏమి కావలెను?" అను ప్రశ్న ఎంతో సహేతుకమని తోస్తుంది. కాబట్టి మిడి మిడి జ్ఞానంతో అనవసరమైన ప్రశ్నల్ని సృష్టించు వానిని పై సామెత తెలిపిన వానితో పోల్చుట సమంజసం కాదనిపిస్తుంది.

సామెత (2) "రామాయణము రంకు పురాణము
భారతము బొంకు పురాణము"

పై సామెతలోని 'రంకు'-'బొంకు' పదాల గూర్చి పరిశీలింప వలసి వుంది. 'రంకు' అనగా సామాన్యంగా స్త్రీ, పురుషుల అక్రమ సంబంధం. పైన తెలిపిన సామెత ప్రకారం రామాయణమంతా స్త్రీ, పురుషుల అక్రమ సంబంధాలకు సంబంధించిన కథయని అర్థం స్ఫురిస్తుంది. రామాయణ కథను పరిశీలిస్తే అట్టి సందర్భాలు శూర్పణఖ, రామ, లక్ష్మణుల్ని కోరుట; రావణుడు సీతను అపహరించుట 'రంకు' అని, ఆ కారణంగానే రామ రావణ యుద్ధం జరిగింది. కాబట్టి రామాయణము రంకు పురాణమని కొందరు భావిస్తున్నారు. ఈ ఊహ సరియైంది కాదని తెలుస్తుంది. ఎందుకంటె స్త్రీ పురుషుల అక్రమ సంబంధం గదా. రంకు: మరి ఇక్కడ రావణాసుర సీతాదేవి మధ్యగాని,శూర్పణఖ- రామ, లక్ష్మణుల మధ్యగాని అట్టి సంబంధంమే లేనపుడు 'రంకు' ఎట్లవుతుంది. కాబట్టి

'రామాయణము రంకు పురాణము' అనుటకు సాధ్యంకాదు.

"బొంకు" అను పదానికి అసత్యమని గదా అర్థం. "భారతము బొంకు పురాణము" అంటే భారతమంతా అసత్యాలతో నిండియున్నదను అర్థం స్ఫురిస్తుంది. భారత కథలో ప్రధాన పాత్రలలో ఒకడైన ధర్మరాజు యుద్ధ సమయంలో అసత్యం పలికినాడని ఎటకార్యారణంగ భారతము బొంకు పురాణమని కొందరు సమర్థిస్తున్నారు. నిజమే, ఎన్నడు అసత్యమాడని ధర్మరాజు యుద్ధసమయంలో అసత్యమాడినాడు. కాని ఆ అసత్యం భారత యుద్ధానికి కారణం కాదుగదా [అది కూడా సంపూర్ణ అసత్యం కాదు].

"రామాయణము రంకు పురాణము-భారతము బొంకు పురాణము" - అను సామెతను బాగా పరిశీలిస్తే రామ-రావణ యుద్ధానికి, కురు-పాండవ యుద్ధానికి గల కారణాల్ని లేక వ్యక్తుల్ని ఆ సామెతలో పేర్కొన్నట్లు తెలుస్తుంది. 'రంకు' అను కార్యం రామ-రావణ యుద్ధానికి గాని, "బొంకు" అను కార్యం కురుక్షేత్రం సంగ్రామానికి గాని కారణభూతాలు కాదని పై పరిశీలనవల్ల తెలుస్తుంది. కాబట్టి ఆ యుద్ధాలకు కారణమైన వ్యక్తులు ఆ సామెతయందు గలరని మనమూహింపవచ్చు.

పదములు లోకంలోని ప్రజల నాలుకలలో తిరిగి తిరిగి కొన్ని వర్ణాల్ని కోల్పోవుట, కొన్ని వర్ణాలు స్థానాల్ని మారుట, కొన్ని అధిక వర్ణాలు చేరుట, జీవద్భాషకు సహజమని పండిత విమర్శకులు అంగీకరించిన సత్యం. ఈ పై సామెత యందుగూడ అట్టిది జరిగియున్నట్లు తెలుస్తుంది.

'రంకువు' అను పదానికి తెల్లని వెంట్రుకలను, మెత్తని తోలును గల యిఱ్ఱి అని అర్థం స్ఫురిస్తుంది. రామ రావణ యుద్ధానికి ప్రధాన కారణం రావణుడు, సీతనపహరించుట. సీతను అపహరించుటకు ప్రధానంగా తోడ్పడింది మాయలేడి. కాబట్టి మాయలేడ 'రంకువు' కారణంగా రామ రావణ యుద్ధం సంభవించిందని గ్రహింపనగును. అనగా ఇక్కడ లోకంలో వాడుకలో 'వు' లోపించిందని గుర్తించవచ్చు.

కురు పాండవ యుద్ధానికి కారణాలు ఎన్నివున్నా, ఎందరు వ్యక్తులు కారణాలైనా ప్రధానంగా 'కర్ణుడే'కారణమని ఎందరో నిర్వచించారు. కర్ణుడు లేనిచో భారతం లేదని ఎందరో పండిత విమర్శకులు భావించారు. కర్ణుని పలుకులే కురు పాండవ యుద్ధానికి, దుర్యోధనుని మరణానికి ప్రధాన కారణాలని డాక్టర్ జి.వి.సుబ్రమణ్యం గారు "మహాభారతము - కర్ణుడు" అను వ్యాసంలో సోదాహరణంగా నిరూపించారు. ఒక విధంగి కర్ణుడు సుయోధనుని 'బంటు'అని

అంగీకరింపక తప్పదు. అనగా భారత యుద్ధానికి ఒక బంటు ప్రధాన కారకుడని అంగీకరించాలి. కాబట్టి పై సామెతలోని ఉత్తరార్ధం 'భారతము బొంకు పురాణము'-అనిగాక భారతము 'బంటువు' పురాణమని గ్రహించడం ఎంతో సమంజసం. అంతే గాక సామెతలో పూర్తి పోలికలు గ్రహింపవచ్చు. ఎట్లంటే మాయలేడి రూపంలో వచ్చిన మారీచుడు రావణాసురునికి నమ్మిన బంటు. కర్ణుడు సుయోధనునికి నమ్మిన బంటు. రెండు గ్రంథాలలోను ఈ బంటులు ప్రతి నాయకులకు సహాయ కారులుగ నుండుట గ్రహింపదగిన అంశం. కాబట్టి ఈ విధంగా ఆలోచన చేస్తే పైన పేర్కొన్న ఆ సామెత "రామాయణము రంకువు పురాణము" అని "భారతము బంటువు పురాణము" అని వుండి క్రమ క్రమంగా మార్పుచెంది వుండునని ఊహింపవచ్చు.

సామెత (3) "పంచ పాండవులు నాకు తెలియదా?
వారు మంచం కాళ్ళవలె ముగ్గురు
అని చెప్పి రెండు వ్రేళ్ళు చూపి
బోర్డుమీద ఒకటి వేసినట్లు"

సామాన్యంగా ఏదైన ఒక విషయాన్ని సంపూర్ణంగ తెలుసుకొనక, నాకు అంతా తెలుసు అనే వారిని గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు పై సామెతను మనం వుపయోగిస్తుంటాం.

పంచపాండవుల జన్మరహస్యం ఆ సామెతలో నిగూఢంగ నిలిచి వుంది. పైకి చూస్తే ఆ సామెత చెప్పిన వ్యక్తి పురాణ విషయం తెలియని వాడనిపిస్తుంది. బాగా పరిశీలిస్తే పురాణ విషయాన్ని పూర్తిగా గ్రహించి పాండవుల జన్మరహస్యాన్ని ఒక్క మాటలో చెప్పిన మహామేధావిగా ఆసామెత కర్తను గ్రహింపవచ్చు. పై సామెతలో మొదట సంఖ్యలను గ్రహించవలసి వుంది.

| | | |
|---|---|---|
| పంచ | = | ఐదు |
| మంచముకోళ్ళు | = | నాలుగు |
| చెప్పినది | = | మూడు |
| చూపినది | = | రెండు |
| బోరుమీద వేసింది | = | ఒకటి |

పాండవులు ఐదుగురని 'పంచ' అను ప్రయోగం స్పష్టం చేస్తుంది. పాండవుల జన్మకు కారకులైన వారు 'నలుగురు'అను విషయం 'మంచము కోళ్ళు' అను ప్రయోగం స్పష్టం చేస్తుంది. వారు యమధర్మరాజు వాయువు,

ఇంద్రుడు, అశ్వనీ దేవతలు, [అశ్వనీ దేవతలు యిద్దరైనను వారు ఎపుడు విడువడని కారణంగ ఒక్కరుగనే గ్రహించాలి] పాండవులలో కుంతీపుత్రులు ముువ్వురను విషయం 'ముగ్గురు' అనే ప్రయోగం వల్లా గ్రహింపవచ్చు. మాద్రి పుత్రులు ఇద్దరు అను విషయం రెండు వ్రేళ్ళు చూపుట వలన తెలుస్తుంది. అంతేగాక ఈ సామెత చివరలో ఒక్కటి అను సంఖ్యను వ్రాసినట్లు కొందరు చెప్తున్నారు. అపుడు పాండవులందరు పాండురాజు పుత్రులుగ ప్రసిద్ధులని గ్రహింపవచ్చు. ఇట్లా ఈ సామెతలో ఇంత నిగూడార్థం నిబిడీకృతమై వుండగా కేవలం మిడి మిడి జ్ఞానంతో మిడిసి పడు వారికి పోలికగా చెప్పుట సమంజసం కాదని నా భావన. ఇంకను ఇట్లే :-

"భరతుని పట్నం రాముని రాజ్యం"
"రామాయణములో పిడకల వేట"
"రామ రావణులిద్దరికి మేలగుగాక"

మొదలగు అనేక సామెతలు పరిశీలింపదగి ఉన్నాయి.

# 4. కర్నూలు జిల్లాలోని దర్శనీయ స్థలాలు

ప్రధాన పట్టణమైన కర్నూలు పేరుమీదుగా ఈ జిల్లాకు ఈపేరు వచ్చింది. రాయలసీమ వాసులు హైదరాబాదు పోవడానికి తుంగభద్రా నదిని కర్నూలు దగ్గరున్న బ్రిడ్జిమీద నుండే దాటాలి. అందువల్ల కర్నూల్‌ను 'గేట్ వే ఆఫ్ రాయలసీమ' అంటారు. పూర్వం కందెనవోలుగా పిలువబడే ఈ ప్రదేశమే కాలక్రమంలో కర్నూలుగా మారిందని జానపదుల నమ్మకం. ఆంధ్రదేశంలో ప్రసిద్ధి చెందిన శైవాలయం అలంపూర్ కర్నూలు పట్టణానికి చాలా దగ్గ రలో ఉంది. అలంపూర్‌లో దేశంలో మరెక్కడాలేని నవబ్రహ్మల ఆలయాలు ఉన్నాయి. దక్షిణ కాశిగా భక్తుల హృదయాల్లో స్థానాన్ని సంపాదించుకొన్న పుణ్యస్థలం ఇది. ఈ అలంపూర్ ఆలయాల నిర్మాణానికి కావలసిన రాళ్ళు, స్తంభాలు, బండలు మొదలైన సామగ్రిని ఎద్దుల బండ్లమీద చేరవేసేవారు. ఆ బండ్లను కర్నూల్లో నిలిపి తుంగభద్ర ఇసుకలో బండి చక్రములు సులువుగా తిరగడానికి అవసరమైన కందెనను వేసుకొనెడి వారు. (ప్రస్తుతం ఉన్న వారధి ఆనాడు లేదనే విషయం గమనించాలి.) కందెన వేసుకొనే స్థలం కాబట్టి ఇది కందెనవోలయింది. ఇప్పటికీ కర్నూల్లో బండిమెట్ట ప్రాంతం ఉండడం గమనింపదగిన అంశం. కాబట్టి కందెనవోలే కర్నూలుగా మారిందని ప్రజల అభిప్రాయం. ఈ కర్నూలు పదవ్యుత్పత్తి విషయమై కొందరి భాషా శాస్త్రవేత్తల ఊహ ఇందుకు భిన్నంగా ఉంది. కర్నూలు జిల్లాలోని నేల ఎక్కువ భాగం నల్లగా ఉండడం లోకవిదితమే. కరి అనగా నలుపు అని, కరి+నేల = కర్నూలు అయి ఉండవచ్చునని వారి అభిప్రాయం. మరొక కారణం కూడ నాకు స్ఫురిస్తున్నది. ఈ ఊహ ఇంతకుముందే ఎవరైన చేసి వున్నారేమో నాకు తెలియదు. అది ఏమంటే - కర్నూలు జిల్లాలో ఎక్కువ ఆలయాలు శైవక్షేత్రాలే. అందులో ప్రసిద్ధి చెందిన క్షేత్రం శ్రీశైలం. శ్రీశైలం శివపార్వతుల ఆలవాలం. శ్రీశైలానికి కర్నూలుకు మధ్యలో దోర్నాల, బ్రాహ్మణ కొట్కూరు, నందికొట్కూరు, వెంకాయన పల్లె ఊళ్ళున్నాయి. 'దోర్నాలంటే' ఆలయ ద్వారము అని ఊహించవచ్చు. దీన్ని శ్రీశైల ఆలయ ముఖద్వారంగా యాత్రికులు భావించారనుకోవచ్చు. బ్రాహ్మణకొట్కూరు ఆలయ పూజారుల

నివాసంగా చెప్పవచ్చు. ఇక్కడి నుండి పూజారులు పర్వదినాలలో శ్రీశైలం వెళ్ళి పూజలు జరిపించి వచ్చే ఆచారం పూర్వం కలదేమో!

నా చిన్నతనంలో మావూరికి దగ్గరలోనున్న తలకోన (చిత్తూరు జిల్లా) అనే శైవక్షేత్రంలో కూడ ఇటువంటి పద్ధతే ఉండడం నేనెరుగుదును. శివరాత్రి లాంటి శైవ పర్వదినాల్లో నెరబైలునుండి పూజారులు వెళ్ళి తలకోన ఆలయంలో పూజాదులు నిర్వహించెడివారు. అలాగే ఇక్కడా జరగియుండవచ్చు. నందికొట్కూరులో నంది ఆలయాలు ఉన్నాయి. నందికొట్కూరు చుట్టూ నవనంద ఆలయాలు ఉన్నాయని ఆ నందులను దాటి ఊరు విస్తరిస్తే కలియుగం అంతమవుతుందని లోకంలో వాడుక. వెంకాయన పల్లెలో వినాయకుని గుడి ప్రసిద్ధి. అట్లే సుబ్రమణ్యంస్వామి గుడి కూడ ఇక్కడ వుండి వుండవచ్చును. ఆగుడి రజాకారుల ఉద్యమంలో జీర్ణమైపోయి వుండవచ్చు. అబ్దుల్ వహాబ్ అనే నవాబు గుడులను మసీదులుగా మార్చినట్లు చరిత్ర చెప్తుంది. 'కంద'న్ అంటే తమిళంలో సుబ్రమణ్య స్వామి, ప్రోలు అనగా పురం. సుబ్రహ్మణ్య స్వామి ఆలయంగల పూరు 'కందన్ ప్రోలు'అవడానికి ఆస్కారం వుంది. కందన్‌ప్రోలు > కందెనవోలు > కర్నూలుగా పదవ్యుత్పత్తిని చెప్పవచ్చు.

ప్రస్తుతం ఈ కర్నూలు జిల్లా ఉత్తరాన మహబూబ్ నగర్ జిల్లా, దక్షిణాన అనంతపురం, కడప జిల్లాలు, పడమర కర్నాటక రాష్ట్రం, తూర్పున ప్రకాశం జిల్లా ఎల్లలుగా కలిగి ఉన్నది. ఈ జిల్లాలోని దర్శనీయ స్థలాలను ప్రధానంగా మూడు భాగాలుగా విభజించినాను.

1. చారిత్రక దర్శనీయ స్థలాలు
2. పుణ్యక్షేత్రాలు
3. పారిశ్రామిక దర్శనీయ స్థలాలు

## I. చారిత్రక దర్శనీయ స్థలాలు

**1. కొండాపురం బురుజు :** ఇది కర్నూలు పట్టణంలో తుంగభద్రా నదికి దగ్గర్లో కలెక్టరాఫీసును ఆనుకొని ఉంది. కర్నూలు కీర్తి కిరీటానికి ఇది కలికితురాయి. ఒకప్పటి కర్నూలు కోటలో మిగిలిన ఒక భాగం ఈ బురుజు. కర్నూలు కోట అచ్యుత దేవరాయల కాలంలో నిర్మించబడినట్లు చారిత్రకుల అభిప్రాయం. పాతకోట ప్రాంత పాలేగారు కొండారెడ్డి. ఈ కొండారెడ్డే అనర్ఘ రాఘవ కర్త బుజ్జల తిమ్మభూపాలుని సోదరుడని చరిత్ర చెబుతోంది.

విజయనగర పతనానంతరం గోలుకొండ సుల్తానులు కర్నూలుపై దాడిచేసి పాతకోట పాలేగారైన కొండారెడ్డిని బంధించి ఈ కోటలో నిర్బంధించినందువల్ల ఈ బురుజుకు 'కొండారెడ్డి బురుజు' అని పేరు వచ్చినట్లు కొందరు చరిత్రకారులు అభిప్రాయపడుచున్నారు.

మరికొందరు కర్నూలు దగ్గరలో నున్న కల్లూరు నివాసి కొండారెడ్డి ఈ బురుజుని కట్టినందువల్ల దీనికి 'కొండారెడ్డి బురుజు' అని పేరు వచ్చినట్లు చెపుతున్నారు. ఈ బురుజు (అంతర్భాగం) నుండి పెబ్బేరు వద్ద కృష్ణానది మధ్యలో ఒక చిన్న గుట్టమీద కల ఆలయంలోకి సొరంగ మార్గం వుందని లోకుల నమ్మకం. సొరంగ మార్గాన్ని గురించి సత్యాసత్యాలెట్లున్నా యాత్రికులు చూడదగిన స్థలం కొండారెడ్డి బురుజు. ఈ బురుజు మీద నుండి

*"గంగా సంగమ మిచ్చగించునే మదిన్ గావేరి దేవేరిగా*
*నంగీకార మొనర్చునే యమునతో నానందముం బొందునే*
*రంగత్తుంగ తరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ*
*యంగంబంటి సుఖించునేని గుణభద్రా! తుంగభద్రానదీ"*

పాం.-1-138

అని తెనాలి రామకృష్ణునిచే కీర్తించబడిన తుంగభద్రానదీ సోయగాన్ని కనువిందుగా తిలకించవచ్చు.

2. **అబ్దుల్ వహాబ్ గుంబల్** : కర్నూల పట్టణంలో పేరొందిన మరొక ఐతిహాసిక స్థలం అబ్దుల్ వహాబ్ గుంబల్. అబ్దుల్ వహాబ్ అనే నవాబు విజయనగర సామంతుడైన గోపాలరాజును ఓడించి కర్నూలును కైవసం చేసుకొన్నట్లు తెలుస్తున్నది. ఇతడు బీజాపూరు సుల్తానుకు ప్రతినిధి. అబిసీనియా దేశస్థుడు. ఇస్లాం మతవ్యాప్తి కోసం కర్నూలులో అనేక దేవాలయాలను మసీదులుగా మార్చినట్లు చరిత్ర చెబుతుంది. ఇతని మరణానంతరము ఇతని శవాన్ని హంద్రీనది ఒడ్డునగల గుంజల్స్‌లో పాతిపెట్టినారు. కొండారెడ్డి బురుజు నుండి తుంగభద్రా నదిని గాంచినట్లుగా అబ్దుల్ వహాబ్ గుంబల్స్ నుండి తుంగభద్ర ఉపనది హంద్రీని మనం చూడవచ్చు.

3. **సుంకేశుల** : కర్నూలు ప్రాంతాన్ని సస్యశ్యామలం చేయడానికి ఉపయోగపడుచున్న ఆనకట్టలలో సుంకేశుల ప్రధానమైనది. ఈ ఆనకట్ట నిర్మాణానికి కారకుడు కాటన్‌దొర. సుంకేశుల నుండి కర్నూలు కడప కాలువ త్రవ్వబడింది. ఈ సుంకేసుల కర్నూలు పట్టణానికి సుమారు 20 కి.మీ. దూరాన ఉంది.

## II. పుణ్యక్షేత్రాలు :

1. అహోబిలం : కర్నూలు జిల్లాలోని ఆళ్ళగడ్డ పట్టణానికి సుమారు 25 కి.మీ. దూరంలో నల్లమల పర్వత శ్రేణులలో ఈ పుణ్యక్షేత్రం వుంది. భారత దేశంలో ప్రసిద్ధి చెందిన 32 నారసింహ క్షేత్రములలో ఇది ఒకటి.

నరసింహస్వామి హిరణ్యకశిపుని వధించేటపుడు సకల దేవతలు అహో బలం, అహో+బిలం అనగా ఎంతబిలం అనే అర్థంలో అన్నారట. కాలక్రమంలో ఈ అహోబలం > అహోబిలంగా మారినట్లు స్థానికులు చెబుతారు. గ్రంథాలలో అహోబలం అనే ఉంది. స్వామి చెంచుకన్యను వివాహమాడి చెంచుల కోరికపై ఆ అరణ్య ప్రాంతంలో స్థిరపడినట్లు కొందరు చెబుతారు. అహోబిలం క్షేత్రం, అహోబిల మఠం విజయనగర రాజుల కాలంలో నిర్మింపపడినాయి. ఇక్కడే పద కవితా పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య ఉపదేశం స్వీకరించినట్లు చరిత్ర చెబుతున్నది. ఆలయం చుట్టు ప్రాకారం వుండి తూర్పు పడమరలలో రెండు పెద్ద గోపురములున్నాయి. ఆలయంలో గర్భగుడి, ముఖమండపాలు ఉన్నాయి. ముఖమండపానికి ముందు గర్భాలయం వుంది. గర్భాలయ మధ్యబాగంలో నాలుగు అడుగుల ఎత్తు ఉన్న అధిష్టానంపై ఉగ్రనరసింహ స్వామి వున్నాడు. ఇక్కడ నరసింహస్వామి విగ్రహం శిల్పి నిర్మితమైనట్లుగాక గరుకుగా వుండడంచే స్వయంభువు అని అంటున్నారు. స్వామి వీరాసన పద్ధతిలో కుడివేలును మడిచిపెట్టి ఎడమవేలును క్రిందివైపు చూపుతూ ఒడిలో హిరణ్యకశిపుని వెల్లికల పరుండ బెట్టుకొని వుంటాడు. వాస్తుశాస్త్ర ప్రకారం వీరాసన పద్ధతిలో ఉండవలసిన 4 నుండి 16 చేతులు ఇక్కడ లేవు. రెండు చేతులు మాత్రమే కనిపిస్తాయి. తలపై కీర్తి మకుటం ఎడమ భుజం నుండి వ్రేలాడే యజ్ఞోపవీతం వున్నాయి. కుడిపాదం వద్ద ప్రహ్లాదుని విగ్రహం ఉంది. ఇక్కడ ప్రవహించే నీరు కొంత ఎరుపు రంగును కలిగి ఉంటుంది. స్వామి హిరణ్యకశిపుని వధించి తన రక్తపు చేతులిందు కడుక్కోవడంచే నీరు ఎర్రగా మారిందని స్థానికుల అభిప్రాయం. ఆలయం చుట్టుపట్ల పర్వత శ్రేణులలో తొమ్మిది నరసింహస్వామి విగ్రహాలున్నట్లు ప్రతీతి. అవి 1. ప్రహ్లాద వరద నృసింహ, 2. కరుడ నృసింహ, 3. యోగానంద నృసింహ, 4. ఉగ్రనరసింహ, 5. సహ నృసింహ, 6. క్రోడ నరసింహ, 7. మలోల నృసింహ, 8. జ్వాలా నృసింహ, 9. పావన నృసింహ. అర్థవంతములైన ఈ నామములు అనేక ఐతిహ్యాలను తెలియజేస్తాయి. ఆలయ సమీపంలో ఒక గుహలో ఒక స్తంభముంది. ఇదే స్వామి చీల్చుకొని వచ్చిన స్తంభమని జనవాణి. ఇప్పటికి

ఇక్కడ కొండ ప్రాంతాలలో కొందరు దిగంబరులు తపస్సు చేసుకొంటున్నట్లు స్థానికులు చెబుతారు.

ఆలయంలో అనేక శాసనాలు కన్పిస్తున్నాయి. అవి ఆయా రాజులు ఆయా కాలాల్లో ఆలయానికి చేసిన దానధర్మాలను గూర్చి తెలియజేస్తున్నాయి. కాకతీయ ప్రభువు రెండవ ప్రతాపరుద్రుడు ఉత్సవ విగ్రహాన్ని చేయించి పూజావిధులు నిర్వహించినట్లును, శ్రీకృష్ణదేవరాయలు తన దిగ్విజయ యాత్రల తరువాత స్వామికి వజ్రాలహారం సమర్పించి, మండపాలు, గోపురాలు నిర్మించినట్లు శాసనాలవల్ల తెలుస్తున్నది.

2. **యాగంటి :** కర్నూలు జిల్లా బనగానిపల్లె సమీపంలో ఎర్రమల కొండకోనల్లో వెలసిన క్షేత్రమిది. సాధారణంగా శివున్ని మనం లింగరూపాన్నే చూస్తాం. ఇక్కడ శివుడు పార్వతీ సమేతుడై విగ్రహ రూపంలో వుండుట ప్రత్యేకత. ఆలయాన్ని నిర్మించి వేంకటేశ్వర విగ్రహాన్ని ప్రతిష్టింప సంకల్పించగా హఠాత్తుగా ఒక రేయి గర్భగుడిలో ఉమామహేశ్వరులు విగ్రహరూపంలో వెలసినారని ఆ తరువాత ఆ వేంకటేశ్వర విగ్రహాన్ని ఆలయం ప్రక్కనే ఒక గుహలో ప్రతిష్టించినారని ఐతిహ్యం. ఈ వేంకటేశ్వర విగ్రహానికి బొటన వ్రేలు లేదు. ఇక్కడ చిట్టెప్ప అనే భక్తుడు తపస్సు చేయగా శివుడు పులిరూపంలో ప్రత్యక్షమైనట్లును, అంత చిట్టెప్ప ఏగంటి? శివా! ఏగంటి అని తన్మయత్వంలో నృత్యం చేస్తూ పులివెంట గుహలోనికిపోయి అదృశ్యమైనాడట. అప్పటినుండి క్రమంగా ఏగంటి > యాగంటిగా మారినట్లు క్షేత్ర పురాణం ద్వారా తెలుస్తుంది. బుక్కరాయలు ఈ ఆలయాన్ని పునర్నిర్మించినట్లు తెలుస్తుంది. ఆలయ ప్రాంగణంలో నందీశ్వరుడు పుట్టశిలగా వెలసినట్లు **రోజురోజుకు ఈ** విగ్రహం పెరుగుతుందని ఇక్కడి జనం వాడుక. ఇక్కడ వయస్సు మళ్ళిన పెద్దలు వాళ్ళ చిన్నతనంలో నంది విగ్రహం చుట్టూ ప్రదక్షిణ చేసేవాళ్ళమని, ప్రస్తుతం విగ్రహం పెరిగి ప్రదక్షిణకు వీలు లేకుండా పోయిందని చెబుతుంటారు. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు గూడ తన కాలజ్ఞానంలో 'యాగంటి బసవయ్య అంతకంతకు పెరిగి కలియుగాంతాన రంకె వేసేను' అనిచెప్పి ఉండడం గమనార్హం. ఇక్కడున్న పవిత్ర పుష్కరిణి పేరు అగస్త్య పుష్కరిణి. ఆలయానికి సంబంధించిన 20 ఎకరాల భూమికి పుష్కరిణి నీరు వుపయోగిస్తుంటారు. బనగానిపల్లెలోని అచ్చమ్మ యింటిలో బ్రహ్మంగారు పశువుల కాపరిగా నుండి ఆ పశువులను యాగంటి అడవులలో వదలి ఇక్కడే కూర్చొని ఎక్కువ భాగం కాలజ్ఞానం వ్రాసినట్లు ప్రతీతి. ఇక్కడున్న గుహలలో ఒకదానికి బ్రహ్మంగారి

గుహ అనిపేరు ఈ గుహలోనే అచ్చమ్మకు బ్రహ్మంగారు కాలజ్ఞానాన్ని వినిపించినట్లు చెపుతారు. ఇక్కడి ప్రకృతి అతిరమ్యం.

3. **శ్రీశైలం :** "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" శ్రీశైల శిఖర దర్శనం చేసికొన్న వారికి పునర్జన్మ ఉండదని పురాణాలు ఘోషిస్తున్నాయి. అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన ఈ శ్రీశైలం కర్నూలు జిల్లా నల్లమల కొండలలో వుంది. భారతదేశంలోని ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటిగా శ్రీశైలం ప్రసిద్ధం. శ్రీశైలమనే పేరు రావడానికి, ఇక్కడున్న స్వామికి మల్లికార్జునుడని, దేవికి భ్రమరాంబ అనే పేర్లు రావడానికి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి.

పూర్వం శిలాధితుడనే మహర్షి పరమేశ్వరుని గూర్చి తపస్సు చేసి అతడు ప్రత్యక్షం కాగా నేను తపస్సు చేసే ప్రదేశంలోనే నీవు వసించి వచ్చిన భక్తుల పాపాలను హరింపజేయాలని ప్రార్థించినాడట. అతని కోర్కె పై స్వామి అక్కడ వెలసినాడని ఆ కారణంగా ఈ క్షేత్రానికి శ్రీశైలమనే పేరు వచ్చిందని అంటున్నారు. శిలాధుని కూతురు శ్రీదేవి కొడుకు పర్వతకుడు ఈశ్వరుని గూర్చి తపస్సు చేసి అతడు ప్రత్యక్షం కాగా మేము తపస్సు చేసిన క్షేత్రంలో వసించమని కోరినారట. దీని కారణంగా వారిపేరుల మీదుగా శ్రీశైలం అనేపేరు వచ్చినట్లుగా కొందరు చెబుతున్నారు.

పూర్వం చంద్రగుప్తుడనే రాజుకు చంద్రమతి అనే కూతురు ఉండేది. ఆమె తండ్రి తనకు కలిగించే బాధలు సహించలేక శ్రీశైలంలో స్థిరపడింది. అక్కడ ఒక ఆవు ప్రతిరోజు ఒక రాయిమీద పాలను వదలడం తెలుసుకొని అది శివలింగంగా చంద్రమతి గ్రహించి నిత్యం భక్తి శ్రద్ధలతో ఆరాధించెడిది. ఒకరోజు శివుడు ప్రత్యక్షం కాగా తాను మల్లికలతోను, అర్జున పుష్పములతోను కట్టిన మాలను ధరించి ఆమెను కూడ తనలో ఐక్యం చేసికొన్నాడు. మల్లిక, అర్జున పుష్పములను ధరించుటచే నాటినుండి ఈ స్వామికి మల్లికార్జునుడను పేరు వచ్చినట్లు చెబుతారు మరియు పాశుపతాస్త్రం కోసం అర్జునుడు తపస్సు చేయగా కిరాత రూపంలో శివుడు ప్రత్యక్షమై చివరకు తన నిజ రూపము చూపినపుడు అర్జునుడు అతనిని మల్లికా గుచ్ఛములతో పూజించినాడని, ఆ కారణంగా అతడు మల్లికార్జునుడు అయినాడని లోకుల నమ్మకం.

బ్రహ్మావర ప్రసాదుడై లోకకంటకుడైన ఒక రాక్షసుని ఆదిశక్తి తుమ్మెదల మాలను ధరించి వధించినది. ఆ కారణముగా ఇక్కడున్న దేవికి భ్రమరాంబ అనుపేరు వచ్చినట్లు చెబుతారు. ఇప్పటికీ భ్రమరాంబ ఆలయం వెనుకవైపు

గోడలో రెండు చిన్న రంధ్రాలున్నాయి. అందుండి ఓంకారమనే ధ్వని ఎల్లవేళల వినబడుతుంటుంది. ఈ నాటికి భక్తులు దేవి దర్శనానంతరం 'భ్రమరాల ధ్వని' వినే ఆచారం వుంది.

శ్రీశైల మహిమలను గురించి ప్రశక్తి సంస్కృత, ఆంధ్ర, కర్ణాటక, తమిళ వాఙ్మయాలలో కన్పిస్తుంది. స్కాంధ, వాయు, బ్రహ్మాండ, మత్స్య పురాణాల్లో, వ్యాస మహాభారతంలోను, వాల్మీకి రామాయణంలోను శ్రీశైలం ప్రశస్తి వర్ణితం. భవభూతి 'మాలతీ మాధవం' లోను, శ్రీహర్షుని రత్నావళిలోను, ఆచార్య నాగార్జుని రసరత్నాకర మందును శ్రీశైల మహిమలు వర్ణితాలు.

తెలుగులో ఆదికవి అరణ్యపర్వంలోను మల్లికార్జుని మల్లికార్జున శతకంలోను, నన్నచోడుని, కుమార సంభవంలోను, పాల్కురికి సోమనాధుని పండితారాధ్య చరిత్ర, అనుభవసారంలోను, శ్రీగిరికవి శ్రీగిరి శతకంలోనూ, రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణంలో, శ్రీనాధుని శివరాత్రి మహాత్మ్యం, పల్నాటి వీరచరిత్రల్లోను, శ్రీశైలం మల్లికార్జునుని వర్ణన వుంది. కన్నడ కవులైన లక్కామహాదేవి, అల్లమ ప్రభువు చామరసు సిద్ధరామన్నలు శ్రీశైలంలో అందలి స్వామిని భ్రమరాంబను మిక్కిలిగా వర్ణించినట్లు తెలుస్తుంది. అట్లే తమిళంలో అప్పరు, సుందరుయ్యర్, జ్ఞానపంబందర్ మొదలగు వారు శ్రీశైలం మహాత్మ్యాన్ని ప్రస్తావించినట్లు తెలుస్తుంది.

శ్రీశైల క్షేత్రానికి నాలుగువైపుల నాలుగు ప్రధాన ద్వారాలు వున్నాయని పురాణాలు చెప్పుతున్నాయి. అవి ఉత్తరంలో ఉమామహేశ్వరం, దక్షిణంలో సిద్ధవటం, పడమర అలంపురం, తూర్పుదిక్కులో త్రిపురాంతకమని ప్రసిద్ధి.

శ్రీశైల క్షేత్రంలో మల్లికార్జునాలయం ప్రధానమైంది. ఈ ఆలయంలో గర్భగృహం, అంతరాళం, ముఖమండపం, రంగమండపం, వీరశిరోమండపాలు కలవు. హరిహర రాయలు ముఖ మండప నిర్మాణం గావించినట్లు తెలుస్తుంది. స్వామికి ఎదురుగా నంది మండపంలో పెద్ద నంది విగ్రహం వుంది. ఈ నంది విగ్రహాన్ని 'శెనగల బసవన్న' అని పిలుస్తారు. స్వామిని భక్తులు ధూళితోనే దర్శనం చేసుకొంటారు. దీనినే ధూళి దర్శనం అంటారు. భక్తులు లింగాన్ని స్పర్శించి ప్రార్థించడం ఇక్కడ ప్రత్యేకత. స్వామి ఆలయానికి దగ్గరలో పడమటివైపు భ్రమరాంబదేవి ఆలయం వుంది. దీనినే కదంబరాజైన మయూరశర్మ నిర్మించినట్లు ప్రతీతి. ఇంకను ఇక్కడ పంచపాండేశ్వర లింగం, కుమారస్వామి ఆలయం, అర్ధనారీశ్వరాలయం, అన్నపూర్ణ భవానీ ఆలయం,

వృద్ధ మల్లికార్జునాలయం, సిద్ధి వినాయకాలయం ఉన్నాయి. ఈ క్షేత్రంలో పాతాళగంగ ప్రసిద్ధి చెందిన తీర్థం. స్వామి ఆలయానికి ఆరు కిలోమీటర్ల దూరంలో కొండకు 500 అడుగుల లోతున పాతాళగంగ ఉంది. దీనితోపాటు గోగర్భం, పాపవినాశనం, బిందుతీర్థం మొదలయినవి చెప్పుకోదగిన తీర్థాలు. పుణ్యక్షేత్రాలే గాక విద్యా సాంస్కృతిక పరిజ్ఞాన కేంద్రంగా కూడ శ్రీశైలం విరాజిల్లుతున్నది. శివరాత్రి ఇచట ముఖ్యమైన పర్వదినం.

4. **మహానంది** : కర్నూల్ జిల్లాలో నంద్యాలకు 16 కి.మీ. దూరంలో నల్లమల కొండల్లో మహానందీశ్వర ఆలయం వుంది. శ్రీశైల మల్లికార్జునునకు, మహానందీశ్వరునికి అవినాభావ సంబంధం వుందని ఒకదానిని దర్శించినవారు మరొక దానిని తప్పక దర్శించాలని ఇక్కడి ప్రజల విశ్వాసం. ఈ ఆలయానికి చుట్టూ పదిమైళ్ళ విస్తీర్ణంలో ప్రథమనంది, సోమనంది, సూర్యనంది, గరుడనంది, నాగనంది, విష్ణునంది, రుద్రనంది, బ్రహ్మనంది నవనందుల ఆలయాలున్నాయి. దీని ఆధారంగానే నంద్యాల అనే పేరు కలిగింది. శ్రీశైలం అనే పేరు రావడానికి కారకుడైన శిలాధుని కథే ఇక్కడ కూడా వాడుకలో వుంది. నందీశ్వరుడు తపస్సు చేసి ఈశ్వరుని మెప్పించి కలకాలం తనవీపుపై వుండునట్లు కోరుటచే ఇక్కడ వెలసిన దేవునికి మహానందీశ్వరుడని పేరు వచ్చినట్లు చెప్పుకొంటారు. కర్నూల్‌ను పరిపాలించిన నందరాజుకు పెద్ద ఆవుల మంద వుండెడిదని అందు ఒక ఆవు నిత్యం పాలను పుట్టలో వదిలెడిది. అది తెలిసి గోపాలుడు ఆవును కొట్టబోవగా దెబ్బను అది తప్పించుకోవడంతో పుట్టను కాలితో తొక్కింది. లోపల ఈశ్వరుడు కన్పించినాడు. తరువాత నందరాజు ఈ ఆలయాన్ని, చుట్టూ వున్న ఎనిమిది నందీశ్వరాలయాలను నిర్మించినట్లు లోక ప్రతీతి. ఇచట ఆశ్చర్యకరమైన విషయం లింగం క్రింది భాగంలో నీటిబుగ్గ పుట్టి భూమిలోనే ఆలయ ప్రాంగణంలోని కోనేరులోనికి పారుతుంది. ఏ ఋతువులో కూడా నీటిమట్టంలో హెచ్చు తగ్గులుండవు. గర్భాలయంలో పుట్టాకృతిలో నున్న దిబ్బ నడుమలో స్వయంభూలింగ మనబడు మహానందీశ్వర స్వామి లిగం వుంది. స్వామికి అభిషేకం చేసిన జలం మొత్తం లింగం క్రింది భాగంలో ఉన్న బుగ్గలో కలిసిపోతుంది. ప్రధాన ఆలయానికి దక్షిణ భాగంలో పార్వతీదేవి ఆలయం వుంది. శివరాత్రి ఇక్కడ పర్వదినం.

5. **మంత్రాలయం** : కర్నూల్ జిల్లాలో ప్రధాన పట్టణాలైన ఆదోని, ఎమ్మెగనూర్‌లకు 25 కి.మీ.ల దూరంలో మంత్రాలయం వుంది. ఇది రాఘవేంద్రస్వామి సమాధి. తుంగభద్రానదీ తీరంలో ఈ సమాధి నిర్మింపబడింది. వెంకన్న భట్టుకు శ్రీ సుధీంద్రులు రాఘవేంద్రుడని నామ

కరణం గావించారు. అప్పటినుండి రాఘవేంద్రునిగా ప్రసిద్ధి చెందారు. ఈ గుడిలోకి ప్రవేశించే ముందు తుంగభద్రలో పాద ప్రక్షాళనం గావించుకోవడం సంప్రదాయం. అంగవస్త్రం లేకుండ స్వామి దర్శనం చేసుకోవడం ఆచారం ఇది ద్రావిడ సంప్రదాయం. ఇక్కడ ప్రతి గురువారం పర్వదినం. స్వామిని దర్శించేవాళ్ళకు నిత్య అన్నదానం చేయబడుతుంది.

6. **నందవరం** : నందవరంలో చౌడేశ్వరీ దేవి ఆలయం ప్రసిద్ధి. నందరాజు నందవరపు బ్రాహ్మణులకు కాశీ జగన్మాత సాక్షిగా ఒకమాట యిచ్చి సాక్ష్యానికి ఆమెనే తీసుకొని రమ్మన్నాడట. అప్పుడా బ్రాహ్మణులు కాశీ నుండి దేవిని రావలసినదిగా ప్రార్థించారు. మీరు తిరిగి చూడకుండ ముందు వెళితే నేను మీ వెంట వత్తునని దేవి చెప్పింది. నందవరం దగ్గరకు వచ్చునప్పటికి బ్రాహ్మణులు అనుమానించి వెనుదిరిగి చూచినారట. దేవి అక్కడే శిలయ్యిందని జనవాణి ఇక్కడ ప్రతి సంవత్సరం ఉత్సవాలు చాల ఆహ్లాదకరంగా జరుగుతాయి. నిప్పులమీద నడవడం ఉత్సవ రోజులలో ముఖ్యం.

7. **చాగలమర్రి చెన్నకేశవాలయం** : మార్కాపూర్ కర్నూల్ జిల్లాలో వున్నకాలంలో మార్కాపుర చెన్నకేశవ స్వామి ఆలయం సుప్రసిద్ధం. పల్నాటి బ్రహ్మన్న ఈ ప్రాంతంలలో సంచరించినాడని ఆతని కారణంగా చెన్నకేశవాలయం వెలసిందని లోకం వాడుక. ఇంకను కర్నూల్ జిల్లాలో ఓంకారం, బ్రహ్మగుండం, ముచ్చట్ల, నెమిలిగుండం, వెంకాయపల్లె వినాయకుడు, కొత్తూరు సుబ్రమణ్యస్వామి ఆలయం, కాలవబుగ్గ, బనగానపల్లి మఠం, పంచ లింగాల, ఎల్లార్తి దర్గా - సుప్రసిద్ధాలు. కర్నూలు పట్టణంలో షిర్డి సాయిబాబా ఆలయం, శమీవృక్షం (జమ్మిచెట్టు), గోకర్ణం, రాంబొట్ల వారి దేవాలయం, శ్రీ ఆంజనేయ స్వామి దేవాలయం, కాశీ విశ్వేశ్వరాలయం, పాండురంగ స్వామి దేవాలయం, బిర్లామందిర్ సత్యనారాయణ స్వామి ఆలయం యాత్రికులు దర్శింపవలసిన క్షేత్రాలు.

## III. పారిశ్రామిక దర్శనీయ స్థలాలు :

1. **కర్నూలు పట్టణంలోని బిర్లా కంపెనీ** : ఇది 1950 ప్రాంతంలో ప్రారంభించబడింది. ఈ ఫ్యాక్టరీలో డాల్డా, సబ్బులు, రీఫైండ్ వేరుశనగ నూనె తయారుచేస్తారు.

2. **పద్మభూషణం మాచాని సోమప్ప** : (Co-operative) సహకార ఉద్యమంలో భాగంగా చేనేత వస్త్రాలు నేయడం ప్రారంభమయింది.

ఆయన నేతృత్వంలో వెలసిన ఎమ్మిగనూరు చేనేత పరిశ్రమ ఆంధ్రదేశంలోనే కాక భారతదేశంలోనే ప్రసిద్ధి చెందింది.

3. **పాణ్యం** : ప్రభుత్వ సహకారంతో మాచానివారి నేతృత్వంలో 1955-56 ప్రాంతంలో నిర్మింపబడిన పాణ్యం సిమెంటు ఫ్యాక్టరీ ఆంధ్రదేశం లోని పెద్ద సిమెంటు ఫ్యాకరీలలో ఒకటి.

4. తుంగభద్రా నదికి ఆవలి ఒడ్డున కర్నూలుకు దగ్గరలో వెలసింది రాయలసీమ పేపర్ మిల్స్. నాణ్యమైన కాగితాలకు రాయలసీమ పేపర్ మిల్స్ ప్రసిద్ధి.

5. **ఆఫోని** : జంఖానాల పరిశ్రమ గూడ చెప్పుకోతగ్గది.

# 5. నన్నయ్య - రసపోషణ

నన్నయ్య భారతము అసంపూర్ణ కథ భారతనాయకులైన పాండవులు అరణ్యా వాసం చేస్తూ కష్టాలను అనుభవిస్తున్న సమయంలో నన్నయ్య రచన ఆగి పోయింది. ఆరణ్య పర్వచతుర్థాశ్వాసంలో యుధిష్ఠిరుడు నహుషుని ప్రశ్నలకు సమాధానం ఇచ్చేంత వరకే నన్నయ్య అనువాదమని పండిత విమర్శకులు నిర్ణయించారు.

సంపూర్ణ కావ్యంలో అన్ని రసాల్ని పోషించిన కవులు చాలామంది వున్నారు. కాని పద్దెనిమిది పర్వాలకథలో రెండున్నర పర్వాలు మాత్రమే తెనిగించి అందు అన్ని రసాలకు న్యాయం చేకూర్చిన వాడు శబ్దశాసనుడంటే అతిశయోక్తి గాదు.

'రసము' అన్నదానికి నిర్దిష్టమైన నిర్వచనం చెప్పడం కష్టం. భరత, భట్టలోల్లట, భట్టనాయక, అభినవ గుప్తాదులు అనేకులు అనేక నిర్వచనాలు చేసారు. ఒక్కొక్కరి మతం ఒక్కొక్క విధం. రసవిషయం నందే గాక రససంఖ్య విషయంలో కూడా అలంకారికులలో ఏకాభిప్రయం లేదు. రసములు ఎనిమిది అని కొందరు, నవరసాలని కొందరు, భక్తిరసంతో కలిపి రససంఖ్య పది అని కొందరు, ప్రేమ, వత్సల మాయా రసాలు కలిపిన వారు కొందరు. శృంగార మొక్కటే రసమని కొందరు పేర్కొన్నారు. కవికర్ణ పూరగోస్వామి 'ఒకటే రసము' అన్నాడు. ఇట్లా లాక్షణికులలో రససంఖ్యలో భిన్నాభిప్రాయాలున్నాయి.

రసము అనడానికి స్థూలంగా 'ఆస్వాద్యయోగ్యమైన భావనా విశేషమందలి అనుభూతి పరాకాష్ఠ రసమ' ని చెప్పవచ్చు. అనుభూతి అనడానికి శ్రీరాళ్ళ పల్లి అనంత క్రిష్ణ శర్మ మొదలగు వారు 'అను భూతిని పూర్తిగా అను భూయామానము చేసికొని అభివ్యక్తితో ప్రకటింపగల సామర్థ్యము మహాకవికే వున్నది. మహావిమర్శకుడు, పాఠకుడు అనుభూతి వలన కలిగిన స్పందనచే తన్మయులై ఏదో చెప్పగలుగుదురు కాని సంపూర్ణముగా చెప్పజాలరు. పాఠకుని కంటె విమర్శకుడు యితని కంటె మహాకవి యిందులో అగ్రగణ్యులు' అని తెలిపాడు.

'రసము' అను పదానికి శబ్దరత్నాకర కర్త 'రసమనగా శృంగారాది తొమ్మిది

రసములని, అవి ఒకటి శృంగారము, రెండు హాస్యము, మూడు కరుణం, నాలుగు వీరము, అయిదు రౌద్రము, ఆరు భయానకము, ఏడు భీభత్సము, ఎనిమిది అద్భుతము, తొమ్మిది శాంతము, మతాంతరముల బట్టి యీ సంఖ్య హెచ్చు తక్కువలు అగును' అని అనినాడు.

రససంఖ్య ఎంతైనా నన్నయ తన భారతంలో అన్ని రసాలు పోషించినాడని చెప్పవచ్చు. భారతంలో అంగి రసమేది అనుటలో కూడ అభిప్రాయ భేదాలున్నాయి. సభా పర్వానికి పీఠిక వ్రాస్తూ డా. దివాకర్ల వేంకటావధాని గారు "భారతంలో శాంతము అంగిరసము అని తెలిపారు. కాని డా. పాటిబండ మాధవ శర్మ గారు అరణ్య పర్వానికి పీఠిక వ్రాస్తూ భారతంలో అంగిరసం ధర్మవీరము అన్నారు. సంపూర్ణ భారతము శాంత రస ప్రధానమా? వీరరస ప్రధానమా? అనునది ఇక్కడ చర్చనీయాంశము కాదు.

నన్నయ్య భారతము మాత్రం శాంత రసము ప్రధానం అని తెలుస్తుంది. అంతరింద్రియ, బహిరంద్రియ నిగ్రహం కలిగి పుణ్య శ్రవణుడైన ధర్మరాజులో శాంతం గోచరిస్తుంది. ఆదిపర్వంలో గాని, అరణ్య పర్వంలో గాని, వీర రసానికి స్థాయీ భావమైన ఉత్సాహం ధర్మరాజులో కనిపించదు. సభా పర్వంలో నారద ప్రేరితుడై రాజసూయయాగం చేయ దలచినపుడు శ్రీకృష్ణ భీమార్జునుల ప్రోత్సాహంతో కించత్ ఉత్సాహం ధర్మరాజులో కనిపిస్తుంది. ఇదికూడా శాంత రసానికి భంగం కలుగునట్లు నన్నయ్య వ్రాయలేదు.

నన్నయ్య రసపోషణలో నాడే గాక నేటికి కూడ నూత్నత కల అంశం ఒకటి వుంది. అది ఏమంటే కథను ఆస్వాద్యం చేయునంత వరకే రసాన్ని పోషించుట. ఉదాహరణకు కరుణ రసపోషణ సందర్భంలో స్థాయియైన శోకానికి దారితీయుద్దీపనలైన దైన్యనిర్వేదాదుల్ని విపులంగ వర్ణించి శోకావస్థకు చేరినంతనే ఉద్దీపనా వర్ణనల ప్రభావంచే పాఠకుడే శోకాన్ని అనుభూయమానం చేసికొనునట్లు చేస్తాడు.

భారతంలో శాంతరసము అంగిరసం అయిన దానికి శృంగార, రౌద్ర హాస్య, భయానకాలు విరుద్ధం కదా! మరి అన్ని రసాలను పోషించిన నన్నయ శాంతి రసానికి భంగం చేకూర్చినట్లే కదా! అనేవారున్నారు. ఈ పరస్పర విరుద్ధ రసాలు ఎకనాయకాశ్రయంగా చేస్తే విరుద్ధం. భిన్ననాయకాశ్రయాలుగ చేస్తే దోషం రాదని ఆలంకారికుల అభిప్రాయం. అందుకే నన్నయ వీర, శృంగార, రౌద్ర, హాస్య, భయానకాల్ని ధర్మరాజు ఆశ్రయంగా చేసుకోలేదు.

నన్నయ రసాలన్నిటిని తన కావ్యంలో నిబంధించినాడంటిమి కదా! అతడు

ఏఏ ఘట్టాలందు ఏఏ రసం ఎట్లు పోషించినాడో స్థాలీపులక న్యాయంగా పరిశీలిద్దాం.

## 1. శృంగార రసం :

శృంగారానికి స్థాయీ భావం రతి. తరుణీ తరుణులకు మనసున పొడమిన సంభోగ విషయకమగు అభిలాష లేక కామం రతి. [కావ్యాలంకార సంగ్రహం] నన్నయ శృంగార వర్ణనలు నిగ్రహంతో కూడివుంటాయి. విప్రలబ్ధ శృంగారానికి ఇచ్చిన ప్రాధాన్యం,నన్నయ సంయోగ శృంగారానికి ఇవ్వలేదు. శృంగార వర్ణనలు చేయుటకు ఎన్ని సందర్భాలు అనుకూలంగా వుండినా నన్నయ వాటిని కడు నిగ్రహంతో, నేర్పుతో అంగిరసానికి భంగం రాకుండా వర్ణించాడు. చేమకూర శృంగార ప్రబంధం 'విజయ విలాసం'నకు మూలం నన్నయ భారత భాగమని సర్వ విదితం.

శృంగార రసపోషణ సమయాన నన్నయ్య ఉద్దీపనుల కిచ్చిన ప్రాధాన్యం స్థాయీ భావానికి ఇయ్యలేదు. శృంగార రసోద్దీపకాలను సహజంగా వర్ణించి తద్వారా రసపుష్టిని కలిగించుట నన్నయ ప్రత్యేకత.

'శకుంతలోపాఖ్యానం' శృంగార రస ప్రధానం. ఇందు నాయకుడైన దుష్యంతుడు నాయిక శకుంతలను చూచు సందర్భంలో 'తన్వి బయోజ దళాయతాక్షి సంకుల మెళి తాళినాల పరి కుంచిత కోమల కుంతలన్, శకుంతల అను కన్యన్ గనియె' [1-4-25] అని వర్ణించాడు. ఇందు ఎంత భవోద్దీపన వుందో సహృదయులకు సువ్యక్తం. ఉద్దీపనను యింత చక్కగా వర్ణించిన నన్నయ స్థాయి భావ విషయంలో 'అభిమత సుఖములనుభవించి" [1-4-64] అని ఒక్క మాటలో దాటవేసినాడు.

అట్లే-

మాద్రీ పాండురాజులు శృంగార రసోల్లాసాలకు ఉద్దీపనగా కమ్మని లతాంతముల కుమ్మొనిసి గింశుక వనమ్ములను నొప్పెన్. [1-5-138] 'చందన తమాల తరులందు....వీచెన్' [1-5-139] అని రెండు లయ గ్రాహి పద్యాలు వ్రాసి స్థాయీ భావమైన రతిని, 'సంభోగసుఖ సమీహితుడయ్యెన్' [1-5-142] అని మాత్రమే వ్రాసి శృంగార రసపోషణలో తన నిగ్రహానికి నిదర్శన చూపాడు. శాంతమున కాశ్రయమైన ధర్మరాజు పాత్రలో శృంగారం శూన్యమనిపిస్తుంది. నన్నయ భారతంలో శృంగారం వుండినా అది అన్యనాయకాశ్రమం కనుక శాంతరసంకు భంగం లేదు.

2. హాస్యం :

హాస్యానికి స్థాయీ భావం హాస్యం. పరమ నైష్ఠికుడైన నన్నయలో హాస్యం లేనేలేదని కొందరి వాదం. కాని పరిశీలించి చూస్తే అతనిలో మృదువైన హాస్యం గోచరిస్తుంది. ఉదాహరణకు అర్జునుడు గురుదక్షిణగా తెచ్చిన ద్రుపదుని చూచి ద్రోణుడు "వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులే యిట్లు కృపణులై పట్టువడ వీరికి వలసెనే [1-6-90] అనుటలో వ్యాగ్రూపమైన హాస్యముంది.

భీముడు కిమ్మీరుని వధించి ఆ శవాన్ని జూచి 'బక హిడింబులు హతులైనన్ బనివి పనివి యుఱచి శోకింపగానక యమపురమున కరిగి తక్కుట రాక్షస' అనుటలో హాస్యముంది. హాస్యంకూడా ధర్మరాజాశ్రయంగా వర్ణించలేదు.

3. కరుణ రసం :

శోకము స్థాయీ భావంగా దైన్యాదులుద్దీపనలుగా కలిగింది కరుణ రసము. స్థాయియైన శోకానికి దారితీసెడి ఉద్దీపనలైన దైన్య నిర్వేదాదులనే నన్నయ ఎక్కువగా విపులీకరించారు. శోకావస్థకు చేరినంతనే ఉద్దీపన వర్ణనల ప్రభావంచే పాఠకుడే శోకం, అనుభూయమానంగా చేసుకొనునట్లు చేయుటలో నన్నయ నేర్పరి.

మాద్రీ పాండు రాజులు మరణించుట, పసిపిల్లలతో అందున అరణ్యంలో కుంతి ఏకాకిగ మిగులుట మొదలగు ఉద్దీపనలు వర్ణించి, స్థాయియైన శోకాన్ని విపులంగా వర్ణింపక, అప్పటి కుంతి శోకం యొక్క పరాకాష్ఠను పాఠకుని ఊహకే వదిలేశాడు. అట్లే ద్రౌపది వస్త్రాపహరణ సందర్భంలో ఆమె పరాభవానికి పూర్వరంగం విపులంగా వర్ణించి, ఆమెశోకాన్ని 'భామిని కృష్ణ దలంచె భీతయై' (2-1-219) అని స్థాయి యైన శోకానికి ప్రాధాన్యం దగ్గించాడు. కొన్నిచట్ల స్థాయి యైన శోకానికి కొంత ప్రాధాన్యం ఇచ్చినా అది ఉద్దీపన వర్ణనలకు మించి వుండదు. అరణ్యవాసానికి బయలు దేరిన పుత్రులను, కోడలిని చూచి విలపించు కుంతి యొక్క శోకాన్ని వర్ణించినా, ఆ శోకానికి ఉద్దీపనగా ద్రౌపది పరాభవం, పాండవుల అరణ్య, అజ్ఞాత వాసాల సమయాలను వర్ణించాడు. ఇట్లా నన్నయ కరుణ రసం నందు కూడా ఉద్దీపనులకే ప్రాధాన్యం ఇచ్చాడు.

భారతం కరుణరస ప్రధానమనే వారు ఉన్నారు. కాని నన్నయ కరుణరస స్థాయియైన శోకానికి ప్రాధాన్యం ఇవ్వలేదు. కాబట్టి నన్నయ భారతం కరుణరస ప్రధానమనుట సమంజసంగా తోచుటలేదు.

## 4. వీర రసము :

వీరరసమునకు స్థాయీ భావం ఉత్సాహం. ఇది యుద్ధవీరం, ధర్మవీరం, దయావీరం, అని ప్రధానంగా మూడుతకాలు. వీరం శాంతానికి విరుద్ధం. ఇవి రెండు ఏకనాయకాశ్రయాలు కారాదు. శాంతానికి ఆశ్రయుడైన ధర్మరాజు వీరరసానికి ఆశ్రయుడు కారాదు. సభాపర్వంలో రాజసూయాగం చేయుదల చినపుడు శ్రీకృష్ణ, భీమార్జునుల ప్రేరణతో కించిదుత్సాహం ధర్మరాజులో కన్పిస్తుంది. ఇక్కడ ధర్మరాజులో వీర రసం నీట మీద బుడగ వలె తొంగి చూచిందేగాని వీరరసానికి స్థాయి భావమైన ఉత్సాహం వర్ణింపబడలేదు. చేయుము రాజసూయము (2-1-98) అని అందరు ప్రేరేపించినపుడు కూడా ధర్మరాజు గంభీరమైన శాంతాన్నే కలిగి ఉండినట్లు కనబడుతుంది. కాబట్టి నన్నయ భారతంలో వీరం శాంతానికి భంగం చేకూర్చ లేదనుట స్పష్టం.

*(అ)* యుద్ధ వీరము : యుద్ధవీరం యుద్ధాదులచే వ్యక్తమవుతుంది. యుద్ధాదుల విషయంలో నన్నయ ఉద్దీపనల కెంత ప్రాధాన్యం ఇచ్చెనో, స్థాయికి సంబంధించి ఉద్దీపనా పర్యావసనాలైన యుద్ధ దృశ్య వర్ణనలకు అంతే ప్రాధాన్యమివ్వాలి. యుద్ధదృశ్యాదులు ప్రత్యక్ష పరిదృశ్యమానమగునట్లు చేయనిచో పాఠకుడు తదనుభూతి పొందలేడు. అందుకే యుద్ధ వీరంలో నన్నయ స్థాయి ఉద్దీపనలకు సమ ప్రధాన్యమిచ్చాడు.

దేవదానవ యుద్ధ సందర్భములో ఉద్దీపనులైన (1) కృత్రిమ నారీ రూపంలో నారాయణుడు రాక్షసుల్ని మోసం చేయడం (2) రాహుకేతువుల కంఠ ఖండనం (3) దేవతలు అమృతాన్ని కాజేయడం. ఈ మొదలగు విషయాలను ఎంత విపులంగా వర్ణించాడో, యుద్ధ వర్ణన కూడా అంతే విపులంగా వర్ణించాడు.

సౌందర్య దార్శనిక స్ఫూర్తిచే యుద్ధదృశ్య సాక్షాత్కారమందలి భయోద్వేగాలను అరికట్టుటలో తిక్కన ప్రసిద్ధుడు. నన్నయ కూడా నిపుణంగాను, లోకోత్తరంగాను అట్టి వర్ణనలు చేసిన సందర్భాలున్నాయి. దేవదానవ యుద్ధ సందర్భంలోనే రాక్షసుల శరీరాలపై పడు బాణ పరంపరను ఆకాశమంతటా నిండిన మేఘాల నుండి వచ్చు వర్షపుధారలతో పోల్చాడు. అట్లే రాక్షసుల మెడలు తెగి క్రిందికి ప్రవహించు రక్త ధారలను పర్వత శిఖరాల నుండి క్రిందకు వచ్చు జలంతో పోల్చాడు.

*(ఆ)* ధర్మ వీరము : ధర్మ నిర్వహకోసం చూపించు ఉత్సాహం ధర్మవీరం. నన్నయ భారతంలో గరుత్మంతుని పాత్రలో మనకు ధర్మవీరం కన్పిస్తుంది.

మాతృదాస్య నివారణం అతని ధర్మకర్తవ్యం. ఆకారణంగానే తన వీరత్వాన్ని చూపి అమృతాన్ని సంపాదించాడు. కాని తానాస్వాదించలేదు. అతడలోలుడు ధర్మవీరుడు. నన్నయ ఆవిషయాన్నే 'నా విజయోత్సాహమునకు, లావునకు, జపంబునకు, నతాల్యమునకు, సద్భావమునకు' అని చెప్పించాడు. తండ్రి కోసం గాంగేయుడు బ్రహ్మచర్యం అవలంభించడం కూడా ధర్మవీరమే! నన్నయ ఈ సందర్భాలలో ధర్మవీరానికి దారితీసిన ఉద్దీపనలను విపులంగా వర్ణించి తత్ పర్యవసనాన్ని ఏపాత్రల మూలంగానో వ్యక్తం చేయిస్తాడు. లేదా పాఠకుడే గ్రహించునట్లు చేస్తాడు.

*(ఇ) దయా వీరం :* నన్నయ భారతమున కాండవ దహన సందర్భంలో పార్థుడు దయ తలచి యముడు, అశ్వసేనుడు, మందపాలుడు మొదలగు వారిని విడుచుట దయావీరానికి ఉదాహరణ.

యుద్ధ వీరంగాని, దయా ధర్మవీరాలు కాని ధర్మరాజు ఆశ్రయంగా పోషించుట శాంతానికి భంగం అనువారు ఉన్నారు. శాంతానికి ఆశ్రయుడు ధర్మరాజు. వీరానికి ఆశ్రయు లనేకులు. వీరరసంలో ఉద్దీపనుల వలే స్థాయికి కూడా నన్నయ ప్రాధాన్యమిచ్చి వీరం అంగిరసంగా చేసినాడని చెప్పవచ్చు.

5. రౌద్రము :

రౌద్రమునకు స్థాయీ భావం క్రోధం. రౌద్ర, భయానక, పోషించుటలో నన్నయ అధిక నిగ్రహం అవలంభించాడు. అంగిరసమైన శాంతి రస వ్యంజమునకు ఇవి భంజకములు గాకుండునట్లు రసపోషణ చేశాడు. స్థాయియైన క్రోధాన్ని వ్యంజమానం చేయు పటిష్ట భావాన్ని ప్రతి పాదిస్తూ అక్షరావృత్యాదులచే కూడా స్థాయిని మరింత వ్యంజనం చేసాడు. ఉదాహరణకు భీమ హిడింబాసుర యుద్ధ వర్ణనలలో నన్నయ పద్యం స్థాయిని మరింత వ్యంజనం చేయకల్గింది.

కం. *"భూరి పదఘాత జాతధ*
*రాణేను ప్రకర ధూసర శరీరకులై*
*వారిద్దఱు నొప్పిరి నీ*
*హార చ్ఛన్నంబులైన మృదుల పోలెన్"* (1-6-211)

రాజ సూయయాగ సందర్భంలో భీముని ఆకారాన్ని,రౌద్రరూపాన్ని 'ప్రకటిత కోపవేగమున అంతకమూర్తి కచ్చటన్' (2-2-51) అను పద్యంలో వర్ణించి, నన్నయ రౌద్రరసానికి ప్రాణం పోశాడు. వన వాసానికి పోయే భీమార్జునులు

క్రుద్ధులై శపథాలు వర్ణించు సందర్భంలో, భీమ కిమ్మీరుల యుద్ధ సందర్భంలో రౌద్రరసం గోచరిస్తుంది. కుమారాస్త్ర విద్యాప్రదర్శన సందర్భంలో భీమ సుయోధనుల గదాయుద్ధం రౌద్రరసస్ఫోరకమే.

## 6. భయానకం :

భయానకానికి స్థాయీభావం భయం. భయానకం శాంతానికి విరుద్ధరసం. భారతంలో ఇవి ఏకనాయకాశ్రయాలు కావు. నన్నయ భారతంలో జనమేజయుడుజేయు సర్పయాగ సందర్భంలో భయానక రసం పోషింపబడింది.

కం. ధరణీసుర మంత్రహోమ
స్ఫురణను వివశులయి భూరి భుజగప్రభులోం
దొరుబలుమము నధిక భయా
తురులై కుండొగ్నలందు దొరఁగిరిపిటుమన్" (1-2-212)

అట్లే భీముని చేతిలో జరాసంధుడు మరణించినప్పుడు "అవని తలంబు వ్రస్సెనో హిమాచల శృంగము వ్రయ్యలయ్యెనో శ్రవణ విధారణంబయిన శబ్దము తానిదియేమి యొక్కొ భైరవమై విన్పెనుంచును పురంబున వారు భయంబు పొందిరా" (2-1-213) అని వర్ణించినాడు. ఇందు 'భైరవమై' అను మాటలోని 'భై' లోని 'బ' కారం యొక్క స్థాయి భయానక రసానికి ప్రాణం పోస్తుంది. ఈ కాకువులతో జరాసంధుని వధని వర్ణించి 'గలహద్వార తోరణ సమీపంబునన్ దత్కళేబరంబు వైచినం సర్వజన భయంకరం బైయుండె' (2-1-214) అని శవం యొక్క భయంకరాకృతిని వర్ణించి భయానక రసపోషణ గావించాడు.

## 7. భీబత్సము

భీబత్సానికి స్థాయీభావం జుగుప్స. సర్వసాధారణంగా ఏవగింపు కల్గు వస్తువుల్ని మాచుట, వీనివలన కల్గుదోత జుగుప్స. నన్నయ భారతంలో కృష్ణ ద్వయపాయునుడు ద్రుపదునికి ద్రౌపది యొక్క పూర్వజన్మ వృత్తాంతం చెప్పునప్పుడు మౌద్గల్యుని, కుష్ఠువ్యాధిని వర్ణించుచు బాదితత్వగస్థి భూత కష్ట శరీరు. వయోవృద్ధువలపలితధరు, దుర్గంధ వధను దుఃఖజీవుడు (1-7-257) అటువంటి మౌద్గల్యముని ఒకరోజు -

కుడుచునెడ వాని పెను వ్రేలు కూటిలోన
దునిబిపదియున్న వ్రేలుపుచ్చితోయజాక్షి
యేవగింపక మూన్పిష్టమిష్టలీల
దగిలి కుడుచుచున్నంత నత్తరుణిఁ జూచి (1-7-258)

అని భీబత్సానికి స్థాయియైన జుగుప్సను వర్ణించి భీబత్స రసానికి తన కావ్యంలో స్థానం కలిగించాడు.

## 8. అద్భుతము :

అద్భుతానికి స్థాయీ భావం విస్మయం. అపూర్వ వస్తు సందర్శనం విస్మయావహం. శిశుపాల కంఠచ్ఛేదన అద్భుత రసప్రధానం. నన్నయ అద్భుత రసస్థాయియైన విస్మయాన్ని హఠాత్సంభవ మగుటకు కావలసిన పూర్వరంగాన్ని సమర్థవంతంగా వర్ణించినాడు. శిశుపాలుడు ఎన్ని నిందలు పలికినా, శ్రీకృష్ణుడు మౌనం వహించాడు. సహదేవుడు కోపించుట, భీష్ముడు శిశుపాలుని వృత్తాంతం చెప్పడం మొదలైనవి శిశుపాలుని కంఠచ్ఛేదనానికి పూర్వరంగాలు. కాని ఇవి ప్రత్యక్షంగా దారితీయవు. ఒక దానిచే ఒకటి ప్రభావితమై హఠాత్తుగా శిశుపాల శిరచ్ఛేదం జరిగింది. ఇట్లు నన్నయ అద్భుత రసాన్ని కూడా పోషించినాడనవచ్చు.

## 9. భక్తిరసము :

భక్తిరసానికి స్థాయీభావం తన్మయత. భారత మితిహాసమే కాని భక్తుల చరిత్ర భగవంతుని మహాత్మ్యం తెలుపు గ్రంథం కాదు. ఐనా నన్నయ కొన్నిచోట్ల భక్తిరసాన్ని పోషించాడు. ద్రౌపది వస్త్రాపహరణ సమయాన ఆమె శ్రీకృష్ణుని ప్రార్థించుట భక్తిరస స్ఫోరకం. రెండున్నర పర్వాల్లోను నన్నయ ఒకేఒక దండకాన్ని రాశాడు. "శ్రీ కంఠలోకేశ" అను ఈ దండకం అర్జునుడు శివుడు ప్రత్యక్షం కాగానే తన్ను తాను మరచి స్తోత్రం చేశాడు. ఈ ఒక్క ఘట్టమే నన్నయకు భక్తి రసపోషణలో గల నేర్పును తెలియజేస్తుది.

## 10. ప్రేమోరసం

ప్రేమోరసానికి స్థాయీభావం స్నేహం, నన్నయ భారతంలో సుయోధన కర్ణుల స్నేహం ప్రేమోరస స్ఫోరకం. అరణ్యా వాసానవున్న పాండవుల్ని చూడ వచ్చిన కృష్ణుడు "ఇపుడే ధర్మరాజుకు దుర్యోధనుని చంపి పట్టము గట్టెదా" అనునది వారి మధ్య గల స్నేహానికి చిహ్నాం.

## 11. వత్సల రసము :

వత్సల రసానికి స్థాయీభావం వాత్సల్యాం. దీనికి పుత్రభ్రాత్రాదులాలంభనం. వారి చేష్టలు, విద్యా శౌర్యాదులుద్దీపనలు. నన్నయ భారతంలో వత్సల రసం

కదు రమ్యంగా పోషింపబడింది. వత్సల రసానికి ఆశ్రయుడు ధృతరాష్ట్రుడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుని మాటలు విని పాండవుల్ని వారణాసికంపినప్పుడు, ద్యూతానికి ఆహ్వానించినప్పుడు అతనికి సుయోధనునిపై గల వాత్సల్యం నన్నయ కదురమ్యంగా వర్ణించినాడు. దుర్యోధనునిపై గల వాత్సల్యమే విదుర, భీష్మాదులు వలదనిన ధృతరాష్ట్రుడు పాచికలాడ అంగీకరించాడు. ఈ పాచికల ఆటయే చివరకు దుర్యోధనుని ప్రాణం తీసింది. ధృతరాష్ట్రునికి గల ఈ వాత్సల్యమే కౌరవనాశనానికి కారణమైంది.

నన్నయ భారతంలో హంసడిభకుల వాత్సల్యం అత్యంత రమ్యం. ఒకరి మరణవార్త విని, ఒకరు మరణించుటలో ఎంత భాతృప్రేమ వర్ణితమైందో సహృదయులకు సువిదితం. ఇట్లు భారత రచనలో నన్నయ పుత్ర భ్రాత్రాదు లాలంబనంగా వారిచేష్టలుద్దీపనులుగా వత్సలరసాన్ని పోషించాడు.

## 12. మాయారసము :

మాయారసానికి స్థాయీ భావం మిథ్యాజ్ఞానం. నన్నయ్య భారతంలో దుర్యోధన, శకుని మొదలగువారు పాచికలతో పాండవుల రాజ్యం అపహరించి శాశ్వతత్వం చేసి కొనదలచుట మిథ్యాజ్ఞానం. అరణ్యవాసానవున్న పాండవు లతో యుద్ధముచేయ దుర్యోధనుడు యత్నించుట కూడా మిథ్యా జ్ఞానానికి నిదర్శనమే.

దుర్యోధనాశ్రయంగా నన్నయ్య భారతంలో మిథ్యాజ్ఞానం పోషింపబడినది.

## 13. శాంతరసము :

శాంతమునకు స్థాయీభావం శమం అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహం ఉన్నప్పుడే శాంతరసం ఉద్భవిల్లుతుంది. నన్నయ్య భారతం మొత్తంమీద ధర్మరాజు అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహం గలవాడుగానే కన్పిస్తాడు. ధర్మజుడు అరణ్య పర్వాన పుణ్య కథాశ్రవణుడగుట శాంతరసానికి ఆలవాలము. ధర్మరాజు అంతరింద్రియ నిగ్రహమే సకల ధర్మబోధకాలైన తత్కాధలవైపు ఆయన బుద్ధిని మళ్ళించినది.

శక్తి సామర్థ్యాలు కలిగిన సోదరులుండి భార్యను పరపురుషుడు అవమా నించినపుడు కూడ ధర్మజుడు శాంత గంభీరుడుగానే కన్పిస్తాడు. నన్నయ్య రచన చివరిభాగంలో భీముని విడిచిపెట్టమని నహుషునితో ధర్మరాజు. 'నీవు సర్పరూపంబు దాల్చిన దైత్యుండవో, దేవతవో యేను యుధిష్ఠిరుండ, నిన్నడిగెద

నిమ్మహాభుజు నాయనుజునామిషార్థివైపట్టితేని నీకు బుభుక్షాన్నివృత్తయగునట్లుగ జాలినంత మృగమాంసము బెట్టెద వీనిని విడువుము' అనుటలో ధర్మజునిలోని శాంత గంభీరం విదితం. నన్నయ్య భారతంలో ధర్మరాజు శాంతమునకాశ్రయుడు.

ఈ విధంగా నన్నయ్య నిగ్రహశక్తితో నిర్దుష్టంగా రచనచేసినాడు. గనుకనే తరువాత అనేక విధాలైన రచనలు పెల్లుబుకి వెల్లువలై వచ్చినా భారతము తన స్థానాన్ని తాను నిలబెట్టుకొనగల్గింది.

# 6. భారత భాగవతాల్లో శ్రీకృష్ణ నిర్యాణము

యావదాంధ్ర దేశమేగాక భారతావని అంతయు బహువిధముల దీపావళి పర్వదినమును జరుపుకొనుచున్నారు. లోకకంటకుడైన నరకుని మరణమునకు సంతోషముతో పండుగ జరుపుకొను ఈ శుభదినమున నరకుని చావుకు కారణమైన ఆ శ్రీకృష్ణ భగవానుని నిర్యాణమును గూర్చి ఉపన్యసించుట అనౌచిత్యమని కొందరి భావన. అసలు ఈ కృష్ణ నిర్యాణమును ప్రస్తావించుటకు పండితులు, కథకులు, హరికథకులు ఇష్టపడరు. కృష్ణావతారము, కృష్ణలీలలు, కృష్ణార్జున యుద్ధము, రుక్మిణీ కళ్యాణము, గజేంద్రమోక్షము, వామనావతారము ఈ మొదలగునవి శ్రేష్ఠములని పలువురి అభిప్రాయము. అందుకే హరివంశమున ఎఱ్ఱన కృష్ణ నిర్యాణమును దాటవేసినాడు. నాచన సోమనాథుడు ఆ పొంతనకు పోలేదు. వీరితో నేనునూ ఏకీభవించుచున్నాను. కాని కృష్ణ నిర్యాణము శ్రేష్ఠతరమని నా భావన. అది ఎట్లనిన....

జీవి పుట్టుకకు ఆనందమును, మరణమునకు దుఃఖమును అనుభవించుట మానవనైజము. జీవి పాపపుణ్యముల ననుసరించి ఈ లోకమున జన్మించుననుట కర్మ సిద్ధాంతము. పాపపరిహారము నొందిన జీవి జన్మరాహిత్యమును పొందుననుట ఋషుల వాక్కు. జీవులయందు మనుష్య జన్మము ఉత్తమోత్తమము కావచ్చు. కాని పాపనాశము పొందినది మాత్రము కాదు.

## 1.1 శ్రీకృష్ణ నిర్యాణము శుభదాయకము :

ఈ లోకము కోటానుకోట్ల జీవులకు నిలయము. అందు ప్రతిజీవి తన అవయవ నిర్మాణ శక్తిచేత తనకు కావలసిన ఆహారమును సంపాదించుకో నేర్చదగినది. కాని ఈ మానవ శరీరము అందుకు భిన్నమైయున్నది. మానవుడు మిగిలిన జంతు కోటితో కలిసి బ్రతకలేడు. అమోఘమైన తనబుద్ధి బలముచే తనకు కావలసిన సదుపాయములను మానవుడు పొందగలుగుచున్నాడు. అట్టి మానవుడు తాను బ్రతుకుటకన్న తరతరములకు తనవారికోసం ఐశ్వర్యము సముపార్జించవలెననెడి ఆశకు లోనగుచున్నాడు. అధికారము మీద మక్కువను పెంచుకొనుచున్నాడు. తనకోసం తనవారికోసం పాపపుణ్యములను లెక్కించ

కుండా ఎదుటివారిని మోసముచేసి బ్రతక నేర్చుచున్నాడు. ఇట్టి నీచమానవ ప్రవృత్తి కిగిన మానవులు లోకమున అధిక సంఖ్యాకులైనపుడు లోకము పాపులచే నిండిపోవును. అట్టి పాపపు ప్రజలను భరించలేక భూదేవి తల్లడిల్లును. అట్టి భూదేవి దుఃఖమును బాపుటకు భగవానుడు అవతరించునని భగవద్గీత. కర్మ సిద్ధాంతము ననుసరించి గీత ననుసరించి దుష్టశిక్షణ శిష్టరక్షణకే శ్రీకృష్ణుడు అవతరించెనని తెలియును. ఆయన నిర్యాణము దుష్టశిక్షణ శిష్టరక్షణ జరిగినపుడే జరుగును.

ఇట్లు పరిశీలించినచో కృష్ణ నిర్యాణము శుభదాయకమే గాని అశుభము కాదు. దుష్టశిక్షణ శిష్టరక్షణ జరిగినది. కావున ఒకవిధమైన సంతోషము, మరణించిన పిమ్మట (Medico విద్యార్థులకు తప్ప) ఎందునకు కొరగాని ఈ మానవ శరీరమును వదలి భగవానుడు తనదయిన వైకుంఠము చేరెను. అది మరియొక సంతోషము. కావున కృష్ణ నిర్యాణము సంతోషించదగ్గ విషయమని నేను నమ్ముచున్నాను.

## 1.2 భారత ప్రశస్తి :

మానవులను ధర్మమార్గ ప్రవర్తకులుగను, మోక్షగాములుగను, సత్యవంతులుగను, నీతిమంతులుగను తీర్చిదిద్దుటకు జ్ఞానము అవసరము. అట్టి జ్ఞానమును లోకమున కందించుటకు పూనుకొనిన వారిలో వ్యాసుడు ప్రథముడు. వ్యాసులనేకులు, "వి" అను ఉపసర్గతో కూడిన "అస్" ధాతువుతో ఏర్పడిన "వ్యాస" శబ్దము గౌరవసూచియని పలువురి అభిప్రాయము. వేదముల యందలి జ్ఞానము అందుకొనుటకు సులభసాధ్యము గాదు. కనుక కృష్ణ ద్వైపాయనుడు భారతేతిహాసమును నిర్మించెను. మొదట భారతము ఇరువది నాల్గువేల శ్లోకములు కల్గిన "జయ" అని పండిత విమర్శకుల అభిప్రాయము. సుమంత, జైమిని, పైల, వైశంపాయన, శుక, రోమహర్షణ, సూతాదుల చేతిలో సంస్కృత భారతము లక్ష శ్లోకములకు ఎదిగినది. అట్టి భారతమునే కవిత్రయము తెనుగున స్వీకరించినది.

## 1.3 భాగవత ప్రశస్తి :

పురాణములు, ఉప పురాణములు కూడా వ్యాస కృతమని సాంప్రదాయము. పురాణములలో భాగవతము సర్వజన మనోరంజితమై భక్తి భావ సంభరితమై విరాజిల్లుచున్నది. భారత రచనానంతరము వ్యాకుల చిత్తుడైన వ్యాసుని వద్దకు నారదుడేతెంచి, భక్తి ప్రధానమైన కావ్యము నిర్మించినచో వ్యాకులత

తీరునని బోధించెనట. అపుడు నిర్మించినదే భాగవతమట. భాగవతకర్త వ్యాసుడవునా? అనునది వివాదాంశము. కర్త ఎవరైనను, కాలము ఏదైనను భాగవత పురాణమొక మహత్తర గ్రంథము. పద్దెనిమిది వేల శ్లోకములు కలిగి ద్వాదశ స్కంధములుగా విభజింపబడినది సంస్కృత భాగవతము.

ఇంతటి ప్రాశస్త్యము కలిగిన భాగవతమును ఏలనో, 15వ శతాబ్దము వరకు ఏ మహాకవి నుడివినట్లు తెలియరాలేదు. ఆంధ్రుల అదృష్టము పండి 15వ శతాబ్దమున ఈ భాగవతము పోతనచేతబడినది.

## 1.4 కవిత్రయాలు :

ఆశ్చర్యకరమైన విషయమేమనగా తొలి తెలుగు భారత కవులు ముువ్వురు. తొలి తెలుగు రామాయణ కర్తలు ముువ్వురు. తొలి తెలుగు భాగవత కర్తలు నలుగురు.

కవిత్రయములో ఒకరు వాగనుశాసనుడు ఆదికవి కాగ, మరియొకడు కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడు కాగ, ఇంకొకరు ప్రబంధ పరమేశ్వరుడు, శంభుదాసుడు అయినాడు. కనుకనే కవిత్రయము వారి గొప్పతక్కువలు చెప్ప సాధ్యము కాదు. తెలుగు భాగవతమునకు అట్టి అదృష్టము కలుగలేదు. తెలుగు భాగవతమున చేయినిడిన గంగన, సింగన, నారయలు పోతన ప్రక్కన కూర్చొనుటకు కూడ అనర్హులు అనిన అతిశయోక్తి కాదు.

## 1.5 తిక్కన :

ప్రస్తుతాంశమైన శ్రీకృష్ణ నిర్యాణము భారతమున తిక్కనచే భాగవతమున పోతన, నారయలచే రచింపబడినది. కావున ఆ కవులను గూర్చి ఒక్కమాట చెప్పుట అప్రస్తుతము కాదనుకొందును. కొమ్మనామాత్యపుత్రుడు, అమలోదాత్త మనిషి, హరిహర నాథోపాసకుడు, సోమయాజి అయిన కొట్టారపు తిక్కనగారు తెలుగున నాటకీయశైలికి ఆద్యులు. పాత్ర చిత్రణలో గడుసరి, సంభాషణా రచనమున సిద్ధహస్తుడు. అలంకారములతో అనల్పార్థ రచన గావించుట అతని సొమ్ము. అలతి అలతి మాటలతో తెలుగు నుడికారపు ఒంపుసొంపులు చూపుట తిక్కన మాత్రమే నేర్చిన విద్య. నన్నయ గద్యములు సహితములు పద్యము లవలె నుండును. తిక్కన పద్యములు గద్యముల వలె నుండునని పండితుల అభిప్రాయము. నన్నయ ననుసరించి ఆ మార్గమున కొంత ముందుకు వెళ్ళిన శ్రీనాథాదులు కలరు కాని, తిక్కన ననుసరించవలెనని ప్రయత్నింపని తెలుగుకవి లేదు. సఫలీకృతుడైనవాడు లేడు. యుద్ధ విషయమును వర్ణించుటలో నాచనసోమన కొంత సఫలీకృతుడైనాడు.

## 1.6 భారతము - మహాభారతము :

తెలుగు భారతమున పర్వవిభజన గావించిన ఆదికవి, కృష్ణ నిర్యాణమును మౌసల పర్వమున పేర్కొనినాడు. భారత స్వరూపమును నన్నయగారు

సీ. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, యైతిహాసికులితిహాసమనియుఁ
బరమ పౌరాణికుల్ బహు పురాణసముచ్చ, యంబని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధ వేదతత్త్వ వేది వేద వ్యాసుఁడాది ముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై, పరగుచుండఁజేసె భారతంబు"

అని నుడివినాడు.

ధర్మమును ఏలపాటించవలె అను ప్రశ్నకు ధర్మమును ధర్మముకొరకే పాటింపవలెను అని సమాధానము. ధర్మి, ధర్మము వీటి యొక్క అద్వైత స్థితిని తెలియజేయునది భారతము, సంస్కృత భారతము ఇతిహాసము, ఆంధ్ర భారతము కావ్యము.

భారతము భరతవీరుల చరిత్ర తెలియజేయునది అని కొందరు "భా" అనగా సత్వ "ర" అనగా రజో, "త" అనగా తమో, అనగా సత్వ రజస్తమో గుణములకు నిలయమయినది భారతమని మరికొందరు అభిప్రాయపడుచున్నారు. ఇట్టి భారతమునకు శ్రీకృష్ణుని చరిత్ర కలిసినపుడే అది మహాభారత మగునని అందరి అభిప్రాయము. 'మహా' అనగా గొప్ప. ఏది గొప్ప అను ప్రశ్నకు ప్రకృతియే గొప్ప అని సమాధానము. అట్టి ప్రకృతిని సహితము శాసించగలవాడు భగవానుడు. ఆ భగవానుని చరిత్ర కలసినట్టి బారతము మహాభారతము. కృష్ణుడే లేనిచో సుయోధన, భీష్మ, ద్రోణ, కర్ణాదులను ఎదిరించు శక్తి పాండవులకు శూన్యము. కావున భారతమున మిగిలిన అన్ని పాత్రలకన్నను శ్రీకృష్ణుని పాత్రకు ప్రముఖ స్థానము కలదు.

## 1.7 భారతములో శ్రీకృష్ణుడు :

భారతము నందలి కృష్ణుడు రాజనీతి తత్పరుడు. భాగవతము నందలి కృష్ణుడు భక్తుల పాలిటి కల్పతరువు. కృష్ణుని పుట్టుకగాని, అతని పెరుగుదల ఉదంతములు గాని, భాగతమున కానరావు. ప్రప్రథమముగా ద్రౌపదీ స్వయంవర ఘట్టమున (ఆది పర్వము - సప్తమాశ్వాసము) కృష్ణ పాండవుల కలయిక కలదు. కురుపాండవ కుటుంబములలో కలహమును ఆధారముగా తీసుకొని

అన్నదమ్ముల మధ్య వైరము సృష్టించి యుద్ధమును నడిపించినవాడు భారత కృష్ణుడు. ఆయన యుద్ధ సారధి, అర్జునుని రథసారథి.

భారతమున శ్రీకృష్ణుని నిర్యాణము మౌసల పర్వమున వర్ణించబడినది. ఇది ఏకాశ్వాసము. విరాట ఉద్యోగ పర్వములలోని నాటకీయత క్రమక్రమముగా తగ్గుముఖము పట్టినది. కారణము ఉద్యోగపర్వము తర్వాతి కథ నాటకీయతకు ఎక్కువ ఉపకరించక పోవడము. మరియు తిక్కన వయస్సు ముదురుట. కాని మౌసల పర్వములో కొంత నాటకీయత చోటుచేసుకొన్నది. సంస్కృత భారతమున మౌసల పర్వము తొమ్మిది అధ్యాయములు కలిగి 273 శ్లోకములలో విరాజిల్లుచున్నది. ఏకాశ్వాసమైన తెలుగు భారతమున 226 గద్య పద్యములు కలవు. తెలుగు భారతమున కురుక్షేత్ర సంగ్రామానంతరము 36 సంవత్సరములకు ఇంద్రప్రస్థమున అపశకునములు తోచినవి. అనేక మహోత్పాతములు పుట్టుచుండ "కొంతకాలమునకు ఒండొరులతో పెనిగి సర్వయాదవులును తెగిరి" అంబుజనాభుండు, హలధరుండు దక్క" అని ధర్మజుడు ఎవరి వంననో వినెను. వెంటనే భీమార్జున నకుల సహదేవులను రావించి ఆ వృత్తాంతం బెరింగించినాడు. ఇచట మునుల శాపము వివరముగా వర్ణింపబడినది.

### 1.7.1 విధివశము :

క. ద్వారవతికిఁ గణ్వుండును
నారద మునివరుఁడు గాధినందనుఁడును బెం
పారంగఁ దొల్లివచ్చిరి
నారాయణుఁ జూచు వేడ్కనరవరముఖ్యా

సీ. చనుదెంచి పరవీధిఁ జను నవసరమున
వృష్ణి కుమారులు విధివశమున
మనముల నవినీతి జనియింప సాంబున
కంగ నాలంకార మమరఁ జేసి
కొనివచ్చి యమ్మహామునివర్గమునకు మి
థ్యా వినియమున వందన మొనర్చి
నిభృతులై కారుణ్య నియతాత్ములార యీ
భామిని బభ్రునిభార్య ప్రజలఁ

తే. గనునెయొదియని యడిగినఁ గౌరవేంద్ర
యత్తపోధన వర్యుల య్యాగడమున
కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ
నెలయనక్కుమారుల తోడ నిట్టులనిరి

"విధివశమున మునుల అవినీతి జనియింప" విధివశమున అవినీతిప రులైనారే కాని, స్వభావ సిద్ధముగ వృష్ణి కుమారులు అవినీతిపరులు కారు.

వృష్ణి కుమారులు సాంబునకు అంగనాలంకారము గావించి మునుల చెంతకు తీసుకొనివచ్చి మిధ్యావినయమున వందన మొనర్చి మునుల పరీక్షించినారు. విషయమెరిగిన మునులు ఆత్మలందలి క్రోధము అగ్గలము కాగా అంబుజనాభుని కొడుకైన ఈ సాంబుని కడుపున యాదవ నాశనమునకు మూలమైన ముసలము పుట్టునని, బలరామ కృష్ణులు తప్ప తక్కినవారు ముసలము కారణముగ మరణింతురని శపించి, కృష్ణుని చూచుట మంచిది కాదని తిరిగి వెళ్ళిరి. విషయమును వినిన కృష్ణుడు బంధువులను చూచి ఇది విధాతృ కరణీయంబుగాని, మనవారి ఒప్పనిపని అని తలపోయకుమని ఉపదేశించినాడు.

### 1.7.2 మునుల శాపము :

మునుల శాపమున సాంబుని కడుపున ముసలము పుట్టినది. యాదవులు కృష్ణునికి ఆ వృత్తాంతమును నివేదించినారు. అప్పుడు కృష్ణుడు రోకలిని పొడిగా చేసి సముద్రమున కలుపమనెను.

క. ముని శాప శక్తి మానుష
మునఁ ద్రోవఁగ రామి యుల్లమునఁ దలపకయ
జ్జనపతియు బాంధవులు న
ట్లొనర్చి యూ ఱిడిలి యుండి రుర్వీనాథా

"ముని శాపశక్తి మానుషమున ద్రోవగరామి" ఇది సామాన్య కష్టం కసాధ్యమైన ప్రయోగము. "మానుషమునఁ ద్రోవగరామి" అనుటలో విశేషార్థము కలదు. ముని శాపము, గాంధారి శాపము బలీయములు. విధిముందు భగవంతుడైన తలవంచక మానడు. అందుకే కృష్ణుడు మానుషమునఁ ద్రోవగరామి అనుకొనినాడు. ఆ సమయమున ద్వారకానగరమున అనేక ఉత్పాతములు కలిగినవి. "Coming events cast their shadows" అని మహాకవి షేక్స్పియర్ అనినట్లుగా ద్వారకలో దుశ్శకునములు ప్రబలినవి.

### 1.7.3 దుశ్శకునాలు :

సీ. చిలుకలు గూబల యెలుఁగుల చందంబు
దోఁపంగ నఱచు లాతులనుదినము
లందును నక్కలయట్లు మేఁకలు గూయు
మెదవు పెందునకు గాడిదలుపుట్టు

ముంగుల కుదయించు మూషికంబులు గుక్క
తెల్లను బిల్లుల నీను బలుదు
హరియును దక్కంగ యాదవనివహంబు
బ్రాహ్మణ ప్రతతికి బాధ సేయు

తే. గురుల కవమాన మొనరించు దిరుగులజ్జ
విడిచి యభిలాషముల వెంట విభుల పంపు
సేయ కున్మార్గములదమ చిత్తములకు
వచ్చినట్లు వర్తింతురు వనిత లధీప

సీ. అనుదినంబున నిట్టుల శుభ సూచకములు
దో పగసర్య విదుండు కృష్ణుఁ
డంతరంగమున సమాలోచనము చేసి
గాంధారి పుత్రశోకమునఁ జేసి
కోపంబు గదిరిన శాపంబు ముప్పది
యాఱవునే డెల్లయాదవులకు
నాశమన్యోన్య హననమునగుటకు
నిచ్చె నిష్ఠించి యయ్యేదు వచ్చె

ఆ. దప్పదది ఫలించుదానికి దీర్ఘస
మీ పభూమియైన మేలుగాదె
యని నరేంద్ర యమ్మహాత్ముఁడీ భంగినం
హించి తెలుగు నిశ్చయించె దినిరి

## 1.7.4 సమాలోచనము :

"కృష్ణుడు అంతరంగమున సమాలోచన చేసి" కవి బ్రహ్మ ప్రయోగము బ్రహ్మకు సహితము ఇట్టి సృష్టిచేత కాదు. ఆలోచన చేయుట మానవ సహజము. సమాలోచనలు చేయుట ఉన్నత మానవ లక్షణము. పదుగురితో ఆలోచన చేయుట ఒక పద్ధతి. కష్టము సంభవించినప్పుడు తానాలోచించి తన శ్రేయస్సును కోరువారితో ఆలోచన జరిపి ఒక నిర్ణయమునకు వచ్చుట మానవ సహజము. దైవాంశ సంభూతుడైన మావుడు తనలో తానాలోచించుకొనును. కానీ దైవమే అయిన ఆ శ్రీ కృష్ణ భగవానుడు అంతరంగమున సమాలోచన గావించినాడు, ఏమిటి ఆ సమాలోచన? నేటికి గాంధారి శాపమిచ్చి 35 సం॥లు గడచినవి. ఆమె శాపము ప్రకారము 36వ సంవత్సరమున యాదవ నాశనము జరుగవలె మరియు మునుల శాపమున్నది సామాన్యులకు నివారింపరానిది, ఈ

రెండు శాపములు మరి భగవానుడైన తాను నివారింపగలడు. ప్రస్తుతము శాపములను నివారింపవలెనా! లేక యాదవ నాశనమును కండ్లచూడవలెనా! ఇది సమాలోచన ఇతరులతో ఆలోచన చేయుటకు వీలు కాని విషయము అందుకే అంతరంగమున సమాలోచన చేసినాడు. అది తిక్కన ఒక్కడే చూసినాడు. ఏమిటి సమాలోచన నిర్ణయము.

### 1.7.5 స్థల నిర్ణయము :

యాదవనాశనమునకు స్థల నిర్ణయము జరిగినది. అందుకే పెద్దకొలువచేసి జాతర చేయనిశ్చయించినాడు. ఆరేయి పీడకలలతో తెల్లవారినది. జనులెల్లరు చూచుచుండగ కృష్ణుని చక్రము గరుడ కేతనము వెంటరాగ ఆకసమునకు ఎగిరిపోయినది. వెంటనే బలరాముని తాడిసిడము వానిననుసరించినది. ఆ వెనుక వాసుదేవుని తేరు దివికి అరిగినది. ఇన్ని జరిగినను యాదవుల తీర్థయాత్రలు మానుకొనలేదు. వానిని గురించి ఆలోచించలేదు. కారణము

"వినాశ కాలే విపరీతబుద్ధి;"

క. తన రథము లేమినొండొక
ఘన రథమును దారుకుండు గైకొని యెలమిం
గాని రావెడ గైసే
సిన కృష్ణుడు నిర్వికార చిత్తత వెడలన్.

### 1.7.6. నిర్వికార చిత్తత :

"కృష్ణుడు నిర్వికార చిత్తత వెడలెను" ఇక్కడ నిర్వికారము కృష్ణునకా? తిక్కనకా? పాఠకులకా? కృష్ణునకెందుకు నిర్వికారము. తాను వచ్చిన కార్యము ముగిసినది. దివికరుగుచున్నాడు. మరి నిర్వికారమెందుకు పొంద వలె? సుమారు 125 సంవత్సరములు తాను నివసించిన ఈ భూమిని వదలి పోవుచున్నానని కృష్ణుడు నిర్వికారమును చెందినాడో కాక తనకు రథము లేక వేరొక రథముపై వెళ్ళుచున్నను కించిత్తు ఆలోచన కూడలేని ఆ యాదవ సమూహమును చూసి నిర్వికారచిత్తుడైనాడో లేక సుయోధనుని మరణమును వర్ణించి "ఏమని చెప్పుదు గురునాథ" అని నిర్వికారము చెందిన తిక్కనయే నిర్యాణమూహించుకొని నిర్వికారము పొందుచున్నాడో.

### 1.7.7. బలరాముని పయనము

ఉద్దవుడు తపమాచరించుటకేగుటకు అనుమతి నడుగగా! "ఒండొకటి

పలుకడు కృష్ణుడు కాలవేదితన్". "కాలవేదితన్" ఏమి ప్రయోగము ఇట్టి ప్రయోగములు తిక్కనకే సాధ్యములు. బలరాముడు పోవ నిశ్చయించినాడు.

క. విను మొక్కడు నొక భూరుహ
మున మూలంబున నిరస్తమోహాంధత్వం
బున వెలుగు బుద్ధి విజ్ఞే
యనిరూఢతఁజేసి యుండెనాసీనుండై

## 1.7.8. యాదవుల ఆగడాలు :

మౌసల పర్వమునకే ఈ పద్యము మణిపూస. తిక్కనగారే వ్రాయవలె. మోహమనెడి చీకటి పూర్తిగా తొలగిపోయిన పిమ్మట జ్ఞానము అనెడి వెలుగు వచ్చును. అట్టి జ్ఞానము సంపూర్ణముగాకల శ్రీకృష్ణుడు ఒక వృక్షమూలమున ఆసీనుడై ఉన్నాడట మహాస్రష్టద్రష్ట అయిన తిక్కన మాత్రమే వ్రాయగలడు ఈ కోవకు చెందిన పద్యములు. బ్రాహ్మణుల కోసము సిద్ధము చేసిన కూడు కూరలను యాదవులు కోతులకు పెట్టినారు. కృష్ణుని ఎదుటనే కావలసిన వానిని నంజుకుంటూ మద్యమును సేవించినారు. మద్యమధికమై సాత్యకి, ప్రద్యుమ్నుడు, కృతవర్మను నిందించినారు. కృతవర్మ సాత్యకిని తూలనాడినాడు. సత్యభామకు కోపము తారాస్థాయి నందుకొన్నది. "కోపమడిరి వనితా స్వభావో ద్గతాశ్రు పూరయగుచు" కృష్ణుని వద్దకు వచ్చినది. సత్య, శ్రీకృష్ణుల కోపమును చూసిన సాత్యకి కృతవర్మ తలత్రుంచినాడు. అంతటితో ఆగక సాత్యకి భోజకుల మీద దూకినాడు. అపుడు బోజకులు, అంధకులు ఒక్కటి అయి సాత్యకిని చుట్టుముట్టినారు. కృష్ణుడు సాత్యకిని రక్షింప ప్రయత్నించలేదు. ప్రద్యుమ్నుడు సాత్యకికి తోడైనాడు. శ్రీకృష్ణుడు చూచుచుండగనే ముసలము కారణముగ పెరిగిన తుంగవారి మరణములకు కారణమయినది. భోజ అంధుకుల చేత వృష్ణి వంశము నాశనమయినది.

## 1.7.9. శాపముల శక్తి :

అది చూచిన పద్మనాభుడు మునీంద్ర శాపంబున "తీవ్రకోపాగ్ని తన చిత్తమున ఉద్దురమై జనింపగ" మిగిలిన యాదవులను సమసింప చేసినాడు. అపుడు దారుక, బభ్రులతో కలసి కృష్ణుడు బలరాముని వెదకుచు బయ లుదేరినాడు. కృష్ణుడు అర్జునుని తెమ్మని ఇంద్రప్రస్థమునకు దారకుని పంపి, స్త్రీ సమూహమును పురము చేర్చవలసినదిగా బభ్రుని కోరినాడు. ఇంతలో ఒక బోయ తుంగతో బభ్రుని మరణము పొందునట్లు చేసినాడు. మునీంద్ర

శాపశక్తికి కృష్ణుడు ఆశ్చర్యపడినాడు. తప్పనిసరియై కృష్ణుడు సామజ, రథ, తురగముల, రామల పురమున చేర్చుటకు పూనుకొనినాడు.

## 1.7.10. కృష్ణుని వీడ్కోలు :

కృష్ణుడు, తిక్కన, పాఠకులు అందరూ ఇక్కడ నిర్వికారము పొందుచున్నారు. పూర్వము కౌరవుల నాశనమును చూచినాను. నేడు యాదవుల నాశనము చూచినాను. అఖిల బంధుహీనమైన ఇచట బ్రతుకుటకు మనసు ఇచ్చగించదు. అన్నకానకేగినాడు. నేనునూ వెళ్ళుచున్నాను. నరుడు వచ్చును అని పలికి వసుదేవుని పాదములమీద తలవంచినాడు. వసుదేవుడు చేష్టలు దక్కి శవమువలె మిగిలినాడు.

వసుదేవుని వీడి శ్రీకృష్ణుడు బలరాముని చేరినాడు. ఆ బలరాముడు శరీరమును వీడి అనంతుని కలిసినాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ఆస్థలమును వదలి అందందు తిరుగుచూ. . . . . . .

తానీలోకమున సాధింపవలసిన పనులన్నీ ముగియుటచే గాంధారీ, మునుల శాపములు తలచుకొనుచు గాఢసమాధిలో "జలనిశయనుండు మహీస్థలశయనుండయ్యె" పాలసముద్రముమీద పవళించే ఆ వైకుంఠ వాసుడు ఈ మానవ శరీరము త్యజించుటకై భూశయ్య నలంకరించినాడు. అక్కడ తిరుగాడు వేటగాడు - "కమలనాభుని యడుగుమోవి జింకనున్నదేమో" అనునట్లుచేసి మాయయావహించె. మాయయావహించినది, లేనిచో పాదము జింక చెవిగా గోచరించుట దుర్లభము. తాను వచ్చిన పని ముగిసినది. కావున శ్రీకృష్ణుడు శరీర త్యాగమును కోరినాడు. అందుకే బోయకు మాయ యావహించినది. శ్రీకృష్ణుని మీగాలమీద బోయ బాణము గ్రుచ్చుకొనినది. వాడును వెంటనే వచ్చి కృష్ణుని పాదముల మీదపడి ఏడ్చినాడు. కృష్ణుడు తన మనోరథము నెరవేరినదని వానిని ఓదార్చి, మానుషమగు ఈ శరీరమును వదలి నిజపథమును చేరినాడు. కురుక్షేత్ర సంగ్రామమున అర్జునునికి రథసారథియైన కృష్ణుడు కంస, పూతన, శిశుపాలాదులను సంహరించిన కృష్ణుడు బోయబాణమునకు అదియును మంత్ర, తంత్ర శక్తి లేనిదానికి మరణించుట తలచినచో "నిందలేనిదే బొందపోదు" అను సామెత సత్యమనిపించును. బాణము కృష్ణ నిర్యాణమునకు కేవలము ఒక వస్తువుగా ఉపకరించినది.

ఊర్ధ్వలోకమునకేగిన ఊర్జిత తేజస్స్వరూపు కృష్ణుని అచటి దివ్యపురుషులు సిద్ధులు మునిశ్రేష్ఠులు మొదలగువారు ఎంతో గౌరవముతో ఆహ్వానించినారు.

### 1.7.11. పాండవుల దుఃఖము :

శ్రీకృష్ణాజ్ఞచే దారుకుడు పాండవుల దగ్గరకేగి యాదవ ప్రళయమును వివరించెను. పాండవులు అనేక విధముల దుఃఖించిరి. దారుకుడు, అర్జునుడు ద్వారకకు శీఘ్రగతిని చేరిరి. ఈ సందర్భమున భారత స్త్రీపర్వ రచయిత తిక్కన ఒకే ఒక పద్యములో మరియొక స్త్రీ పర్వమును సృష్టించినాడు.

### 1.7.12. శ్రీకృష్ణుని భార్యల దుఃఖము :

చ. అరిగి మగండు చచ్చిన కులాంగనయున్ శశిఁగుంకినట్టి శ
వరియును బోల్పఁబట్టుగుచు వారిజనాభుఁడులేని దీనతం
బొరసి కృపైక భాజనతఁబొందిన యప్పురిఁజూచి మానసం
బెరియఁగఁజొచ్చె నేటికెదురీఁదిన చాడ్పున నేమి చెప్పఁగన్

"మగండు చచ్చిన కులాంగనలు శశిక్రుంకినట్టి శర్వరిని పోలి ఉన్నారట" ఏమి ఉపమానము. ఆ పురమున ప్రవేశించుచున్న అర్జునునికి ఏటికి ఏదురీది నట్లున్నదట, కృష్ణార్జునుల బంధము మనకు తెలుసు. ఆపురమునకు వచ్చుట అర్జునునికి ఎంతో సంతోషము. మీదు మిక్కిలి అత్తవారిల్లు. ప్రస్తుతము ఆర్ద్రతతో నిండిపోయిన అర్జునుని హృదయము ఆపురమును చూడలేక ఏటికి ఎదురీదినట్లుగా నడుచుచున్నాడు. కృష్ణుడు పురమున లేడని పాపము పార్థునికి తెలియదు. తెలిసియుండిన ఆ నగరమున అడుగిడెడివాడు కాడేమో. కృష్ణుని చూడవలెననెడి ఒకే ఒక ఆశ పార్థుని ఆ నగరమున ప్రవేశింపజేసినది. ఆసమయమున కృష్ణుని '16 వేల భామలు పార్థుని పాలికివచ్చిరి. "మురాంతక ప్రియాంగనలు పదాఱువేలును మొగంబులఁగప్పగ బాష్పవారి రోదనరవముల్ చెలరఁగఁగఁ బదంబులు దొట్రుపడంగ దైన్యముల్ తనువులు దాల్చినట్టు తెరలంజనుదెంచిరి పార్థుపాలికిన్"

ఎవరైన మరణించినపుడు మరణించిన వ్యక్తి ఆప్తులురాగ మరణించిన వ్యక్తి ఇల్లాలు ఆ వచ్చిన ఆప్తుని చూపి బాధ అధికముకాగ అంతకు ముందుకన్న ఎక్కువరోదన చేయును. ఈ విషయమునే పాఠకుల కండ్లకు కట్టినట్లుగా తిక్కనగారు తీర్చిదిద్దినారు.

ఉ. వారలంగాంచి శోకమ నివారణఁజిత్తము పెల్లగింప న
క్కౌరవ సత్తముండెలుగు గద్గది కందగులంగ నేడ్చుచుం
దేరొక భంగిడిగ్గియులఁద్రెళ్ళిన యద్దురవస్థఁజూచినన్
వైరులకైన డెందములు వ్రయ్యలుగా వగదాంకు భూవరా.

ఈ పద్యము చదివిన కవిబ్రహ్మకు చేతులెత్తి నమస్కరింపక తప్పదు. శోకము అనివారణ చిత్తము వెల్లగించినదట, అవును అడుగడుగున తనకెంతో సహాయము గావించిన ఒక వ్యక్తి ఆపదను విన్న సహజముగా శోకము అనివారణము. అర్జునుడు ధీరోదాత్తుడు కనుకనే "ఎలుగుగద్గధికఁ తగులంగ నేడ్చినాడు" ఏదైన ఒక విషాద వార్తను విన్న మానవుడు కారునుండి గాని మరి ఏ వాహనము నుండిగాని దిగుటలో తడబడును. అందుకే అర్జునుడు తేరాక భంగిడిగ్గినాడని తిక్కన ప్రయోగము. మరియు చూడుడు ఆదురవస్థ చూచిన వైరులకయిన డెందములు వ్రయ్యలగునట.

"దిక్కెవ్వరు మాకునను చు దీనత దోపన్" ఇది హృదయవిదారకమైన దృశ్యము. నేడుకూడ ఒక ఇంటి యజమాని మరణించినపుడు ఆఇంటిలోని వారు ఇక మాకు దిక్కేముంది అని విలపించుట సహజమేకద.

## 1.7.13. వసుదేవుడు :

అట్టి సమయమున అర్జునుడు కృష్ణునిదశ ఎట్టిదో ఎఱిగించు వారెవ్వరు అని మనస్సున తల్లడిల్లుచూ వసుదేవ మందిరము చేరినాడు. అపుడు వసుదేవుడు శయ్యపైనుండి లేచి సవ్యసాచిని కౌగిటచేర్చి విలపించినాడు. "అకారణ రోషమునన్" దైవము అల్గినదటకాకున్న ఈ చిత్రమేమి? వారిలో వారు పోరాడుకొని సమస్త యాదవ నాశనమైనదన్న దైవమల్గుట కాక వేరేమి. వసుదేవునికి విరక్తి కలిగినది.

క. విను నీశిష్యులు సాత్యకి
యును బ్రద్యుమ్నుండు నిమ్మహోగ్రపు సమరం
బునం దొలు పీనుంగు లైనారని
వినియుఁ బ్రదికినాఁడ నేన వీరుఁడ జగతిన్.

అర్జునుని శిష్యులైన సాత్యకి, ప్రద్యుమ్నులు ఈ యాదవ నాశనమునకు ప్రధానులు. అనగా అర్జునుని వద్ద విద్య నేర్చిన వీరు ఎంతో గుణసంపన్నులు. విధి బలీయమై అట్టివారలు సహితము ఈ దుష్కార్యమునకు పూనుకొని పీనుగులైనారు.

వసుదేవుడు తన మాటలలో యాదవ నాశనము కృష్ణుని యుపేక్ష చెప్పినాడేకాని కృష్ణుని గూర్చి చెప్పక పోవుటచే అర్జునుడు తల్లడిల్లి కృష్ణుడెక్కడికేగినాడని ప్రశ్నించినాడు. విధివశమున యాదవులు నాశనమైనారు. అర్జునునికి నేను చెప్పి పంపినాను. అతడిప్పుడే వచ్చును. కతి పయదినములలో సముద్రుడు

ఈ పురమును ముంచివేయును. అతడు వనితలను బాలురను కాపాడును. నాకునూ అతనికిని ఇంచుక భేదములేదు. అని చెప్పి కృష్ణుడు నన్నువీడి వెళ్ళినాడని వసుదేవుడు అర్జునునికి చెప్పినాడు. కృష్ణుడు వసుదేవునకు చెప్పిన ఈ విషయమును వసుదేవుడు అర్జుననకు చెప్పినాడు. ఆ మాటలు విని అర్జునుడు కృష్ణుడులేని ఈ దేశమున నివసించగ నాకు చిత్తము ఒప్పవే. ధర్మ భీమ నకుల సహదేవులు ద్రౌపది నేను ఏకచిత్తులము. కావున ఈ స్త్రీజనమును. ఇంద్రప్రస్థమునకు చేర్చి ఈలోకమును బాసెదను అని నిర్ణయించుకొనినాడు.

తర్వాత అర్జునుడు దారుకునితో కలసి కృష్ణుడు పోయిన దిక్కుకు పోవ సమకట్టి "మదిని వగలు మిగుల ఆరేయి కృష్ణ సదనమున కాలము ..ప్పినాడు. తెలతెలవారునప్పుడు వసుదేవుడు ఈ లోకమును వీడినాడు. వసుదేవు శరీరమునకు చేయవలసిన అగ్ని సంస్కారములను అర్జునుడు తాను దగ్గరుండి జరిపినాడు. పిమ్మట రామకృష్ణులను వెదికికొనుచు పార్థుడు బయలుదేరెనాడు.

## 1.7.14. అర్జునుడు కానలకేగుట :

అర్జునుడు కానకేగుచున్నాడు. మనసు పరిపరివిధముల పరితపించుచున్నది. ననురమ్మని, తండ్రికి కావలిగా ఉండమని ఆదేశించి వెళ్ళిన ఆ భగవానునికి అతని తండ్రి మరణమును చెప్పుటకా నేను వెళ్ళునది అని దుఃఖించినాడు. మరల తనలో తాను అసలు వసుదేవుని మరణము కృష్ణునికేల చెప్పవలె? చెప్పి కృష్ణుని తపోనిష్ఠను ఎందుకు చెరచవలె? అని వితర్కించుకొనిపోయి, కృష్ణుని చూచి అతడు చెప్పిన పని చేసెద అని సమాధానపడినాడు. ఇంతలో అతని మదిలో గాంధారీ శాపము తళుక్కున మెఱసినది. "దిక్కెవ్వరు లేని యట్టిచోట నీకు తెగుట సంభవించు" అని ఆమె శపించినపుడు దగ్గరుండి విన్నాడు అర్జునుడు. అందుకే అనుకొంటున్నాడు. "నిప్పసు చెదలంటు నొక్కో" ఏమి తిక్కన ప్రయోగము. కృష్ణుడు నిప్పు, గాంధారి శాపము చెదలు. కావున కృష్ణనిర్యాణము జరుగదు. మరి గాంధారీ శాపము నిప్పు. అది తప్పుట చెదలు. కావున కృష్ణ నిర్యాణము జరిగితీరును. ఇట్లు రెండర్థములు స్ఫురించును. "విధాత చేత కడ్డము గలదే" విధిముందు విధియైనను తలవంచ వలసినదే. కృష్ణుడు భగవానుడే అయినను ఎంతటి శక్తి సంపన్నుడయినను విధిని ఎదురించలేదుకదా! ఇది అర్జునుని ఆలోచనా విధానము. ఈ పద్యములు ఎంతటి కఠిన హృదయులనైనను కరిగించగలవు.

ఇట్లు తలపోయుచు అర్జునుడు అడవిలో ఇటు అటు తిరుగుచు ఒక్క

బోయ సహాయముతో కృష్ణదేహమును చూసినాడు, మూర్ఛిల్లినాడు. మూర్ఛతేరి పెద్దయు ప్రొద్దు ఆ శవమును కౌగిటచేర్చి వెన్నంటి వచ్చినవాడు అను నయ వచనములు పలుక అంకిలిదేరిన మతితో అశ్రువులు కరతములమున ఒత్తుకొనుచు

అవికృతమును రుచిరమునై
యవయవములు నిదురవోయి నప్పటిక్రియ నుం
డవలలు కృష్ణుని దేహం
బవిరత చక్షురభి ముఖత నాలోకించెన్.

## 1.7.15. కాలమూలంబు సర్వంబు :

అట్లు విలపిస్తున్న అర్జునుడు ఆ మరుసటిరోజే ద్వారకను సముద్రము ముంచివేయునని విషయమును గుర్తుకు తెచ్చుకొనినాడు. ఆ ప్రదేశముననే బలరాముని శవమును కూడ కాంచి వారికి అగ్ని సంస్కారములు గావించి ద్వారకను చేరినాడు. ద్వారక నుండి స్త్రీలను తీసుకొని ఇంద్రప్రస్థము చేరుమందుగ మధ్యబోయురాతనిని ఎదిరించి దోచుకొనినారు. భీష్మ, ద్రోణ, కర్ణ ఆదిగాగం అతిరథ మహారథులను కురుక్షేత్రమున సంహరించినవాడు ఫాలనేత్రుని ఓడించి పాశుపతమును పొందినవాడు ముక్కుడి మూక చేతిలో ఓడినాడు. ఇంద్రప్రస్థము చేరిన పిమ్మట కృష్ణుని భార్యలు రుక్మిణీ మొదలగువారు అగ్ని సంస్కారము చేయగ, సత్యభామ మరికొందరు తపమునకై వనమున కరిగిరి.

అర్జునుడు వేదవ్యాసుని వద్దకు చేరినాడు. వ్యాసునితో యాదవ ప్రళయము, వసుదేవ రామకృష్ణుల నిర్యాణము బోయలచేతిలో తన భంగపాటు వివరించి శోకించినాడు. అపుడు వ్యాసుడు అర్జునా! నీవు పరితపించపనిలేదు. మునుల శాపవశాత్తూ యాదవులట్లు ప్రవర్తించిరి - మరణించిరి. కృష్ణునకు సర్వమూ తెలుసు. ప్రాప్తకాలంబగు పనికి అడ్డుపడనేలయని భగవానుడుపేక్షించినాడు కాని, కాకున్న గాంధారీ మునులు శాపములను నివారింపశక్తి లేనివాడు కాడు. అవని భారము తగ్గించుటకు ఉపయోగపడిన నీ అస్త్రములు నిన్నువీడి దేవలోకము చేరినవి.

తే. కాలమూలంబు సర్వంబుగానదీని
కొందు తలపుల దక్కి మీరుత్తమంపు
గతికి జనుడు నిశ్చింత వికారతనులు
విడిచి యార్య జనంబులు వినుతిసేయ.

కాలమూలంబు సర్వంబుకావున నిశ్చింత బుద్ధితో ఉత్తమ గతికి వెళ్ళుమని అర్జునకుపదేశించెను. ఇట్లు వ్యాసునిచే ఉపదేశమును పొందిన అర్జునుడు శోక మోహంబులు వదలి వ్యాసుని వీడుకొని ఇంద్రప్రస్థము చేరుటతో మౌసలపర్వము ముగిసినది.

## 2. భాగవతము :

భాగవతామృతమును ఆంధ్రులకందించినవాడు బమ్మెర పోతన. భాగవతము భక్తికి మారుపేరు, పోతన సహజ కవి. పుట్టుక శైవకుటుంబము వ్రాసినది వైష్ణవ గ్రంథము భాగవతము. శైవులకు శైవుడే కన్పిస్తాడు, వైష్ణవులకు విష్ణువే కన్పిస్తాడు. తిక్కనకు ఇద్దరు ఒకటిగా కన్పిస్తారు. పోతనకు ముందు వెనుకలుగా శివ, విష్ణువులు కన్పించారు. పరిశీలించి చూచినచో కొంత విష్ణువునందు మొగ్గు కన్పించును.

భాగవతమనగా "భాగవతుల చరితం భాగవతులనగ భక్తులు. భక్తుల చరిత్ర భగవంతుని చరిత్రతో ముడిపడియే యుండును. భాగవతమునందలి భగవంతుడు శ్రీకృష్ణుడు"

ఎందరో భక్తులు గలిగిన భాగవత కృష్ణునికి అర్జునుడు కూడ ఒక భక్తుడు. పుట్టిన రోజునుండి చిత్రవిచిత్రమైన జీవితము, వివాహాది విషయములు కృష్ణుని భగవానునిగనే భాగవతము నిర్మించినది.

సంస్కృత భాగవతమున శ్రీకృష్ణ నిర్యాణము ప్రథమ, ఏకాదశ స్కందము లందు కలదు. ప్రథమ స్కంధమున ధర్మజునికి, దుర్నిమిత్తములు తోచినవి. వాటినిగూర్చి ధర్మజుడు భీమ, నకుల సహదేవులతో చర్చించుచున్నాడు. సరిగ్గా ఆ సమయమున ద్వారక నుండి అర్జునుడు వచ్చినాడు. అతని వదనము విషాదముతో కప్పబడినది. అర్జునుని విషాద ముఖమును చూచిన ధర్మజుడు రామకృష్ణులు యాదవులు క్షేమమే కదా! అని ఆతుతతో ప్రశ్నించినాడు. సమాధానము లేదు. అర్జునుడు చేయరాని పని ఏదోచేసి దుఃఖించుచున్నాడని ధర్మజుడు పరిపరివిధముల ప్రశ్నించినాడు. ఎట్టకేలకు అర్జునుడు యాదవ నాశనమును వివరించి కృష్ణునికి, తమకుగల ప్రత్యేక బంధమును తలపోసినాడు, కృష్ణనిర్యాణమును వివరించినాడు.

భాగవతాన్ని గూర్చి పోతన,

"పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండఁటనేఁ
బలికిన భవహరమగునట,
పలికెద వేరొండు గాథ బలుకగ నేలా

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁదమ్మి చూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపరుతు

లలిత స్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమనస్సు జ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై"

ఈ విషయమే మరీవిపులముగా ఏకాదశ స్కంధమున వివరింపబడినది. ఏకాదశ స్కంధమున దేవతలు భూలోకమున కేతెంచి, కృష్ణుని వైకుంఠమునకు రావలసినదిగా కోరినారు. యాదవ కులనాశనము గావించి వత్తునని కృష్ణుడు వారికి ప్రత్యుత్తరమిచ్చినాడు. ఇది సంస్కృతాంధ్ర భారతములలో లేని నూత్న విషయము.

## 2.1. దుర్నిమిత్తాలు :

ఆంధ్రమున ప్రథమ స్కంధము సహజ పాండిత్యుడు బమ్మెర పోతనచే తెనిగింపబడినది. భాగవతములో పోతన ధర్మరాజుకు దుర్నిమిత్తములు గోచరించుటతో కృష్ణనిర్యాణ ఇతివృత్తము ఆరంభమైనది. అవి ఎటువంటి దుర్నిమిత్తములు. లోకమున క్రోధంబు, లోభంబు, క్రూరత, బొంకు అధికమైన వట. మగలతో ఇల్లాండ్రు మచ్చరించెదరట. సుతులు తండ్రుల తెగచూతురట. గురులను శిష్యులు దూషించెదరట. నేడు సామాన్యమైన ఈ విషయములు ధర్మజుని కాలమున (లేక పోతన కాలమున) అసహజములు. కనుక ధర్మరాజు అన్నాడు "కాలగతి వింతయై వచ్చె" అని కాలగతి వింత అనునది పరిశీలింప వలసినమాట. ఏలయన కృష్ణ నిర్యాణముతో కలియుగము ఆరంభము కానున్నది. కృతయుగమున నాలుగు పాదములమీద చల్లగా నడచిన ధర్మము త్రేతాయుగమున మూడు పాదములమీదను, ద్వాపరమున రెండు పాదముల మీదను, కలియుగమున ఏకపాదము మీదను నడచునని ఆర్యోక్తి. కనుకనే

ధర్మజుడు "కాలగతి వింత" అనినాడు. అనగా అప్పటికే కలియుగ లక్షణములు గోచరించుచున్నవి. ధర్మజునికి కనిపించిన దుర్నిమిత్తములు ఎట్టివనగా అతని ముందు కుక్క మోరయెత్తి మొరుగుచున్నది. సూర్యోదయ సమయమున నక్క అభిముఖముగా వాపోవుచున్నది. గర్ధభాదులు ఉత్తమాశ్వములకు జనించినవి. మత్తగజంబులు నశించినవి. హోమములందు అగ్నిమండుటలేదు. దూడలు చన్నులు కుడుచుటలేదు. ఇట్టి అనేక దుర్నిమిత్తములు అతనికి గోచరించినవి.

## 2.2. అర్జునుని రాక :

ఈ దుర్నిమిత్తములను గూర్చి ధర్మజుడు భీమునితో చర్చించు సమయమున ద్వారక నుండి ధనుంజయుడు ఇంద్రప్రస్థమున ప్రవేశించెను. ప్రవేశించి, అగ్రజుని తత్పాదముల నయన సలిలోత్పాదకుడై పడియె దీనుభంగి", ఏదైనా ఒక విషాదవార్తను మోసుకొనువచ్చు వ్యక్తి సుదూరమునుండి వచ్చి, ఆప్తులను చూడగనే విషయమును చెప్పలేక మనస్సును కుదుటపరచుకోలేక ఏడ్వడము, పెద్దల కా      ఃడడము సహజము. ఈ విషయమునే చక్కగా చిత్రించినాడు పోతన.

## 2.3. ధర్మజుని ఆత్రుత :

పిన్నతమ్ముని గని పాండవాగ్రజుడు "మాతామహుండైన మనశూరుడున్నాడే" అని మొదలుపెట్టి సమస్త యాదవులను పేరుపేరు" ప్రశ్నించినాడు. చివరగా శ్రీకృష్ణుని గొప్పతనములను చెప్పి, అతను క్షేమమేనా యని ప్రశ్నించినాడు. ఇక్కడ కృష్ణుడు క్షేమమేనాయని ధర్మజుడు ప్రథమముగా అడిగి ఉండవలసినది అని కొందరి విమర్శ. అది సహేతుకము కాదు. ఏలయన దూరమునుండి ఒక వ్యక్తి వచ్చి కన్నీళ్ళతో మన ఎదుట నిలిచినపుడు ఏ ముదుసలి వారో మరణించినారని భావన కలిగి, తాత బాగున్నాడా? అవ్వ బాగుందా? అని అడుగుతామే కాని, ఆరోగ్యముతో నున్న వ్యక్తిని గురించి ప్రశ్నించము. ఇక్కడ ధర్మజుడు కూడ అపనే చేసినాడు. మాతామహునికి వయస్సు ఎక్కువ. అందుకే అతనిని గురించి ప్రథమముగా ప్రశ్నించినాడు. అర్జునుడు ఏమీ చెప్పక పోవుటచే ఒక్కొక్కని గూర్చి ప్రశ్నించినాడు. మారుపలుకని అర్జునునితో

అన్నా! ఫల్గున భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుండు గోవిందుఁడా
పన్నానీక శరణ్యుఁడీశుఁడు జగద్భద్రాను సంధాయి శ్రీ
మన్నవ్యాంబుజ పత్రనేత్రుఁడు సుధర్మామధ్య పీఠంబునం
దున్నాఁడా? బలభద్రుఁగూడి, సుఖియై, యుత్సాహియై ద్వారకన్.

## 2.4. ధర్మజుని ఉత్కంఠత :

ఉత్కంఠత ఎక్కువ కాగా అర్జునుని దుఃఖమునకు కారణము తెలియకపోవుటచే

మున్ను గ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరువో,
సన్నాహంబునఁ గాలకేయుల పడిం జక్కాడువోఁ బ్రాభవ
స్కన్నుండైవను కౌరవేంద్ర పనికై గంధర్వులం ద్రోలువోఁ
గన్నీరెన్నఁడుఁ దేవు తండ్రి చెపుమా! కల్యాణమే చక్రికిన్!

అని కృష్ణుని క్షేమములను విచారించి, మరియు శత్రువులకు ఓడితివో, సాదు దూషణ గావించితివో, పరసతిని కూడితివో, మానధనము వీడితివో, ఇచ్చెదనను మాట తప్పితివో, కపట సాక్షి చెప్పితివో, చేసిన మేలును దెప్పితివో, బ్రాహ్మణుల పసువుల, రోగుల స్త్రీలపై యుద్ధము ప్రకటించితివో, బాల వృద్ధ గురువులను వదలి కుడిచితివో, పరుల విత్తమునకు ఆశించితివో కాకున్న నీవు విలపించుటకు కారణమేమని ప్రశ్నించినాడు. ఈ ప్రశ్నల ద్వారా పోతన సమాజమునకు ఎంతటి చక్కని హితోపదేశము చేసినాడు, పురాణములు కేవలము కాలక్షేపమునకేయని కొందరందురు. కానీ ఇంతటి హితోపదేశము చేయుట కన్నా సమాజమునకు మరియేమి కావలె. దానిని ఆచరించు మానవుల సంఖ్య అల్పమై, దేశము పురోగమనము నుండి తిరోగమనమునకు పయనించుచున్నది.

## 2.5. అర్జునుని సమాధానము :

మరియు, అన్న పశ్నలకు, తమ్ముని సమాధానమిట్లున్నది. గద్గద స్వరముతో మహానిధి కోల్పోయిన పేద చందంబున

క. మన సారథి, మన సచివుడు, మన వియ్యము, మనసఖుండు మన బాంధవుడున్
మనవిభుడు, గురువు, దేవర మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

క. కంటకపునృపులు, సూడగ, మింటంగంపించుయంత్రమీనము గ్రోలన్
గెంటించి మనము వాలుం, గంటింజేకొంటిమ తనికరుణనకాదే

క. దిక్కుల రాజుల నెల్లను, దుక్కించి ధనంబు గ్రొనుట, మయకృత సభము
నెక్కుట, జన్నము సేయుట, నిక్కము హరి మనకు దండ నిలివనగాదే?

మ. ఇభజ ద్వీర్య! మఖాభిషిక్తమగు నీ యిల్లాలు ధమ్మిల్లమున్
సభలో శాత్రువు లీడ్చనన్ ముదువకా చంద్రాస్య దుఃఖింపగా
నభయంబిచ్చి ప్రతిజ్ఞచేసి భవదీయా రాతికాంతాశిరో
జభరశ్రీలు హరింపఁడే? విధవలై సౌభాగ్యముల్ వీడగన్?

ఇట్లు విలపించి, మరియు కృష్ణునకు, పాండవులకు ప్రత్యేకించి కృష్ణార్జును లకు గల సంబంధమును వివరించినాడు (పెద్దలైన సభాసదులు) మన్నించాలి. ఒక చిన్న ఉదాహరణ. ఒకనికి ఇరువురు భార్యలున్నారనుకొందాము. అతను మరణించినపుడు ఒక భార్య దుఃఖమును గుండెల నిండా నింపుకొని, మాటలు మూగవోగా, మనస్సునందే విలపించును. మరియొక భార్య ఎడమచేతితో ముక్కుసు చీదుకుంటూ కన్నీళ్ళు వెల్లువలుకాగా, నేలమీద, ఆశవముమీద పడి, జరిగిన విషయములను పాడుకొంటూ విలపించెనను కొందము. అదిగో ఆ మొదటి భార్యయే తిక్కన అర్జునుడు. ఆ రెండవ భార్యయే పోతన అర్జునుడు.

అర్జునుడు అంటున్నాడు పందికై పోరాడ ఫాలాక్షుడు ఎవ్వని బలమున నాకిచ్చె పాశుపతమ్మును, దేవేంద్రుని పీఠార్థమును ఎవని దయతో నేను అధిష్ఠింపగలిగితిని, కాలకేయ, నివాత కవచాది దైత్యులను, కర్ణ, సైంధవ, కౌరవేంద్రుల తలపాగలను ఎవని దయతో తెచ్చి విరటుని పుత్రికకు ఇచ్చితినో, కురుక్షేత్ర సంగ్రామమున నారథము నొగలపై కూర్చుండి నా బాణములు శత్రువులను చేరక మునుపే శత్రువుల ప్రాణములు గైకొని నాకు ఉత్సా హమును కల్గించెనో, భీష్మ ద్రోణ కర్ణ శల్య కృప అశ్వత్థామాది వీరుల దివ్యాస్త్రములు నా చెంతకు రాకుండా ఎవరు కాపాడిరో, అట్టి కృష్ణుడు మరియు చెలికాడా రమ్మని ఒకవేళ, మరిదియని ఒకవేళ పిలిచి నాకుదాతయై, ప్రాణదాతయై, మంత్రియై బుద్ధిచెప్పి రథసారథియై నా బ్రతుకునకు సారథియైన కృష్ణుడు నా శయ్యమీద పరుండి నా తొడన శిరము చేర్చి, తన భార్యలతో తానాడిన ముచ్చటలు, వారి మధ్యకయ్యములు పనువుగా నాకు వినిపించు కృష్ణుడు, భార్యల వద్దకు నను రాయబారము పంపు ఆ శ్రీకృష్ణుడు ఈ లోకమును వీడిపోయినాడు. అన్నా! దేహలోభమున నా ప్రాణములింకను మిగిలియున్నవి. నేను యాదవస్త్రీలను తీసికొని వచ్చుచుండగా వారిని బోయలు దోచుకొని పోవుచుండగా "భామిని భంగినుంటి విడిపింపలేక" అని అర్జునుడు విలపించినాడు. ఏదినమున వైకుంఠుడు మేదినిపై మేను విడిచినాడో ఆనాడే కలియుగము ఆరంభమైనది. ఇంతటితో పోతన భాగవతమున కృష్ణ నిర్యాణము సమాప్తమైనది.

## 3. వెలిగొందుల నారయ :

ఇక వెలిగొందల నారయ తాను పోతనకు ప్రియ శిష్యుడనని చెప్పు కొనినాడు. ఏకాదశ, ద్వాదశ స్కంధములను తెనిగించినాడు. సభాసదులు క్షమించాలి. ఈ నారయ పోతనకు శిష్యుడై చేసిన మేలుకంటే కీడు ఒకింత లధికమని అభిప్రాయపడుచున్నాను. ఇతనికి విశిష్టాద్వైతము మీద వున్న భక్తితో

వందోవంతు సాహితీ సంప్రదాయముపై ఉండి ఉండినచో భాగవతమునకు ఇంత అపకారము జరిగి యుండెడిది కాదు. అద్వైతమత భాగవత రచనలో విశిష్టాద్వైతమును ప్రవేశపెట్టి నారయ పోతనకు అన్యాయమే చేసినాడు.

## 3.1. మునుల శాపము :

వెలిగొందుల నారయ భాగవత ఏకాదశ స్కంధమును తెనుగు చేసినాడు. విశ్వామిత్ర, వశిష్ఠ, నారదాదుల ఆగమనముతో శ్రీకృష్ణ నిర్యాణ కథ ప్రారంభమగుచున్నది. వచ్చిన మునిశ్రేష్ఠులు శ్రీకృష్ణుని దర్శించి, అనేక విధముల అతనిని ప్రస్తుతించిరి. తిరిగి వారుద్వారకా నగరంబునకు అనతిదూరములోనున్న "పిండారకము" అను పుణ్యతీర్థమును చేరిరి. అపుడు యాదవులు సాంబునకు స్త్రీ వేషమువేసి మునులను పరీక్షించిరి. కోపించిన మునులు "యదకుల నిర్మూలకరంబైన యట్టి ముసలంబొకటి ఈ బాలికకుదయించున్ పొందు ఆలస్యంబు లేదు" అనిరి. అపుడే మునుల శాప ప్రభావము వలన ముసలము ఉద్భవించినది. దానిని శ్రీకృష్ణునకు చూప, తెలిసియు తెలియని వానివలె వారితో నిట్లనెను.

"మదిచెడి కన్నులగానక,
మదయుతులై మునులఁగల్ల మాయలఁ మాటలఁజెనయం
గదిసికు లక్షయకారణ,
విదితంబగు శాపమొందు వెఱ్ఱులు గలరే.

ధరణీ సురశాపమునకు
హరిహర బ్రహ్మాదులైన నడ్డముగలరే.
నరులనఁగ నెంతవారలు,
కరమరుదుగఁబూర్వ జన్మకర్మముఁద్రోవన్."

ఈ మాటలు తిక్కన కృష్ణుడుగాని, పోతన కృష్ణుడుగాని అనరు. కవిత్వములో పరిపక్వత పొందని కవులే ఇట్టి సృష్టిగావించుచుందురు. కృష్ణుని యానతితో యాదవులు ముసలమును పొడిగావించి, సముద్రమున కలిపిరి. నారయ ఇక్కడ కథను ఆపి, వసుదేవునకు నారదుడు తెలిపిన పుణ్య కథను వివరించినాడు. సుమారు 50 గద్య పద్యములలో ఈ కథ నడచినది. తరువాత దేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకు రమ్మని ఆహ్వానించిరి. యాదవ నాశనానంతరము వత్తునని కృష్ణుడువారికి చెప్పెను. ద్వారకలో దుర్నిమిత్తములు గోచరించినవి. తిరిగి 40 పద్యములలో కృష్ణుని శక్తి వివరింపబడినది. ఆపైన యాదవుల అన్యోన్య కలహము, కృష్ణబలరాముల నిర్యాణము వర్ణితము.

ముగింపు చాలా పేలవముగా నున్నది.

## 4. పరిశీలనాంశాలు :

పరిశీలనలో తేలిన ముఖ్యాంశములేమన 1. యాదవుల నాశనముగూర్చి ఎవరివలననో ధర్మజుడు వినినట్లు భారతము చెప్పగ, అర్జునడే వచ్చి చెప్పినట్లు భాగవతము. 2. కృష్ణనిర్యాణము విదుర మరణానంతరమే జరిగినట్లు భారతము, విదుర మరణము ముందుగ భాగవతము తెలియజేసివి. 3. భారతమున ద్వారకకు వచ్చిన మునులు కణ్వుడు, నారదుడు, గాధి నందనుడు, భాగవతమున విశ్వామిత్ర, దుర్వాస, భృగు, అంగిరస, కశ్యప, వామదేవ, వాలఖిల్య, అత్రి, వశిష్ఠ, నారదాదులు. 4. భారతమున వచ్చిన మునులు యాదవుల ఆగడమును భరించలేక శాపమిచ్చి కృష్ణుని చూడకనే వెనుదిరిగినట్లున్నది. భాగవతమునవారు కృష్ణుని దర్శించి పెండారకములో సాంబునికి శాపమిచ్చినట్లున్నది. 5. శాపవశాత్తు ముసలము పుట్టుట భారత, భాగవతములలో ఉన్నను, భాగవతములో అప్పుడే ముసలము ఉద్భవించినట్లు కలదు. 6. ముసలమును పొడిచేసి సముద్రమున కలిపిన విషయము రెండింటియందు ఒక్కటిగనే కలదు. కాని, అందు మిగిలిన ముక్కనొకదానిని ఒక చేప మ్రింగడము, ఆ చేపను ఒక లుబ్ధకుడు వలవైచి పట్టుకొని ఆ ముక్కతో బాణముచేసి ఆ బాణముతో కృష్ణుని పాదమునకు కొట్టినట్టు భాగవతమున కలదు. యాదవుల మధ్య జరిగిన అన్యోన్య కలహము భారతము వివరించినంత వివరముగ భాగవతము వివరించలేదు. 7. బలరామ నిర్యాణము భారతము ఎంతో హృదయంగమముగా వర్ణింపగా భాగవతము చాలా క్లుప్తముగా వివరించినది. 8. కృష్ణ నిర్యాణమునకు ముందే శ్రీకృష్ణాజ్ఞచే ధారకుడు అర్జునుని కోసం వెళ్ళినట్లు భారతము కృష్ణనిర్యాణ సమయమున ధారకుడు కృష్ణుని వద్దనే వుండినట్లు భాగవతము. 9. భారతము వసుదేవ నిర్యాణమును ఆపై కృష్ణనిర్యాణమును చెప్పగా, భాగవతము ముందుగ కృష్ణనిర్యాణమును ఆపై వసుదేవ నిర్యాణమును చెప్పెను. 10. రామకృష్ణుల శవములను అర్జునుడు వెదకి అడవులలోగాంచి అగ్ని సంస్కారము చేసినట్లు భారతము. ద్వారకలో ధారకుడు కృష్ణనిర్యాణము చెప్పగా అర్జునునికి తెలిసినట్లు భాగవతము. 11. దేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకు రమ్మని కోరినట్లు భాగవతము. భారతమున ఈ ప్రసక్తిలేదు. 12. కృష్ణనిర్యాణమును అర్జునుడు వ్యాసునికి తెలియజేసినట్లు భారతము భాగవతమున ఈ ప్రసక్తిలేదు. 13. భారతమున విపులముగా చక్కగా వర్ణింపబడిన అనేక సంఘటనలు భాగవతమున చాలా కుప్తముగా

నున్నవి.

## 5. ముఖ్య వివరణ :

కృష్ణనిర్యాణ ఘట్టమును తిక్కన ఋషియై హరిహరనాథోపాసకుడై నిర్మిం చగా, పోతన భక్తుడై అద్వైతుడై నిర్మించినాడు. వెలిగొందల నారయలో విశిష్టాద్వైతమే మిక్కుటముగా కనిపించును. తిక్కనగారి సృష్టి అపూర్వము. ఆ పద్యముల పోకడ అనన్య సామాన్యము. మౌసల పర్వము చదువుచున్నంత కాలము మన ఆప్తుడు. మన బంధువు, మన తెగవారు మరణించినట్లు అనుభూతిని పొందుదుము. పోతన కృష్ణనిర్యాణమును చదువుచున్నంతకాలము కృష్ణార్జునుల మధ్యగల స్నేహమును పాండవులకు కృష్ణునిపైగల భక్తిని, కృష్ణుడు పాండవులకు చేసిన సాయమును అచ్చెరువుతో మెచ్చుకొందుము. నారయ కృష్ణనిర్యాణము నీరసముగా, పేలవముగా ఎవరో ఎవరికో కథ చెప్పుతుండగా మనము వినినట్లుండును. కనుకనే వెలిగొందల నారయ కవి కొట్టారపు తిక్కన కవిబ్రహ్మ, బమ్మెర పోతన సహజ పాండిత్యుడు.

# 7. ఎఱ్ఱన బిరుదులు - సార్థకత

## ఎఱ్ఱన జీవిత విశేషాలు :

### 1. ఎఱ్ఱన పేరు :

తెలుగు సాహిత్య చరిత్రలో కవిత్రయంగా ప్రసిద్ధి పొందిన వారిలో మూడవవాడు ఎఱ్ఱన. ఈతడు పేరమాంబ, ఎరపోతశూరుల పౌత్రుడు, పోత మాంబిక, శూరనార్యుల పుత్రుడు. నృసింహపురాణంలో పూర్ణపురుషాయుప జీవిత ధన్యుడైన తన తాతగారి పేరే తనకు పెట్టబడినట్లు ఎఱ్ఱన స్వయంగా చెప్పుకొన్నాడు. ఈతని వంశీయులు ఆపస్తంభ సూత్రులు శ్రీవత్సగోత్రులు.

### 2. ఎఱ్ఱన ఇంటిపేరు :

విప్రనారాయణ చరిత్రకర్త చెదలవాడ మల్లయ్య తన కృతిలో ఎఱ్ఱనను గూర్చి "ప్రతిభతో నారణ్య పర్వశేషము జెప్పెఁగవులకు | జవులపండువలు గాగ అని పేర్కొన్నాడు. ఈ కారణంగా ఎఱ్ఱాప్రెగ్గడ ఇంటి పేరు చెదులవాడ అని కొందరి వాదన. చెదల వాడలో ఎఱ్ఱన నివసించుటచేత అతనికాపేరు వచ్చిందని ఆ తరువాత ఆ వంశీకులు చెదులవాడ వారయ్యారని ఎఱ్ఱనకు పూర్వం చెదులవాడ వారి యింటి పేరు కాదని కొందరి వాదన.

శ్రీమత్ భాగవత షష్ఠస్కంధ నిర్మాత ఏర్చూరి సింగన తన పూర్వులలో ఆపస్తంభ సూత్రుడు, శ్రీవత్సగోత్రుడు అయిన ఎఱ్ఱన వుండేవాడని పేర్కొన్నాడు. ఈ కారణంగా ఎఱ్ఱన యింటిపేరు ఏర్చూరి వారని కొందరి వాదన. ఏర్చూరి ఎఱ్ఱనకు, కవిత్రయ ఎఱ్ఱనకు సంబంధం లేదని వారు వేరు వేరు వారని శ్రీ చాగంటి శేషయ్య గారు నిరూపించారు. కాబట్టి ఎఱ్ఱన యింటి పేరు యిదియని యిప్పటికి దొరికిన ఆధారాలతో నిర్ణయించడం సాధ్యం కాదు.

### 1.3. ఎఱ్ఱన ఊరు :

అరణ్యపర్వ శేషంలో చివర చాలామంది ప్రక్షిప్తమని భావించే ఒక సీసము,

ఒక కందం ఆధారంగా ఎఱ్ఱన మొదట పాకనాటి యందలి గుడ్లూరు గ్రామంలో వుండేవాడని ఊహించవచ్చు.

వేమారెడ్డి సోదరుడైన మల్లారెడ్డితో పరిచయమయిన తర్వాత ఎఱ్ఱన చెదలవాడకు వెళ్ళి రామాయణ హరివంశాల్ని రచించి, రాజధానియైన అద్దంకిలో కొంతకాలముండి వార్ధక్యంలో చెదలవాడ చేరియుండెనని కొందరి విమర్శకుల ఊహ.

## 1.4. ఎఱ్ఱన కాలం :

ఎఱ్ఱన తన కృతులలో ఒకటియైన హరి వంశాన్ని ప్రోలయ వేమారెడ్డి కంకితమిచ్చాడు. కాబట్టి ఎఱ్ఱన వేమారెడ్డి కాలానికి సంబంధించిన వాడనుటలో అభిప్రాయభేదాలు లేవు. ప్రోలయ వేమారెడ్డి కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు సేనానాయకులలో ఒకడు. మహమ్మదీయులు ప్రతాపరుద్రుని ఢిల్లీకి కొని పోయిన పిమ్మట కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయింది. దుర్గాధిపతులు కొందరు స్వతంత్ర రాజ్యాలేర్పరచుకున్నారు. అట్టి వారిలో ప్రోలయ వేమారెడ్డి ఒకడు. ఇతని రాజ్యపాలన 1324 నుండి 1349 వరకు అని కొందరు, 1325 నుండి 1353 వరకు అని కొందరు చరిత్రకారులు నిరూపించారు. వేమారెడ్డి రాజ్యపరిపాలన కాలంలోఎఱ్ఱన కవిగా కృతులు నిర్మించాడు.

ఎఱ్ఱన తాత ఎరపోతసూరి. ఆతని తాత భీమన మంత్రి. ఈ భీమన మంత్రి వెలనాటి చోళుని వలన మిగుల మన్నన పొందినట్లు ఎఱ్ఱన నృసింహ పురాణంలో చెప్పినాడు. కాబట్టి ఈ భీమన మంత్రి 1140-1200 మధ్యవాడై వుండాలి. తరవాతనకు 35 సంవత్సరములు కలుపుకుంటే ఎఱ్ఱన 1280 ప్రాంతంలో జన్మించినట్లు ఊహించవచ్చు. ఈ లెక్కన 1315-1340 సంవత్సరాల మధ్య ఎఱ్ఱన కృతుల నిర్మాణం జరిగి వుండాలి.

## 1.5. ఎఱ్ఱన కృతులు :

ఎఱ్ఱన కృతులుగా లోకంలోమనకు మూడు కన్పిస్తున్నాయి. రెండు పేర్లు వినిపిస్తున్నాయి. కనిపిస్తున్న కృతుల్లో అరణ్యపర్వశేషరచన వివాదాస్పదం వినిపిస్తున్న వాటిలో కవి సర్పగారుడమను ఛందో గ్రంథం ఇదిమిద్ధంగా ఎఱ్ఱనదే అని చెప్పడానికి ఆధారాలు లేవు. ఎఱ్ఱన రామాయణంలోని కొన్ని పద్యాలు తప్ప కావ్యమలభ్యం. కాగా, పోగా హరివంశం, నృసింహపురాణం ఎఱ్ఱనవే అనుటలో వాదోపవాదాలు లేవు. అయితే అరణ్య పర్వశేషం ఎఱ్ఱన రచించాడని కొందరు,

లోపించిన బాగాన్ని పూరించాడని కొందరు అంటున్నారు. అంటే అరణ్య పర్వశేషం ఎర్రన కృతి అయినా,కాకపోయినా ఆయన చేయివుందనుటలో సందేహం లేదు.

## 1.6. ఎర్రన కృతుల క్రమం :

ఎర్రన కృతుల క్రమంలో విమర్శకుల మధ్య రెండు భిన్నమైన అభిప్రాయాలున్నాయి. ఒకటి అరణ్య పర్వం, నృసింహపురాణం రచించిన తర్వాత రామాయణ, హరివంశాల్ని వ్రాశాడని, రెండు రామాయణ, హరివంసాల తర్వాత అరణ్య పర్వశేష, నృసింహ పురాణాల్ని వ్రాసాడని వాదాలున్నాయి.

నృసింహ పురాణ అవతారికలో ఎర్రన తన తాత తనను నృసింహపురాణం వ్రాయమని ఆదేశించినపుడు.

> "ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబులఁగా వ్యకర్తవై
> యెన్నికయైఁ బ్రబంధ పరమేశుఁనంగ నరణ్య పర్వశే
> షోన్నయ మంధ్ర భాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
> నన్నయ భట్ట తిక్కకవి నాథుల కెక్కినన భక్తి పెంపునన్"

అని చెప్పినట్లు వ్రాసుకొన్నాడు. కాబట్టి అరణ్య పర్వశేషం తర్వాతే నృసింహ పురాణ రచన యనుటలో సందేహం లేదు.

హరివంశ పీఠికలో ప్రోలయ వేమారెడ్డి చెప్పినట్లుగా ఎర్రన ఈ పద్యాలు వ్రాసుకొన్నాడు.

> నాతమ్ముడు ఘనుండు మల్లధర నీనాథుండు నిన్నాతత
> శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమింజే పట్టి మాకిచ్చుటన్
> జేతో మోదమెలర్ప రామకథమున్ జెప్పించి యత్యుత్తమ
> ఖ్యాతిం బొందితి నింకనుందనియనేఁగావ్యామృతాస్వాందనన్
>
> భారత పరాంశమని యిం
> పారఁగఁజెప్పుదురు బుధులు హరివంశమునీ
> వారయ్యకథ తెనుంగుగ
> ధీరోత్తమ నిర్వహించి తెలుపుముమాకున్

పై పద్యాలాధారంగా హరివంశానికి ముందే రామాయణ రచన యనుట నిస్సందేహం. ఈ రెండు జంటలలో ఏది ముందు అనుటలో విమర్శకుల మధ్య అభిప్రాయ భేదాలున్ననాయి.

ఎఱ్ఱన అరణ్య పర్వశేషం నన్నయ కృతి భర్తయైన రాజరాజనరేంద్రునికే అంకితమిచ్చాడు. రామాయణ, హరివంశాల్ని వేమారెడ్డికంకితమిచ్చాడు. నృసింహపురాణాన్ని అహోబిల నృసింహస్వామికి అంకితమిచ్చాడు. కాబట్టి ఎఱ్ఱన మొదట రామాయణ, హరివంశాల్ని రాసి రాజు కంకితమిచ్చి మన్ననలను పొందాడు. వయస్సు, అనుభవము పెరిగి నిష్కామ కర్ముడై నిరాపేక్షగా భారత శేషాన్ని రాజరాజున కంకితమిచ్చాడు. వయసు ముదిరి పరలోక సుఖాన్ని కోరి కావ్యాల్ని దైవాంకితం చేసాడు అని కొందరు ఈ వరుసను సమర్థిస్తున్నారు.

ఎఱ్ఱన నృసింహపురాణంలో తన్ను గూర్చి చెప్పకుంటూ "కతిపయాక్ష పరిగ్రహ జనితంబైన నైసర్గిక చాపలంబు కథంబున"అని చెప్పుకున్నాడు. ఈ మాటలు అతని కవితా ప్రారంభదశను సూచిస్తున్నాయి. అందుకే అరణ్యపర్వ శేషరచన చేసినా తన పేరు చెప్పకొనేంత ధైర్యం చేయలేకపోయాడు. నృసింహపురాణ రచన కాలం నాటికి అతనికి మల్లారెడ్డి, వేమారెడ్డిల ప్రాపు లభించక పోయి ఉండవచ్చు. ఆకారణంగా తన తాత ప్రేరణతో వ్రాసిన గ్రంథాన్ని తన తాత కిష్టమైన నృసింహ స్వామికే అంకితమిచ్చి ఉండవచ్చు. కాబట్టి అరణ్య పర్వశేషం, నృసింహ పురాణం, రామాయణ, హరివంశాల వరుస సరియైందని కొందరి వాదన. ఇక్కడ ఒక్క విషయం గుర్తించాలి. తిక్కన రామాయణం వ్రాస్తూ చెప్పిన మాటలకన్నా భారతం వ్రాస్తూ చెప్పిన మాటల్లో వినయం కనబడుతుంది. అంతమాత్రాన రామాయణం కన్నా భారతం ముందు అనలేం కదా!

అరణ్యపర్వ శేషంలో రామకథ ఉంది. ఈ రామకథనే హరివంశ నిర్మాణమపుడు వేమారెడ్డి ప్రశంసించినాడని భావిస్తే ఎఱ్ఱన మొదట అరణ్య పర్వశేషాన్ని, తరువాత హరివంశాన్ని ఆతరువాత నృసింహ పురాణాన్ని వ్రాసినాడని ఊహించవచ్చు. కాని ఎఱ్ఱన రామాయణంలోనివిగా లాక్షణికులు పేర్కొన్న పద్యాలు అరణ్య పర్వశేష రామకథలో లేకపోవడం,నృసింహపురాణ అవతారికలో హరివంశ ప్రసక్తి లేకపోవడం వలన ఈ వాదం నిలువదు. ఏది ఏమైనా ఎఱ్ఱన అరణ్య పర్వశేషాన్ని, హరివంశం, నృసింహపురాణాల్ని సంపూర్ణంగాను, వ్రాసి వరుస ఏదైనా సమర్థుడైన కవిగా లోకంలో నిలిచి పోయాడు.

## 2. ఎఱ్ఱన బిరుదులు :

ఎఱ్ఱన పేరు తలచుకోగానే మనకు శంభుదాసుడు, ప్రబంధపరమేశ్వరుడు అనే అతని బిరుదులు స్ఫురిస్తాయి. ఈ బిరుదు శబ్దాన్ని గూర్చి, దాని

ఆవిర్భావాన్ని గూర్చి ఎర్రనకు అవి లభించిన తీరును గూర్చి, ఆ బిరుదులకు తగినట్లుగా అతని కృతుల పరిశీలన అవసరం.

## 2.1. బిరుదు శబ్దవిచారం :

'బిరు' శబ్దం అన్యదేశ్యం. ఈ పదానికి ప్రబల విరోధం అని అర్థం. విరోధాన్ని కలిగించేది బిరుదం అని అర్థం. పూర్వం వందిమాగధులు రాజుల్ని బిరుదావళుల్తో కైవారం చేసేవారు. ఆ బిరుదావళుల్లో ఆరాజుల వంశప్రసస్తి, రణ వితరణ శౌర్యం, చిహ్నాలు కీర్తింపబడేవి. అవి శత్రురాజులకు కర్ణకఠోరాలై భయజనకాలయ్యేవి.

కం. 'బిరు'శబ్దంబు విరోధో
త్కరము మహారాష్ట్ర భాషఁదత్ (తత్)ప్రదవిధులన్
బిరుదములనఁ జను;వానిన
ధర బిరుదావళి యొనర్పఁదగు నంద్రుబుధుల్
(కావ్యాలంకార చూడామణి 4-25)

ఈ బిరుదు శబ్దం క్రమక్రమంగా రాజులతో పాటు కవిరాజులకు కూడా సంక్రమించింది. ఇది ఆయాకవుల పాండిత్యాతిశయాన్ని, కవితా పాటవాన్ని ప్రదర్శింప జేసేది. ఈ బిరుదు శబ్దం సుకవులకు మోదంగాను, కుకవులకు ఖేదంగాను పరిణమించేది.

## 2.2. నిఘంటువులలో బిరుదు :

"బిరుదు" శబ్ద అర్థాన్ని పరిశీలిస్తే దాని విస్తృతి మనకర్థమవుతుంది. Apte పండితుడు తన Sanskrit English Dictionaryలో బిరుదు పదానికి 'A Token Won on the arm or hand etc, indicating excellency అని, A paneggric అని అర్థాలిచ్చాడు తమిళ LaXicow (volume6, part-I) పరిశీలిస్తే 'Title"Banner' 'Trophy "Badge of victary' అని అర్థాలు కనిపిస్తాయి. తమిళంలోని 'విరుతు'శబ్దమే 'బిరుదు'గా మారినట్లు కొందరి అభిప్రాయం. కన్నడ Kettel-A kannada English Dictionary పరిశీలిస్తే 'distinctive mark' అని 'A badge of hanour' అని 'distinction' అని, 'Developed power' అని అర్థాలు కన్పిస్తాయి.

తెలుగులో సి.పి.బ్రౌన్ 'A Dictionary Telugu and English'లో బిరుదు శబ్దానికి, 'A Badge', 'A Title or Honour', A Hero; 'A Braveman' అని అనేక అర్థాలు కనిపిస్తాయి. బహుజనపల్లి సీతారామయ్య గారి శబ్దరత్నాకరంలో చూస్తే

1. బిరుదము (సంస్కృతసమము, విశేష్యము, పుంలింగము) సామర్థ్య చిహ్నము.
2. బిరుతాయత్తు [వైకృతము. ప్రాకృత సమమును సంస్కృత, ప్రాకృత భవమునై పదము వైకృతము-విశేషణము] బిరుదు గలవాడు.
3. బిరుదు [వైకృతము, విశేష్యము] సామర్థ్య చిహ్నము, శౌర్య చిహ్నము ప్రతిజ్ఞ సమర్థుడు, సమర్థము, శూరుడు.
4. బిరుదులాడు [ద్వయము(వైకృతము,దేశ్యము, మిశ్రమమైన పదము ద్వయము) విశేషణము] బిరుదులు+ఆడు, ప్రతిజ్ఞావంతుడు అనే అర్థాలు మనం చూడవచ్చు.

పై నిఘంటువుల పరిశీలన వలన బిరుదు పదానికి సామర్థ్య చిహ్నము, శౌర్యము,సామర్థ్యము, ప్రతిజ్ఞ మొదలైన అనేక అర్థాలు కనిపిస్తున్నాయి.

## 2.3. లక్షణ గ్రంథాలలో బిరుదము :

ప్రాచీన లాక్షణికులు ఓరుదమునకు లక్షణాల్ని వివరించారు. వేదం వేంకటరాయ శాస్త్రి గారనువదించిన (విశ్వనాథుని సాహిత్య దర్పణం), ఆంధ్ర సాహిత్య దర్పణంలో "గద్య పద్యమయి యగు రాజస్తుతి బిరుదమనం బడును". ఉదాహరణకు బిరుద మణిమాల అని లక్షణం చెప్పారు. అట్లే పొత్తపి వేంకటరమణ కవి తన లక్షణ శిరోమణియందు "బిరుదు గద్య సంబోధనాంత పద బంధురంబునై వర్థిల్లు"అని లక్షణం చెప్పారు. కాకునూరి అప్పకవి బిరుదావళి లక్షణం బెరింగించెద" అని ఈ క్రింది పద్యాలు చెప్పాడు.

తే. క్షితి మహారాష్ట్ర భాషచే జెప్పబడెడు
భీకరోక్తులు బిరుదులై పెక్కుదనరు
వాని బిరుదావళి యొనర్పవలయు నంధ్రు
బుధులు సంబుద్ధి పదములు పొసఁగఁగూర్చి

వ. అతిభుజ విక్రమోద్భవము లైరిపు కర్ణకఠోర కంటులై
యతులిత వీర వాక్కులయి యాదిమపార్థివ లాంఛనంబులై
ప్రతిపద నూతనంబులయి భాసిలు సూక్తుల గూర్చి స్వస్తివా
క్సతతుల జెప్పనొప్పు బిరుదైవళి సార్వవిభక్తి కంబుగాన్

వ. సలిలిత వాక్యగుంభనల సర్వవిభక్తుదీపనంబులన్
జెలువగు పద్యమొక్కటి రచించిన పిమ్మట గౌడరీతి సం
కలిత చరుష్క షట్కదళ గద్యము లెన్మది యుంబదాఱు నిం
పలరంగ గూర్చి పేర్చి బిరుదావళిఁజెప్పఁగ నొప్పు నెంతయున్

క. ఒక పద్యము పిదప దళా
ష్టక సందర్భాష్ట గద్య చతురంబగు భ
క్క్రికి, బేరు చక్రవాళం
బొకట చతుర్భద్ర మదియె యచ్యుత మఱియున్

క. తొలి సమాసనాంత్యా వర్ణనము
గళమే పునరుక్తిగాఁగ గైకొని సామీ
ప్యల సత్యమాసము మొదలు
నలరించినఁజక్క వాళమగు దాశార్హా

తే. అవధరింపుము దేవ దివ్య ప్రభావ భావనాతీత నిస్తుల పరమ మూర్తి
పూతనాజైత్ర సుస్రామ పుత్రమిత్రశశినేత్ర నిర్జస్తోత్ర పాత్ర”

బిరుదావళికి లకణము వివరించెను.

పై లక్షణాల్ని మనం పరిశీలిస్తే గద్యపద్య రూపాంల్లో స్తుతి పాఠకులు రాజుల్ని స్తుతించే బిరుదాలు సంభోదనలతోనూ, దీర్ఘసమాస భూయిష్టంతోను వుండేవి.

## 2.4. బిరుదము - పర్యాయపదాలు :

బిరుదు, బిరుదము రూపాంతరాలు. బిరుదమునకు పర్యాయపదాలుగా పద, నామ, గుణనామధేయ, ఉపనామ, ఉపాధి రూపాలు కనిస్తాయి.

## 2.5. బిరుదశబ్దం - ప్రాచీన కవుల ప్రయోగాలు :

'బిరుదు' శబ్దాన్ని ప్రాచీన కాలం నుండి సంస్కృతాంధ్ర కవులు తమ కావ్యాల్లో ప్రయోగించినట్టు తెలుస్తోంది. శఠగోపస్వామి అను సంస్కృత కవి తన 'వాసంతికా పరిణయం'లో “దివ్యావంధి జనస్తు వంతి బిరుదం దీపోత్సవం పంక్తి సహ” అని బిరుదు శబ్దాన్ని ప్రయోగించాడు. నన్నయ తన భారతంలో భారంబునకు జాలి భూరి సత్వాఢ్యమై బిరుదైన ఎద్దు భూసురునకి అని బిరుదు శబ్దాన్ని ప్రయోగించాడు. తిక్కన భారతంలో మనకు పలుచోట్ల బిరుదు శబ్దం కనిపిస్తుంది. ఉదాహరణకి “బిరుదు గల మగలు గలరని తరమిడి వంపింప జూచెదరు” (విరాటపర్వం 3వ ఆశ్వాసం-60వ పద్యం)

“నవ్వెదు తలలను గ్రొవ్వారు చేతులను బిరుదులు బెట్టిన చరణములను”
(కర్ణ - 3-76)

"బిరుదులైనను బిరికి వాండ్రనునైన జంపుచోగడరుదు జముడు" (స్త్రీ-1-25)

అట్లే భాస్కర రామాయణంలో 'బిరుదు' శబ్ద ప్రయోగాన్ని చూడవచ్చు.

"ఉరుతర బిరుదరి తొలగుట కంటెను మరణం బెంతయునొమేలు మగవారలకున్"
(భాస్కర రామాయణం-కిష్కింధకాండ 214 పద్యం)

ఎర్రన తరువాత వారైన శ్రీనాథాదులు బిరుదు శబ్దాన్ని ప్రాచుర్యంగా ప్రయోగించారు.

## 2.6. బిరుదు - ఆవిర్భావ కారణాలు :

శిశువు జన్మిస్తే జననీ జనకులు బారసాలనాడు బంధు మిత్రకుటుంబ సమేతంగా హోమాది కార్యక్రమాలు జరిపి ఆ శిశువుకు నామకరణం చేస్తారు. ఆరోజు నుంచి ఆశిశువు ఆ నామాంకితమవుతుంది. అట్లే విద్వాంసునికి గాని, పండితునికి గాని, కవికిగాని, గాయకునికి గాని సభలో సారస్వత వర్చవేసి ఉచితమైన ఒక బిరుదును ముద్రిత పత్రం మీద వ్రాసి అతనికొక బిరుదాంకితుని చేస్తారు. ఒక విధంగా విద్వత్కవులకు, పండితులకు ఇది ఒక నామకరణం లాంటిది.

కవుల యొక్క ప్రతిభకు, ప్రతిష్ఠకు ఈ బిరుదు ఒక చక్కని ఉదాహరణ. ఏదైన ఒక రంగంలో ఘనతను సాధించిన వ్యక్తిని నలుగురిలో సత్కారం చేసి బిరుదు ప్రధానం చేయుట సంప్రదాయం. ఈ బిరుదు రాజదత్తం కావచ్చు. సభాదత్తం కావచ్చు. సమకాలీన కవి పండిత దత్తం కావచ్చు. లేక సంస్థాదత్తం కావచ్చు. లేక ప్రజలభిమానంతో యిచ్చినవి కావచ్చు.

ఉదాహరణకు ఆంధ్ర కవితా పితామహుడు రాజదత్తమైన బిరుదు. "అల్లసానివాని అల్లిక జిగిబిగి" అన్నది ఒకరకంగా సభాదత్తమైన బిరుదు. "ముక్కుతిమ్మనార్యుముద్దు పలుకు" ప్రజలిచ్చిన బిరుదు.

ఇంకా ఈ బిరుదులు, కవుల పాండిత్యానికి కవితా కౌశలానికే గాక వారి వ్యక్తిగత భక్త్యభిమానాలకు విహ్నంగా కూడా వుంటాయి. ఉదాహరణకు 'ప్రతివాద భయంకర' అనేది కవి పాండిత్యానికన్నా అతనికున్న వాద పటిమను తెలియజేస్తుంది. అట్లే కింకవీంద్రఘటాపంచానన, కవిరాజు, కవిసార్వభౌమ మొదలగునవి గ్రహించవచ్చు.

ఈ విధంగా విద్యావైవిధ్యాలకు మతభక్తి తత్వాలకు, శైవ వైష్ణవ అభేద ప్రతిపత్తి నిర్వేదాలకు బిరుదులు మిగిలిపోయిన గుర్తులు.

## 2.7. ప్రాచీన కవుల బిరుదులు :

ప్రాచీన కావ్యాల్ని మనం పరిశీలిస్తే ఆశ్వాసాంత గద్యాల్లో కవుల బిరుదాలు కనబడుతుంటాయి. ఒక కవి స్వయంగా తనకు తానొక బిరుదు తగిలించుకోవచ్చు. ప్రజలు అతనిని అభిమానించి బిరుదును ప్రసాదించవచ్చు. రాజ దత్తంకన్నా సభాదత్తమైన బిరుదు ఉత్తమం అంతకన్నా ప్రజలిచ్చే బిరుదు ఉత్తమోత్తమం. ప్రజలిచ్చే బిరుదులు ఆకవికి అక్షరపతాకాలు.

### 2.7.1. ఎఱ్ఱనకు ముందున్న కవుల బిరుదులు :

ఎఱ్ఱనకు ముందు నన్నయకు ఆదికవియని, వాగనుశాసనుడని బిరుదులున్నాయి. నన్నెచోడునికి కవిరాజ శిఖామణియని బిరుదు ఉంది. పాల్కురికి సోమునికి పిడుపర్తి సోమన.

తే. అతని నుతియింప నానోటే కలివియగునె
జైన మస్తక విన్యస్తశాతశూల
కలిత బిజ్జల తలగుండ గండబిరుద
శోభితుడు పాల్కురికి సో[illegible]ఘుండు"

అని స్తుతించాడు

ప్రతాపరుద్రునికి 'విద్యాభూషణ' బిరుదముంది. తిక్కనకు కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడు, మయూర సన్నిభుడు, ఆ[illegible]భోజుడు, భారవికల్పుడు అనే బిరుదాలున్నాయి. కేతనకు 'అభినవదండి'బిరుదముంది. ఇక ఎఱ్ఱనకు 'శంభుదాసుడు', 'ప్రబంధపరమేశ్వర' బిరుదులున్నాయి.

నన్నయకున్న ఆదికవి బిరుదం చర్చనీయాంశమైంది. ఈ బిరుదు అతని కవితా శక్తికి నిదర్శనం కాదు. ఆదికవి యంటే మొదటి కవియని అర్థం. తెలుగున నన్నయ మొదటి కవికాదు. తెలుగున అతడు వ్రాసిన గ్రంథమే మొదటి దంటే అంతకు ముందే పద్మకవి, సర్వేశ్వరుడు, గజాంకుశుడు అనే కవులున్నట్లు తెలుస్తోంది. కన్నడంలో పంపకవికి ఆదికవి అనే బిరుదు వుంది. కన్నడంలో అతను మొదటి కవి కాదు. అయితే మహాభారత రచనకు పూనుకున్న మొదటి కవిగా నన్నయను ఆదికవి యనవచ్చు. కాకపోతే నన్నయకు పూర్వం పద్యకవిత్వమే కాకుండా గేయరూపమైన దేశి కవిత్వం కూడా వున్నట్టు పాల్కురికి సోమనాథుని రచనల వల్ల తెలుస్తుంది. దేశి కవితకంటే భిన్నమైంది మార్గకవిత. మౌఖిక కవిత్వం కంటే వేరైంది లిఖితకవిత్వం. ఆపద్ధతులకు ఆదికవిగా నన్నయను పేర్కొనవచ్చు. అప్పుడు ఆదికవి పదానికి మొదటి కవి

అనే అర్థం కాకుండా మొదట పెద్దకవి అనే అర్థాన్ని గ్రహిస్తే బాగుంటుంది. కవి అల్లసాని పెద్దన, కవి తిక్కన సోమయాజి అనిన తెనాలి రామకృష్ణుని మాటల్లోని కవి శబ్దానికేఅర్థముందో ఇక్కడ ఆదికవి శబ్దానికదే అర్థాన్ని గ్రహించాలి.

## 2.7.2. ఎర్రన తరువాత కవుల బిరుదులు :

శ్రీనాథునికి కవిసార్వభౌముడనే కాకుండా శృంగార శ్రీనాథుడనే పేరు కూడా వుంది. ఇక్కడ ఒక్క విషయం గమనార్హం. తెలుగు కవుల పేర్లు పరిశీలిస్తే నన్నయ, తిక్కన, కేతన, ఎర్రన, పోతన, పెద్దన, తిమ్మన, యిలాగే వుండేవి ఒక్క శ్రీనాథుని పేరు మాత్రం సాహిత్యంలో వేరుగా కనిపిస్తూ వుంటుంది. నా ఊహ సత్యం కాకపోవచ్చుగానీ ఇతనికి శీనన్న లేక చిన్నన్న అనే పేరు వుండి వుండవచ్చు. చాటు పద్యాలలో శృంగారాన్ని జొప్పించి ప్రతికులపు స్త్రీని వర్ణించి స్త్రీనాథుడైనాడు. ఈ స్త్రీనాథుడే క్రమంగా శ్రీనాథుడైనాడేమో? ఇదే సత్యమైతే శ్రీనాథుడు అన్నది కూడా 'బిరుదు'వాచకమవుతుంది. ఇతని కావ్యాల్లో శృంగారశ్రీనాథుడనడానికి తగినంత శృంగారమేమి లేదు. కాకపోతే చాటుపద్యాలే ఇతన్ని శృంగారశ్రీనాథుణ్ణి చేసాయి.

అట్లాగే మనకు తెనాలి రామకృష్ణుడు కనిపిస్తాడు. ఇతనికి వికటకవి అనే బిరుదొకటుంది. ఇతని కృతులైన పాండురంగమహాత్మ్యంలో గాని, ఘటికాచలమహాత్మ్యంలో గాని ఈ బిరుదుకు తగిన హాస్యమెక్కడా లేదు. నిగమశర్మ అక్కను ముక్కుపుడకకు ఏడ్పించనంత మాత్రాన ఇతనికి బిరుదు సార్థకమని చెప్పలేం. అయితే లోకంలో ఇతని మాటల్లోని హాస్యానికే ఈ బిరుదు వచ్చి వుండాలి. యిట్లా పరిశీలిస్తే కవులకు వ్యక్తిగతంగాను, మతపరంగాను, కవితాపరంగాను అనేక రకాలుగా బిరుదులు రావటం జరిగేదని తెలుస్తుంది.

## 3. శంభుదాసుడు :

ఎర్రన కున్న రెండు బిరుదులలో 'శంభుదాసుడ'న్నది ఒకటి. నృసింహ పురాణ గద్యలోఎర్రన తనను శ్రీ శంకరస్వామి సమ్యమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్యధుర్యుడనియు, శంభుదాసలక్షణాభిధేయుడనియు చెప్పుకొన్నాడు. హరివంశంలో శంకరస్వామిని మదిని పూజించాడు. తన పితామహుని తండ్రి సూర్యకవి ఆరాధ్య సర్వజ్ఞుండని ఎర్రన చెప్పినాడు. ఆరాధ్య శబ్ద మాధారంగా ఇతడు శైవుడని కొందరూహిస్తున్నారు. ఎర్రన శివకేశవులిద్దరి యెడ సమాన భక్తి ప్రవత్తులు కలవాడని తెలుస్తుంది. ఉదాహరణకు నృసింహ పురాణంలో

"గిరిశ పదభక్తిరస త
త్పర భావము కలిమి శంభుదాసుండనగా
బరఁగియు గోవిందగుణా
దర సంభృత సౌమనస్య ధన్యుడ వెందున్"

అను పద్యం ఆతని శివకేశవాద్వైత భావాన్ని చక్కగా వ్యక్తీకరిస్తుంది. శంభుదాసుడు అనే బిరుదుకు శివభక్తుడనే అర్థంవస్తుంది. కాని ఎఱ్రన వ్రాసిన గ్రంథాలు అన్నీ విష్ణుకథా ప్రధానమైనవే. దీన్నిబట్టి శంభుదాస బిరుదు ఎఱ్రనకు కవిగా కాకుండ ఆతని వ్యక్తిగత విషయానికి సంబంధించి ముఖ్యంగా మతానికి సంబంధించి వచ్చి వుంటుందని ఊహించవచ్చు.

## 3.1. తిక్కన - హరిహరనాథుడు :

కవుల జీవితాల్ని పరిశీలిస్తే 15వ శతాబ్దికి ముందు తెలుగు కవులు అధికంగా శైవులే కనిపిస్తారు. కాని వారు వ్రాసిన గ్రంథాలు అధికంగా విష్ణుకథా ప్రధానాలే. నన్నయ విషయం ఎలా వున్నా తిక్కన శైవుడనే ఎక్కువ మంది అంగీకరిస్తారు. ఆతని హరిహరనాథతత్వం రామాయణ రచన తరువాత ప్రతిపాదించ బడింది. రామాయణ రచన నాటికి తిక్కన శైవుడే. అయితే సోమన శైవతత్వం వేరు. తిక్కన, ఎఱ్రనాదుల శైవతత్వం వేరు.

ఎఱ్రనకు ముందు సాహిత్యాన్ని మనం పరిశీలిస్తే నన్నయది వైదిక మార్గం. పాల్కురికి సోమనది వీర శైవం. తిక్కనది హరిహరాద్వైతం. తిక్కన సోమ యాగం చేసి శివ కేశవ అభేద ప్రత్యయ నిర్మాణానికి పూనుకున్నాడు. తిక్కన తరువాత వచ్చిన కేతన మొదలైన వారు ఈ ప్రతిపాదనను అనుసరించినా, తిక్కన వలే హరిహరనాథతత్వాన్ని జీర్ణించుకున్న వారు కారు. తిక్కన చూపిన హరిహరనాథురూపాన్ని తరువాత వచ్చిన కేతన, ఎఱ్రన, నాచనసోమన, చూడాలని, ఎంతో ప్రయత్నించరే కానీ, సంపూర్తిగా చూడలేకపోయారు. ఆ హరిహరనాథుని సంపూర్ణరూపాన్ని మనో నేత్రాలతో చూచినవాడు తిక్కన ఒక్కడే. ఎఱ్రన తిక్కన వలే శివకేశవులకు అభేదం పాటించినా తిక్కన వలే తాత్విక (పారమార్థిక) దర్శనం చేయగలిగాడా? అనేది సందేహించవలసిన విషయమే. 15వ శతాబ్దం వరకు ఇంచుమించు కవులందరూ కూడాశైవులే. అయితే తిక్కన గారి ప్రతిభవల్ల కేశవద్వేషం వారిలో నశించిపోయింది.

## 3.2. తిక్కన - హరిహరనాథ తత్త్వం :

తిక్కన భారతం పీఠికలో 'శ్రీయన గౌరినాబరఁగు' పద్యంలో చివర తిక్కన 'విష్ణురూపాయ నమఃశివాయ' అన్నారు. ఈ వాక్య మాధారంగా కొందరు మేధావులు కొత్త చర్చను ప్రారంభించారు. తిక్కన విష్ణు రూపంలో వుండే శివునికి నమస్కారం చేశాడే గానీ, శివుని రూపంలో వుండే విష్ణువుకు నమస్కారం చేయలేదని, ఇది తిక్కన శైవ ప్రీతికి నిదర్శనమని కొందరి వాదన. ఇది అత్యంత హాస్యాస్పదమైన వాదన. తిక్కనగారి పైమాటను సహృదయ భావంతో అర్థం చేసుకోవాలంటే 'విష్ణురూపాయ నమఃశివాయ' అన్న వాక్యానికి 'శివరూపాయ విష్ణవే నమః' అని వాక్యాంతరంగా పూరణ చేసుకోవాలి.

అద్వైతులు నిత్యసంధ్యా వందనంలో ఇలా స్తుతిస్తారు. శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః యధాశివమయో విష్ణుః ఏవం విష్ణుమయా శివః యధా అంతరం నపశ్యామి

తధామె స్వస్తిః ఆయుః షి

ఎంతవరకు మనం శివకేశవులకు అభేదం పాటించెదమో, అంతవరకు స్వస్తి, ఆయుస్సు అని ప్రతిజ్ఞా వాక్యాలు.

తెలుగు సాహిత్యంలో చాలామంది కవులు కృతికర్తల కోరికలననుసరించి ప్రజల అభిరుచుల ననుసరించి తమ మనోగత విషయాలాధారంగా కావ్యాలు నిర్మించేవాళ్ళు. ముఖ్యంగా పురాణాదుల అనువాదాల వల్ల శివకేశవ అభేద దృష్టికి అవకాశాలెక్కువగా లభించేవి వ్యక్తిగతంగా కవి ఏదైవాన్ని పూజించినా కావ్యాల్లో నిస్పాక్షిక దృక్పథం వుండేది. ఇది వీర శైవ కవులలో కనిపించేది కాదు. ముఖ్యంగా పాల్కురికి సోమన వీరశైవ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. మడికి సంగన పద్మపురాణ ఉత్తర ఖండంలో శ్రీవైష్ణవ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

తిక్కనకు ముందు కన్నడ దేశ ప్రభావంతో ఆంధ్ర దేశంలో శైవమతం బహుళ వ్యాప్తిలో నుండేది. మరొకవైపు శ్రీరంగం నుంచి రామానుజుల శ్రీవైష్ణవం ప్రబలమవుతూ వచ్చింది. రెండింటి సంఘర్షణను నివారించాలని తిక్కన చేసిన ప్రయత్నమే హరిహరనాథ తత్త్వం. తిక్కన తరువాతి వారు హరిహరనాథతత్వాన్ని ఆదరించారేగాని జీర్ణించుకోలేదు. ఇదే మనకు ఎర్రనలో కూడా కనిపిస్తుంది.

### 3.3. ఎఱ్ఱన మతం :

ఎఱ్ఱన చిన్ననాడు అడ్డబొట్లు పెట్టి జంధ్యం వేసి ఒక చిన్న జంగమయ్యగా తిరుగుతూ వచ్చీరాని పద్యాలు అల్లుతూ యుండి వుండవచ్చు. ఇందుకుదాహరణగా 'నిను సేవించిన కల్గు' అని నీలకంఠేశుని గూర్చి చెప్పిన పద్యం గ్రహించవచ్చు. ఆతని రూపం, కవిత చూసిన ఎవరో 'శంభుదాసుడు' అని ఆతనిని సంభోధించి యుండవచ్చు. తిక్కన హరహరనాథ తత్వాన్ని అర్థం చేసుకొనే వయసు వచ్చిన ఎఱ్ఱన కవిగా లోకంలో నిలిచిపోయాడు. కాబట్టి 'శంభుదాసుడ'న్న ఈ బిరుదు ఎఱ్ఱనకు ఇప్పుడు లభిస్తున్న గ్రంథాలాధారంగా వచ్చింది కాదని చెప్పడంలో తప్పేమి లేదనుకొంటాను. నృసింహపురాణం ద్వితీయాశ్వాసంలో హిరణ్యకశ్యపుడు పట్టాభిషిక్తుడై దిక్పాలకుల్ని పరాభవించే సందర్భంలో ఎఱ్ఱన ఈక్రింది పద్యం వ్రాసాడు.

ఎక్కుడి దెద్దు, భూతియును నెమ్ములు సొమ్ములు, భిక్షజీవనం,
బొక్కటి కట్ట జీరయును, నుండఁగ నిల్లును లేదు, నిక్కువం
బిక్కరకున్న పస్పిజనుఁ డేచిన నయ్యేడు నేమియంచుఁ దా
నొక్కని శర్వునిం బఱుప నొల్లఁడు దైత్యుడనాదరంబునన్

శివుని అనాదర భావంతో హిరణ్య కశ్యపుడు వదలి పెట్టేసాడని పై పద్యభావన. కాని ఇది ఎఱ్ఱన అభిమాన పూర్వకమైన అత్యంత శైవభక్తిని తెలియజేస్తుందని కొందరి ఊహ. విష్ణుమహిమలు వర్ణించేటప్పుడు కూడా ఎఱ్ఱన ఇటువంటి అభినివేశాన్నే ప్రదర్శించాడు. కాబట్టి ఎఱ్ఱన హరిహరుల యందు సమాన భక్తిని ప్రదర్శించినాడని చెప్పవచ్చు. కాని ఎఱ్ఱన, తిక్కన వలే హరిహరులను ఒక్కటిగా చూసినాడని మాత్రం చెప్ప సాహసించలేం.

ఎఱ్ఱన శంభుదాస లక్షణాభిధేయము అతని శివభక్తి పరాయణతకు ఇంచుక ఆధిక్యాన్నిచ్చిందని దివాకర్ల వేంకటావధానిగారి అభిప్రాయం. లక్షణ శబ్దానికి సంజ్ఞ, సూచన, పేరు, గుణం, మారువేషం అని అర్థాలున్నాయి. శంభుదాస లక్షణాభియుడంటే గుణాన్ని బట్టి శంభుదాసుడనే మారుపేరు కలవాడు అని అర్థం కూడా స్ఫురిస్తుంది. కాబట్టి శంభుదాసుడన్నది బిరుదు కావచ్చు, మారుపేరు కావచ్చు.

శంభుదాసుడన్నది బిరుదైన, మారుపేరైన అది ఎఱ్ఱనకు వ్యక్తిగతం గాను, మతపరంగాను సంక్రమించిందిగాని కవిగా అతని కవితా గుణాలకు సంబంధించి సంక్రమించింది కాదని స్పష్టంగా తెలుస్తోంది.

ఎర్రన గ్రంథాలు లభిస్తున్నవి గాకుండా ఇంకా ఏవైనా వ్రాసి వుంటే అవికూడా శైవమత గ్రంథాలైతే అవిలభిస్తే అపుడు ఈ వాదం నిలువదు కాని అంతవరకు శంభుదాసుడన్న బిరుదు ఎర్రనకు కవితా పరంగా వచ్చింది కాదని నిర్ధారించవచ్చు.

## 4. ప్రబంధ పరమేశ్వరుడు :

ఎర్రనకున్న రెండవ బిరుదు. అతని కవితా లక్షణానికి సంబంధించింది ప్రబంధ పరమేశ్వర బిరుదం. స్థూలంగా చూస్తే ప్రబంధ రచనా పాటవమున పరాకాష్టనొందిన వాడనే అర్థం స్ఫురిస్తుంది. నృసింహపురాణంలో తాత ఎర పోతసూరి ఎర్రన "ఎన్నికయై ప్రబంధపరమేశుడనంగ అరణ్య పర్వశేషోన్నయ మంద్రభాష సృజనోత్సవ మొప్పగా" నిర్వహించినాడనియు, ఆతడు ప్రబంధర చనా ప్రావిణ్యమున సహజపరిణితి సిద్ధుడని చెప్పినట్లువుంది. ఇక్కడ ఒకటి, రెండు అంశాలు పరిశీలింపదగి యున్నాయి. ఎర్రన అరణ్య పర్వ శేషరచన నాటికే పరిణితి చెందిన ప్రబంధ పరమేశ్వరుడా? లేక అరణ్య పర్వశేష రచనలో ప్రబంధ పరమేశ్వరుడయ్యాడా? అనేది ఆలోచింప వలసిన విషయం. అరణ్య పర్వమునకు ముందే ప్రబంధ పరమేశ్వరుడైతే ఏ గ్రంథ రచనల ద్వారా అంతటి ఖ్యాతిని పొందాడు? రామాయణ, హరివంశాలు ఒకవేళ అంతకు ముందే వ్రాసాడా? ఒకవేళ అదే నిజమైతే ఎరపోతసూరి ఆ గ్రంథాల ప్రసక్తి చేయాలి గదా? అరణ్యపర్వశేష రచనతోనే ప్రబంధ పరమేశ్వరుడైతే అరణ్యపర్వశేష రచన ప్రబంధం కావాలి కదా? కాబట్టి అరణ్యపర్వశేష రచన లేదా అందలి ముఖ్య కథలైన రామాయణం, సావిత్రోపాఖ్యానం, కర్ణకథ మొదలైనవి ప్రబంధ ఛాయలు కలిగి యున్నవా? అనే విషయాలని పరిశీలించాలి. పై విషయాల్ని పరిశీలించాలంటే ప్రబంధ శబ్దార్థాన్ని తెలుసుకోవాలి. ఇక్కడ మరోవిషయం.

కవిత్రయం వారిని త్రిమూర్తులతో పోల్చడం జరుగుతుంది. నన్నయను విష్ణువుగాను, తిక్కనను బ్రహ్మగాను, ఎర్రనను పరమేశ్వరునిగాను చెప్పడం మనకుంది. పరమేశ్వర శబ్దానికి ఆనుపూర్విగా · ప్రబంధ శబ్దం వుండవచ్చని కొందరు. ఆతని కవితలో గల ప్రబంధ లక్షణాలకాను పూర్విగా పరమేశ్వర శబ్దం వచ్చిందని కొందరు అంటున్నారు. కాబట్టి ప్రబంధ స్వరూప స్వభావాల్ని తెలుసుకొని ఎర్రన కృతులను అనుసంధించి అతనికా బిరుదు తగిందో, లేదో తెలుసుకోవాలి.

తెలుగు సాహిత్యంలో ప్రబంధశాఖకు ప్రబల ప్రచారముంది. ప్రబంధం ఒక

విశిష్ట వాఙ్మయశాఖగా అంగీకరింపబడింది. సాహిత్య చరిత్రలో ప్రబంధయుగం గుర్తింపబడి వుంది. ఇన్ని విశిష్టతలు కలిగిన ఈ ప్రబంధ శబ్దం ప్రాచీనమా, అర్వాచీనమా? సంస్కృత అలంకారికులీ శబ్దాన్ని ఏ అర్థంలో వాడినారు? ఆ అర్థం సర్వాలంకారిక సమ్మతమా? ఆంధ్ర అలంకారికులా అర్థాన్నే గ్రహించినారా అనే అనేక విషయాలు చూడవలసిన అవసరం ఉంది.

## 4.1. సంస్కృత లాక్షణికులు - ప్రబంధ ప్రయోగం :

ఆంధ్ర ప్రబంధం - అవతరణ వికాసములు అను విషయము మీద కూలంకషచర్చ గావించిన ఆచార్య కాకర్ల వేంకట రామనరసింహం గారు ఈ క్రింది అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. "దండ్యాదులు గావించిన అనేకములగు కావ్య భేదాల్ని సేకరించి ధ్వన్యాలోకకారుడు నిరూపించిన కావ్య భేదాలలో ఎచ్చటా ప్రబంధ శబ్దం కానరాదు. ఆతని నిర్వచనంలో మాత్రం ప్రబంధ శబ్దం కనిపిస్తుంది. పర్యాయ బంధమును, ఆఖ్యాయికను, కథను, ధ్వన్యాలోకకారుడు ప్రబంధమనే చెప్పియున్నాడు. వస్తుభేదం వలన వాటికి వేరువేరు పేర్లున్నా వాటి మూటినీ కలిపి ప్రబంధమనే అతడన్నాడు." ఇక సాహిత్య దర్పణకారుడు కావ్య ప్రబంధ శబ్దాల్ని సమానార్థకాలుగా వాడినాడు. ఈతడు ఇతిహాసమైన భారతాన్ని, మహాకావ్యమైన రామాయణాన్ని ప్రబంధాలని వ్యవహరించాడు. శ్రవ్య కావ్యాల మాట అటుంచి దృశ్యకావ్యమైన మాలతీ మాధవం, రత్నావల్యాదులను కూడా ఇతడు ప్రబంధములనే వ్యవహరించినాడు. జయదేవుడు ప్రసన్న రాఘవం నందు నాటకాన్ని ప్రబంధంగానే వ్యవహరించాడు. రాజశేఖరుడు కావ్యాన్ని ముక్తహం, ప్రబంధమని రెండు విధాలుగా చెప్పాడు.

## 4.2. తెలుగు లాక్షణికుల ప్రబంధ ప్రయోగం :

తెలుగు లాక్షణికుడైన అప్పకవి ప్రబంధములనీ, చాటు ప్రబంధములనీ కావ్య భేదాలు రెండు రకాలని చెప్పినాడు. ఇట్లే విన్నకోట పెద్దన కూడా ముక్తక ప్రబంధాలు, చాటు ప్రబంధాలని చెప్పాడు.

అప్పకవి సంస్కృతంలో దండ్యాదులు చెప్పిన సర్గబంధ లక్షణాల్నే ప్రబంధ లక్షణాలుగా చెప్పారు. నరసభూపాలీయకారుడు అష్టాదశ వర్ణనలు ప్రబంధ లక్షణంగా చెప్పాడు. విన్నకోట పెద్దన కూడా అష్టాదశ వర్ణనలే ప్రబంధ లక్షణాలుగా చెప్పాడు.

### 4.3. తెలుగు కవుల ప్రబంధ యుగం :

తెలుగు కవులు ప్రబంధ శబ్దాన్ని విరివిగానే ప్రయోగించారు. తిక్కన సోమయాజి తన భారతాన్ని ప్రబంధమండలిగా సంబోధించాడు. కేతన "తత్ప్రబంధముఖ మండనంబుగా నమ్మహాత్ము వంశావతరంబు వర్ణించెద" (దశకుమార చరిత్ర) అని అన్నాడు.

ఎర్రన హరివంశంలో 'అని యిమ్మహీ నాయకుగృతి నాయకత్వంబున కవి ముఖంబుగా నొనర్చి జగదర్చితంబగు ప్రబంధంబు నిర్మింపనుపక్రమించితి' అనియూ చెప్పాడు. మంచెన 'కర్ణ సౌఖ్యావహమై ప్రబంధ రచనాశ్రయమయ్యెగు మార్గమూతగన్' అని కేయూర బాహు చరిత్రలో చెప్పాడు. శ్రీనాథుడు క్రీడా భిరామ వీధిని ప్రబంధమనే అన్నాడు. శృంగార నైషధాన్ని భీమేశ్వర పురాణాన్ని, హరవిలాసాన్ని ప్రబంధాలనే సంబోధిచాడు. నందిమల్లయ, ఘంటసింగనలు తమ వరాహ పురాణాన్ని ప్రబంధమనే పేర్కొన్నారు. పిల్లలమర్రి పినవీర భద్రుడు జైమినీ భారతాన్ని, శృంగార శాకుంతలాన్ని ప్రబంధాలనే చెప్పాడు. ఇట్లు పరిశీలిస్తే ప్రబంధ యుగానికి ముందే వచ్చిన కావ్యాలన్నిటినీ కూడా ఆయా కవులు ప్రబంధాలనే పేర్కొన్నట్టు తెలుస్తుంది.

### 4.4. అర్వాచీనుల అభిప్రాయాలు :

ఆచార్య కాకర్ల వేంకట రామ నరసింహం గారు ప్రబంధాలకి, పురాణాలకి లక్షణాలు చెపుతూ ఈ క్రింది లక్షణాలని వివరించారు. 'ఆంధ్ర కవులలో కొందరు కథాకథనమునందే దృష్టిని నిల్పిరి. కొందరు కథాకథనము కంటె కవితా శిల్పమునే విశేషంగా ఆదరించిరి. కథాకథనము నందు దృష్టిని నిలిపి వ్రాసిన వ్రాతను పురాణ ధోరణి యనియు, కవితా శిల్పము నందు దృష్టిని నిలిపి వ్రాసిన వ్రాతను ప్రబంధ ధోరణియనియు స్థూలముగా వ్యపదేశించవచ్చును. స్థూలముగా ననగా పురాణ ధోరణియందు కవితా శిల్పం లేదనికాని, ప్రబంధ ధోరణియందు కథాకథనదృష్టి లేదనికాని అభిప్రాయపడరాదని భావము. ఈ గుణములొండింటి ఆశ్రయించియే తరచూ వాఙ్మయమున కాన్పించును. ఈ ప్రబంధ ధోరణి అధికముగా ఆశ్రయించినవారు ప్రబంధ కవులని, పురాణ ధోరణి అధికముగా ఆశ్రయించినవారు పురాణ కవులని స్థూల నిర్దేశము.'

ఎర్రనకు గల ప్రబంధ పరమేశ్వర బిరుదును గూర్చి తలకొక రీతిగా భావించారు. అందులో దివాకర్ల వేంకటావధానిగారు ఇట్లా వివరించారు. "ప్రబంధ పరమేశ్వరుడనగా కావ్య కల్పనా కౌశలమును పారంగతుడ"ను

అర్థము వచ్చును. పకారాదియైన ప్రబంధ శబ్దము తర్వాత పరమేశ్వర శబ్దము వాడుటకు శృతి శుభగత్వమే కారణం. కవిబ్రహ్మయను బిరుదము వలెనే ప్రబంధ పరమేశ్వరుడను బిరుదమును కావ్య రచనా దక్షతను సూచించునట్టిదే. ఈ బిరుదము నందలి ప్రబంధ శబ్దమునకును మనుచరిత్రాదుల విషయమున మనము వాడు ప్రబంధ శబ్దమునకు కొంత భేదమున్నది. ఒకటి సామాన్య లక్షణోపేతం, రెండవది ప్రత్యేక లక్షణ సంపన్నం. అందుచే మనుచరిత్రాది ప్రబంధ లక్షణములు కొన్ని నృశింహ పురాణమందో, అరణ్య పర్వమందలి ఉపాఖ్యానములందో యాదృశ్చికముగ కానవచ్చుచుండుటచేత ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వరుడను బిరుదము కలిగెననుట ఉచితము కాదు. కావ్య రచనాకుశ లుడగుటచే అతనికా బిరుదము కలిగి యుండును." (నృశింహ పురాణం - పీఠిక)

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు "ఇతివృత్తము వర్ణనలచే అలంకరించెడి నూత్న పద్ధతికి సూత్రధారుడగుటచే ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడయ్యెను." (ఆంధ్ర సాహిత్య చరిత్ర పేజీ నెం. 275) కవిసామ్రాట్ విశ్వనాథ సత్య నారాయణ గారు "ఎఱ్ఱన సర్వమార్గేచ్ఛ విధాత్రుండు" అని పేర్కొన్నాడు. ఇది ఒక రకంగా ప్రబంధ పరమేశ్వర బిరుదానికి పరోక్ష వ్యాఖ్య. పురాణ మార్గము, ఇతిహాస మార్గము, కావ్యమార్గము మొదలైన వాటిల్లో ఇచ్ఛవచ్చినట్లు సంచరించే సృజనాత్మక శక్తి కలవాడు ఎఱ్ఱన అని విశ్వనాథుల అభిప్రాయము.

"ప్రక్రియల్లో వైచిత్రి, వైవిధ్యం, వైశిష్ట్యం, వైలక్షణ్యం ఉన్నప్పుడే ఆయా కృతుల్లో, వాడే శైలిలో కూడా ఆయా విశేషాలు కనబడేవి. ఎఱ్ఱన చేసే ప్రతి ప్రయోగము యోగికంగా ఒక ప్రబంధము ప్రబంధమంటే ప్రక్రియా పరంగా రెండుగానీ అంతకంటె ఎక్కువ గానీ ప్రక్రియల యొక్క లక్షణాలకు, స్వభావాలకు ఏర్పడే గాఢమైన అనుబంధము" (ఆదివారం ఆంధ్రప్రభ 7.8.88) అని జి.వి. సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయం.

## 4.5. భారతాదుల్లో ప్రబంధఛాయలు :

పై లక్షణాలు ఇంచుమించుగా నన్నెచోడుని కుమార సంభవంలోనే కన్పి స్తాయి. కాని ఆ లక్షణాలు కలిగిన గ్రంథాలధికంగా రావడంతో రాయల యుగాన్ని మనం ప్రబంధ యుగమంటున్నాం. భారతాదుల్లో కూడా ప్రబంధ ఛాయలు మనకు కన్పిస్తాయి. ఉదాహరణకు కీచకవధ ఘట్టాన్ని మనం గ్రహించవచ్చు. భీముడు నాయకుడు. కీచకుడు ప్రతినాయకుడు. కీచకవధ

వస్తువులుగా వస్త్వైక్యం సాధించబడింది. సూర్యోదయ, చంద్రోదయాది వర్ణనలు ప్రబంధత్వాన్ని సంపాదించాయి. అంటే తిక్కనలోనే ప్రబంధ లక్షణాలు బీజప్రాయంగా నున్నాయని మనం గ్రహించవచ్చు.

ప్రబంధనామంతో వెలువడిన అనేక గ్రంథాల్ని పరిశీలిస్తే కొన్ని విషయాలు ద్యోతకమవుతాయి. రాయల యుగంలో వచ్చిన కావ్యాలన్నీ ఒక కాలంలో, ఒకే ప్రాంతంలో వచ్చాయి గాబట్టి వీటిని పరిశీలించి ప్రబంధ లక్షణాల్ని చెప్పవచ్చు. అట్లా పరిశీలిస్తే మనకు కన్పించేది ముఖ్యంగా ఏక నాయకాశ్రయంతో పాటు వస్త్వైక్యము. ఇంకనూ ఒక చిన్నకథను సర్వాంగసుందరంగా వ్రాసేదానికి అవసరమైన వర్ణనలు. ఈ వర్ణనలు వస్తు బహిరాకార వర్ణనలు. వస్తుగుణ వర్ణనలు అయివుంటాయి. వీటికి తోడుగా శృంగార రసం, ఆలంకారికమైన రీతి మొదలైనవి.

## 4.6. ప్రబంధపరమేశ్వరుడు - సార్థకత :

లభిస్తున్న ఎఱ్ఱన కృతులు మూడింటిని పరిశీలిస్తే హరివంశం పురాణ కవితా శైలితో, ఇతిహాస వస్తువుతో కథాకథన పద్ధతిలో సాగింది. అరణ్య పర్వశేషం కావ్య కవితా శైలితో, ఇతిహాస వస్తువుతో, కథాకథన పద్ధతి - వర్ణనా పద్ధతితో సాగింది. నృసింహపురాణం ప్రబంధ కవితా శైలితో, పురాణ వస్తువుతో వర్ణనాత్మక పద్ధతిలో సాగింది.

హరివంశం, అరణ్యపర్వశేషం భారత పూరణకు ఉపకరించాయి. నృసింహ పురాణం ఒక నూత్న ప్రస్థానానికే నాంది పలికిన రచన. ఈ కావ్యానికి కవి గావించిన పేరు నరసింహావతారంబను పురాణకథ. ప్రబంధ ఛాయలతో నిండిన పురాణమిది. అనగా ప్రబంధ పురాణమని పిలువదగిన ప్రక్రియ. నృసింహావతారానికి మూలమైన కథార్థాల్ని సంవిధానం చేయుటయే కావ్య నిర్మాణ మర్మం. ఎఱ్ఱన దీనికి తోడుగా క్షేత్రమహత్మ్య లక్షణాల్ని కూడా జోడించాడు. ఎపుడు క్షేత్రమహత్మ్య లక్షణాల్ని జోడించాడో, తప్పకుండా దైవ, క్షేత్ర, తీర్థ, పర్వ, భక్తి వర్ణనలు చోటుచేసుకున్నాయి. ఈ వర్ణనలకు తోడుగా ఎఱ్ఱాప్రగడ అష్టాదశవర్ణనలు కూడా పొందుపరిచాడు. ఈ వర్ణనలలో ఆలంకృతశైలిని ప్రవేశపెట్టాడు. అనగా పురాణకథ, క్షేత్ర మహాత్మ్యము, అష్టాదశ వర్ణనలు, ప్రబంధ శైలి కలిసి ప్రబంధ పురాణమైన నృసింహపురాణం తయారైంది. ఈ విధానమైన రచనకు ఎఱ్ఱనే ఆద్యుడు. అరణ్య పర్వశేషంతోనే, హరివంశరచనతోనే అతనికి ప్రబంధ పరమేశ్వరుడనే బిరుదు వచ్చినా నృసింహ

పురాణ రచనతో అది సార్థకమైంది.

హరివంశంలోని ఉషా అనిరుద్ధులకథో, భారతంలోని సావిత్రోపాఖ్యానమో, రామాయణమో అతన్ని ప్రబంధ పరమేశ్వరుడుగా పిలిపించి యుండవచ్చుగాని ఆ బిరుదును చిరస్థాయిగా సార్థకం చేసింది నృసింహపురాణం.

## 4.6.1. ఎఱ్ఱన హృద్యోక్తులు :

అని బహుమానముగా నడిగి జనమేజయున కతుల కృప వైశంపాయనముని యిట్లను నభినందన పూర్వకముగ నుదాత్తతర హృద్యోక్తిన్ అని హృద్యోక్తులు పేర్కొన్నాడు (హరివంశం పూర్వభాగం 57వ పద్యం)

హరివంశ పూర్వభాగంలో బాలకృష్ణుని వర్ణిస్తూ ఎఱ్ఱన ప్రయోగించిన హృద్యోక్తులు గమనార్హాలు.

సీ. పాలుపారగా బోరగిలిపాన్పు నాల్గుమూలలకును వచ్చును మెలగి మెలగి
లలిగ పోలంబులు గిలిగింతలు వుచ్చి నవ్వింపగలకల నవ్వినవ్వి
ముద్దులు దొల్కకాడ మోకాలంగేలనుడదవుచు నెందును దారితారి
నిలుచుండ బెట్టి యంగుళు లూత సూపగా బ్రీతి దప్పడుగులు వెట్టిపెట్టి

తే. యన్నగంటిదండ్రిని గంటి నయ్యగంటి నిందు రావయ్య విందుల విందవనుచు
నర్థిదనుబిలువగ నడయాడియాడి, యుల్లసిల్లెగృష్ణుడు శైశవోత్సవముల
(హరివంశం - పూర్వభాగం - 193 పద్యం)

ఇటువంటి హృద్యోక్తిమయమైన రచన హరివంశమంతా మనకు కన్పిస్తూ వుంటుంది.

నృసింహ పురాణంలో

ఉ. ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబులగావ్యకర్తవై
యెన్నికయై ప్రబంధ పరమేశుడనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్ర భాష సుజనోత్సవ మొప్పంగ నిర్వహించితా
నన్నయభట్టుతిక్కన కవినాధుల కెక్కిన భక్తి పెంపునన్

## 4.6.3. ఎఱ్ఱన మధురోక్తులు :

అరణ్యపర్వ శేష సావిత్రోపాఖ్యానంలోని ఈ క్రింది పద్యం అతని చతురోక్తికి ఉదాహరణగా గ్రహించవచ్చు.

ఉ. కన్నులు వచ్చి యెల్లెడలుఁగన్గొని, వృద్ధ నరేంద్రుఁడాత్మకుం
గన్నులుఁబోలెనైన తన గాదిలి పుత్రుడు గాననంబులో
నెన్నఁడు లేని యంతతడ వేటకిఁ జిక్కెనొ? యంచు నార్తితోఁ
గన్నులు లేని యట్లా కఁదుఁగానక యేడ్చె సతీసమేతుడై

(అరణ్యపర్వశేషం - 7వ ఆశ్వాసం - 269వ పద్యం)

ఉ. శ్రీమదహోబలేశ నరసింహుఁడు నా ప్రియ దైవతంబు, మ
త్స్వామి, తదీయ తీర్థ విభవంబును దన్మహితావతారమున్
నీ మధురోక్తి గుంభన మనీషులు మెచ్చఁగఁబ్రస్తుతింపు నీ
కీ మెయి సంభవించు నఖిలేప్సిత పుణ్యఫలో దయోన్నతుల్

అని మధురోక్తులను గూర్చి తెలిపాడు. నృసింహ పురాణం నందలి ప్రతిపద్యం కూడా అతని మధురోక్తికి ఉదాహరణలే. అనగా హరివంశం హృద్యోక్తుల తోను, అరణ్యపర్వశేషం చతురోక్తులతోను, నృసింహపురాణం మధురోక్తులతోను సాగిందని గ్రహించాలి.

పైవిధంగా పరిశీలించినపుడు రాయల యుగంలో వచ్చిన కావ్యాల లక్షణాలు ఎఱ్ఱన కావ్యాల్లో బీజప్రాయంగా మనకన్నీ కన్పిస్తాయి. అరణ్యపర్వశేషం నందలి సైంధవుడు ద్రౌపదిని బలాత్కరించే ఘట్టం ఒక చిన్న ప్రబంధం. ఆరు ఏడు ఆశ్వాసాల్లోని రామాయణం ప్రబంధ తుల్యం. నృసింహపురాణం ప్రబంధ లక్షణాలు కలిగిన పురాణమని ముందే చెప్పబడింది.

## 4.7. ఎఱ్ఱన వర్ణనా విధానం :

తిక్కన రచనలో బీజప్రాయంగా నున్న ప్రబంధ ధోరణి ఎఱ్ఱనలో ననలె త్తింది. ~~ఈతని వలన~~ ప్రబంధ కవులు అనేకం నేర్చుకున్నారు. అందుకే ఇతడు ప్రబంధ పరమేశ్వరుడైనాడు. ఇతని బిరుదుకు సార్థకతను కలిగించింది వర్ణనా ప్రాబల్యం. అష్టాదశ వర్ణనలతోపాటు రూప వర్ణనలు, మనోచిత్ర వర్ణనలు గావించుటలో ఎఱ్ఱన అద్వితీయుడు. కథతో వర్ణనల్ని మేళవించి వ్రాయడానికి ఇతనికితడే సాటి. ఇది తరువాతి ప్రబంధ కవులకు మార్గదర్శకమైంది.

నృసింహ పురాణం ప్రథమాశ్వాసంలో హరి మహిమాభివర్ణన గావిస్తూ ఎఱ్ఱన జగదీశ్వరుడైన నారాయణుడే రజ, సత్త్వ, తమోగుణాత్మకత చెంది క్రమంగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల పేరుతో సృష్టిస్థితి సంహారముల నొనరించునని పేర్కొన్నాడు. ద్వితీయాశ్వాసంలో బృహస్పతి ఇంద్రునితో చరాచరభూతాలకు

నారాయణాభిదానమగు తేజమే పరాయణమని ఉపదేశించే సందర్భాన్ని పురస్కరించుకొని ఎర్రన శ్రీమన్నారాయణుని సుగుణ, నిర్గుణ స్వభావాల్ని చక్కగా వర్ణించాడు. ప్రహ్లాదుడు తండ్రికీ, గురువుకు తత్త్వోపదేశాన్ని చేసే సందర్భాన్ని పురస్కరించుకుని శ్రీమన్నారాయణుని పరబ్రహ్మత్వాన్ని చెప్పాడు. వసంత ఋతువు వర్ణనా సందర్భంలో దోహదక్రియా పరిజ్ఞానమును వ్యక్తంగావించాడు. మధుపాన లీలావర్ణన సందర్భంలో అతని భావసంపద వ్యక్తమవుతుంది. సాయం, నిశాచంద్ర, చంద్రికాది వర్ణనల్లో అతనిలోక పరిశీలన, ప్రపంచ ప్రవృత్తి పరిశీలన మనకు తెలుస్తాయి. అపారమైన ప్రతిభాసంపన్నుడు, లోక శాస్త్రాద్యవేక్షణ పూర్వకమైన అపూర్వ వ్యుత్పత్తి గలిగిన మహాకవి ఎర్రన. ప్రకృతి వర్ణనలు చేయుటలో ఈతడగ్రగణ్యుడు.

### 4.8. ముగింపు :

ప్రబంధ శబ్దానికి ప్రకృష్టమైన బంధము గలది ప్రబంధమని గ్రహించినా, అష్టాదశవర్ణనలు, వస్త్వైక్యం మొదలైన నేటి ప్రబంధ లక్షణాలే చెప్పినా, లేక కావ్య సామాన్యార్థాన్ని గ్రహించినా, హృద్య, చతుర, మధురోక్తుల కలయిక ప్రబంధ లక్షణమని గ్రహించినా ఎర్రన ప్రబంధ పరమేశ్వరుడనుటలో సందేహం లేదు.

శంభుదాసుడన్న బిరుదు ఎర్రన మతానికో, వ్యక్తిత్వానికో సంబంధించిందై వుండాలి. ప్రబంధ పరమేశ్వరుడన్న బిరుదు ఆతని కవితా గుణానికి సంబంధించిందై వుండాలి.

# 8. పురాణ ప్రబంధాలలో హిమవంతం

పౌరాణికంగా భౌగోళికంగా, చారిత్రకంగా, చివరకు రాజకీయంగా కూడా హిమవత్పర్వతాలకు ప్రత్యేక స్థానముంది. పౌరాణికంగా చూస్తే అది శివపార్వతుల విహార స్థలం. పార్వతి కన్నతండ్రి ఆవాసం. దేవతలు తిరిగేచోటు. గంగకు స్థానం. ఋషులకు కేంద్రం. అలాగే భౌగోళికంగా భారతదేశానికి ఉత్తరాన పెట్టని కోట. ఈలాంటి హిమవత్పర్వత వర్ణన పురాణాలలో ఉన్నా, కాళిదాసు కుమార సంభవంలో రమణీయకంగా వర్ణించాడు.

ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన స్వారోచిషమనుసంభవం అనబడే మనుచరిత్రలో సుదీర్ఘ హిమాలయ వర్ణన చేశాడు. మనుచరిత్ర మొదటి రెండుశ్వాసాల కథ, హిమాలయ పర్వత ప్రాంతాలలో జరిగింది. ఈ వర్ణన పండిత విమర్శకుల మధ్య కొంత విమర్శకు లోనైంది. పెద్దన వృక్షజాతులు, పశుపక్ష్యాదులు, అరటి, తమలపాకుల తోటలు, బృందావనాన్ని మరిపించే ఉద్యానవనాలు హిమాలయాలలో వున్నట్లుగా వర్ణించారు.

హేతువాద దృష్టితో చూస్తే పెద్దన వర్ణనంతా అసత్యమే. ఎందుకంటే మంచుతో నిండివున్న హిమాలయాలలో ఉద్యానవనాలు, పశుపక్ష్యాదులు సహజంగానే వుండవు. పెద్దన చెప్పిన ఈ విషయాన్ని కొందరు ఒక విధంగా సమర్థించారు. విజయనగర ప్రాంతములోని ఉద్యానవనాల్ని, వృక్ష జాతులను, పశుపక్ష్యాదుల్ని చూచిన అనుభవంతో పెద్దన హిమాలయ పర్వత వర్ణనగా చేశారని కొందరి నమ్మకం. వీరి వాదనకు బలం కలగడానికి రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారి "సత్యము గాని అసత్యము గాని, అసత్యము గాని సత్యము గాని, కావ్యమందు దొరకు పదార్థం కాదు. అన్న వాక్యాన్ని" ఇంకను "వ్రాసిన కవి సత్యమై వుండగా అతను జీవించినది సత్యమై వుండగా అతను చెప్పినదంతయు అసత్యమనుట సంభవం గాదు" అన్న వాక్యాలు బలం కావచ్చు.

ఈ పై విమర్శ పూర్తిగా కొట్టివేయ తగింది కాదు. పెద్దన తుంగభద్రానదిని చూశాడు. ఆ నది వెంట వుండే ఉద్యానవనాదుల్ని; పశుపక్ష్యాదుల్ని చూశాడు. అంతమాత్రంచేత వాటినాధారంగానే హిమాలయ పర్వత వర్ణన చేసాడనుట

అంత సహేతుకమైన విమర్శకాదు.

పెద్దన కావ్యానికి మూలం మార్కండేయ పురాణం. సంస్కృతంలోని పద్దెనిమిది పురాణాలలో ఈ మార్కండేయపురాణ మొకటి. ఈ సందర్భంగా మార్కండేయపురాణంలో సాగిన హిమాలయ వర్ణన పరిశీలించడం సబబు.

(దదర్శాతి మనోజ్ఞాని - సామాని హిమాభూభృతః)

హిమవంతం నుండి ఎన్నోనదులు క్రిందికి ప్రవహిస్తున్నాయి. ఆ పర్వత సానువులతో రమ్యంగా వున్నాయి.

(సిద్ధ గంధర్వ జుష్టాని - కిన్నెరాభిరతానిచ
క్రీడావిహార రమ్యాణి - దీనా దీనా మితస్తతః)

ఆ సానువులలో సిద్ధ, గంధర్వ, కిన్నెరాది దేవత విహారాలు చూడడానికి అందంగా వున్నాయి.

(ప్రనృత్యచ్ఛిఖికే కాఖ - రన్యతశ్చ నినినాదితం
పుంస్కోకిల కలాలాపైః- శృతిహారిధిరన్వితం)

ఆ పర్వతంలోని జలపాతాలు రమణీయంగా వున్నాయి. ఆ సానువులలో నాట్యం చేస్తున్న నెమళ్ళు చక్కని కూతలు వేస్తున్నాయి. మగ కోకిలల ఆలాపం ఆ ప్రాంతాన్ని వినసొంపుగా చేశాయి.

(ప్రఫుల్ల తరుగంధేన వాసితానిలనిధితం ముదా
యుతస్సితదదృశే హిమవంతం మహాగిరిం)

ఆ ప్రాంతంలోని వృక్షాలు విరబూసి వున్నాయి. ఆ పుష్పాల సుగంధం సర్వత్రా వ్యాపించడం వల్ల ఆ ప్రాంతం సుమనోజ్ఞంగా వుంది.

(ఈ వర్ణన మార్కండేయ పురాణం 58వ ప్రకరణంలోని 16వ శ్లోకం దాకా వుండి సాగింది.)

బ్రహ్మాండ పురాణంలో కూడ మనకు హిమత్పర్వత వర్ణన 27వ ప్రకరణంలో 1 నుండి 43వ శ్లోకం వరకు కనిపిస్తుంది.

పర్వత శ్రేష్ఠమైన హిమాలయం పలురకాలైన వృక్షాలతో, లతలతో శోభాయమానంగా వుంది. విస్తరించిన అతి దీర్ఘాలైన ఆ పర్వత రాజ శిఖరాగ్రాలు, అంబరతలం లోపలికి చొచ్చుకొని పోయినట్లుగా ఉన్నాయి. అనేక రకాలయిన రత్నాలు అమూల్యమైన ఔషధాలు మొదలగు వాటితో నిండిపోయిన హిమా

లయ పర్వతం వివిధ ప్రకాశలంకారకమై ప్రకాశిస్తున్నాయి. ఈ పర్వతంలో గాలికి వృక్షశాఖలు రాసుకుంటే పుట్టిన అగ్నిరమ్యంగా వుంది. సూర్యకాంతమణులు రవి కరస్పర్శచే మండుతున్నట్టుగా అనిపించి, హిమజలంలో చల్లారినట్లుగా కన్పిస్తాయి. ఈ పర్వతంలోని కొన్ని ప్రాంతాలలో స్ఫటికాలు వున్నాయి. స్ఫటికాలు పరిసరాలలోని అంజన దీప్తుల్ని, సువర్ణరాసుల్ని ఆకర్షించినందువల్ల రకరకాల కామిత మయూఖజాలం వ్యాపింప చేస్తున్నాయి. ఆ పర్వత అధోభాగంలోని సిద్ధదంపతులు లే ఎండకు విశ్రమిస్తారు. వ్యధపడిన సిద్ధ దంపతులు సేద తీర్చుకుంటారు. సిద్ధదంపతుల గుంపులతో ఆ ప్రదేశం చాల రమ్యంగా వుంది.

హిమాలయాలలోని కొన్ని ప్రాంతాలలోని యక్షులు గుంపులు గుంపులుగా వున్నారు. నీరు ఎండ వేడిమికి ఆస్వాదిస్తారట. కొండల గుహల నుండి బయటికి వచ్చిన ఖడ్గమృగాన్ని చూచి ఆ పరిసరాల్లోని విశ్రమించిన మృగయూధం భయనిహ్వాలం కావడం వల్ల ఆ పర్వతానికొక శోభ వచ్చింది. శార్దూలాల గుంపులు, పందుల గుంపులు పరస్పరం పోరాడుకోవడం వల్ల వాటి తాకిడికి కొన్ని వృక్షాలు నేలకూలిపోయాయి.

ఆడ ఏనుగులు తమ ఓడ్డల్ని రక్షించుకోవడానికి క్రూర మృగాల మీదికి దూకినప్పుడు వాటి పాదఘటనకు పర్వతంలోని శిలలు నలిగిపోయాయి. మత్తెక్కిన మదగజాలు తమంత తాము పోరాడుకోవడంచేత గుహ యొక్క గండశిలలు తునాతునకలయ్యాయి. కొన్ని ప్రాంతాలు నేత్రపర్వంగా వున్నాయి. ఏనుగుల ఘీంకారాలు విని వాటిని వెంటాడిన సింహాలు పదునైన గోళ్ళ తాకిడికి ఆ పర్వతంలోని శిలాతలం కొంత నలిగిపోయింది. సింహాలు, ఏనుగుల్ని శిరస్సుల్ని రక్తసిక్తం చేస్తే ఆ బాధను సహించలేని ఏనుగుల ఆక్రందనలతో హిమాలయ పర్వత ప్రాంతం నిండిపోయింది.

గిరి పుంజాలలోని మగ ఏనుగులు ఆడ ఏనుగులతో క్రీడకు సంసిద్ధమయినాయి. కరేణువుల మర్మావయవాలు ద్రవసిక్తాలమయమైనా విహరించడం ఆ పర్వత ప్రాంతాలలో చూడవచ్చు. నిద్రిస్తున్న సింహాల ముఖాల నుండి వెలువడే వాయువు జింకలకు భయహేతుకంగా వుంది.

పర్వత గుహలలోని కిన్నెర జంటల ఆట పాటల చెత ఆ పర్వత దిక్కులన్ని ప్రతిధ్వనిస్తున్నాయి. వనదేవతలు ఆ ప్రాంతంలో విహరించడం వల్ల హరిచరణాలు లత్తుక ఆ పర్వతంలోని శిలలపై అక్కడక్కడ కన్పిస్తుంది. ఆడ నెమళ్ళు నృత్యం చేస్తూ మధురాతి మధురంగా గానం చేస్తుంటే ఉత్సాహాన్ని

పొందిన మగ నెమళ్ళు పురివిప్పి నాట్యం చేయడాన్ని ఆ పర్వతాలలో చూడ వచ్చు. నదుల ప్రక్కన పెరిగిన చెట్ల నుండి రాలిన పూల సువాసన చేత ఆ ప్రాంతమంతా నిండిపోయింది. ఆ సుగంధపు గాలికి అక్కడి ప్రాణ సముదాయం ఎంతో ఆహ్లాదాన్ని అనుభవిస్తున్నది. ఇంకా ఎంతో ఆహ్లాదాన్నిచ్చే ఆ పర్వతాల్లో కదంబ, నింబ, హింతాల, సర్ప, బంధూకి, తిందుక, వెలగ, పనస, అశోక, మామిడి, మొదలగు వృక్షజాతులు నాగ, చంపక, పున్నాగ, కోనిదార, ప్రియంబు, ప్రియావ, నీడ, వకుళ, బంధూక, అక్షతమూలుక, మొదలగు పుష్పవృక్షాలు, ద్రాక్ష, మధూక, ఉసిరి, నేరేడు, కంకోల, బిల్వ, అర్జున కదంబ మొదలగు పండ్ల వృక్షాలు, పిచుల, అంబష్టి, కనక, వైకంక, శమీ, ఉదుంబురు, పిప్పలములు, మొదలగు జాతులతో హిమాలయ పర్వత ప్రాంతం శోభాయమానంగా వున్నట్లు పురాణాలల్లో వర్ణితం.

బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడైన పెద్దన విజయనగర ప్రాంత ప్రభావాన్ని వర్ణించాడనటం కంటె ఈ పురాణ ప్రభావాలకు లోనై మంచు పర్వతాలలో కనరాని పశుపక్ష్యాదుల్ని మహావృక్షాల్ని వర్ణించి వుంటాడని చెప్పవచ్చు. పురాణాల నుడి కథను గ్రహించిన పెద్దన ఈ వర్ణన విషయంలో గూడా పురాణాలనే అనుకరించానడం సమంజసం. అతని పాండితీ ప్రభావాలకు ఈ వర్ణన చక్కని నిదర్శనం.

# 9. ప్రబంధాలలో వేట వర్ణన

తెలుగు సాహిత్య చరిత్రలో సర్వజన సమ్మతంగా యిది మొదటి ప్రబంధమని తెలియజేయుట గగన కుసుమాలను ధరింపదలచినట్లే అవుతుంది. కొందరి మతంలో 'కుమార సంభవము' ప్రథమాంధ్ర ప్రబంధం. కాదనువారు పెక్కురు. ఎర్రన ప్రబంధ పరమేశ్వరుడు. అతడే ప్రబంధాలు సృష్టించినట్లు కొందరు, కాదుకాదు అతడు పురాణ ఫక్కికి చెందినవాడని మరికొందరు. ఈ విధంగా సాహిత్య చరిత్రకారులు ఏకంగా అంగీకరించలేని అనేక వివాద విషయాలల్లో ఇదొకటి. అయినా అధిక సంఖ్యాకులు 'ప్రబంధయుగం' అని రాయల కాలాన్ని అంగీకరిస్తున్నారు. ఈ యుగానికి ముందు ప్రబంధాలు లేవా? లేవా ఏమిటి? పినవీరన 'శృంగార శాకుంతలము' నేనున్నానని అంటుంది. అందుకే అన్నారు. శాకుంతలం ప్రబంధమే కాని, అనేక ప్రబంధాలు వెలసిన రాయల యుగమే ప్రబంధయుగమని, ప్రబంధాలతోపాటు పురాణాలు వెలసిన శాకుంతల జన్మకాలాన్ని శ్రీనాథ యుగమని, సంధియుగమని కాకుంటే ప్రబంధ పూర్వయుగమని. ప్రబంధ యుగము తరువాతది క్షీణయుగమని కొందరు, దక్షిణాంధ్ర యుగమని కొందరు అన్నారు. ఎవ్వరేమనినా అది ప్రబంధ యుగానికి తర్వాతిదని అంగీకరించాలి. మరి ఈ యుగాన ప్రబంధాలు వెలికి రాలేదా అంటే? హొయలు చూపిస్తూ "విజయ విలాసము", సొగసులు చూపిస్తూ "సారంగధర చరిత్ర" మనముందుకు వస్తాయి. అందుకు సాహిత్య చరిత్రకారుల సమాధానం "అవునవును మేము కాదనలేదు. కాని సర్వలక్షణ సంగ్రహంగా రాయల యుగాన వెలసిన ప్రబంధములవలె లేవు. ఒకవేళ ఒకటి అరా వున్నా అవి లెక్కలోనికి రావు" అని అంటారు. అయ్యో అంత సాహిత్యం వెలసిన కాలాన్ని క్షీణయుగం అని అనరాదని దక్షిణాంధ్ర యుగమని కొందరన్నారు. కాబట్టి ప్రబంధాలలో ఏ విషయాన్ని పరిశీలించ దలచినా ప్రబంధ యుగంలోని ప్రబంధాలే గాక అంతకు ముందు వెనుక నున్న ప్రబంధాలను గ్రహించాలి. అన్ని ప్రబంధాలను పరిశీలించి ఒక విషయాన్ని తెలుసుకోవటం అసాధ్యం కాదుగాని, కష్టసాధ్యం. కాబట్టి ప్రబంధాలలో వేటవర్ణన తెలుసుకోవడానికి ప్రబంధ యుగానికి ముందు వెలువడిన శాకుంతలము ప్రబంధ యుగాన వెలువడిన స్వారోచిషమను సంభవము. ప్రబంధ యుగానికి

తరువాత వెలువడిన సారంగధరను పరిశీలించవచ్చు.

ప్రాచీనాలంకారికులు 'రసము' సంఖ్యను ఎట్లు నిర్దుష్టంగా తెలియజేయ లేదో అట్లే ప్రబంధాలలోని వర్ణనలను గూర్చి నిర్దుష్టంగా చెప్పలేదు. అంటే నవరసాలని, రససంఖ్య పది అని, శృంగార రసమొక్కటేనని లాక్షణికులు భిన్న భిన్నాభిప్రాయాలు తెలిపినట్లే. వర్ణనలు 18 అని, 24 అని, 32 అని వివిధాభిప్రాయాలు వెలిబుచ్చారు.

'కావ్యదర్శన'ములో దండి 'నగర' 'సముద్ర' శైల, ఋతు, చంద్రోదయ, సూర్యోదయ, ఉద్యాన, సలిలక్రీడా, మధుపాన, రతోత్సవ, విప్రలంభ, వివాహ, కుమారోదయ, మంత్ర, ద్యూత, ప్రయాణ, ఆజి, 'నాయకాభ్యుదయ' ననునవి అష్టాదశ వర్ణనలని అందు రెండు, మూడు లేకున్నను మహాకావ్య మవుతుందని చెప్పాడు. కాకనూరి అప్పకవి గారు ఇవిగాక వేట, మున్యాశ్రమం, కన్యాంగ సౌందర్య కథనం దౌహృదయ అనునవి కలిపి మొత్తం ఇరువది రెండు వర్ణనలు వుండేవే మహాకావ్యమని తెలిపాడు.

సాహిత్య దర్పణకారుడు దండి చెప్పిన పదునెనిమిదిట్లో జలక్రీడా, ద్యూత, నాయకాభ్యుదయాలను వదలి అప్పకవి చెప్పిన నాల్గింటిలో వేట, మున్యాశ్రమ వర్ణనలను స్వీకరించి తాను క్రొత్తగా స్వర్గ, యాగ, సంధ్యా, రాత్రి, ప్రదోష, ధ్వాంత, వాసర వర్ణనలు ఏడు చేర్చి సంఖ్యను ఇరువది నాలుగుకు పెంచాడు. 'అలంకార శేఖరము'న దండ, అప్పకవులు చెప్పినవానిలో కొన్నిటిని వదిలి 'రాజ' రాజాజీ, దేశ, గ్రామనదీ, సరోవర, వన, హయ, గజ, స్వయంవర, పుష్పావచ యకళా, వయస్సంధీ, ధాతు వర్ణనములు గ్రహించి మొత్తం ముప్పై రెండు వర్ణనలని చెప్పబడింది. ఇలా లాక్షణికులు అనేక విధాలుగా తెలియజేసిన వర్ణనల సంఖ్యలో ఎక్కువమంది వేట వర్ణన ప్రబంధంలో ఉండాలని నిర్ణయించారు. కాని దండి చెప్పిన అష్టాదశ వర్ణనల్లో వేట వర్ణన పేర్కొనబడి యుండలేదు.

నేడు విమర్శకులు అనేకులు ప్రబంధాలు కేవల - వర్ణనా చమత్కృతులు, ప్రబంధాలలో రాజు, రాణి వారి వివాహం, కాకున్న వారి విరహవర్ణన అంతేగాని అందులో సాంఘిక పరిస్థితులు గాని పగటు మనిషికి సంబంధించిన విష యాలు గానీ లేవని ప్రబంధాలను ఈసడించుకొంటున్నారు. కానీ కీర్తిశేషులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అన్నట్లు "కవులు కావ్యమందలి వస్తువుల నెంత పైకెత్తినను భూలోకపు గాలిని దాటునంత మీదికి తోయజాలరు..." "వ్రాసిన కవి సత్యమై యుండగా అతడు జీవించి, సంచరించి, చూచి, అనుభవించిన సంఘము కన్నుల యెదుట స యుండగా అతడు వ్రాసిన కావ్యములలో

అంతయును అసత్యమే యుండుట అసాధ్యము" అనునది సహృదయంతో పరిశీలిస్తే నిజమని ఒప్పుకొనక తప్పదు. వేట వర్ణనలలో సగటు మనిషికి సంబంధించిన విషయాలు కనిపిస్తాయి. 'వేటవర్ణన' అంటే కేవలం రాజులను గూర్చిగాక పినవీరన, పెద్దన, వెంకటకవులు ఎందరో పల్లెవాసుల గూర్చి వర్ణించడం గమనార్హం.

'వేట' అను పదానికి అనేకార్థాలున్నాయి. రంగనాథ రామాయణములో "రాముడొనర్పనున్న పెన్‌వేటకు రావణాది మృగబృందము...." అని ప్రయోగం వుంది. అనగా ఇక్కడ వేట పదానికి మృగం వేటయని గ్రహింపవలసి వుంటుంది.

శబ్దరత్నాకర కర్త వేట రెండు విధాలని అందొకటి మృగాలవేట, రెండు పక్షుల వేట అని; మృగాల వేటలో తిరిగి ఏదువేట, గంటవేట, తెరవేట అని మూడు విధాలు గుర్తించి పక్షుల వేటలో పాదివేట, విడివేట అని రెండు విధాలు గుర్తించారు. మార్కండేయ పురాణం నందు "వేట మాంసంబు అష్టమాసంబులు, దుప్పిమాంసము నవమాసంబులు, గురుపోతుమాంసంబు దశమాసంబులు, తగరు మాంసంబు ఏకాదశమాసంబులు, గోవుపాలను పాయ సంబును పండ్రెండు మాసంబులు పితృదేవతలకు "తృప్తియొనరించి" అని వుంది. ఇక్కడ వేట అనగా మేకపోతు అని అర్థమీయబడి ఉంది. పోతన భాగవతంలో వేట అనునది పొట్టేలు అను అర్థంలో ప్రయోగింపబడి వుంది. ప్రాచీన సాహిత్యం అటుంచితే నేటి వ్యవహారికంలో 'వేట' అనేది బహువిధాలుగా ప్రయోగింపబడుతుంది. 'మేము యీరోజు అడవికి వేటకు పోలిమి' అనే ప్రయోగాన్ని మనం వింటున్నాం. ఇక్కడ 'వేట' అనే పదానికి మృగాల్ని వేటాడడానికి అని గ్రహించవలసి వుంటుంది. అలాగే నేను పూరేడిని తీసికొని వేటకు పోయి వుంటిని" అన్నది రాయలసీమ ప్రాంతంలో బహుళ ప్రచారంలో వుంది. ఇక్కడ పూరేడివేట అంటే పక్షులవేట అని అర్థం. అలాగే "మాకు గంగమ్మకు మొక్కు వుంది వేట నీయాలి" అనేదానిలో వేటకు పొట్టేలు అనిగాని 'మేకపోతు' అనిగాని అర్థం స్ఫురిస్తుంది. ముఖ్యంగా రాయలసీమలో వేట మాంసం అంటే పొట్టేలు మాంసం అనే అర్థాల్లోనే ప్రయోగిస్తుంటారు.

ఈ 'వేట' అనేపదం అనేకార్థాల్ని స్ఫురింపజేస్తున్నా ప్రబంధాలలో వేట వర్ణన అంటే మృగాలవేట అని మాత్రమే ప్రబంధ కవులు గ్రహించినట్లు తెలుస్తుది. దీనికి కారణం బహుశః రాజు దుష్టశిక్షకుడు శిష్ట రక్షకుడు కాబట్టి క్రూర మృగాల్ని చంపి సాధుజంతువుల్ని కాపాడు ధర్మాన్ని కలిగి వుంటాడు. అందుకే ప్రబంధ కవులనేకులు వేట వర్ణన అంటే క్రూరమృగాల్ని వేటాడుటనే

వర్ణించారు. రాజ ధర్మాలల్లో వేటాడటం ఒకటిగా కొందరు పేర్కొన్నారు. వేట సప్తవ్యఘూలల్లో ఒకటి అని మరికొందరు పేర్కొన్నారు. అసలు 'వేటాడుట' అన్నది ఒకజాతికి ప్రత్యేకమైన విషయంగా ఉండినట్లు తెలుస్తోంది. తిక్కన భారతంలో శల్య పర్వంలో 'వేటగాడు' అనే ప్రయోగం బోయవాని పరంగా వాడబడింది. కాశీఖండంలో శ్రీనాథుడు 'బోయపల్లె'ను "వేటపల్లె" అని అన్నాడు. అంతేగాక తిక్కన ఉద్యోగపర్వం నందలి ప్రయోగం 'వేట' అనగా వధించుట అనే అర్థాన్ని స్ఫురింపజేస్తుంది.

ఈ విధంగా వేట రాజధర్మాలల్లో ఒకటిగాను సప్తవ్యసనాల్లో ఒకటిగాను పేర్కొని యుండుటచే మనం ఒక్క విషయాన్ని గ్రహించవచ్చు. క్రూరమృగాలు అధికమై సాధుజంతువులకు, మునులకు, పల్లెవాసుల పంటలకు నష్టం కలిగించునపుడు రాజు వేటాడి వారికి క్షేమాన్ని చేకూర్చాలి. అంతేగాని రాజ్య క్షేమాన్ని వదలి ఎల్లవేళల వేటాడుట సప్తవ్యసనాలల్లో చేరుతుందని తెలుస్తోంది. "నిదానమే ప్రధానం, ఆలస్యంఅమృతం విషం" అను సామెతల్లో సహితమింతే గదా!

పిల్లలమర్రి పినవీరభద్రుని శృంగార శాకుంతలములో అల్లసాని పెద్దన స్వారోచిషమను సంభవములో, చేమకూర వేంకటకవి 'సారంగధర చరిత్ర'లో వేటవర్ణన నాటి సంఘంలోని కొన్ని విషయాలకు ప్రత్యక్ష సాక్ష్యం. అందు ముఖ్యంగా అడవి ప్రాంతమందు నివసించు ప్రజల వేషభాషల్ని, రాజుకు వారికి గల సంబంధాల్ని తెలిసికోవచ్చు.

నేటివలె నాడు భారతదేశమంతా ఒక్కటిగా పరిపాలించు విధానంలేదు. చిన్నచిన్న రాజులు కొన్ని ఊర్లను వశపరచుకొని పరిపాలించేవారు. అట్టి కొందరి రాజుల వద్ద కప్పములు స్వీకరించి మరికొంత పెద్ద రాజ్యంగా మహారాజు లేక చక్రవర్తి పరిపాలించేవాడు. నాడు నేటివలే భాషను బట్టి రాజ్యాల విభజన లేదు. ఒక్క తెలుగు ప్రాంతాన్నే అనేక రాజులు పాలించేవారు. వారికి పరిహద్దులు ప్రకృతి సహజంగా ఏర్పడిన అడవులు, కొండలు. వేట జీవనాధారంగా గలిగిన అడవి ప్రాంతం ప్రజలు అడవుల ఆధారంగానే బ్రతికేవారు. అంటే ఒక రాజ్యానికి మరియొక రాజ్యానికి మధ్య జీవించేవారు. అడవులకు ఒకవైపు ఉన్నవారు ఒకరాజు ఏలుబడిలోను, మరొకవైపు వున్నవారు ఇంకొకరాజు ఏలుబడిలో ఉండేవారు. శత్రురాజులు రాజ్యంపై యుద్ధం చేయాలంటే వీరున్న ప్రాంతాల్ని అధిగమించి రావాలి. అటువంటి సమయాల్లో వీరు శత్రురాజుల వార్తను వెంటనే రాజునకు అందజేసేవారు. ఇలా అడవి ప్రాంతంలోని ప్రజలు రాజుకు సహాయకారులై ఉన్నారన్న సత్యం మనకు చరిత్రలో అనేకచోట్ల

సాక్షాత్కరిస్తుంది. కాబట్టి రాజులు వీరి మాటయందు కొంత గురి వుంచి వీరికి క్రూరమృగాలతో బాధ కలిగినపుడు నడుముకట్టి ముందుకు వచ్చి వేటాడి వారి బాధల్ని తొలగిస్తారు. ఇంతవరకు కవి వ్రాసేది సత్యం. "సత్యము లేని అసత్యముగాని అసత్యము లేని సత్యము గాని దొరుకు పదార్థము కాదు" అని రాళ్ళపల్లి వారన్నట్లు ఇక్కడి నుండి కవి కల్పనలు చిత్రవిచిత్ర సంఘటనలు జరుగుతాయి. వేటాడవచ్చిన రాజు ఏకన్యనో చూచుట, ప్రేమించుట, విరహాన్ని పొందుట, వివాహమాడుట, ఇంకా ఎన్నో తన కథలోనికి కవి మనల్ని లాగుకొని పోతాడు. కవి తన గ్రంథంలోని నాయకా నాయకుల ప్రథమ సమాగంకో మరి ఏ విచిత్ర సంఘటనకో వేట నాధారంగా గ్రహించినా అందున్న కొంత సత్యం మనకానాటి ఆటవిక ప్రజల విషయాల్ని రాజు చేసే వేట అడవి ప్రాంతపు ప్రజలకు బాధను తొలగించుట. అప్పటి పరిస్థితుల్ని చూసిన కవి ఆ విషయాల్ని కొంత వర్ణనలతో తన కావ్య నాయకుల కంటగట్టవచ్చు. కాబట్టి ప్రబంధాలల్లోని వేటవర్ణన అంతా కేవలం కవుల అభూత కల్పనయని గాక అందలి సత్యాన్ని నేటి విషయాలతో పోల్చిచూస్తే వేటయందు నాటికి నేటికి గల భేదసాదృశ్యాలు మనకు తెలుస్తాయి.

శృంగార శాకుంతలములో ప్రథమాశ్వాసం 97 పద్యం నుండి ద్వితీయా శ్వాసం 8వ పద్యం వరకు వేటను గూర్చి వర్ణన వుంది. కథానాయకుడైన దుష్యంతుడు కొలువుదీరి వుండ కొందరు పుళింద వల్లభులు ఆకులు, కొమ్మలు మొదలగు వానితో గూడిన వృక్షాగ్రాల వలె ఒంటరి జుట్టు గలిగిన, శిరస్సులు గలిగి లేత చిగురాకులవలె ఎర్రనైన గుండ్రనైన కన్నులు గలిగి, ఏనుగు చర్మం వలె ప్రకాశిస్తున్న శరీరం గలిగి కొందరు పల్లెవాసులు కొల్వు రాజు సభకు వస్తారు. వచ్చి రాజు సభాసదుడైన దుష్యంతునికి వెదురుపాలు, జవ్వాది, మురళి పప్పు, జుంటితేనె, కారుకోళ్ళు, కస్తూరి, పులిపిల్లలు, ఎలుగుపిల్లలు కానుకలుగ ఇచ్చి, ప్రణామంబు లొనర్చి, కేలుదోయులు పాలకింబులం జేర్చుకొని వినయ వినిమిత స్కంధులై క్రిందుచూపుల నెర్రతారల పారంగనుంగొనుచున్నవారల నవలోకించి చిత్తంబు మృగయా యత్తంబుకాగా నృపోత్తముడు క్రొవ్విన మృగములు కలిగి, సమీపమున ఏరు, కాలువ నేదైన కలిగి, అనుకూలమగు వృక్షములు గలిగిన అడవి ఎచ్చటైన గలదా అని ప్రశ్నిస్తాడు. అందుకు పుళిందులు "దేవా నీవు వేటాడదలచిన యమునానదీ ప్రాంతము నందున్న వనమునకు వేంచేయుడు. ఆ వనము నందలి మృగములకు వెంట్రుక పెరికిన వచ్చునది రక్తము గాదు చమురు. దగ్గర దగ్గర ఊర్లు ఉండుటచే ఊరికి ఊరికి మధ్య వ్యవసాయ క్షేత్రములుండుటచే మేతకు పశువుల మంద ఆయడవి

నాశ్రయించుకొని యున్నవి. అడవిలో తగిన గడ్డి నీరు లభించినను బెబ్బులుల భీతిచే గోవృషభములు అడవిలో జేర వీలులేక బాధపడుచున్నవి. అటువంటి మందను తీసుకొని అడవికి మేపుటకై వెళ్ళి ఎల్లవేళల ఆయుధములను ధరించి ఏ క్రూరమృగము కనిపించిన చంపుచు పశువులుగాయు వారి మనస్సులకు, శరీరరములకు విశ్రాంతి లేదు. ఓ రాజా! ఆ ప్రాంతమునకు మీరు వచ్చిన ఒక్కసారికి మీ వింటికి 15 బాణములు జోడించి వదిలినను 15 బాణములకు 15 మృగములు పడును. ఏలయన గుంపులు గుంపులుగా భయములేక ఆ ప్రాంతమున మృగములు చరించుచుండును. ఆవల దేవర చిత్తంబు కొలది యనిన గోరక్షణంబు కొరకును, దుష్టమృగ శిక్షణంబు వలన సుకృతంబుగా మృగయాసౌఖ్యంబు సిద్ధించునని అమాత్యుల యనుమతంబున గొలువులిచ్చి యందర సముచిత ప్రకారంబుల వీడుకొలిపి నేత్రహస్తులం బిలిపించి పట్టణం బున మృగయవిహార సన్నాహంబునకుం జాటించగా పులిమల్లుడు, గరుడుడు, పెట్టుగాడు, చిగురుండు, చిత్రాంగి, పులియుండు అను మొదలగు కుక్కల తీసికొని తారకులు విచ్చేసినారు. ఆ కుక్కలు నేలను కాళ్ళతో రాకుచు "భౌభౌ"మని ఆకాశము బ్రద్దలయ్యేటట్లు అరుస్తూ వచ్చినవి. అంత వారికి వారికి తగినట్లు గజాశ్వరూఢులై వేటాడ నుత్సాహము గల వారందరు బయలుదేర, రాజు తనకు గల ఉత్తమాశ్వము నధిరోహించి బయలుదేరినాడు. వేటాడ బయలుదేరినవారు తమ వెంట్రుకలను ముడిగావైచి ఆ ముడి జారిపోవకుం డుటకై తలపాగ గట్టి, మగసిరి వుట్టిపడేటట్లుగ తిలకంబు పెట్టి, మొలను కత్తిని ధరించి బయలుదేరినారు. మరికొందరు బోనులు, వలలు మొదలగు వేటకు కావలసిన సామగ్రిని తీసికొని బయలుదేరినారు. ఇట్లు బయలుదేరిన దుష్యంతాదులు అడవి ప్రాంతమునందున్న ఒక గొల్లపల్లెకు చేరువుకాగానే ఆ గొల్లలు తమ రాజు రాక తెలిసి ఆనందంతోను, భయంతోను నిండిన మనస్సుగలవారై నమస్కరించి వినయ వాక్యాలతో ఆ రాజున కిట్లనిరి "ప్రభూ! మీరు చాలాదూరము వచ్చియున్నారు. మీరును, సైన్యమును అలసినారు. నీరు పెట్టుదగిలి వగర్చుచున్నవి అశ్వములు. నీటికి నాలుకలు చాపుచున్నవి మీ కుక్కలు. శ్రమతో కూడికొని రెక్కలు నల్లాడ్చలేకున్నవి మీ డేగలు. కాలమా మధ్యాహ్నమాయెను. కావున దేవా నేడిచట కాలాగి మామంద పాడి చూచి గోరసము పాయసంబుల నారగించి మమ్ము సంతోషపెట్టవలయును" అని ప్రార్థించగా దుష్యంతుడు బదులు చెప్పుటకైన అవకాశమీయక మాండవ్యుడు వీరి కోరికను తొందరపడి కాదనవద్దు రాజా! పెరుగులు, నేయి, చిత్రధాన్యాలు, పాలు, వెన్న, వీరివద్ద అధికంగా వుంటాయి. కానుకలు గట్టుటలేదు. కాబట్టి

ఒకపూట మనకు భోజనమిడుట వలన వీరికొచ్చిన నష్టంలేదు. అంతేగాక వేటాడుటకు వెళ్ళేటప్పుడు విప్రుని మాట కాదనరాదు. పాయసంతో గూడిన భోజనం ఎంతేని శ్రేయస్కరం. భోజనం, తాంబూలం, గంధపుష్పాలు వద్దంటే కార్యసిద్ధి కలుగదు. ఇల్లు వదిలినవాడు తను తలచిన తావునకు చేరువరకు ఏ ఆకలి లేకుండుటకు లభించినదాన్ని స్వీకరించాలి. రాజా! మనం భవంతి వదలి వచ్చునప్పుడు కాకి ఎదుట వచ్చింది. వృషభం రంకెవేసింది. వాడలో కుక్క, కొత్తకుండలు ఎదురుపడ్డాయి. ఇంకా అనేక శకునాలు సంభవించాయి. కాబట్టి ఈ గొల్లల మాట విని ఈరోజు ఇక్కడ విడిదిచేయుట మంచిది. నీవు భోజనం చేసిన వీరు ఎంతో సంతోషిస్తారు" అని విన్నవించగా రాజు సమ్మతించాడు. అంత ఆ గొల్లలు నేతితో చేసిన పిండివంటలు, మీగడలు, జున్నుపాలు, జుంటితేనె, మాంసం, పాయసాహారాలు రాజుకు, రాజుతోపాటు విచ్చేసిన వారికి ఆరగింపజేసారు. ఆ మరుసటిరోజు రాజు వేటకై అడవిప్రాంతాన్ని చేరి మాండవ్యునికి సెలవు నిచ్చుటతో శాకుంతలమున వేటకు సంబంధించిన విషయం ముగుస్తుంది.

మనుచరిత్రలో చతుర్థాశ్వాసం 14వ పద్యం నుండి 60వ పద్యం వరకు వేటవర్ణన వుంది. స్వరోచి విశ్వకర్మ నిర్మితమైన నగరాన బోయలు సేవించుచుండ నొక్కనాడు వర్షం వచ్చి వెలసింది. అప్పటి ప్రకృతికి మురిసిపోతూ ఒక ఎఱుకరాజు నక్కకొమ్మును, వేడిగోరోజనాన్ని, తేనెను, జారపప్పు, ధనస్సు, బాణములు కాన్కగా విచ్చి నమస్కరించి దగ్గరగానున్న ఒక భయంకరాటవిని వ్రేలితో చూపుతూ "రాజా!" ఆ అడవియందు అడవిపందులధికం. అవి దురద తీర్చుకోవడానికి వృక్షానికి రాచుకోగా ఎంతటి మహావృక్షమైనా వ్రేళ్ళతో కదలి పోతుంది. ఏమాత్రం చప్పుడైనా అవి రోషంతో వెదురుపొదల్ని ఖండిస్తాయి. అవి కోపంతో వంటికి వంటికి రాపిడిచేయగా అందుండి వచ్చు నిప్పు వెదురును కాల్చివేస్తుంది. వేసవికాలంలో అవి నీటికై వచ్చి మడుగుల్లో త్రొక్కగా అందుండి వచ్చు బుడగలతోపాటు వాని శరీరం నుండి వచ్చిన చమురు నేతిజిడ్డువలె తేలుతుంది. తొండాలు లేవుగాని అవి ఏనుగులంత వుంటాయి. పందిగున్నలు వెదురులను విరచి పశువులు చొప్ప నమలినట్లుగా నమిలి వెదురుబియ్యాన్ని గ్రహిస్తాయి. రాజా రక్తం తగిలిన ఆయుధాలకు ఏదైనా చమురు పూయకున్న త్రుప్పుపట్టుతుంది. కాని వానిని వధించిన ఆయుధాలకు ఆ అవసరంలేదు. వాని మాంసం సలాకలకు గ్రుచ్చి కాల్చినపుడు అందుండి చమురు నిప్పులమీద పడి 'చుయ్యు'మను శబ్దం వస్తుంది. వాన యిపుడే వెలుసుటవల్ల వాని అడుగుల గుర్తులుంటాయి. బురదనేల దిగబడి పరుగిడలేవు. కాబట్టి బాణాలు, కుక్కలు

అవసరం లేకుండానే చేతిబాకుతో వాని దగ్గరకు వెళ్ళి చంపవచ్చు. అంతేగాక ఈ అడవిలోని దుప్పులు బలిసి వాని ఒంటిమీద మచ్చలన్నీ ఏకమై, కండ పెరిగి వాని కొమ్ములు ఒకటి రెండు నాలుగు ఎనిమిదై బరువెక్కి అడుగుతీసి అడుగువేయలేకుండ వుంటాయి. అడవిలో మగజింకలు వేటగాండ్రు వేసిన దీమాల్ని జూచి అవి తమతో పోరవచ్చిన య్రిపోతులని మధించి మచ్చకం పూని తమ కొమ్ములతో పొడిచి అది దీమము కాగా దానిని తన తలకు తగిలించుకొని పోతుంటాయి. వీపుమూపు ఒక్కటిగా బలిసిన ఆ జింకలు మనుష్యులు దగ్గరకు వచ్చినా లెక్కచేయక తమలో తాము పోరాడుతూ వుంటాయి. డేగ అవసరం లేకుండ కేవలం చూపుడుకోల సహాయంతో ఆ అడవిలోని పక్షుల్ని పట్టుకొనవచ్చు. ఉడుములు, పందికొక్కులు, తెల్లఎలుకలు మున్నగునవి ఆ అడవిలో బహుళములు. అవి నివసించుటకు త్రవ్వుకొన్న కలుగులతో ఆ అడవి జల్లెడవలె వుంది" అని చెప్పగా స్వరోచి పట్టణం లోకి పోయి వేటకాండ్రు ఏదినానికాదినం బాగుగా పరీక్షించి ఆకలిగొన్న వేళ తెలిసికొని ఎంతో నేర్పుతో మేతపెట్టినా, వారు పెట్టిన మేతకు నిరాకరించి మెడ వెనుకకు త్రిప్పి ముక్కుతో రెక్కల వెంట్రుకలను సరిచేసుకొనుచున్న డేగల్ని, మేతవేళ దాటుటచే ఆకలి హెచ్చి యరచుచు పొట్టలు వెన్నుల కంటుకొనిపోగా కంటికి గంతలున్న మొగం నటుయిటు త్రిప్పుచు పంజరంలో వున్న చిలుక, గోరువంక, పావురం మున్నగు పిట్టలు కూతలు విని వానిని చంపి తినవలెనని ఆ వంకకు ఎగిరి ఎగిరి కాలిదోరెపు దాళ్ళ బంధాలతో పోలేక తాము నిలుచుండెడి దండెపు వెదురుగడలకు ప్రదక్షిణం చేయునట్లు ఱెక్కలు విప్పార క్రిందికి మీదికి గిరగిర తిరిగి అతికష్టం మీద మరల వెనుకటివలె స్థిరపడుచున్న డేగల్ని బంగారు నీరానిన మెడపట్టెలతో శరీరాన క్రిమి లేకుండ పసుపునీట స్నానంచేయించి కట్టురాడులకు బంగారు గొలుసులతో గట్టబడి ఒడలు జాడించుకొనుచు సొగసైన మోరలెత్తి వనికట్టుచు ఎదుటనున్న గొఱ్ఱె పోతుల మీదికి దూక యత్నించుచు నిప్పులు రాలుచున్నట్లున్న కనుగ్రుడ్లతో, వ్రేలాడు నాలుకతో, తెరచిన నోళ్ళతో, సన్నని నడుములతో, వ్రేలాడు చెవులతో, బలిసి వెండిగుండులవలె నుండి కాలభైరవుని పట్టపుగుఱ్రములో యనునట్లున్న వేటకుక్కలను పరిశీలించి డేగలను, కుక్కలను తగినవానిని వేరుచేయించి వానికి తగిన సేవకుల పిలిచి తాను పలువిధాలగు కత్తుల్ని, అమ్ములపొదల్ని ధరించి ఉన్నతాశ్వంనెక్కి బయలుదేరాడు.

మరికొందరు వేటలో అటుఇటు పరుగెత్తునప్పుడు అడ్డంరాకుండ వుండే టట్లు జడల్ని చుట్టుగా జుట్టి ఆ చుట్టలు కదలకుండా దానిమీద సన్నని

బట్టలతో తలపాగలు జుట్టి ఒడలనంటి వుండునట్లు లాగులను దొడుగుకొని వానిపై గాసెకోకలు బిగించి, ఆ గాసెకోకలందు బాకులను దోపుకొని డేగలను చేతులపై ఎక్కించుకొని బయలుదేరినారు. శరీరబలంతో దిగ్గజాలనైనా చంపగల శక్తిగలవి, ఆకాశంలో ఎగిరే గరుత్మంతునినైన క్రిందివాలునంతవరకు తరిమిపట్టగలవి, గాలిసోకిన చాలు సూకరరూపుడైన మూకాసురుని కదలకుండ నిలుపునట్లు పసిగట్టగలవి, ఆదికూర్మంచిప్పనైనను చీల్చగలవి, "భౌభౌ" శబ్దాలతో కొండగుహలు మారుమ్రోగునట్లు చేయగలవి అయిన పులియుడు, బూచిగాడు, అసురుడు, పోతలరాజుడు, హనుమంతిగాడు, భైరవుడు, సాల్వుడు అనే కుక్కలు బయలుదేరాయి.

వీరివెంట ఆవూరి వేటగాండ్రు నడుమలకు బిగగట్టిన నీలిరంగు దట్టీల్ని గలిగి, ధనసుల్ని ధరించి, నొసటిమీద పడుతున్న చింపిరి, ఎర్రనైన జుట్టుతో మొలలో దోపుకొనిన కత్తులు గలవారై, నల్లని దేహాలుగలవారై, వేటయందుపయోగించు బాణాల్ని ధరించి బైలుదేరారు. ఇలా బయలుదేరిన వీరు మార్గమధ్యంలో కొంత సంభాషణ జరిపారు. వారి మాటలు వారి పరాక్రమానికి ప్రత్యక్ష నిదర్శనం. "ఓ రాజా! కోపంతో మెడమీద రోమాలు నిక్కగా మనమీద బడవచ్చిన పందిని ఎదురుగా పోయి పొడిచివైతును" అని ఒకడు, "లోకమంత కలిగిపోవునట్లు విసిరిపారవేయు ఏనుగునైన చెవిపట్టి ఈడ్చితెస్తాను" అని మరియొకడు అన్నారు. మరియొక మహావీరుడు ఏ పొదచాటుననో వుండి గర్జించు పెద్దపులిని ఆ పొదలోనికి పోయి పడగొట్టానన్నాడు. మరికొందరు వరాహాది మహాఘాతుక మృగాలనే సులభంగా చంపగల మాకు ఇవి యొకలెక్కలోనివా యని అంటూ రాజువెంట నడిచారు. వేటయందు మక్కువ వావని కొందరు ముదుసలలు వలలు వీపున వేసికొని రాజువెంట పరుగెత్తారు. ఇంత సన్నాహంతో స్వరోచి ఆ యెఱుకరేడు చూపిన అడవిలో ప్రవేశించాడు. ఇక్కడ అల్లసాని పెద్దన స్వరోచి, అతని పరివారం వేటాడిన విధానాన్ని కనుంకుకట్టినట్లు వర్ణించాడు. వేటలో వారవలంభించిన పద్ధతులు వర్ణించుట జూచిన "ఆంధ్రకవితాపితామహుడు" సాహితీ సమరాంగణ సార్వభౌమునితోబాటు వేటకు పోయినాడేమో అనిపిస్తుంది. ఇక్కడ పెద్దనార్యుడు వర్ణించిన వేట పద్ధతులు, అతడు రాయలసీమప్రాంతం వాడని చెప్పకనే చెబుతున్నాయి.

అనేక విధాలుగా వేటాడిన వేటగాండ్రు వేటలో మృగాల్ని, పక్షుల్ని అధికంగా చంపి అందరు చచ్చిపడియున్న లేళ్ళు, పందులు మున్నగు మృగాల మాంసపు ముక్కల్ని ఆకులతో పెద్దపొట్లాలుగా కట్టి వానిని గుదులుగా కట్టి చిక్కాలలో పెట్టి కొడవలి అందులో ఉంచుకొని తిరుగు ప్రయాణమునకు సిద్ధమైనారు.

చిదుగులలో మంటలు పుట్టించి, ఆ మంటలపై తాము చంపిన పులుల వెంట్రుకలు కాల్చివేసి దాని చర్మం ఒలుచుకున్నారు. ఆ అడవిలో పడిఉన్న ఏనుగు దంతాల్ని, వాని కుంభస్థలాల నుండి రాలిన ముత్యాల్ని గ్రహించారు. పులుల చర్మాలు, గోళ్ళు, ఏనుగు దంతాలు, ముత్యాలు తీసుకొనుట వారి శౌర్యానికి చిహ్నం. కైలాసపర్వతం నుండి ప్రవహిస్తున్న సెలయేళ్ళ దరులందు దట్టంగా పెరిగిన చెట్లనీడలకు చేరి చిన్నచిన్న గుంటలు త్రవ్వి అక్కడ లేతవి, వేడికి మెత్తబడనవి, మంచి వాసనగలిగిన గొల్లబిడ్డు తీగ ఆకులలో మాంసం వుంచి అందులో మంచిమాంసం ఉడికించి వండిన మాంసంతో మొదట రాజుకు పెట్టి తరువాత తమతమ వంతుల్ని తాము స్వీకరించారు. ఇట్లుండ అపశకునాలు, వానివెంట మంచిశకునాలు కలుగుట వెనువెంటనే అందుకు సంబంధించిన విషయం జరుగుతుంది. ఇక్కడితో మనుచరిత్రలోని వేటవర్ణన ముగిసింది.

చేమకూర వేంకటకవి "సారంగధరచరిత్ర"లో ప్రథమాశ్వాసం 62 పద్యం నుండి 113 పద్యం వరకు వేటను గురించిన వర్ణన వుంది. రాజరాజనరేంద్రుడు సభజేరియుండు సమయాన సామంతరాజులు కొలుస్తుండ పులితోలుతో శరీ రావయాల్ని కప్పుకొనినవారై, చేతులకు కడియాలు ధరించినవారై, ఎంపిరిజుట్టు గలవారై, గౌరవం పుట్టిపడుచుండ చెంచులు వచ్చి జల్లులు, పునుగు, జువ్వా దులు, కుందేటిపిల్లలు రాజుకు కానుకగా యిచ్చి రాజుతో "సామి వింజపుగొండ కాఉడవి పజ్జన్ గూడెముల్ గట్టి మీసేమంబే నతమిచ్చగోరి యాభూమిన్ వేటల దోటలందరిగి, మీ పున్నెన మాకచ్చికం బేమియు లేక సుగాన చుండుదుము నీవే దిక్కుగా. అయ్యా పరాకు మాని తెలియన్ వినుము. లచ్చనదేవుడున్, సీరామయ్య సీతమ్మ కొఱకై తొలుతన్ గనుపట్టు ముచ్చుబల్ దయ్యపుమూక జెందిన పొలాలకు మొన్నను వేటలాడకో జయ్యనబోయి యా యడవిచాయల గంటిమి అక్కడి పందులు క్రొవెక్కి ఏనుగులనైన నారయజూచును. యన్బో తులు కారుపోతుల చంపజూచును. జింకలు చిఱుతపులులపై పట్టట్టు దాటును. సామినుల్లములోన నేమనుచుందువో యేనొక డబ్బు దచ్చెదన్. వరాహముల వెంద్రుక యొక్కటి లెమ్మి తీసినన్ జల్లున వెళ్ళు బో చమురు విమ్మినగ్రోవిని చిమ్ముకైవడిన్" అని అనేకవిధముల ఆ అడవిలోని జంతువులగూర్చి వర్ణించి "మా దేవరవలె వేవేగమ సామి వేట విచ్చేయువయా" అని ఆహ్వానించగ రాజు "పొందు మీద నే వత్తు" నని వారికి పట్టుకోకలిచ్చిన వారానందంతో వెనుదిరిగారు. అంత రాజు వేటకు పోవలయునని జనులను ఆజ్ఞాపింప, వారు ఆనందంతో వేటకు కావలసిన ఆయుధాలు ధరించి, వలలు, ఉరులు, బోనులు, సివంగుల బండ్లు, డేగలను కొని రాజు వెంట బయలుదేరినారు. అలా అడవి

చేరిన వారు కావించిన వేటను వేంకటకవి తాను ప్రత్యక్షంగ ఆ వేటయందు పాల్గొని చూచినట్లుగా వ్రాశాడు. ఇట్లు వేటాడి భూవరేణ్యుండయ్యరణ్యాన అనేక మృగవిహగ ఝూటంబుల నిరాఘాటంబుగ గటడించి యాఖేటక విహారంబు చాలించి యెల్లెడలం దెల్లగా వ్రెళ్ళిన యిట్టిజింక, దుప్పి, కడితి, యెనుబోతు, కొండగొరియ, యేదుపంది, కుందేలు, గురుపోతు మొదలైన తినుమెకంబుల బొందులను, శకుంత బృందములను, బొందుగానొక్క కందువ బ్రోవు వేయించి యందుల పుళిందుల సొగయ మృగయాధి దేవతాప్రీతిగా చేయందగు కృత్యంబులు చేయించి యెల్లరకును సమాంశంబులుగా మాంసంబులు పంచి యిప్పించి, యుత్తమంబులగు దంతిదంత మౌక్తిక నికరంబులు, నికరంబులయిన కస్తూరీ సంకుమద పంకజులు బొంకంబులగు చమరవాల జాలంబులు నాదిగాగల సమస్త వస్తువులు గైకొని పుష్పరసాది బహుపదార్థంబులు సాకనిపుణ పాచక రచిత మహిత విశిత ఖండంబుల ఖండంబులుగా నేదిష్ట భూమండలాఖండల మండలంబులు నిండు వేడుకల వెల్పి మెప్పించిన నిష్టమృష్టాన్నంబులు సంతుష్టిగా దినుచు సఖలజనంబులు భుజియించి యయ్యేలమావుల క్రీనీడల కొండొకసేపు పరిశ్రమంబు వాయ విశ్రమించి ఇక్కడ పదినైదు రోజులు వుండవలెనని తలంచుచున్నాడను అందుకు తగిన ప్రదేశమేదేని కలదా యనిన అందులకా యాటవికులు 3 ఆమడలోనున్న ప్రదేశమును దెలిపి "అయ్యా! అందు దొల్లి సీతారాములు విహరించిరని పెద్దల వలన వినియున్నార"మని విన్నవించిరి. రాజు అమ్మహనీయస్థల శృంగారంబున అత్యంత సంతుష్టాంతరంగుడై అచ్చట విశ్రమించి, తత్తద్విశేషంబు లప్పటికింగనుచు, వనవిహారంబు సులుప్రుచు వినోద ప్రసంగంబులు ప్రొద్దుగడుపుచుండె" ఇంతటితో "సారంగధరచరిత్ర"యందు 'వేటవర్ణన' ముగియును.

పై మూడు గ్రంథాలలోని విషయాల్ని తైపారుచేసిన కొన్ని విషయాల్ని మనం గ్రహించవచ్చు. మూడు గ్రంథాలలోను రాజులకు వేటకు ఆహ్వానం వుంది. మానవుడు లోకంలో ఏదేని ఒక్క విషయాన్ని చూస్తే ఆ విషయంపై అనుభూతి కలిగిన ఆ అనుభూతి మానవుని కోర్కెగా మారి ఆ కోర్కెను తీర్చుకొనుటకు మానవుడు ప్రయత్నించుట లోకసహజం. ఉదాహరణకు ఒక గొప్పనాటకాన్ని చూసినపుడు నటనా ప్రియుడైన వ్యక్తి ఆ నాటకంలోని ఏదేని ఒక పాత్ర విషయంలో అనుభూతి చెందితే ఆ పాత్ర తాను నటింప ప్రయత్నిస్తాడు. అట్లే వేటయందు ఉత్సాహం కలిగిన దుష్యంతుడు పుళిందువల్లభులు తెచ్చిన కాన్కల్ని చూడగానే అతని హృదయమందు వేటాడాలనే కోర్కె కల్గింది. అంతమాత్రాన రాజు వేటను వ్యసనంగా గలవాడని అనుటకు

వీలులేదు. ఎందుకంటే దుష్యంతుడు పుళిందాదుల్ని చూసి క్రూరమృగాలుండి ఏరు, కాలువ కలిగిన ప్రదేశాన్ని చెంతమున్నది అనుట వలన క్రూరమృగాలు దగ్గర నుండి పుళిందాదులకు బాధ కలుగజేయు ప్రదేశం కలదాయని రాజు ప్రశ్నించుట వలన వేటయందు ఆసక్తి కలవాడేగాని వ్యసనంగా గలవాడు కాదని తెలుస్తుంది. గోరక్షణంబు.... కొరకును....." అనేది ఇందుకు తగిన ప్రోద్బలం. ఇక 'మనుచరిత్ర'లో స్వరోచిని వేటకు ఆహ్వానించుట ఎరుకరాజు వ్రేలుచూసి అడవిని చూపినాడనిన మరి స్వరోచి ప్రాంతానికి దగ్గరగా నున్నదని గ్రహించవచ్చు. సారంగధరలో చెంచులు తమకు గలుగు కష్టనష్టాలు తెల్పి రాజును వేటకు ఆహ్వానిస్తారు. దుష్యంతుడు వేటయందు ఆసక్తి కలవాడు కాగా, స్వరోచిని వేటకు ఎరుకరాజు ప్రేరేపింప రాజరాజనరేంద్రుని చెంచులు వేట ఆవశ్యకమని తెలియజేసారు. మరియొక విధంగా గ్రహిస్తే ప్రజలు ఎపుడు తమ బాధల్ని రాజుకు తెలియజేస్తే అపుడే వెంటనే వానిని తీర్చువాడు ఉత్తమరాజు. ప్రజల బాధల్ని తెలిసికొని వారు తెలియజేయకపోయినా వానిని తీర్చువాడు అంతకంటె ఉత్తముడు. అడవిప్రాంతము నందున్న వారు కానుకలు సమర్పించిన వెంటనే వారి బాధల్ని తీర్చదలచి వారు కోరగనే వారి కోరిక తీర్చదలచిన ఉత్తముడుగా దుష్యంతుడు కన్పిస్తాడు. ఈ మూడు గ్రంథాల లోని సాంప్రదాయం నేడు రాయలసీమ ప్రాంతం నందుండుట గమనార్హం. అడవిప్రాంతంనందున్న ఏ ఎరుకలవారో కనుపించగానే వేటపోవువారు ఎక్కడ వేట కనుకూలమైన ప్రదేశం గలదో వారిని విచారించుట సర్వసాధారణం. సామాన్యంగా వేట చలికాలంలో సాగదని నేటివారి అభిప్రాయం కూడ. ఎందుకంటే జంతువులు చలికి పొదలయందుండునే గాని బయటకురావు. వేసవికాలంలో అవి నీటికి సెలయేళ్ళ దగ్గరకు వస్తుంటాయి. వర్షం పడిన మరుసటిరోజు వేటాడబోవుట ఈనాడు కూడ అనేకులు వేటాడువారు అనుసరించు పద్ధతి. జంతువుల అడుగుజాడలు అనుకూలించునని వారి అభిప్రాయం. అడవికి దూరంగా తుపాకులు కలిగి వేటాడుట యందు ఆసక్తి కలిగిన వారి వద్దకు అడవిప్రాంతములోని ఎరుకలు వర్షం పడిన మరుసటిరోజు వచ్చి వేటాడ తీసుకొనిపోవుట నేటికిని వుంది. అడవిప్రాంతములోని వారి పైరుపంటలు, పశువుల్ని మృగాలు నాశనం చేయునపుడు వారు వేటకు ఆహ్వానించుట వుంది. ఈవిధమైన వేట ఎక్కువగా రాత్రులలో చేయుట జరుగుచున్నది. కాబట్టి నిశితంగా పరిశీలిస్తే మూడు గ్రంథాలలోను వేటకు ఆహ్వానించు పద్ధతి అసహజం కాదని తెలుస్తుంది.

ఇక వేట సన్నాహాలల్లో కూడ మూడు గ్రంథాలలో కొంత భేదమున్నా

అసహజంగా ఏ గ్రంథంలోను లేదని చెప్పవచ్చు. వేటాడ బయలుదేరిన దుష్యంతుని వెంట బయలుదేరిన కుక్కల పేర్లను తెలిపాడు పినవీరన. నేడు కూడ ఆ సంప్రదాయం వుంది. తాము పెంచుకున్న కుక్కలకు ఎరుకలు సహజంగా సింగడు, పులిగాడు అని పేర్లుపెట్టుకోవడం సహజమే. వేషభాష లందు పాశ్చాత్యుల ననుసరిస్తున్న నాగరికులు టామీ, గామీ అని కుక్కలకు పేర్లు పెట్టుకుంటున్నా అడవిప్రాంతములోని ఎరుకలు మొదలగువారు ప్రాచీన సాంప్రదాయానుసారంగా నేటికి సింగడు మొదలగు పేర్లు పెడుతున్నారు. ఇక తలవెంట్రుకల్ని ముడిగా కట్టుకోవడం, వెంట్రుకలు జారిపోకుండ వుండడానికి తలపాగ చుట్టడం, చీకటిలో సహితం క్రూరమృగాలు కనిపించుటకు తలపై లైటు కట్టుకోవడానికి వీలుగా తలను అమర్చుకోవడం నేటికి వుంది. ఎంత నాగరికత పెరిగినా, తుపాకులు ఎన్నిరకాలు వచ్చినా తుపాకులవారితో పాటు బాకులు, వలలు మొదలగునవి తీసికొని బయలుదేరువారు ఉన్నారు. రాయలసీమలో ప్రత్యేకించి 'కుందేటివల' 'చిరుతబోను' అనేవి అడవిప్రాంతంలోని ప్రతి ఇంట్లో వుంటాయి. ఈ విషయాలే శాకుంతలములో వర్ణింపబడ్డాయి. ఒకవిధంగా ఈ వర్ణన ఏ అతిశయోక్తి అలంకారం కాదని సంభావోక్తి యని నేడు వేటకు పొయ్యేవారిని చూస్తే తెలుస్తుంది. మనుచరిత్రకారుడు వేటకుక్కలనే గాక డేగల విషయం విపులంగా వర్ణించాడు. ఇందుకు బహుశా పెద్దనార్యుడు రాయలసీమ వాడగుటయే కారణమని ఊహించిన తప్పుగాదేమో. డేగలు మేపు పద్ధతి పెద్దన వర్ణించిన విధానానికి, నేడు రాయలసీమ పల్లెప్రాంతాలలో కొందరు వూరేడి వేటాడువారు. వూరేడిని పెంచు విధానానికి వ్యత్యాసం లేదు. క్రూరమృగాల్ని వేటాడేవారు, డేగవేటవారు కలసి వేటకు బయలుదేరారు మనుచరిత్రలో. కాని మృగాలవేట, పక్షులవేట ఒక్కమారుగా చేయుట అసాధ్యం. ఇది కల్పితం. వెంటనే పెద్దనార్యుడు వేట జరిగిన కొంత సమయానికి డేగవేటకాండ్రు విడిపోయి డేగవేట మొదలిడినట్లు దానిని సమర్థించాడు. వేటయందు ఆసక్తి చావని ముదుసలులు వేటకాండ్రతోపాటు వెళ్ళుట సహజమే. అంతకన్న సహజమైన వర్ణనను పెద్దన సృష్టించాడు. ఎల్లవేళల వేటాడుటలో కాలం గడిపిన వారికి చెట్లుచాటున వంగియుండుట వలలు, బోనులు వీపుపై మోయుట మొదలగు కార్యాలచే గూని వస్తుంది. ఈ వర్ణన పెద్దన వేటకాండ్రను ప్రత్యేకంగా చూపివుంటాడని చెప్పకయే చెపుతుంది. "కుందేటి వల మోసి మోసి వీనికి గూని వచ్చింది" అనే మాటల్ని రాయలసీమ అడవిప్రాంతమందు నేటికి మనం వినవచ్చు. మార్గమధ్యంలో స్వరోచితో వారు జరిపిన సంభాషణ సహజంగా వుంది "మొన్న నాటుతుపాకితోనే కణితి తల ఎగరగాల్చినాను. నాకీ

వేట ఒక లెక్కా" ఇటువంటి మాటలు అనేకాలు నేటికి వినిపిస్తుంటాయి. మనుచరిత్రకారుడు అడవి జంతువుల్ని వర్ణించిన తీరు అక్కడ స్వరోచి వేటాడుటకు పన్నిన ఉపాయాలు ఎంతో సహజంగా వున్నాయి. మనిషి చెట్టు ఆకుల్ని చుట్టుకొని తానొక చెట్టువలె వుండి వేటాడుట నేటికి వుంది.

సారంగధర చరిత్రలో వేట సన్నాహం వర్ణించినంత విపులంగా వేటాడ టాన్ని వర్ణించలేదు. వేట సన్నాహాలు పై గ్రంథంలో వలెనే సారంగధర చరిత్రలో సహజంగ వున్నాయి. వేటకు ఆహ్వానించిన తీరు ఎంతో సహజంగ వుంది. "దాని వెంట్రుకలు పెరికిన వచ్చునది రక్తము కాదు చమురు" అని మూడు గ్రంథాలలోను వుంది. నేడు కూడ "దాని శరీరంలో రక్తమెక్కడిది క్రొవ్వెక్కిన దాన్ని గ్రుద్దితే పగిలి చమురు వస్తుంది" అనే ప్రయోగం బహు ళంగ వినబడుతుంది. ఇక మనుచరిత్రకారుడు వ్రాసినట్టు "ఆయుధములు త్రుప్పుపట్టకుండుటకు చమురు పూయనవసరం లేదు" అనే ప్రయోగం నేడు వాడుకలో వుంది.

భిన్నప్రాంతాల్లోనే గాక, భిన్నకులాలవారి మధ్య ఏకప్రాంతంలో ఏకకాలంలో ధ్వన్యుచ్చారణ వారి కులాన్నిబట్టి కూడ మారవచ్చు అనే విషయం వెంకటకవి సారంగధరచరిత్ర ద్వారా తెలిసికొనవచ్చు. చేమకూర అడవిప్రాంతంవారి మాటలలోని యాసను అలాగే గ్రహించినట్లు తెలుస్తుంది. "సామి నేనొక దబ్బు దబ్బెదన్" అనేది వ్యావహారికం. ఈనాడు ఇటువంటి మాటలు మనకు వినిపిస్తాయి. పల్లెప్రాంతాలలో "సామి నా వాగుడినుకో" మొదలగు మాటలు వున్నాయి. వేటాడువారి వేషాలగూర్చి వ్రాయునపుడు ముగ్గురు కవులు కూడ చింపిరిజుట్టును, పులిచర్మాలు ధరించడాన్ని, ఏనుగుచర్మం వలె మెరియు శరీరాన్ని ఎర్రని కన్నుల్ని వర్ణించియుండుట గమనింపదగిన విషయం.

మనుచరిత్రకారుడు, సారంగధర చరిత్రకారుడు తెలుపని మరియొక సహజ విషయాన్ని శాకుంతలకారుడు తెలియజేసాడు. వేటాడ బయలుదేరిన రాజు గొల్లపల్లె చేరగా అక్కడ వుండే ప్రజల విన్నపాలు, వారు రాజును సత్కరించుట ఎంతో సహజంగా వర్ణించాడు. నేడు సహితం ఉన్నత కుటుంబంలోని ఒక వ్యక్తి అడవిప్రాంతాల్లోని పల్లెకు వేటాడు నెపంతోగాని, అడవిప్రాంతమందున్నవారి వద్ద ఔషధాలకుగాని వెళ్ళిన వారి మాటలు, చర్యలు శాకుంతలములోని గొల్ల పల్లెవారివలె వుంటాయి. "సామి మీరొచ్చినారా! ఒరే సింగా సామొచ్చినాడు మంచమేయర, మల్లిదానిని మజ్జిగతెమ్మన్రా! సామొరికేదో దయగలిగినాది మా కొంపలకొచ్చారు. పనుండె పరుత్తోచ్చేవాళ్ళంగా సామి మీరొచ్చినా రింత దూరం ఈపూటాగండిసామి లచ్చిగాడడవి పోయిండు సామి వాడో

తెసామి దానమ్మ ఒక్కటైన కొట్టితెస్తాడు సామి. ఎపుడు పల్లొచ్చినా సామి ఆ తల్లి కడుపుసూచి కూడెట్టుతాది, ఆతల్లి కడుపు సల్లంగ మీరుట్టారు సామి ఒక్కపూటంటె ఒక్కపూటాగండిసామి. చీకటడతాదనుకోకు సామి, తోడొచ్చేంసామి. కనిది మూలగా సామి యేరికేమైంది సామి. మాటారుస చెప్పి ఏమడేల్ని పంపినా మీపాదల చెంతకు దెచ్చేవాళ్ళంగ సామి. నాయాల్ది దానికి మీరింత దూరం నడిచేరా సామి. ఒరే బుచ్చిగ సుబ్బులోడింటికాడ కడితి మూలగుందేమో చూడరా సామి కోరిండు. లేకున్న యెల్లి దాన్నడగరా అదెట్టే వుంటాది" ఇట్లా సంభాషణతో గౌరవ మర్యాదలుట్టిపడేటట్లు చేతులు కట్టుకొని మగ, ఆడ భేదం లేకుండ ఆ వ్యక్తికి నమస్కరించి, ఆ వ్యక్తి ముందు నిల్చొని మాట్లాడటం రాయలసీమ ప్రాంతంలో కనిపిస్తుంది. అంతేగాక మాండవ్యుని మాటలవల్ల వారు కప్పం కట్టువారుకారని తెలుస్తుంది. అనగా అడవి ఆధారంగ బ్రతుకువారు ఎల్లవేళల రాజుక్షేమం కోరి ఒకవిధంగ గూడచారులై నివసిస్తూంటారేగాని పన్నులు చెల్లించేవారు కాదని తెలుస్తుంది.

వేట ముగిసిన పిమ్మట మాంసాన్ని అక్కడే వండుకొను పద్ధతి మనుచరిత్ర, సారంగధరచరిత్రలలో వర్ణింపబడివుంది. నేడుకూడ కొందరు వేటకు పోయేవారు ఒక్కొక్కమారు బియ్యం మొదలగు ఆహారధాన్యాల్ని తీసికొని వంటవాళ్ళతో సహా వెళ్ళి అక్కడే సెలయేటి సమీపాల్లో వంటచేసుకుంటారు. పెద్దన మాంసాన్ని వేయడానికి ఆకులు ఎలా ఉండాలో వర్ణించాడు. మనుచరిత్ర చదవని ఎందరో వేటగాండ్రు ఇట్టి ఆకుల విషయాన్నే పేర్కొనడం గమనార్హం. ఇక రాజరాజనరేంద్రుడు విశ్రమింపదలచిన చోటు సీతారాములు విహరించిన చోటని చెంచులు తెలియజేయుట కేవల కవుల అభూతకల్పన కాదు. ఆనాడు ప్రచారంలో వుండే విషయాలే కావ్యాలల్లో చోటుచేసికుంటాయి.

చిత్తూరుకు సమీపంలో ఉన్న అవణికొండ దగ్గర ఒక రాతిగుండు ఒకప్రక్క పేడు లేకుండ వుంది. దానిని అచటి ప్రజలు రాముడు అశ్వమేధయాగం చేసినపుడు లవకుశులు ఆ గుర్రాన్నిపట్టి ఆ గుండుకు కట్టగా, గుండులోని కొంతభాగం ఆ గుర్రం తినివేసిందని చెపుతారు. నేటికి అక్కడ పూజలు, పునస్కారాలు జరుగుతున్నట్లు తెలుస్తుంది. ఎక్కడి రాముడు! ఎక్కడి అవణికొండ? ఇట్లే వాడుకలో వున్న విషయాల్ని గ్రహించి చేమకూర సారంగధరచరిత్రలో చేర్చివుంటాడు.

శాకుంతలము నందలి గొల్లల గౌరవమర్యాదలను, మనుచరిత్రలోని వేటతీరును, సారంగధరచరిత్రలోని భాషను గ్రహించి పరిశీలించిన ప్రాచీనకాలంలో మన పల్లెప్రాంతాల్లోని వేషభాష, ఆచారవ్యవహారాలు కొంతవరకు తెలుస్తాయి.

# 10. శ్రీనాథుని శివరాత్రి మహాత్మ్యము

"శివరాత్రి మహాత్మ్య" కావ్యం శ్రీనాథుని ప్రాయం ఉడిగిన తర్వాత వ్రాయబడింది. ఈశ్వరుని మహత్తును వర్ణించే గ్రంథాలు తెలుగు సాహిత్యంలో అనేకాలున్నాయి. ముఖ్యంగా శివకవి యుగంలో వచ్చిన గ్రంథాలు దాదాపు అన్నీ కూడా శివుని ఔన్నత్యాన్ని ప్రదర్శించేవే.

క్షేత్ర మహాత్మ్యాల్ని తెలిపే గ్రంథాలకు సాహిత్యంలో కొరవలేదు. కానీ ఒక "రాత్రి" మహాత్మ్యాన్ని ఆధారంగా చేసుకొని తెలుగులో గ్రంథ నిర్మాణం గావించిన కీర్తి శ్రీనాథునికే దక్కింది. శ్రీనాథుని ఈ శివరాత్రి మహాత్మ్యానికి మూలం స్కాందపురాణాంతర్గతమగు ఈశాన సంహిత. ఈ గ్రంథాన్ని శ్రీనాథుడు రాజులకూ, మంత్రులకూ కాకుండా శ్రీశైలంలో భిక్షవృత్తి యతీశ్వరుని మూల భృత్యుడైన పువ్వుల శాంతయ్యకు అంకితమిచ్చాడు. ఈ గ్రంథాన్ని మొదట ప్రచురించిన కర్రి సాంబమూర్తి శాస్త్రి గారు నాలుగాశ్వాసాలే ప్రకటించారు. తర్వాత బిరుదరాజు రామరాజుగారు తనకు లభించిన గ్రంథంలో ఐదు ఆశ్వాసాలున్నాయని పూర్తి గ్రంథాన్ని ప్రకటించ రు.

స్కాంద పురాణంలో 'ఈశాన సంహిత'లో 'శివరాత్రి మహాత్మ్య' కథ ఉంది. పార్వతి ఏదైనా ఒక గొప్ప వ్రతాన్ని గూర్చి చెప్పమన్నప్పుడు పరమేశ్వరుడు శివరాత్రి వ్రతాన్ని గూర్చి పార్వతికి తెలిపాడు. పార్వతి ఆ వ్రత విధానాన్ని కుమారస్వామికి తెలిపింది.

### శివుడు పార్వతికి చెప్పిన శివరాత్రి కథ :

వరాహావతారం దాల్చిన విష్ణువు భూమిని ఉద్ధరించి క్షీరసాగరం మీద విశ్రమించి యుంటాడు. బ్రహ్మ తాను సృష్టించిన ప్రపంచాన్ని చూసి గర్వంతో మహావిష్ణువును క్షీరసాగరం మీద నుండి లేవమంటాడు. ఎవరు గొప్ప అనే విషయంలో వారిద్దరి మధ్య వాగ్వివాదాం ఏర్పడుతుంది. అప్పుడ శివుడు లింగ రూపంలో వెలుస్తాడు. బ్రహ్మదేవుడు హంసరూపం దాల్చి ఆ లింగాకారం యొక్క ఊర్ధ్వ భాగాన్ని తెలుసుకొని రావడానికి బయలు దేరుతాడు. విష్ణువు వరాహరూపాన్ని దాల్చి లింగాకారం యొక్క అధోభాగం తెలుసుకోవడానికి

వెళ్తాడు. ఆది అంతాల్ని బ్రహ్మ విష్ణువులు తెలుసుకోలేకపోతారు. అప్పుడు ఈశ్వరుడు ప్రత్యక్షమై మీరిరువురు ఒకరిని ఒకరు అంతం చేసుకోవడానికి అస్త్రాలు ధరించారు. కాబట్టి మీ తేజస్సులు నశించాయి. మీరు మీపదవుల కనర్హులు, మీరు మాఘ బహుళ చతుర్దశినాడు శివరాత్రి వ్రత మాచరిస్తే తిరిగి మీ పదవులు మీకు లభిస్తాయని చెప్తాడు. ఆ శివరాత్రి వ్రత మహాత్మ్యానికి ఉదాహరణగా సుకుమారుని కథ చెప్తాడు.

## స్కాంద పురాణంలో సుకుమారుని కథ :

సింధూనది తీరంలో కుబ్జకమనే పట్టణాన్ని ఒక రాజు పరిపాలిస్తుంటాడు. వ్యవహార విచారార్థం నయకోవిదుడైన సుకుమారుడనే బ్రాహ్మణున్ని అతడు నియమిస్తాడు. కామోద్దీపితుడైన ఆ సుకుమారుడు కులస్త్రీల్ని చెరుస్తాడు. రాజు సుకుమారునికి దేశ బహిష్కరణ శిక్ష విధిస్తాడు. హూణమండలం చేరిన సుకుమారుడు స్నానార్థం వచ్చిన ఒక చండాల కన్యని మోహిస్తాడు. మాంస, మద్య, మైధున ప్రీతుడై సుకుమారుడు దారులు గొట్టి చండాల స్త్రీతో కలిసి బ్రతుకుతుంటాడు. ఆ చండాలాంగన మరణాంతరం ఆమె కూతుళ్ళతో సంగమించి ఇద్దరు కొడుకుల్ని కంటాడు. దారిన వెళ్ళే నూర్గురు బ్రహ్మణుల సమూహాన్ని వధించి ధనాన్ని అపహరిస్తాడు. రాజా వార్త విని అతన్ని చంపమని దూతల్ని పంపుతాడు. అది తెలిసిన సుకుమారుడు కిరాత దేశానికి పారిపోతాడు. కిరాతదేశంలో మణిక్ప్రదము అనే పురంలో నాగేశ్వరాలయంలో శివరాత్రి వ్రతాన్ని చూస్తాడు. తరువాత ఇతడు మరణించగా శివభటులు యమభటుల్ని కాదని, ఇతన్ని శివలోకానికి తీసుకొనిపోతారు. యముడు శివుడి దగ్గరకు వచ్చి సుకుమారుడు శివలోకానికి రావటానికి ఎట్లా అర్హుడని ప్రశ్నిస్తాడు.

శివరాత్రి వ్రతాచరణం చూచుటచే సుకుమారుడు శివలోకానికి రావడానికి అర్హుడయ్యాడని శివుడు చెప్పి, నీవు కూడా శివరాత్రి వ్రతాన్ని ఆచరించమని యమునికి చెబుతాడు. యముడు ఆ వ్రతాన్ని ఆచరించాడు. మీరు కూడా ఆ వ్రతాన్ని ఆచరించి మీ పదవుల్ని తిరిగి పొందమని శివుడు బ్రహ్మ విష్ణువులకు చెప్పినట్లు శివుడే పార్వతికి చెబుతాడు.

శ్రీనాథుని "శివరాత్రి మహాత్మ్యంలో" శివరాత్రిని గూర్చి శివుడు బ్రహ్మ; విష్ణువులకు చెప్పినట్లుగా ఉంది. బ్రహ్మ, విష్ణువులు తమలో ఎవరు అధికులు. అనే విషయంపై వాదోపవాదాలకు దిగినారు. ఆ సమయంలో శివుడు వారిమధ్య మహాస్తంభ రూపంలో ఆవిర్భవించాడు. ఆ స్తంభం ఆద్యంతాలు తెలుసుకోవడానికి ప్రయత్నించిన బ్రహ్మ విష్ణువులు. విఫలులౌవుతారు. అప్పుడు

శివుడు శివరాత్రి మహాత్మ్యాన్ని వారికి చెబుతాడు.

## శివరాత్రి మహాత్మ్యంలో సుకుమారుని కథ :

శివరాత్రి మహాత్మ్యం పూర్తిగా సుకుమారుని చరిత్రే. సుకుమారుడు మంత్రి యజ్ఞదత్తుని కొడుకు. ఇతడు జూదరి, తాగుబోతు, వ్యభిచారి; సర్వ అవలక్షణాలకు నిలయమైనాడు. ఇతని నిర్వాకములు భరించలేక రాజు ఇతనికి దేశ బహిష్కరణ శిక్ష విధిస్తాడు. అడవి మార్గంలో పయనించే సుకుమారుడు ఒక చండాల కన్యను చూసి మోహించి ఆమెతో రహస్యంగా కాపురం పెట్టాడు. దారి దోపిడి దారుగా మారతాడు. చివరకు ఆచోటును వదలి ఆమెను తీసుకొని వలసపోతాడు. ఆ చండాలాంగన ఇద్దరు కుమార్తెల్ని కని చనిపోతుంది. సుకుమారడు ఆ క్షుమార్తెలతో కూడా కాపురం చేస్తాడు. ఆ ఊరి వాళ్ళు వాన్ని వెళ్ళగొడతారు. మాఘమాసంలో ఒకనాడు పువ్వులకోసం వెళ్ళిన సుకుమారుడు శివాలయంలోకి వెళతాడు. ఆరోజు శివరాత్రి. భక్తులు శివపూజ చేస్తున్నారు. అది సుకుమారుడు చూశాడు. కొన్నాళ్ళ తర్వాత అతడు మరణించగా శివదూతలు వచ్చి యమదూతల్ని జయించి సుకుమారున్ని కైలాసానికి తీసుకువెళ్తారు. యముడు శివుని వద్దకు వచ్చి ఆ దుష్టుడికి శివసాన్నిధ్యమెల్లా వచ్చిందని ప్రశ్నిస్తాడు. సుకుమారుడు శివిరాత్రి ఉత్సావాన్ని చూచుట చేత శివ సాన్నిధ్యం వచ్చిందని నీవు కూడా శివరాత్రి వ్రతాన్ని చేయమని యమునికి శివుడు చెబుతాడు. యముడు శివరాత్రి వ్రతాన్ని చేస్తాడు. ఈ కథను శివుడు బ్రహ్మ విష్ణువులకు చెప్పాడు.

ఈశాన్య సంహితలోని కథకు శ్రీనాథుని శివరాత్రి మహాత్మ్య కథకు భేదం లేదనే చెప్పాలి. ఈశాన్య సంహితలో పార్వతి కోరగా శివుడు వ్రత మహాత్మ్యాన్ని చెప్పడానికి ప్రారంభిస్తాడు. తానే ఒకనాడు ఈ వ్రతాన్ని గూర్చి యమునికి చెప్పినట్లు, తరువాత బ్రహ్మ విష్ణువులకు చెప్పినట్లు పార్వతికి చెబుతాడు.

శ్రీనాథుని కావ్యంలో శివుడు తాను యమునికి చెప్పిన శివరాత్రి వ్రత మహాత్మ్యాన్ని బ్రహ్మ విష్ణులకు చెబుతాడు.

ఈశాన్య సంహితలో సుకుమారుడు అనే బ్రహ్మణున్ని రాజు వ్యవహార విచారార్థం నియమించినట్లుంది. శ్రీనాథుని కావ్యంలో సుకుమారుడు ఒక మంత్రి పుత్రుడు. ఈ మార్పు కావ్యానికి ఒక శోభను కలిగించింది. రాజు వ్యవహార విచారార్థం నియమించినవాడు. కామోద్దీప్తుడైనాడంటే రాజు నియమితం చేసేటప్పుడు జాగ్రత్తలు తీసుకోలేదని రాజుపై అపవాదుంటుంది.

అంతేగాక అటువంటి వాడిని రాజు నియమించినాడనుట కూడా మంచిది కాదు. అందుకే శ్రీనాథుడు సుకుమారున్ని మంత్రి పుత్రునిగా మార్చాడు. మంత్రిపుత్రుడు అనడంలో అతనికి రాజ్యంలో అన్ని హక్కులు వుండేవి. తండ్రి పలుకుబడితో తాను విరవీగాడు. మంత్రి పుత్రుడు కాబట్టి ధనానికి కొదవలేదు. శ్రీనాథుని ఈ మార్పు కావ్యానికి ఒక శోభను చేకూర్చింది.

**లింగపురాణంలో శివరాత్రి :**

"శివరాత్రి మహోత్మ్యం " లింగపురాణంలో కూడా చెప్పబడింది. లింగ పురాణంలో కూడా పార్వతి ఒక గొప్ప వ్రతాన్ని గూర్చి చెప్పమని పరమేశ్వరుని కోరుతుంది. అప్పుడు శివుడు శివరాత్రి వ్రతాన్ని గూర్చి చెప్తాడు. ఇందులో బ్రహ్మ విష్ణువుల చరిత్ర లేదు. ఒక బోయ విషయం ఇందు వర్ణితం. శివరాత్రిని గూర్చి లింగపురాణంలో ఇలా ఉంది.

ఒక బోయవాడు ఒక కోమటి వద్ద అప్పుచేసి తప్పించుకు తిరుగుతుం టాడు. శివరాత్రినాడు ఆ కోమటి బోయవాన్ని శివాలయంలో బంధిస్తాడు. ఆకారణంగా ఆ బోయవాడు ఉపవాసముంటాడు. భక్తులు ఆలాపించే శివస్తో త్రాల్ని వింటాడు. తర్వాత కొందరు భక్తులు కోమటికి అప్పు చెల్లించి వాన్ని ఋణ విముక్తున్ని చేస్తారు. మరుసటి రోజు వేటకు వెళ్ళిన బోయ అడవిలో హేళనగా తాను ఆరాత్రి శివభక్తుల నోటిద్వారా విన్న "శివ" "శివ" శబ్దాల్ని ఉచ్చరిస్తుంటాడు. సాయం సమయమైనా వాడికి ఏ మృగమూ లభించలేదు. ఆరాత్రి సింహ శార్దూలాలకి భయపడి వాడొక వృక్షాన్ని అధిరోహిస్తాడు. కాకతాళీయంగా అదోబిల్వ వృక్షమై ఉంటుంది. ఆ వృక్షం క్రిందనే ఒక శివలింగం ఉండడం బోయకు తెలియదు. వృక్షాన్నధిరోహించడానికి అడ్డుగా ఉండే ఆ బిల్వ వృక్షపు కొమ్మల్ని వాడు విరిచి క్రింద వేస్తాడు. అవి ఆ శివలింగంపై పడ్డాయి. అంటే వాడికి తెలియకుండానే బిల్వ పత్రాల పూజ చేసినట్లైంది. చెట్టుపైనున్న బోయ ఆ రాత్రంతా నిద్రపోతే పడిపోతాననే భయంతో మేల్కొనే ఉంటాడు. అప్పుడప్పుడూ ఉబుసుపోకకు శివభక్తులు గావించిన "శివ" "శివా" అనే శబ్దాల్ని హేళనగా అంటూ కాలం గడిపాడు.

రాత్రి నాల్గవ ఝామున ఒక జింక నీటికోసం అటుగా వచ్చింది. బోయ దాన్ని చంపాలని విల్లు సంధిస్తాడు. ఆశ్చర్యకరంగా ఆ జింక మనుష్యభాషలో "నన్నేల చంపెదవు?" అని ప్రశ్నిస్తుంది. సమాధానంగా బోయ "నేను, నా తల్లి కుటుంబం ఆకలితోనున్నాం. మా ఆకల్ని తీర్చుకొవడానికి నిన్ను వధిస్తాను. కానీ నీవు మాటల్ని ఎట్లా నేర్చావని?" ప్రశ్నిస్తాడు. అందుకు జింక నేను

'రంభను. హిరణ్యాక్షుడనే దానవున్ని ప్రేమించి వాడి మైకంలో శివుని కొలువు మర్చిపోయాను. కోపగించిన శివుడు 12 సంవత్సరాలు మమ్మల్ని మృగాలుగా జీవించమని శపించాడు. నేను పూర్ణ గర్భవతిని. ఇంకొద్ది సేపట్లో మరొక జింక ఇటు వస్తుంది. దాన్ని చంపి దాని మాంసం తిను. లేదా నేను నావసతికి పోయి ప్రసవించి తిరిగి వస్తాను. అప్పుడు నన్నే భుజించు' అని అనేకవిధాల శపథంచేసి తిరిగి వెళ్తుంది. మరికొంత సేపటికి మరొక జింక అటుగా వస్తుంది. బోయదానిపై బాణం ఎక్కుపెట్టాడు. అంత ఆ జింక 'నేను నాభర్తను వెదక్కుంటూ వచ్చాను. ఇంకొద్ది సేపట్లో బలిసిన జింక ఒకటి ఇటుగా వస్తుంది. దాన్ని చంపి తిను. లేదా నావసతికి పోయి తిరిగి వస్తాను' - అని శపథం చేసి వెళ్తుంది.

కొంత సేపటికి బలిసిన ఒక జింక వస్తుంది. దాన్ని చంపడానికి బోయ పూనుకుంటాడు. ఆ జింక ఈ బోయ తన పెంటి జింకల్ని కూడా చంపి వుంటాడని భావించి విలపించింది. దాంపత్య లాభాల్ని తలచి విరహాన్ని గురించి సుదీర్ఘంగా దుఃఖిస్తుంది. తర్వాత బోయతో నీవు పెంటి జింకల్ని చాశావా? అని అడుగుతుంది. బోయ జరిగిన వృత్తాంతం చెప్పాడు. ఈ జింక కూడా గృహానికి పోయి మరలా వస్తానని శపథంచేసి వెళ్తుంది. గృహానికి వెళ్ళిన మగజింక పెంటి జింకతో క్రీడించి వ్యాధుని కాహారంగా పోవడానికి సిద్ధపడింది. ఆ రెండు పెంటి జింకలు కూడా భర్తననుకరిస్తాయి. ఆ జింకల ప్రవర్తన బోయకు కనువిప్పు కలిగిస్తుంది. ఇక జీవితంలో జీవహింస చేయనని ప్రతిన చేస్తాడు. ఒక దివ్య విమానం వచ్చి జింకల్ని, బోయను సశరీరంగా శివలోకానికి తీసుకొని వెళ్ళింది. కృష్ణమృగం ఆకాశంలో నక్షత్రంగా నిలిచింది. దాన్నే నేడు 'మృగశీర్ష' అంటున్నాం. దాని వెనుక ఉండే నక్షత్రమే బోయనక్షత్రం. ఇది పార్వతికి పరమేశ్వరుడు చెప్పిన కథ. ఈ కథకు శ్రీనాథుని శివరాత్రి మహాత్మ్య కథకు సంబంధంలేదు. లింగపురాణంలో శివరాత్రి జాగారం ఒక వ్రతంగా చెప్పబడింది.

ఈశాన సంహితలోని కథకు శ్రీనాథుని శివరాత్రి మహాత్మ్యకథకు భేదం లేదు. గాని లింగపురాణంలో కథకు వీటితో సంబంధంలేదు. ఈశాన సంహిత, శివరాత్రి మహాత్మ్యకథ బ్రహ్మ విష్ణువులకు కూడ ఈశ్వరుడే ప్రభువని నిరూపించ ప్రయత్నించాయి.

లింగపురాణం కథ అట్లుగాక ఒక శివరాత్రి మహాత్మ్యాన్ని మాత్రమే చెప్పింది. ఏది ఏమైనా శివరాత్రినాడు ఉపవాసముండి రాత్రి జాగారంచేసి శివుని ధ్యానించి, బిల్వ పత్రాలతో పూజచేసిన సర్వపాప నివారణ కలుగుతుందని పై మూడు కథల సారాంశం.

# 11. మనుచరిత్ర - భారతీయ సంస్కృతి

*అంకముఁజేరి శైల తనయాస్తన దుగ్ధములాను వేళ బా*
*ల్యాంక విచేష్టఁదొండమున నవ్వలి చన్ గబళింపఁబోయి యా*
*వంకఁగుచంబుఁగాన కహి వల్లభ హారముఁగాంచి వే మృణా*
*ళాంకుర శంక నంటెడు గజాస్యునిఁగొల్తు నభీష్ట సిద్ధికిన్.*

ఈ పద్యము 'మను చరిత్ర' అని మనం పిలిచే స్వారోచిష మను సంభవము లో పెద్దన గారు చేసిన గణపతి ప్రార్థన. పార్వతీ దేవి ఒడిలో పడుకొని ఆమె స్తన్యాన్ని తాగుతున్న బాల వినాయకుడు, ఆతల్లి మరొక వైపు నుండు కుచమును తన తొండముతో పట్టుకోవాలని చూస్తున్నాడు. అలా అనుకోవడానికి కారణము బాల్యచేష్ట. ఇది సహజము. చిన్న పిల్లలు తల్లి దగ్గర పాలు త్రాగేటపుడు తెలియని ఆనందముతో మునిగి పోతారు. ఆ ఆనందపు మైకంలో కాళ్ళు ఆడిస్తూ చేతితో తల్లి మరొక స్తనాన్నో, లేక ఆమె మెడలోని హారాన్నో పట్టుకొని ఆడుతుంటారు. అదే బాల్యంక విచేష్ట. ఈ పద్యంలో కూడ వినాయకునిది అటువంటి విచేష్టే. కాకపోతే యిక్కడ వినాయకునికి తల్లి మరొక స్తనాన్ని తన తొండముతో కబళించాలని చూచినపుడు ఆవైపు స్తనము కనిపించలేదు. అందుకు బదులు పరమేశ్వరుని హారమైన పాము ఆ వినాయకునికి కనిపించింది. ఆ పామును మన వినాయకుడు లేత తామర కాడ అనుకున్నాడు. ఆ విధమైన భ్రమలో నుండు వినాయకునికి పెద్దన నమస్కరించి నాడు. ఆ నమస్కారము కూడ తన అభీష్టము నెరవేరడానికి చేసాడు. ఏమిటి తన అభీష్టము? "స్వారోచిషమను సంభవము" అనే కావ్యం పూర్తి కావడం. ఇది ఈ పద్యములో మనకు స్పష్టంగా కనిపించే భావము. "కావ్యం కప్పి చెప్పబడుతుంది - విమర్శ విప్పి చెప్పబడుతుంది"- అనే మాటను అనుసరించి ఈ పద్యాన్ని మరికొంత లోతుకు వెళ్ళి పరిశీలిస్తే కావ్యంలోని కథను సూచన ప్రాయంగా ఎర్రన యిందులో పొందు పరచినాడని స్పష్టమవుతుంది.

మను చరిత్రలో యితివృత్తము సుపరిచితమే. నిష్ఠాగరిష్టుడైన ప్రవరుని వరూధిని కామించడము, ప్రవరుడు అందుకు నిరాకరించడము, మాయా

ప్రవరుడు వరూధినితో సుఖాల్ని అనుభవించడం, వరూధిని మాయా ప్రవరున్ని ప్రవరుడుగా భ్రమించడం కావ్యములోని ప్రధాన అంశం.

కావ్యంలో వరూధిని యవ్వనము కారణంగా, మాయా ప్రవరున్ని ప్రవరుడని భ్రమించింది. ఈ ప్రార్థనా పద్యంలో బాల్యాంక విచేష్టన్ వినాయకుడు పామును తామర కాండ అని భ్రమించాడు. కావ్యంలో ఆ వరూధిని మనముడే మనువు అయినాడు. ఈ పద్యంలో పెద్దనకు ఆ వినాయకుడే అభీష్టసిద్ధిని ప్రసాదించాడు. ఆ అభీష్టం కేవలం కావ్య పరిసమాప్తి మాత్రమే కాదు. తరతరాలకు తన కావ్యం ద్వారా భారతీయ సంస్కృతిని అందివ్వడం పెద్దన లక్ష్యం. ఆ లక్ష్యసాధనే పెద్దన అభీష్టం. అది నెరవేర్చినవాడు వినాయకుడు.

ఈ విధంగా మన తెలుగు సాహిత్యం ఆది నుండి కూడ ఒక ప్రత్యేకమైన పద్ధతిలో చెప్పబడుతూ వస్తూవుంది. లభించినంత వరకు అనంతరమైన తెలుగు సాహిత్యం నన్నయ్యతో మొదలైంది అని చెప్పవచ్చు. నన్నయ్య నుండి నేటి వరకు తెలుగు సాహిత్యంలో భిన్న ప్రక్రియలు వెలసాయి. ఆయా కాలానికి అనుగుణంగా సాహిత్యంలో మార్పులు వస్తూనే వున్నాయి. జీవమున్న కవిత్వం కాల గర్భంలో కలసి పోకుండా తన స్థానాన్ని తాను పదిల పరచుకుంటూ వస్తూనే వుంది. రసహీనం, జీవము లేని సాహిత్యం కాలగర్భంలో కలసి పోయింది.

నన్నయ సృష్టించిన భారత రచనా విధానం పైన పాల్కురికి రచన ఒక విప్లవం. పాల్కురికి రచన విధానంపై. తిక్కనది ఒక విప్లవం. అట్లే శ్రీనాథుని కావ్యయుగం అంతకు మునుపున్న సాహిత్యానికి భిన్నమైంది. ఆ తరువాత రాయల యుగంలో వెలసిన ప్రబంధాలు ఆ కాలంలో వచ్చిన మార్పుగా మనం గుర్తించాలి.

ఈ రోజుల్లో అందరూ కాదు కాని కొందరు తెలుగు సాహిత్యాన్ని రెండుగా విభజించి ఒకటి గొప్పది మరొకటి కాదు అనేధోరణిలో మాట్లాడడం దురదృష్ట కరం. ప్రాచీన సాహిత్యం అంతా పనికి రానిదని, ఆధునిక సాహిత్యమే గొప్పదని కొందరు. ఆధునిక సాహిత్యంలో పసలేదని, అంతా ప్రచీన సాహిత్యంలోనే చెప్పబడిందని మరికొందరు ఊకదంపుడు ఉపన్యాసాలు చేస్తున్నారు. రెండు వర్గాల వారి వాదనలోను లోపం వుంది. ఏ సాహిత్యమైనా ఆయా కాలానికి అనుగుణంగా, ఆయా సాంఘిక, రాజకీయ, మత పరిస్థితుల ననుసరించి పుడుతుంది. అందులో వుండేదంతా అన్ని కాలల్లోకు వర్తిస్తుందనడం ఎంత అవివేకమో అందులో చెప్పబడిదంతా పనికిరాదనడం అంతే అవివేకము.

ఇక్కడ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ అన్న ఒక్కమాట మనం గుర్తుంచుకోవాలి. "సత్యంకాని అసత్యంకాని, అసత్యంకాని సత్యంకాని కావ్యప్రపంచంలో దొరకు పదార్థం కాదు". అంటే కావ్యంలో అంతా సత్యమే గాని అంతా అసత్యం కాని వుండదు. ఉదాహరణకు మనుచరిత్రలో హిమాలయ పర్వతాలలో కదళీ ప్రూకులు, ఉద్యానవనాలు సెలయేర్లు ఇసకతిన్నెలు ఉన్నట్లు వర్ణించబడివుంది. హిమాలయాలు సత్యం-అట్లే ఉద్యాన వనాదులు సత్యం. అయితే ఆ ఉద్యాన వనాదులు తుంగభద్రానది గట్టున పెద్దన తన కాలంలో చూసారు. వాటిని హిమాలయాల్లో వున్నట్లు చెప్పాడు. అది అసత్యం. ఆ అసత్యం రెండు సత్యాల కలయిక. కావ్యంలో రమ్యతకోసం పెద్దన కల్పించిన కల్పన. కాబట్టి కావ్యాల్ని లేదా ప్రాచీన తెలుగు సాహిత్యాన్ని చదువుకనే ముందు ఆనాటి కవుల దృక్పధాన్ని అర్థం చేసుకొని చదువుకోవడం మంచిది.

ప్రబంధాలలో ఏముంది? అంతా ఒకే మూసలో పోసిన సాహిత్యమది. నాయికా నాయకుల అంగాంగ వర్ణన, వారి ప్రేమ, విరహం, వివాహం తప్ప అందులో ఏమి వుండదని అవి చదవవలసిన అవసరం లేదని యిపుడు కొందరు వాదిస్తున్నారు. ఇది సాహిత్య రంగానికి అంత ఆరోగ్యకరమైన విషయం కాదు. ప్రాచీన సాహిత్యాన్ని బాగా ఆకళింపు చేసుకొని ఆధునిక సమాజాన్ని అర్థం చేసుకొని ఈనాటి పరిస్థితుల కనుగుణంగా సాహిత్య సృష్టి చేస్తే అది పదికాలాల పాటు సమాజంలో నిలిచి వుంటుంది. పదిమందికి అది వుపయోగపడుతుంది.

మన ప్రాచీనులు ప్రతి విషయాన్ని ఎంతో నిగూఢంగా చెప్పేవారు. దానికి కారణం ఆనాటి సామాజక స్థితి గతులే. ఉదాహరణకు మనుచరిత్ర పారిజాతాపహరణ ప్రబంధాలలో ఎంతో ఉన్నతమైన భారతీయ సంస్కృతి చెప్పబడింది. పద్యం, పద్యభావం తెలుసుకుంటే అందలి కథ మాత్రమే మనకు గోచర మవుతుంది. ఆ ప్రబంధాలలో ఆయా కవులు ప్రతిపాదించిన విషయాన్ని లోతుకు వెళ్ళి మనం పరిశీలించ గలిగితే మన సంస్కృతి ఎంత గొప్పదో అవగతమవుతుంది. మొదట మనుచరిత్ర విషయం కొంత ఆలోచన చేయడం అవసరం. ఇందులో ప్రధానమైన పాత్ర ప్రవరుడు. అతడు-

"యౌవన మందు యజ్వయు ధనాఢ్యుడునై కమనీయకౌతుక
శ్రీవిధిఁగూఁకటుల్ గొలిచి చేసిన కూరిమి సామిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియున్
దేవర వోలెనుండ యిలు దీర్పగ గాపురమొప్పు వానికిన్"-

ఈ పద్యభావము స్పష్టం. యవ్వనములోనే యజ్ఞంచేసి ప్రవరుడు ధన వంతుడై ప్రియభార్య పొందుతో సుఖంగా వున్నాడు. అంతేకాదు పార్వతీ పరమేశ్వరుల వంటి తల్లిదండ్రుల సేవ చేస్తూనాడు. ఈ పద్యంలో తల్లి దండ్రుల సేవ చేసినట్లు చెప్పడం భారతీయ సంస్కృతి. మనకు యిప్పటి వలె ఆనాడు old age గృహాలు లేవు. పాశ్చాత్య పరిచయం వల్ల ఈనాడు మనకు old age గృహాలు వచ్చాయి. ఆనాటి సమాజంలో ముదుసలులైన తల్లిదండ్రులకు బిడ్డలే రక్షకులు. ఆ బిడ్డలు తల్లి దండ్రులను పట్టించుకోకపోతే వారి బ్రతుకుతెరువు కష్టతరమవుతుంది. అందుకే బిడ్డకు మూడేళ్ళు రాగానే Residential School ల్లో చేర్చి టాటా చెప్పి వస్తే, వాడు బాగా చదివి పెద్దవాడై, ఉద్యోగస్థుడై తండ్రిని old age గృహంలో చేర్చి టాటా చెప్పి పోయే సంప్రదాయం ఆనాడు లేదు. పెద్దన తన కాలంలో వున్న గృహస్థ ధర్మాన్ని లోకకళ్యాణం దృష్ట్యా ఎంతో నొక్కి చెప్పాడు. ప్రబంధాలలో ఏముంది? అని అనుకునే ముందు ఈలాంటి భారతీయ సంస్కృతికి నిదానాలైన విషయాల్ని మనం గ్రహించాలి.

అతిధి సేవను గూర్చి ప్రవరుని పాత్ర ఆధారంగా పెద్దన ప్రసంగించాడు. ఈనాడు మనకవి అంతగా రుచించక పోవచ్చు. కారణం మనం కాలాన్ని, ఎవరికి ప్రతి చిన్న విషయాల్ని డబ్బుతో ముడిపెట్టి బ్రతుకుతున్న రోజులివి. దానికి కారణం అనూహ్యంగా పెరిగిన జనాభా. పట్టణాలల్లో ఏ సమయంలో నైనా, డబ్బుంటే కావలసిన ఆహారపదార్థాలు మనకు లభిస్తాయి. మరి పల్లెల్లో అది సాధ్యమా? ఎద్దులు కొనాలని పల్లె పల్లె తిరిగే రైతు మూడు నాలుగు రోజులు తిరిగితే గాని తనకు కావలసిన ఎద్దుల్ని కొనలేడు. అదికూడ పల్లెల్లో తిరగాలసిందే. ఎక్కడో గాని, అంటే సుమారు Town అయితే తప్ప Hotel లేదా పూటకూళ్ళ యిల్లు వుండవు. మరి ఎద్దులకోసం తిరిగేవారు, భోజనానికి ఎక్కడికి పోవాలి. అట్లే గొర్రెలు, గేదెలు మొదలైనవి కావలసిన వారి విషయం కూడా యింతే. అదేవిధంగా చిన్న చిన్న వ్యాపారాలు చేసుకొనే వారి విషయం మనం ఆలోచించాలి. ఉదాహరణకు గాజుల వ్యాపారి వున్నాడనుకుందాము. అతను గాజులు అమ్ముకుంటూ పల్లెలు తిరుగుతుంటాడు. అతనికి భోజనం కావాలి. ఏ పల్లెలో హోటలు వుంటుంది? ఎవరో దయతలచి పెట్టాలి. భారతదేశంలో పల్లెలే ఎక్కువ. అక్కడ జనజీవనానికి అనుగుణంగా అతిధి సత్కారం అవశ్యకం. ఈ సత్యాన్ని గ్రహించిన పెద్దన ప్రవరుని పాత్ర ఆతని భార్య సోమిదమ్మ పాత్రలు ఆధారంగా అతిధి సత్కారాన్ని గూర్చి వివరించాడు. ఇది భారతీయ సంస్కృతి.

ప్రవరుడు హిమాలయాలకు వెళ్తాడు. అతనికి వరూధిని తారస పడుతుంది. ఆమె అతన్ని వలచింది. అతడు నిరాకరించాడు. ఆమె అతన్ని కౌగలించుకొనింది. అతను త్రోసి వేసాడు. తన దారిన తాను పోయాడు. ఆమె పెడదారి పెట్టింది. మాయా ప్రవరుని కోరిక తీరింది. ఇది కథ. ఇక్కడ గమనింపవలసిన అంశాలు అనేకాలున్నాయి. అందు మొదటిది ప్రవరుడు సన్యాసికాదు. సంసారి. భార్య పొందు కలిగినవాడు. స్త్రీ సౌఖ్యాన్ని అనుభవించిన వాడు. స్త్రీ సౌఖ్యమెరుగని సన్యాసి వరూధినిని నిరాకరించడం గొప్పగాదు. ఆ ఆనందాన్ని తెలిసిన వాడు నిరాకరించడం విశేషం. ప్రవరుడు భారతీయ సంస్కృతికి అద్దంపట్టే పాత్ర. సంసారం చేసి సంతాన వంతుడు కావడం, తల్లి దండ్రులను సేవించడం, అతిథి మర్యాదల నాచరించడం మొదలైనవి మన సంప్రదాయాలు. వాటిని బోధించి ప్రజల్ని ఆ త్రోవలో నడిపించడం కవుల ధర్మం. అదే పెద్దన చేసిన పని. శూర్పణఖను కాదన్న రాముని కంటే వరూధినిని తిరస్కరించిన ప్రవరుడు గొప్పవాడు. శూర్పణఖ అందవిహీన. అందులోను సీత అక్కడ వుంది. ఇక్కడ హిమాలయాల్లో అప్సరస వరూధినిని రమ్యమైన ప్రకృతి మధ్య తిరస్కరించడం ప్రవరుని అత్యున్నత సంస్కారానికి నిదర్శనం. అది భారతీయ సంస్కృతి. వరూధిని ఎన్నో విశేషాలు చెప్పింది.

వెలి పెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి
దాశకన్యా కేళిఁదప్పుసేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టఱికము
వనువు కాఁడై వేల్పు నాగవాసము గూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సురలహ
ల్యా జారుఁడైన జంభాసురారి

వారికంటెను నీమహత్త్వంబు ఘనమె
పవన పర్ణాంబు భక్షులై నవసి, యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్ల
దామరస నేత్ర లిండ్ల బందాలు గారె.

స్వర్గానికి వచ్చేది మా పొందు కోసమే అన్నట్లు కవ్వించింది. కాని ప్రవరుడు చలించలేదు. కాగా పోగా "ఈ తుచ్ఛ సుఖంబులు మీసాలపై తేనియల్" అన్నాడు. అది అసలు సిసలైన భారతీయ సంస్కృతి. లోకంలో

కొందరిలో ఒక భ్రమ వుంది. పుణ్యాలు చేసి మరణించి స్వర్గానికి పోతే రంభాది అప్సరసల పొందు లభిస్తుందని. అది కేవలం అభూత కల్పన. స్వర్గమంటే రంభాదుల పొందు గాదు. జన్మరాహిత్యాన్ని పొందడమే స్వర్గం అని పెద్దన నిగూఢంగా చెప్పాడు. తిక్కన భారత రచన ద్వారాను, పోతన భాగవత నిర్మాణం ద్వారాను కోరింది జన్మరాహిత్యాన్నే. అదే స్వర్గం. అది సులభ సాధ్యం కాదు. ఆ విషయాన్నే పెద్దన ప్రవరుని పాత్ర ఆధారంగా చెప్పాడు. శక్తి సంపన్నుడై, ప్రకృతి రమ్యమై, వలచి వచ్చిన సౌందర్యవతిని, స్త్రీ పొందు సౌఖ్యం తెలిసిన వాడు నిరాకరించడం అతని నిష్ఠకు నిదర్శనం. అటువంటి నిష్ఠాపరులుగా జీవించాలి. అపుడే సమాజం ఆరోగ్యవంతంగా వుంటుంది, అని చెప్పడం పెద్దన ధ్యేయం. ప్రవరుని భారతీయ సంస్కృతిని మూసపోసిన పాత్రగా పెద్దన చిత్రించాడు.

# 12. అన్నమయ్య - దశావతార వర్ణన

మత్స్యకూర్మ వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ
బుద్ధః కల్కి రేవచ -

అన్న దశావతార శ్లోకం బహుళ వ్యాప్తిలో వుంది. ఆ శ్లోకాన్ననుసరించి మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, శ్రీకృష్ణ, బుద్ధ, కల్కి అవతారాలు దశావతారాలుగా అనుకోవాలి. కానీ దశావతారాలకు సంబంధించి భిన్నాభిప్రాయాలు కనిపిస్తాయి. పై శ్లోకం కొంత భిన్నంగా యిలా వుంది.

మత్స్య కూర్మ వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ
బుద్ధః కల్కి రేవచ

ఇందులో ముగ్గురు రాములున్నారు. ఒకరు పరశురాముడు, రెండవవాడు దశరధ రాముడు, మూడవవాడు బలరాముడు. ఈ శ్లోకంలో శ్రీకృష్ణావతారం చెప్పబడలేదు. ఆదిశేషు అవతారమని పలువురు భావిస్తున్న బలరామావతారం ఇందు చెప్పబడింది. విష్ణువు అవతారాల్లో ఆదిశేషుని అవతారమైన బలరాముని చెప్పడం సమంజసం కాదని కొందరి మతం.

శ్రీకృష్ణావతారం పూర్ణావతరాం కాబట్టి పై అవతారాల్లో కృష్ణావతారం చేర్చబడలేదని, కృష్ణుడు అవతారపురుషుడు కాదు స్వయంగా విష్ణువే అని భావించడం వలన కృష్ణావతారాన్ని యిందులో చేర్చలేదని కొందరి అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని "గీత గోవిందం" సమర్థిస్తుంది.

ఈ దశావతార తత్త్వానికి డార్విన్ జీవపరిణామ సిద్ధాంతానికి కొంత సంబంధమున్నట్లు నిశిత పరిశీలనలో తెలుస్తుంది. అందుకే ఆధునిక శాస్త్రజ్ఞులు మత్స్యావతారం నుండి రామావతారం వరకు కలిగిన జీవపరిణామ క్రమాన్ని సహేతుకంగా పరామర్శించారు.

ప్రథమ సృష్టిజలం : ఈ వైదిక భావాన్ని మనువు యిలా వివరించారు.

'అపఏవ ససర్జాదౌతాసు
బీజ మహోన్సృజత్' (మను - 1అ - ర శ్లోకం)

పరమేశ్వరుడు ప్రపంచాన్ని సృష్టించాలనే సంకల్పముతో తొలుత జలాన్ని సృజించి, అందులో తన తేజాన్ని నిక్షిప్తం చేశాడని, అది సువర్ణాకారంలో వుందనీ, అందులో నుంచి బ్రహ్మ ఆవిర్భవించి, ఆత్మధ్యానం వల్ల దాన్ని రెండు ముక్కలుగా చేసి, వాటిలో భూమిని, ఆకాశాన్ని నిర్మించిన తరువాత సమస్త సృష్టినీ చేశాడనీ వైదిక ప్రసిద్ధి. ఈ విషయం కుమార సంభవంలో కూడా చెప్పబడింది.

"యదమోఘమపా మన్తీరుప్తం బీజ మజత్వయా
అంతశ్చరా చరం విశ్వం ప్రభవస్త స్యగీయసే"
(కుమార సంభవం - 2వ సర్గ - 5వ శ్లోకం)

పంచభూతాల్లో ఒకటైన జలమ్ ప్రథమ సృష్టి అని తేలింది.

జలచరాల్లో ప్రధానమైంది మీనం. క్రమంగా కొంత భూభాగం ఏర్పడడంతో అటు జలచరంగా, యిటు భూచరంగా ( ఉభయచరంగా) మనగలిగిన కూర్మం అవతరించింది. ఆపైన ఎక్కువగా భూమిమీద చరిస్తూ, నీటిపై ఆసక్తిని పూర్తిగా వదలలేని వరాహము రూపు దాల్చింది.

అనంతరం భూభాగం మీద అరణ్యాలకు ప్రాధాన్యం కలిగింది. బహుమృగా కీర్ణమైన అడవికి సింహం రాజైంది. దీనినే జీవపరిణామ క్రమంలో నరసిం హావతారంగా భావించవచ్చు. మానవుడు మరుగుజ్జురూపాన్ని పొందాడు. ఇది అసంపూర్ణ మానవాకృతే. అదే వామనావతారం. పరిపూర్ణ మానవావతారం రామావతారంలోనే పరిణీతి చెందింది. పరిపూర్ణత చెందిన మానవుడు తన దివ్యత్వాన్ని పొందేదానికి కాలంతో ప్రయత్నించాడు. దీనినే శ్రీకృష్ణావతారంగా పరిగణించవచ్చు. ఇట్లు జలచరం నుంచి దివ్యపురుషుడి దాకా సాగిన జీవపరిణామ క్రమమే దశావతారాల్లోని పరమార్థంగా భావించవచ్చు.

ప్రాచీన కవుల్లో చాలామంది ఏదోవిధంగా కథా సందర్భాలతో ముడి పెడుతూ దశావతార స్తోత్రాల్ని చేశారు. దశావతార సిద్ధాంతంపై వారికి అపూర్వమైన గౌరవం. మానవ జీవితంలోని వివిధ దశల్ని అభివర్ణించే సంద ర్భంలో కూడ అందరి స్థితిగతుల్ని వివరించడానికి దశావతారాల్ని గ్రహించడం

పూర్వకవుల వివేకానికి ఒక నిదర్శనం. ఒక్కొక్క అవతారంలోని వైలక్షణ్యాన్ని గ్రహించి ఎంతో వైలక్షణ్యంతో సమీకరించి ఒక వినూత్నమైన పరిస్థితికి దాన్ని సంధించి సమన్వయించడం ప్రాచీన కవుల సంధాన చాతుర్యానికి నిదర్శనం.

భారతీయ సంస్కృతికి అద్దంపట్టిన సంస్కృత వాఙ్మయంలో ఈ దశావతారాల ప్రసక్తి ప్రచురం. అదే సంస్కృతిని ఆకళించుకొన్న ఆంధ్రకవుల నిర్మాణాల్లో కూడా దశావతారాది వర్ణనలు ఎంతో విశిష్టతను సంతరించుకున్నాయి. ఆధునిక యుగంలో కూడా నాట్యకళాప్రియులు, సంగీత సాహిత్య పిపాసులు అయిన కొందరు రచయితలు దశావతారాలు చక్కని గేయాలుగా రూపొందించి అభినయింపజేయడం మనకు తెలిసిందే. రచయితలేకాక చిత్రలేఖకులు, శిల్పులు దశావతార కథల్నీ, కధాంశాల్నీ కళాత్మకంగా రూపకల్పనచేసి కళాప్రతిభను ప్రదర్శించడం కూడా చూస్తూనేవున్నాం. ప్రాచీన సాహిత్యంలో పదాలు, వచనాలు, సంకీర్తనలు ప్రగాఢమైన భక్తికి ప్రతీకలుగా నిలిచాయి. నాటి వాగ్గేయకారులు, సంకీర్తనాచార్యులు, గాయక శిఖామణుల కంఠాల్లో ఆంధ్రగాన సరస్వతి మహదానందంగా ఆలాపనలు సాగించింది. గానకళాకోవిదుల గాత్ర మాధుర్యం పండితుల్ని, పామరుల్ని రంజింపచేసింది. పదకవితా పితామహుడు అన్నమయ్య ఆబాలగోపాలాన్ని తన సంకీర్తనల గానామృతంలో తానమాడించాడు. సింహగిరి వచనాల వంటి సాహితీ ప్రక్రియలవల్ల కలిగిన భక్తి ప్రచారానికంటే అన్నమయ్య సంకీర్తనలవల్ల కలిగిన వైష్ణవభక్తి ప్రచారం ముఖ్యంగా రాయలసీమ ప్రజల్ని తన్మయాభావంతో పునీతుల్ని చేసింది.

"సర్వం విష్ణుమయం జగత్" అనే భావాన్ని అన్నమయ్య అనుభవపూర్వకంగా అనేక ప్రసిద్ధ క్షేత్రాలు దర్శించి ఆయా ప్రసిద్ధ స్థలాల్లో నెలకొన్న వెంకటేశ్వరుని ప్రతిరూపాలైన విభిన్న అర్చామూర్తుల్ని తనివితీరా దర్శించి నోరారా కీర్తించాడు. మనసారా తన మనవి విన్నవించుకొన్నాడు. అన్నమయ్య భక్తి పారవశంలో వైష్ణవ సంప్రదాయంలో ప్రసిద్ధంగా వుండే దశావతారాల్ని అనేక సందర్భాల్లో అభివర్ణించాడు.

> "ఇట్టి మమ్ము రక్షించుట యేమి దొడ్డ నీకు నేడు
> బట్టి బాయిటనే నీవు పదిరూపులైతివి
> చదువుల చిక్కుదిద్ది చక్కగ జేసితివి
> మొదలగుంగిన కొండమోచి యెత్తితి
> వొదిగి చేపట్టి తెచ్చి భూమి పునరుద్ధరించితివి
> అదనున బ్రహ్లాదునటే మన్నించితివి

అడుగుల మూటనే యఖిలము గొలచితి
బడిబడినే రాయజగ నీగితి
జెడిదపులంక విభీషణు నేలించితివి ||ఇట్టి||

త్రిపుర కాంతుల గుట్టుదీర బోధించితివి
వుపమ గలికి రూపై యున్నాడవు
ఇప్పుడు శ్రీ వేంకటేశ యేలితివి లోకాలెల్ల
యెప్పుడు మాసుతులకు నర్థవైతివి"

(అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తనలు, సంపుటము 1, కీర్తన 80)

పై కీర్తనలో అవతారం పేరు చెప్పక పోయినా విశేషణాల ద్వారా మీన, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధక, మానవావతారాల్ని అన్నమయ్య పేర్కొన్నాడు.

## 1. మత్స్యావతారం :

దశావతారాల్లో మొదటిదిగా మత్స్యావతారం చెప్పబడింది. వేదాల్లో కూడా దీని ప్రసక్తి వుంది. హయగ్రీవుడనే రాక్షసుడు చతుర్వేదాల్ని అపహరించి సముద్రంలో దాక్కున్నాడు. శ్రీమహావిష్ణువు మత్స్యరూపం ధరించి ఆ రాక్షసుల్ని సంహరించి వేదాల్ని రక్షించాడు.

వైవస్వత మనువు అర్ఘ్యమిస్తుండగా అతడి దోసిలిలోనికి మత్స్యమొకటి వచ్చి రక్షించమని ప్రార్థించింది. అతడు ఆ మత్స్యాన్ని నీటి కుండలో వుంచాడు. మరుసటి రోజుకది పెద్దదై భాండం పట్టక కాపాడమని అర్థించింది. ఇలా పెరిగిపోతున్న మత్స్యాన్ని ఆ రాజు నూతిలో, ఆ తరువాత చెరువులో, చివరకు సముద్రంలో వదలి, ఆ మత్స్యం అలా పెరగడానికి గల కారణమడుగుతాడు.

అప్పుడా మత్స్యం తాను శ్రీహరినని, నూరేళ్ళకు ప్రళయం వస్తుందని, అప్పుడు మహాసత్త్వాల్ని, వేదాల్ని ఒక నావలో వుంచి దాన్ని తన శృంగానికి కట్టమని చెప్పి నావనిచ్చి అదృశ్యమవుతుంది. ప్రళయకాలంలో మనువు మత్స్యం చెప్పినట్లు సర్వ పదార్థ సత్త్వాల్ని వేదాల్ని నావలో వుంచుతాడు. ప్రళయ కాలానంతరం నావలో వున్న సత్త్వాల నుంచి తిరిగి ప్రపంచంలోని సర్వ పదారార్థాలు ఏర్పడ్డాయని మత్స్యావతార కథనం.

శతపథ బ్రాహ్మణంలో కథ మరొక్క విధంగా వుంది. అందు ప్రజాపతి మత్స్యరూపం ధరించినట్లు చెప్పబడింది. మనువు దోసలి లోనికి వచ్చిన చేప

"నన్ను నీవు రక్షిస్తే నిన్ను నేను రక్షిస్తానంటుంది." ఆ మాటలకు ఆశ్చర్యపడిన మనువు నీవు నన్ను ఎట్లా రక్షిస్తావని ప్రశ్నిస్తాడు. ప్రళయకాలంలో నిన్ను నేను రక్షిస్తానని చేప చెబుతుంది. మనువు ఆ చేపను సముద్రంలో విడిచి పెడతాడు. అనుకున్నట్లే జల ప్రళయకాలంలో మనువును ఆ చేప ఒడ్డుకు చేరుస్తుంది - ఈ కథలో వేదాల ప్రసక్తి లేదు.

అన్నమయ్య గావించిన మత్స్యావతార వర్ణనలో వేదాల ప్రసక్తి వుంది.

"చదువుల చిక్కుదిద్దె చక్కగ జేసితివి"

ఇందులో చదువులు అనగా వేదాలనే అర్థం. చిక్కుదిద్దడమంటే కాపాడడం అనే అర్థం గ్రహించాలి. ఇట్లే అన్నమయ్య మత్స్యావతార వర్ణన గావించాడు.

## 2. కూర్మావతారం :

దశావతారాల్లో ఇది రెండవది. వేదాల్లో కూడా కూర్మావతారం ప్రస్తావన కనిపిస్తుంది.

దేవదానవులు అమృతం కోసం మంధర పర్వతం కవ్వంగా సర్పరాజైన వాసుకిని తాడుగా సముద్ర మధనం ప్రారంభిస్తే కొంతసేపటికి పర్వతం సముద్రము లోనికి క్రుంగుతుంది. అంత సముద్ర మధనం కష్టసాధ్యమవు తుంది. అంత దేవతలు విష్ణువును ప్రార్థిస్తారు. విష్ణువు కూర్మావతారం ధరించి సముద్రంలో మునుగుతున్న మంధర పర్వతానికి అడుగున ఆధారపీఠంగా వుండి సాగర మథనం సులభతరం చేస్తాడు. ఈ అవతారానికి కారణం సముద్ర మధనం.

"మొదలగుంగిన కొండ మోచి యెత్తితి" అని అన్నమయ్య వర్ణన. అనగా కొండ మొదలు సముద్రంలో కుంగిపోతుంటే నీ వీపుమీద మోచియుంచినావని శ్రీహరిని అన్నమయ్య వర్ణించినాడు. ఇంకనూ,

"పట్టి యెత్తవలెనంటే బాతాళాన బడ్డకొండ
తట్టి యెత్తి పాలవెల్లి దచ్చగా నీవు"

(ఆధ్యాత్మిక సంకీర్తనలు, సంపుటము : 2. కీర్తన 47)

పాలసముద్రంలో క్రుంగి పాతాళంలో చేరిన కొండను పైకి ఎత్తి నిలిపిన నిన్నుపట్టి ఎత్తుకొనుటకు సాధ్యమా! అని అన్నమయ్య కూర్మావతార వర్ణన గావించాడు.

"అదిగో పాతాళమందు వెదకితే నాది కూర్మమో విష్ణుడు"

(ఆధ్యాత్మిక సంకీర్తనలు. సంపుటము 9, కీర్తన 81)

ఇట్లే అన్నమయ్య సంకీర్తనల్లో కూర్మావతార వర్ణనలు అనేకం గ్రహింపవచ్చు.

### 3. వరాహావతారం :

దశావతారాల్లో వరాహావతారం మూడవది. విష్ణువు వరాహావతారంలో భూమిని ఉద్ధరించినట్లు కథనం.

హిరణ్యకశిపుని అగ్రజుడైన హిరణ్యాక్షుడు లోకోపద్రవ కార్యాలు చేస్తూ భూమిని చుట్టచుట్టి సముద్రంలో ముంచేస్తాడు. అప్పుడు శ్రీహరి వరాహ రూపుడై అతన్ని సంహరించి సముద్రంనుంచి భూమిని పైకి ఎత్తడం యిందలి కథనం.

"వొదిగి చేపట్టి తెచ్చి భూమి వుద్ధరించితివి" అని అన్నమయ్య వరాహావతార వర్ణన గావించాడు. 'చేపట్టి' అనే పదంలో నిగూఢార్థముంది. భూమిని చేపట్టి అనగా భూదేవిని వివాహం చేసుకుని అనే అర్థం గ్రహించవచ్చు.

"చలమున హిరణ్యా జక్కాడి యిటు భూ
వలయము నిలిపిన వరాహమా!"

ఆధ్యాత్మిక సంకీర్తనలు, సంపుటము-8, కీర్తన 18A

ఇందు అన్నమయ్య వరాహావతార ప్రయోజనాన్ని వెల్లడించాడు.

### 4. నరసింహావతారం :

దశావతారాల్లో నాలుగవది నరసింహావతారం. నర, జంతు రూపంగా రూపొందించింది. నరసింహావతార కథ జనబాహుళ్యంలో ప్రచారం బాగా వుంది. తన భక్తుడైన ప్రహ్లాదుని అతని తండ్రి హిరణ్యకశిపుని బారినుండి రక్షించడానికి శ్రీహరి నరసింహావతారం ధరించాల్సి వచ్చింది. అందుకు కారణం బ్రహ్మ హిరణ్యకశిపునికిచ్చిన వరం. బ్రహ్మ వరంతో హిరణ్యకశిపుడు లోకకంటకుడిగా మారి గర్వంతో అరాచకాలు సృష్టిస్తూ వుంటాడు. అతని కొడుకు ప్రహ్లాదుడు విష్ణుభక్తుడుగా వుంటాడు. వాదోపవాదనల తర్వాత నీ విష్ణువును ఈ స్తంభములో. చూపగలవా? అని ఆ స్తంభాన్ని రెండుగా పగులగొడతాడు హిరణ్యకశిపుడు. అప్పుడు విష్ణువు తల సింహరూపంలో, మొండెం మానవ రూపంలో కలిగి పగలు రాత్రి కాని సాయం సంధ్యలో, ఇంటా బయటా కాక గడపలో, భూమ్యాకాశాల మీదగాక తన తొడలమీద, కత్తులు, బాణాలతో గాక గోళ్ళతో హిరణ్యకశిపుని కడుపు చీల్చి ప్రాణం తీస్తాడు.

"అదునున ప్రహ్లాదునట్టె మన్నించితి" అని అన్నమయ్య నరసింహావతార వర్ణన చేసాడు.

"జగతి వైశాఖ శుద్ధ చతుర్దశి మందవార
మగణితముగ గూడెనది స్వాతియోగము

పక్కనుక్కు గంభము పగిలించుక వెడలి
తొక్కి హిరణ్యకశిపు దొడగి పట్టి
చక్కగా గడప మీద సంధ్యాకాలమున
వక్కలు సేసె మరవడి నరసింహుడు

విచ్చిగాగ జప్పరించి పేగులు జందేలు వేసి
తొప్పదోగుచు నెత్తురు దోసిట జల్లె
రొప్పుచు గోపముతో గేరుచు బక బక నవ్వి
తప్పక చూచెనాని మదగ నరసింహుడు
ఎదుట బ్రహ్లాదుజూచి యిందిర దొడపైనుంచె
అదన నందరికి నభయమిచ్చె
కదసి శ్రీవేంకటాద్రి గద్దెమీద గూమండె
వెదజల్లె గృపయెల్ల వీర నరసింహుడు"

ఆధ్యాత్మిక సంకీర్తనలు, సంపుటము-10 కీర్తన : 285

ఇందులో నరసింహావతారం మహావిష్ణువు ఏరోజు ధరించాడో స్పష్టంగా చెప్పాడు. వైశాఖశుద్ధ చతుర్దశి. మందవారం, స్వాతియోగంలో నరసింహావతారం జరిగినట్లు అన్నమయ్య చెప్పాడు. ఉక్కుస్తంభం నుండి బయటికి వచ్చి సంధ్యాకాలంలో గడప మీద హిరణ్యకశిపుని వక్కలు చేసిన నరసింహుడు అని అన్నమయ్య నరసింహుని భావించాడు.

నరసింహ రూపాన్ని అన్నమయ్య చక్కగా దర్శించాడు. పేగులు జంధ్యాలు వేసుకొని, నెత్తురు దోసిటితో తాగుతూ, చల్లుతూ, రొప్పుచూ, కోపముతో కేరుచూ, పకపక నవ్వుతూ, ఉగ్రనరసింహుడు అన్నమయ్యకు దర్శనమిచ్చాడు. ఎదుటవుండే ప్రహ్లాదుని ఇందిర తొడమీద కూర్చోపెట్టి అక్కడున్న అందరికీ అభయమిచ్చి వేంకటాద్రి గద్దెమీద కొలువైన నారసింహుడు కృపగలిగిన వీరనారసింహుడని అన్నమయ్య వర్ణన.

**5. వామనావతారం :**

దశావతారాల్లో అయిదవది వామనావతారం. శ్రీహరి రాక్షసరాజు బలిని నిర్జించడానికి వామనావతారం దాల్చాడు. నరసింహావతారంలో శ్రీమహావిష్ణువు రక్షించిన ప్రహ్లాదుని మనుమడు విరోచనుడు. ఆతని పుత్రుడు బలి. బలి

రాక్షస రాజే అయినా ధర్మబుద్ధి గలవాడు. రాక్షసకృత్యాలు చేస్తున్నా ధర్మాన్ని వదలలేదు. శ్రీహరి మానవరూపంలో వెళ్ళి మూడడుగుల నేల భిక్ష కోరుతాడు. వామనుని ఆంతర్యం తెలిసిన రాక్షస గురువు శుక్రాచార్యుడు అభ్యంతరం తెలియజేస్తాడు. మాట తప్పని బలి మూడడుగుల భూమిని దానం చేస్తాడు. వామనుడు ఒక అడుగులో భూమిని, మరో అడుగులో ఆకాశాన్ని ఆక్రమించి, మూడో అడుగు ఎక్కడ పెట్టాలని అడుగుతాడు. బలి తన తలను చూపిస్తాడు. వామనుడు బలిని పాతాళానికి తొక్కేస్తాడు.

"అడుగులు మూటనే యఖిలము కొలిచితి" అని అన్నమయ్య వామనావతార వర్ణన చేశాడు.

> "అరుదుగ బలిమీద మడపగ నాకశమంటినస రూపము
> సరగున భూమింతయు నొక చరణంబున గొలిచి
> పరగిన పాదాంగుటమున బ్రహ్మాండము నగిలించిన
> పరమాత్ముడితడేపో పతి వేంకట విభుడు"
>
> ఆధ్యాత్మిక సంకీర్తనము, సంపుటము : 1 కీర్తన : 80

బలి మదము అణిచేందుకు వామనుడు త్రివిక్రమాకృతి ధరించాడేమోనన్న భావం జనించేటట్లు అన్నమయ్య వామనావతార వర్ణన చేసాడు.

### 6. పరుశురామావతారం :

దశావతారాల్లో పరశురామావతారం ఆరవది. రామావతారానికి సమకాలీన మైన అవతారం పరశురామావతారం. భారత కథలో కూడా పరశురామావతార ప్రసక్తి వుంది. పరశురాముడు రేణుక, జమదగ్నుల పుత్రుడు. తండ్రి ఆజ్ఞ ప్రకారం తల్లి రేణుకాదేవిని వధించి తండ్రి వరం వల్ల తిరిగి ఆమెను బ్రతికించి తన పితృభక్తిని చాటుకొన్నాడు. తన తండ్రినకారణంగా చంపిన హయహయుడు క్షత్రియుడు కావడం వల్ల 21 సార్లు క్షత్రియుల్ని వధిస్తానని శపథంచేసి ఆ ప్రకారంగా వధించి కురుక్షేత్రంలో 5 కాలువలు త్రవ్వించి ఆ కాలువల గుండా క్షత్రియరక్తం నింపి తండ్రికి తర్పణగావిస్తాడు. ఈ ఐదుమడుగుల్ని శమంతక పంచకాలని అంటారు. క్షత్రియ సంహారణాంతరం లభించిన పుడమిని భార్గవుడు కశ్యపునికి దానం చేస్తాడు. భారతవీరులైన , కర్ణులకు యితడు గురువు.

"బడిబడినే రాచపగ నీగితి" అని అన్నమయ్య పరశురామావతార వర్ణన గావించాడు.

"పలు వీరులలో వెదకి చూచితె పరశురాముడొకడైనాడు," అని అన్నమయ్య పరశురాముణ్ణి కీర్తించాడు. ప్రత్యేకించి పరశురామావతారాన్ని గూర్చిన కీర్తనలు లేకపోయినా దశావతార వర్ణనల్లో అన్నమయ్య పరశురామ ప్రసక్తి చేసినాడు.

## 7. రామావతారము :

దశావతారాల్లో రామావతారం ఏడోది. శ్రీరాముని జీవితాన్ని గూర్చి లోకంలో అనంత సాహిత్యం అనేకానేక ప్రక్రియల్లో వెలసింది.

శ్రీరాముడు మొదట అద్వితీయ పాలకుడిగా ఖ్యాతి చెంది క్రమంగా దివ్యత్వం పొందినట్లు రామాయణం వల్ల తెలుస్తుంది. వాల్మీకి రామాయణంలోని బాలకాండలో రాముడు నరుడనీ, అలౌకిక సద్గుణాలు గల మహాపురుషుడని చెప్పబడింది.

"బెడిదపు లంక విభీషణ నేలంచితివి" అని అన్నమయ్య వర్ణన. రావణుని చంపి రాముడు లంకకు విభీషణుని పట్టాభిషక్తుని చేసిన విషయం ఇక్కడ ప్రస్తావించబడింది.

రామాయణంలోని ప్రధాన ఘట్టాలన్నీ అన్నమయ్య ఒక కీర్తనలో వర్ణించి యుండడం మనం చూడవచ్చు.

చెప్పితే నాశ్చర్యము చేసిన చేత లతడు
ముప్పిరి మనుజ వేషమున బుట్టె నీతడు

రాముడుదయించె దశరథునికి దమ్ములతో
గామిడైన తాటకిని బంధించెను
ఆముక యజ్ఞము గాచె హరుని విల్లు విరిచె
ప్రేమమున సీతాదేవి బెండ్లియాడెను

మదియించె ఖరుని మారీచుని వధియించె
కెదపె వాలిని యా సుగ్రీవుని బెంచె
జలధి బంధించెను సరుగ రావణుగొట్టె
బదినే విభీషణుని బట్టము గట్టెను

సీతాదేవితో నయోధ్య సింహాసనం బెక్కె
పోతరించి కుశలవ పుత్రుల గాంచె
శ్రీ తరుణితో గూడ శ్రీవేంకటేశుడై నిల్చె
కైతుకమున జగము కరుణగాంచెను.

(ఆధ్యాత్మిక సంకీర్తనలు సం : 11,కీర్తన : 182.)

## 8. కృష్ణావతారము :

ఎనిమిదవ దశావతారము కృష్ణుడు, పురాణాల్లో కృష్ణుని చరిత్ర మిశ్రమంగా వుంది. భాగవతంలో కృష్ణుని యందు దైవత్వము ఎక్కువగా కనిపిస్తుంది. శ్రీకృష్ణుడు సంపూర్ణావతారమని కొందరి భావన.

"అదరి పాండవుల దిక్కై నిలచితివి"- అని అన్నమయ్య పాండవులను కాపాడిన కృష్ణుని పేర్కొన్నాడు. అన్నమయ్య శ్రీకృష్ణుని బాల్యంనుండి కీర్తిం చాడు. శ్రీకృష్ణుడు గావించిన దుష్టశిక్షణ మొదలైనవి ఆధ్యాత్మిక కీర్తనలలోను గోపికలతో జరిపిన క్రీడా విశేషాల్ని శృంగారపరంగాను అన్నమయ్య కీర్తించారు.

కనియు గానరు నీ మహిమ కైరవ కంస జరాసంధాదులు
మనుజులు దనుజుల జంపిరనగ విని మరినీశరణము చొరవలదా

పుక్కిటనే లోకములు చూపితి పూతకి చన్నెట దాగితివి
పక్కననె బండిదన్ని విరిచితివి బాటలు సేసెటి పనులవియా
అక్కరతో తృణావర్తు నణచితివి ఆబోతుల కీటకాచితివి
చిక్కించి యనలము చేత మింతివి శిశువులు సేసేటి పనులివియా

తొడిబడి మదుద్దు భువిపై గూలగ దొబ్బియు బకాసురు జంపితివి
బదినె గోవర్ధగిరి యెత్తితి పదుచులు చేసేటి పనులివియా
అదరి బ్రహ్మమాయకు బ్రతిమాయలు అట్టే గదింటి నిలిచితివి
పదికిట చాణూరు నేమగ గొట్టితి పిన్నలు సేసేటి పనులివియా

కాళంగుని మదమణించి దవ్వుగా కడగడలకు పోజూపితివి
గోల్లకై యజ్ఞఫలములిచ్చితివి గోవాళ్ళు చేసేటి పనులివియా
యీలీల శ్రీవేంకటాద్రి మీదనే యిందరికిని పొడచూపితివి
బేలు దనంబుల నెంచి మాడ పసిబిడ్డలు చేసేటి పనులివియా

(ఆధ్యాత్మిక సంకీర్తనలు, సంపుటం : 8, కీర్తన : 277)

## 9. బుద్ధావతారము

దశావతారాల్లో తొమ్మిదవది బుద్ధావతారము. బౌద్ధమత స్థాపకుడైన బుద్ధుడే బుద్ధావతారమని కొందరు. కాదని కొందరి భావన. మహాభారతం; దేవి భాగవతాల్లో చెప్పబడ్డ దశావతారాల్లో బుద్ధావతార ప్రసక్తిలేదు.

"త్రిపుర కాంతల గుట్టు దీర బోధించితివి"- అని అన్నమయ్య బుద్ధావతారాన్ని పేర్కొన్నాడు.

## 10. కల్కి అవతారము :

దశావతారాల్లో చివరిది కల్కి అవతారము. శ్రీమహావిష్ణువు కలియుగాంతంలో కల్కి అవతారంలో విష్ణుశయనుడనే పేరుతో పుట్టి సకలధర్మాల్ని నిలుపుతాడని, ఆ ధర్మాల్ని తొలగిస్తాడని పురాణాల్లో చెప్పబడింది.

"వుపప కలికి రూపై యున్నాడవు"అని అన్నమయ్య కల్క్యావతారాన్ని ప్రస్తావించియున్నాడు.

అన్నమయ్య తన కీర్తనల్లో సందర్భానుసారంగా ఒక్కొక్క అవతారాన్ని ప్రస్తావించాడు. కొన్నిచోట్ల కొన్ని అవతారాల్ని ప్రస్తావించాడు. అక్కడక్కడ దశావతారాలన్నింటిని వర్ణించియున్నాడు. అన్నమయ్య ఆధ్యాత్మిక కీర్తనల్లో మనం అనేక స్థలాల్లో దశావతార కీర్తనల్ని గమనించవచ్చు.

ఇందు **'జయ'** శబ్దం సంఖ్యా (18) సూచి.

ఈ పుస్తకంలోని వ్యాసాలు కొన్ని వివిధ పత్రికలలో ప్రచురించబడినాయి. ఆయా పత్రికాధిపతులకు నా నమస్సులు.

కొన్ని వివిధ సాహితీ సంస్థలలో నేను చెప్పిన ఉపన్యాసాలు. నన్ను ఉపన్యాసకుడుగా ఆహ్వానించిన ఆయా సంస్థల నిర్వాహకులకు ధన్యవాదాలు.

రెండు వ్యాసాలు రేడియో ("కర్నూలు దర్శనీయ స్థలాలు" - కడప ఆకాశవాణి; మనుచరిత్ర భారతీయ సంస్కృతి - కర్నూలు ఆకాశవాణి) ప్రసంగాలు. సంబంధిత ఆకాశవాణి అధికారులకు కృతజ్ఞతలు.

-రచయిత

# 13. అన్నమయ్య సాహిత్యం - జానపద ధోరణులు

ఈ నాటి సాహిత్య లోకంలో శిష్ట భాష, శిష్ట వ్యవహారికం, శిష్టాచారం, శిష్ట సాహిత్యం లాంటి మాటలతో బాటు భాష, జాన పద సాహిత్యం, గ్రామ్యం, లోకాచరాం వంటి మాటలు వ్యవహారంలో వున్నాయి. జానపద సాహిత్య పరిశోధకులకు శిష్ట సాహిత్యంతో పరిచయం ఎక్కువగా వుందేమోగాని, శిష్ట సాహిత్యవేత్తలలో చాలామందికి జానపద సాహిత్య పరిచయం తక్కువ. శిష్ట సాహిత్యానికి జానపద సాహిత్యానికి సేతువు లాంటిది పద సాహిత్యం. అంచేత ఈ సాహిత్యంలో రెండు రకాల వాఙ్మయాల అనుకరణలు అనుసరణలు కొట్టి వచ్చినట్లు కన్పిస్తాయి.

తెలుగులో పదకవులెందరో వున్నారు. కాని తాళ్ళపాక అన్నమయ్య పదకవులలో శ్రేష్టుడు. అతడు పదకవితాపితామహుడు. అతడు శిష్టసాంప్రదాయాన్ని, జానపద సాంప్రదాయాన్ని అర్థం చేసుకొన్నవాడు. అతని రచనలలో జానపద అంశాలే ఎక్కువగా కన్పిస్తాయి. వీటికి ప్రధాన కారణాలు మొదటిది అన్నమయ్య గ్రామంలో జన్మించిన వాడు కావడం. అతడు బ్రాహ్మణుడైన సామాన్య వ్యవసాయ కుటుంబంలోని వ్యక్తులలాగ జీవితం గడిపిన వాడు కావడం. గ్రామ వాతావరణం, గ్రామీణుల ప్రవృత్తులు బాగా ఆకళింపు చేసుకొన్నవాడు కావడం.

రెండవది భక్తకవి అయిన అన్నమయ్య వైష్ణవమత ప్రచారం కోసం ఊరూర తిరగడం, ఆరోజుల్లో కాదు ఈ రోజుల్లో కూడ వైష్ణవం అంటే తమిళ వైష్ణవమనే అభిప్రాయం వుంది. వైష్ణవ క్షేత్రాలలో తిరుపతి, సింహాచలం రెండు తప్ప మిగిలినవి అంతా తమిళ కేరళ రాష్ట్రాలలోని వున్నాయి. సామాన్యులకు వైష్ణవం అందరిది అనే అభిప్రాయం కల్గించడానికి ఊరూర వైష్ణవ ఆలయాలున్న ప్రదేశాలకెళ్ళి కీర్తించి దివ్య తిరుపతుల సంఖ్య పెంచారు.

మూడవది ఒక మతము ప్రచారం కావాలంటే తార్కిక భూమిక మాత్రం చాలదు. ప్రజలకు నచ్చేలా చెప్పడం అవసరం. అందుచేత అన్నమయ్య జానపదాంశాలను విరివిగా వాడు కొన్నాడు.

అన్నమయ్య సాహిత్యంలోని జానపద అంశాలను నాలుగు రకాలుగా

వర్గీకరించవచ్చు.

1. జానపద కథల స్వీకరణ
2. జానపద బాణీల స్వీకరణ
3. జానపద వాతావరణ వ్యక్తీకరణ
4. జానపద సంగీత స్వీకరణ

## 1. జానపద కథల స్వీకరణ :

కొన్ని కథలు శిష్ట సాహిత్యంలోను, జానపద సాహిత్యంలోను సమానంగా వుంటాయి. కాని కొన్ని కథలు, సన్నివేశాలు శిష్టసాహిత్యంలో ఉండకపోవచ్చు. రామాయణంలో, ఉడతపాత్ర, లక్ష్మణ దేవర నవ్వు, ఊర్మిళా దేవి నిద్ర మొదలైనవి. ఈ కథల ప్రచారాన్ని, ప్రజల ఆదరాన్ని పసిగట్టి వీటిని శిష్టకవులు ఆదరించవచ్చు. అలాగే భారత కథలు, భాగవత కథలు ఇతర పురాణ కథలు,

భాగవతంలో శ్రీకృష్ణ లీలలున్నాయి. వాటిలో లేని రెండుమూడు సన్ని వేశాలు అన్నమయ్య సంకీర్తనల్లో కన్పిస్తాయి. వాటిని పరిశీలిద్దాం.

తల్లి బిడ్డను లాలిస్తుంది. చందమామ **పాట** పాడుతూవుంది. "చందమామ రావే" అంటూ పిలుస్తుంది. శ్రీకృష్ణుడు చంద్రుణ్ణి చూశాడు. సైగ చేశాడు. ఆకాశంలోని చంద్రుడు దిగి వచ్చాడు. తల్లి హడలిపోయింది. పిలువగా ఒక వ్యక్తి రావడంలో వింతలేదు. చంద్రుణ్ణి చూడగానే దిగ్భ్రాంతురాలై ఎందుకు పిలిచానా అని అనుకొన్నదట. ఈ భావాలున్న కీర్తన.

"చందమామ పాడి తల్లి సరిపొత్తుకు రమ్మంటే
చందురు చూచి కృష్ణుడు సన్న జేసెను.
ముందర చంద్రుడు వచ్చి మొక్కితే యశోదచూచి
ముందేలా యంటినో యని మరచి వెర గందెను".

అలాగే మరో సన్నివేశం.

"నీరాటు లోన తన నీడ చూచి బాలుండట
రారమ్మని పిలిచి రా కుండగా
వారించి కడవ నీకు కలంచి వెదికే
పూరకే కానకే పొంచి వున్నాడు కృష్ణుడు.

నీళ్ళ కొరత రాయల సీమ వారికి క్రొత్త ఏమీ కాదు. వాగుల్లో, బానల్లో, కడవల్లో చివరకు ముంతల్లో కూడ నీరు భద్ర పరచటం అలవాటు రేపల్లె ఇండ్లలోని పిల్లలు రకరకాల ఆటలు ఆడుతున్నారు. వాటిలో 'నీరాట'కాగుల వెనుక దాక్కోవడం కూడా ఆటే. కృష్ణుడు ఆడుకుంటున్నాడు. అతని కంటే చాల ఎత్తు ఒక కాగు. అంతే ప్రయత్నం మీద ఎక్కి నిక్కి చూచాడు. ఆకాగులో అతని ప్రతిబింబం కనిపించింది. రారా అనిపిలిచాడు. వాడు రాలేదు. తన్ను రమ్మన్నట్లుగా అనిపించింది. కోపం వచ్చింది. చేతుల్తో కలచాడు. నీళ్ళ కదలిక లేకపోగా అపుడు మరల కనిపించాడట.

మూడవ సన్నివేశం. నాయకుడు ముత్యాల అంగి తొడుకున్నాడు. నాయిక ప్రేమతో నాయకుణ్ణి సమీపించింది. ఆమె రూపం ముత్యాల అంగిలో అనేక రకాలుగా ప్రతిబింబించింది. నాయకునికి తాను మాత్రం కాదు ఎందరో నాయకులున్నారు. వారిని చేర్చుకున్నాడని అసూయ పడిందట. తన తనానికి వేదన పడిందట కూడ.

## 2. జానపద గేయ బాణీలు :

ఇక రెండవ అంశం జానపదగేయ బాణీలు, శిష్ట సాహిత్యంలో కూడ జానపద గేయాల ప్రసక్తి వుంది. నన్నెచోడ కుమారసంభవంలో గొడు గీతా లున్నాయి. పోతన భాగవతంలో గోవిందు మీది పాటలున్నాయి. పాల్కురికి సోమన రకరకాలైన పాటల్ని వినడమే కాదు, వాటిని పాడగా చూసిన వాడు ఈ పాటల బాణీలు అన్నమయ్యకు నచ్చాయి.

వైష్ణవ వ్యాప్తికి ఆళ్వారుల పాశురాలు చాలవు. అంచేత ఆకట్టు కొనేందుకు జానపదగేయాల వరుసలు ఎన్నుకున్నాడు. పిల్లలకి ఇష్టమైన వస్తువు ఇచ్చి క్రమంగా మనము వినేలా చేసుకోవడమనే తంత్రం లాంటిదే ఇది. వాటిలో మేలుకొలుపు, సువ్వి, అల్లోనేరేళ్ళు, గొబ్బి, జాజర, సోది, తందాన, ఫల, కోలాట, చందమామ, శోభన, హారతి, నివాళి, ధవళ, ఉయ్యాల, లాలి, జోల మంగళ గీతాలున్నాయి. ఇతరులలో కనిపించని పాటలు కూడ వున్నాయి. వానిలో "జాలి" పాటలు రాజప్రసాదాలు చుట్టూ ప్రహరి తిరిగే వారు పాడేపాట జాలిపాట అని కొందరు భావిస్తారు.

"గాములు వారెడి పొద్దు, కావలి కొండ్లాల
జాము జాము తిరగరో జాలో జాలి
దీమసపు పారివార దివె పంజులు చేపట్టి
ఏమరక మీలో మీరు ఇయ్యారో జాలి

కారు కమ్మె నడురేయి గడవే కట్టిన వార
సారె సారె పలుకరో జాలో జాలి

ఇలాగే కులం జాతి పాటలు.

"పొదల గంధపు మేని బోయతి వచ్చి
పొడికప్పురపు బూత బోయతి
గుడిగొన్న మొగలి రేకులు యెన్ను కొనగోర
జిడిమి దేవుని లేసే బెంజల్".

3. జానపద వాతావరణం :

ఈ విభాగంలో ప్రధానంగా జానపదుల 'చిత్త వృత్తులు' ప్రాముఖ్యం వహిస్తాయి.

మచ్చుకు కొన్ని.

* పెక్కు పురుషులలోన పెరసోకసలి యుంటే
మక్కువై యుంటే నాటు నిందరి చూపు

* మగవాడెంత చక్కని మగువ కలిగినను
మిగుల వేరొక సతితో మేల మాడును.

* పతిలేని భూమికి బలవంతుడే రాజు
గతిలేని కూటికి కన్నదే కూడు
సతిలేని వానికి జరిగినదే యలు

* తన గట్టిల్లా నెరిగిన వారల ముందట
తన ఎమ్మెలు చెప్పు కొనుట రోత

* అంత హితులా తనకు అన్నలును, తమ్ములను
వంతు వాసికి పెనగు వారే కాక

* మగడు విడిచినా మామ విడువని యట్లు
వలపువ యొక్కు దీపావళి కానికె
కలయిక మాటలు వుగాది కానికె
మేదరింపు లంజె వోయి మేది నీకు తగులంగ
గొదిలి విటులెల్ల కుల్లిన యట్టు
ఎంత సేసెనొ దైవ మింతలోన నయ్యో
సంతపాక లంజవలె చల్లు చూపులేమికి

సామెతలు - పొడుపుకథలు :

జాన పదుల సంభాషణల్లో సామెతలు కుప్పలు తెప్పలు, సామెతలు 'అనుభవాల' కూర్పు.

నిజము పలికిన వైరము తోడె యగును
పనియంత కూలినంతే
పాసిన కూడు కంటె పస్తైన మేలు
తెలిసిన మాటకు తెర మరుగేటికి
కూలిచ్చిన వారు పనిగొనక విడుతురా!
పొగలో పడలేక సెగలో పడ్డట్లు
కుక్క తోక వంకర
ఏటి వంకలు దిద్ద వశమా?
దేవుడు కలవారికి దిగులు చింతయూ లేదు.
ఆశ కలిగిన చోట ఆడినదే సరసం
విరచెడ, ఊదర బలినిల యట్లు

ఒక నాయిక సిగ్గుతోనో లేదా వలపు కారణం వల్లనో, చెలికత్తెలతో మాట్లాడకుండ బిగుసు కొని కూర్చుంది. చెలికత్తెలకు అసలు విషయం తెలుసు. నాయికను ఆట పట్టించాలను కొన్నారు. లోకంలో ఎవరైన ప్రత్యేకించి సౌందర్య ప్రశంస చేస్తుంటే ముగ్ధలు కావడం సహజం. ఈ భావంతోనే అన్నమయ్య ఒక పొడుపు కథ రూపంలో చక్కటి సన్ని వేశాన్ని కల్పించాడు.

గొంది నొక సింహమట కొండలు మోచినదట
ఇందు ముఖుల నడుమ ఇరవట
కందువ ఈ పొడుపు కథ యిది నీవు మాకు
అందముతో ఆనతీవె ఆరు నెలలు గడువు

అన్నమయ్య శిష్ట భాషలోనే గాకుండ గ్రామ్య భాషలో కూడ లెక్కలేనన్ని కీర్తనలు వ్రాశాడు. ఇది పూర్తిగా జానపదుల్ని ఆకట్టు కోవడానికే. మచ్చుకు

"కూపెట్టు సదువుల కోనల పేరిట వాడు
పూప కొడుకు గని బాము లేలేటి వాడు
సాపనీటి కింద సతి సంక బెట్టుక
తాపుల తిరుమల దేవరైనాడే

సామాన్య జానపద సంప్రదాయాన్ని కూడ తాళ్ళ పాక అన్నమయ్య అవతార పురుషునికి అన్వయించి చెప్పడం విశేషం.

పసిపిల్లల్ని సాయంత్రం తిప్పరాదు. అలాగే చీకటి వేళ పసిపాపల్ని వాహ్యాళికి తీసుకెళ్ళరు. ఇవి జానపద సంప్రదాయమే అయినా వీటికి అన్నమయ్య మంచి కారణాలను జత చేశాడు. కృష్ణుడు నారాయణుడని కల్పన చేశాడు. అలాగే ఆది శేషుడు స్వామికి కైంకర్యము చేయడం కోసం సిద్ధంగా వున్నాడని భంగ్యంతరంగా చెప్పాడు. ఇవేకాకుండ జానపదుల నవ్వుల్ని, సందడి నవ్వు, వికిలి నవ్వు, పకపక నవ్వు, ముసి ముసి నవ్వు, కొలత నవ్వు, కుప్ప నవ్వు, కులుకు నవ్వు, నగరాని నవ్వు మొదలైన వాటిని, రకరకాల చూపుల్ని కూడ కొనచూపు, కొసర చూపు, తూగు చూపు, గులుకు చూపు, నగవు చూపు, కినుక చూపుమొదలైన వాటిని కూడ స్పష్టం చేశాడు.

4. సంగీతం :

అన్నమయ్య కాలం నాటికి సంగితం అంతగా రూపం అందుకోలేదు. అన్నమయ్యది ప్రధానంగా భజన సంప్రదాయమే. పురంధరదాసు కాలం నాటికి సంగీతం ఒకరూపానికి చేరుకొంది. అన్నమయ్యలో పాడడానికి వీలులేనటువంటి కీర్తనలు కూడ చాలా వున్నాయి.

ఉదా : "బాపు దైవమా మువాలి భవమా
తాపురాకాసి నెత్తురు ధీం ధోం ధోం ధోం ధోం ధోం ధోం
కాలనేమి పునుకిది కంచు వలె లెస్స వాగె
తాళమొత్తరే త్త్ త్త్ త్త్త్త్
కాలమెల్లము భూత్ గణమెల్ల వీడెకాచె
నేలబడి నేరుమ ధీం ధం ధీం ధీం ధీం ధీం ధం

అన్నమయ్య 95 రాగాలను ప్రయోగించినట్లు పండితులు భావిస్తున్నారు. వాటిలో ద్రావిడ భైరవి, తెలుగు కాంభోది చెంచు మలహరి మొదలైనవి. కర్ణాటకాంధ్ర ప్రాంతాలలో బాగా వ్యాప్తిలో వుండేవని పండితులు భావిస్తున్నారు. శాస్త్రీయ, సంగీత లక్షణాల కంటె అన్నమయ్యలో జానపద సంగీత ధర్మాలే ఎక్కువ అని చెప్పడం సమంజసం. ఈ రెండింటికి వున్న తేడాను ఆచార్య రామరాజు గారు స్పష్టంగా.

"The basic difference between the classical music and folk music is more in the spirit than in the out word form. Folk music is born of the rustir's heart, where as classical music in the product of the thinking mind of elite musicians.... ...The natural simplicity and the glow of human heart. So evident of in the rural folk form an important aspect in the style and form of folk music" అని వివరించాడు.

# 14. అన్నమాచార్యుల నాటి సాంఘిక జీవనం

సురవరం ప్రతాపరెడ్డిగారు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' వ్రాశారు. ఈ శాఖలో ఇదే మొదటిది. ఈ రచనకు వాఙ్మయం ఆధారం. అప్పటికి తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనల ముద్రణ చురుకుగా సాగలేదు. ఈ సంకీర్తనల ముద్రణ ఆరంభ దశలో ఉంది. సాంఘిక జీవనాంశాలెన్నో ఈ సంకీర్తనల వాఙ్మయంలో కనిపిస్తాయి. అన్నమాచార్యుల సంకీర్తనలు సమకాలిక సాంఘిక జీవనానికి దర్పణం లాంటివి. మచ్చునకు జాతరలు.

## 1.1. జాతర :

సురవరం ప్రతాపరెడ్డిగారు తన 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' లో సంఘంలో జాతరకు గల (స్థానాన్ని) ప్రాధాన్యాన్ని వివరించి అందుకు తార్కాణంగా 'పాండురంగ మహాత్మ్యం'లోని జాతర వర్ణన ఉదహరించారు. అయితే పాండురంగ మహాత్మ్యంలోని జాతర వర్ణన కంటే ముందే అన్నమాచార్యుల సంకీర్తనల్లో జాతర వర్ణన కనిపిస్తుంది. తాళ్ళపాక జాతర వర్ణన తెనాలి జాతర వర్ణన రెండూ జతచేసి పరిశీలించవచ్చు.

| | తాళ్ళపాక (11-2162) | తెనాలి (3-77) |
|---|---|---|
| 1. | మారుగాళ్ళీయ వద్దు | మారుగా విచ్చెనకో సుధా<br>మధురవాణి |
| 2. | చిచ్చులోన - చొరవద్దు | చెందమ్మి కొలన రంజిల్లు<br>నంచమ వోలె నిప్పు టెట<br>జరించె నెలత యొర్తు |
| 3. | సిడిదల వియ్య వద్దు | అంబోధరము క్రింద నసియాడు<br>ఐరావతియు వోలె సిడి<br>క్రవిదె రవయోర్తు బత్తులగు<br>నువాకత్తు మొత్తిరి |
| 4. | జీవాల జంపవద్దు | పశు సమాజి మండములు<br>వాడముఖ నెత్తు ధారలు<br>ఘోర విపత్తి మిరణ వారుణ<br>ప్రభలు ప్రబలంగన్ |

పరిశీలిస్తే తెనాలి జాతర వర్ణనకు తాళ్ళపాక వారు మార్గదర్శకులన వచ్చు. ప్రబంధాలలో మనకు కనిపించే సాంఘికాంశాలకు అన్నమాచార్యుల సంకీర్తనలలోని అంశాలే మూలమనిపిస్తాయి.

శక్తిని సంతృప్తి పరచి అమ్మవారి మన్ననల్ని పొందడానికై మారుచేతులు మామూళ్ళివ్వడం, గుండెలు కోసివ్వడం, జంతుబలివ్వడం, హింసాత్మకమైన కైంకర్యాలు ఆనాటి జాతరలోని భాగాలు.

అన్నమయ్య ఈ జాతర వర్ణన తిరుపతి గంగజాతర్ని తలపిస్తుంది. ఎనుబోతును బలివ్వడం, దాని మెడ తెగి క్రిందబడే లోపల దానిగుండెలు, గిట్టలు కోయడం జరిగెడిది. ఆ బలికి ముందు ఆ ఎనుబోతును గుడిచుట్టూ ఊరేగింపుగా తిప్పడం ఆనవాయితి. దీన్తోపాటు మేకలు, మేకపోతులు, గొర్రెలు, పొట్టేల్ళు, కోళ్ళు మొదలగు వాటిని బలివ్వడం జరిగేది. ఎంత నిషేధమున్నా నేటికీ జాతర్లో కొన్ని హింసాత్మక కృత్యాలు వాడవాడూరూర ఉన్నాయి. అన్నమయ్య తిరుపతి జాతర్నో లేక తన తాళ్ళపాక గ్రామ ప్రాంతంలో జాతర్నో చూసి ఈ జాతర వర్ణన చేసి వుండవచ్చు. అన్నమయ్య వర్ణనల ద్వారా ఆనాటి జాతరల విధానం మనం తెలుసుకోవచ్చు. అన్నమయ్య కాలం నందే ఈ జాతర్లు వున్నాయని ఫలితార్థం.

## 1.2. బందె :

గ్రామాల్లో పశువులు పంట పొలాల్లో పడి పంటను నాశనం చేస్తే క్షేత్రాధికారి ఆ పశువుల్ని గ్రామాధికారి కప్పగిస్తాడు. గ్రామాధికారి వానిని ఒకచోట ఉంచి నిర్ణీత శుల్కాన్ని పశువుల ఆసామి చెల్లించిన ఆ పశువుల్ని విడిపిపెడ్తాడు. ఈ పశువుల్ని గ్రామాధికారి నిర్బంధించిన స్థలాన్ని 'బందెలదొడ్డి' అంటారు. ఈ బందెల దొడ్డి తాళ్ళపాక అన్నమయ్య కాలంలో వారి గ్రామంలోనూ, అతను సంచరించిన స్థలాల్లోనూ ఉండినట్లు అతని ప్రయోగాలాధారంగా తెలిసికోవచ్చు.

"పసరము వంట మాట పాపపు బందెలు దెత్తు" (10-23)

"పసిమి పాపమునేటి బందెమేయు పసరము" (7-107)

"బందెలు మేసితిని" (10-227)

మొదలగుచోట్ల అన్నమయ్య బందె ప్రయోగం కావించినాడు.

### 1.3. కానుకలు :

కానుక, కానిక అని కూడా కలదు. ఉపహారమని నిఘంటు వర్థం. పెళ్ళిళ్ళలో వధూవరులకి మనమిచ్చే బహుమానాల్ని పెళ్ళికానుక అంటారు. దేవునికి కానుకలు సమర్పించడం ఆచారం. ఇది వారివారి శక్తిని బట్టి వుంటుంది. పూలు, పండ్లు, ధనం, కనకం, వస్తు వాహనాదులు దేవునికి కానుకగా అర్పిస్తారు. అన్నమయ్య కీర్తనల్లో శ్రీ తిరుపతి వేంకటేశ్వరుడు దొండపండు, పూలగుత్తి తన ప్రియురాండ్ర కిచ్చినట్లుగా వర్ణింపబడి వుంది (15-177). ఆ ప్రియురాండ్రు వేంకటేశ్వరునికి వెలగపండు. టెంకాయ కానుకగా ఇచ్చినట్లు వర్ణితం (12-35). ఈ కానుకల్లో టెంకాయ, పూలు నేటికి కూడా వున్నాయి. వెలగ పండు, దొండ పండు వినాయకచవితి మొదలగు రోజుల్లో తప్ప సామాన్యంగా కానుకలుగా లోపించాయి. కారణం విరివిగా లభించకపోవుటయే కావచ్చు. అన్నమయ్య నాడు ఇట్టి కానుకలుండినట్లు గ్రహింపవచ్చు.

### 1.4. బంగారు :

ఇనుమును బంగారంగా మార్చే ప్రయత్నాలు ఎప్పటి నుండో జరుగుతు న్నాయి. వేమన చరిత్రలో సహితం ఈ చర్చ వుంది. అన్నమయ్య కీర్తనల ద్వారా అన్నమయ్య కాలంలో కూడా ఈ నమ్మకమున్నట్లుగా తెలుస్తుంది. పరుసవేది సహాయంతో ఇనుమును బంగారంగా మార్చడానికి ఆనాటి వారు ప్రయత్నించినట్లు (8-190) తెలుస్తుంది. ఇంకా ఇత్తడిపై బంగారు నీరూదుట ఆనాటి వారికి కొత్త కాదని

"చెంబు మీది కుప్పు బొంత" (7-1)

వల్ల తెలుస్తుంది. మరియు

"పాదికెత్తు మెరుగారు బంగారు *గుండు*" (12-278)

అను ప్రయోగం వల్ల ఆనాటివారు బంగారాన్ని పాతిక విభాగాలుగా తూచి వ్యవహరించేవారని తెలుస్తుంది.

### 1.5. ఆభరణాలు :

పూర్వం పురుషులు కూడా ఆభరణాలు ధరించేవారు. నిన్న మొన్నటి వరకు గ్రామాల్లో పురుషులు చెవులకు ఆభరణాలు ధరించేవారు. అట్లే పురుషులు జడవేసి పూలు పెట్టుకొను పద్ధతి 30 సంవత్సరాల ముందు

కూడా గ్రామాల్లో ఉండేది. అన్నమయ్య కీర్తనలాధారంగా అన్నమయ్య నాడు పురుషులు ఆభరణాల్ని ధరిస్తున్నట్లు తెలుసుకోవచ్చు. చుక్కలవలె ప్రకాశవంతాలగు పూసలు (7-15, 10-85) చిరుగంటల మువ్వల గజ్జలు (12-302), సూర్యచంద్రుల వంటి మొలపూసలు, మొలగంట (11-175) నాడు పురుషులు ధరించు ఆభరణాలుగా తెలియనగును. అట్లే మొలనూళ్ళు (12-297) (12-4) బరువైన మొలనూళ్ళు (4-148), తీగ వడ్డాణం (4-35) అను ఆభరణాలు స్త్రీలు ధరించునవిగా తెలియుచున్నవి. మరియు సంకుచేరులు (7-12) కొత్త ముత్యపు సరులు (4-28) అచ్చపు గుచ్చు ముత్యాల హారాలు (12-302) ఈ ప్రయోగాల్ని బట్టి ఆనాడే ముత్యాలయందధిక ప్రీతి యున్నట్లు తెలుస్తుంది. ముత్యాల కుచ్చుల విషయం అన్నమయ్య ప్రస్తావించి యున్నాడు. ముత్యాల కుచ్చులు (8-164) కుచ్చుల ముత్యాలు (4-108) అను ప్రయోగాలు గమనింపదగినవి.

అన్నమయ్య కీర్తనల్లో స్త్రీ పురుషులిరువురూ హస్తాభరణాలు ధరించినట్లు పేర్కొనబడింది. ముత్యాల కంకణాలు (12-304) ఈ ముత్యాల కంకణాలు స్త్రీల హస్తాభరణంగా తెలుస్తుంది. సంధి దండలు, సంకు కడియం (4-108) ఇది పురుషుల హస్తాభరణంగా తెలుస్తుంది.. ముంగ మురువులు, చేమపూ కడియాలు (11-2120) ఇది చిన్నపిల్లల చేతికి వేసే ఆభరణ విశేషం కావచ్చు.

## 1.6. సంత :

గ్రామాల్లో సామాన్యంగా సంతలు జరుగుతుంటాయి. రైతులు తాము పండించిన కూరగాయలు ఈ సంతలకు తీసుకొనిపోయి అమ్ముతారు. ఈ సంతల్లో కూరగాయల్తో పాటు నిత్యావసర వస్తువులూ లభిస్తాయి. నేడు ప్రత్యేకంగా టమోటా సంత - అని కొన్ని గ్రామాల్లో జరుగుతూంది. అనగా ఆరోజు ఆ గ్రామంలో పండిన టమోటా అంతా అక్కడికి తీసుకురాగా పట్టణాలనుండి వచ్చే వ్యాపారస్తులు ఆ టమోటాలను కొని పట్టణాలకు చేరుస్తారు. అట్లే పొట్టేళ్ళ సంత, పశువుల సంత నేడున్నాయి. ఈ పశువుల సంతనే 'పరస' అనికూడా అంటారు. ఈ సంతలు అన్నమయ్య కాలంలో ఉన్నట్లు అన్నమయ్య కీర్తనల ద్వారా తెలుస్తుంది.

"చింత చిగురు దెచ్చి సంతలో నమ్మి" (4-116)

ఆనాడు 'మైలసంతలు' (5-178) కూడా ఉన్నట్లు తెలుస్తుంది.

## 1.7. వృత్తులు :

### 1.7.1 వెట్టి :

'వెట్టి' శబ్దానికి 'కూలి లేక చేసెడు పని' అని నిఘంటువర్థం. ప్రాచీన కాలంలో గ్రామాధికారి ఆజ్ఞల్ని శిరసావహించి రాత్రింబవళ్ళు విరామం లేక కష్టం చేసేవాడు వెట్టివాడు. ఈ పనికి ప్రతిఫలం లేదు. నేడీ వెట్టి చాలావరకు లోపించింది. గ్రామ ప్రాంతాల్లో 'తోటివాడు' అని ఉంటాడు. 'తోటి' అనగా మాల, చండాలుడని నిఘంటువర్థం. పండుగ రోజుల్లో ఈ తోటివాడు ఉన్నత కుటుంబాల వారికి ఇండ్లు పూసుకోవడానికి ఎర్రమట్టి, పండుగ రోజుకు సరిపడే వంట చెరకు తెచ్చిచ్చే ఆచారముంది. అలాగే ఈ తోటివాడు మట్టిపాత్రల క్రిందవేసే చుట్టకుదుర్లు చేసి ఇస్తాడు. దీనికి ప్రతిఫలంగా వానికి పండుగరోజు భోజనం, పంట వచ్చిన రోజు తిరిపెం లభిస్తాయి. ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో ఈ తోటి పనివాండ్రు ఉన్నారు. వెట్టివానికి, తోటివానికి కొంత వ్యత్యాసం కనిపిస్తుంది. తోటివాడు కొన్ని రైతు కుటుంబాల నాశ్రయించి బ్రతుకుతుంటాడు. వాడాశ్రయించుకున్న ఇళ్ళల్లో ఎవరైనా మరణిస్తే బంధువర్గాని కంతటికీ ఈ తోటివాడు పోయి చెప్పి రావడం సంప్రదాయం. గ్రామంలో తోటివానితో పాటు తలారి ఉంటాడు. రాత్రివేళల్లో దొంగతనం జరక్కుండా కావలి కాచేవాడే తలారని నిఘంటువు చెబుతుంది. గ్రామాల్లో ఈ తలారికి కొంత ప్రాధాన్యముంది. గ్రామంలోని పెద్దల్ని ఒకచోట చేర్చడానికి గాని, లేదా ఏదైనా ఒక విషయం గ్రామమంతా చాటించడానికి గాని ఈ తలారి సహాయపడతాడు. జాతర మొదలగు వానిలో జంతు బలులిచ్చేప్పుడు చాకలి సహజంగా జంతుబలికి పూనుకొని పోతును పూజించి తానుకూడా బొట్టుపెట్టుకుని కత్తిని చేతబట్టి "దొరవారి సెలవు. నగిరి నాయనవారి సెలవు. పినపెద్దల సెలవు. తోటి తలారి సెలవు అయిందా" అంటాడు. అప్పుడక్కడున్న పెద్దల అనుమతి తెలిపితే బలి కావిస్తాడు. ఇక్కడెక్కడ కాని వెట్టివాని ప్రసక్తి లేకపోవడం గమనార్హం. వెట్టి కేవలం గ్రామాధికారి ఆజ్ఞను మాత్రమే నిర్వర్తిస్తాడు. కాబట్టి ప్రత్యేకమైన గుర్తింపు లేకుండా పోయినాడు.

అన్నమయ్య కీర్తనల్లో గ్రామాధికారి నియోగాల నాచరింప లేక వెట్టి గ్రామాంతరానికి పారిపోగా మరలా వాన్ని వెదికి తెచ్చినట్లు వర్ణింపబడింది. (11-2/31) మరొక్కచోట (5-11/5) వెట్టి బరువుల్ని మోసినట్లుగా జీవుడు ఈ శరీరాన్ని మోస్తున్నాడని వర్ణింపబడింది. అన్నమయ్య ఈ వర్ణన ద్వారా నేడు అంతరించిపోయిన ఈ వెట్టి ఆచారం ఒకనాడు ఆంధ్రదేశంలో ఉండేదని చెప్పవచ్చు.

1.7.2. దొమ్మరులు

గడసాము చేసి తమ ఆటల్తో ప్రేక్షకులకు వినోదాన్ని కలిగించేవారు దొమ్మరులు. వీరు సామాన్యంగా రైతులకు పంటలు చేతికందినప్పుడు గ్రామాల్లో విరివిగా తమ ఆటల్ను ప్రదర్శించి ధాన్యాన్ని సంపాదిస్తారు. ఈ దొమ్మర్ల గడసాములు అన్నమయ్య నాడు కలవని అన్నమయ్య కీర్తనల్లో (7-12) వ్యక్తమౌతుంది.

1.7.3. కమ్మరి :

కమ్మరి పని చేసి బ్రతికేవాడు కమ్మరి. గ్రామాల్లో ఈ కమ్మరి పని చేసేవార్ని కంసాలి అంటారు. వీరు ఇనుముతో అనేక పనిముట్లు చేస్తుంటారు. రైతులకు వీరికి విడదీయరాని బంధం ఉంది. పొలందున్నే నాగళ్ళి, గొడ్డలి, పార, కత్తి మొదలగు పనిముట్లన్నీ కమ్మరి తయారుచేసి రైతుకిస్తాడు. పంటలు వచ్చినపుడు ఈ రైతులు కమ్మరికి 'మేర' అనుపేర కొంత ధాన్యాన్నిస్తారు. అంతేగాక కమ్మరి తాను చేసిన పనిముట్లు గ్రామ సంతలో విక్రయిస్తుంటాడు. అన్నమయ్య కీర్తనం ద్వారా అన్నమయ్య కాలంనాడు ఈ కమ్మరు లున్నారని తెలుస్తుంది.

"మన్మథునివే ఖడ్గమునకు వసంతుడను
కమ్మరి పదును పెట్టెను" (13-140)
"సానబల్లపై మాపులనే ములుకులకు
దును పెట్టెను ఆ నికషము
లన మోహమను పొడి రాలినది" (13-409)

1.7.4. నేతగాండ్రు :

ఈ నేతవారినే సాలెలని, తొగట్లని గ్రామాల్లో పిలుస్తుంటారు. వస్త్రాలు నేయుట వీరి వృత్తి. ఈ నేతవారు అన్నమయ్య కాలంలో వున్నారని ఈ క్రింది ప్రయోగం ద్వారా తెలుస్తుంది.

(పంచ భూతములనే పలువన్నెల నూలును
చంచలమనే గంజిలో ముంచి చీరను నేచి యిమ్ము" (5-178)

1.7.5. ఓడ వ్యాపారం :

అన్నమయ్య సంకీర్తన లాధారంగా అన్నమయ్య కాలంలో ఓడ వ్యాపారం

సాగుచుండేదని తెలుస్తుది. అంతేగాక ఓడ వ్యాపారానికి సుంకం చెల్లించుట కూడా వుండేదని తెలుస్తుంది.

"సంసారమనే సముద్రము నందు
దేహమను ఓడ వ్యాపారి పాప
పుణ్యములను సరకులతో బూతు
రేవున దిగినట్లు సుంకము నాటి అభ్యర్థనము" (9-35)

అట్లే ప్రతికూల వాతావరణంలో శరీరాన్ని ఓడవలె యథేచ్ఛగా పోనీయువలెనని ఉంది. (11-79)

దీన్ని ఆధారంగా ఓడ వ్యాపారులు ఎదురుకొను విపరీత వాతావరణం ఆనాటి వారికి సుపరిచితమనిపిస్తుంది. ఉప్పు మొదలైన వాటిని ఎద్దుల మీద, గాడిదలమీద, ఎనుబోతుల మీద ఏసుకొని వచ్చి గ్రామాల్లో విక్రయిస్తారు.

అన్నమయ్య కీర్తనల్లో వస్తువుల సంచుల్ని ఎద్దుంపై వేసుకొని వచ్చి అమ్మినట్లు (5-307) వర్ణింపబడి ఉంది. దీన్నిబట్టి ఇటువంటి వ్యాపారం అన్నమయ్య నాడుండేదని తెలుస్తుంది.

## 1.7.6. వడ్డీ వ్యాపారం :

అన్నమయ్య కీర్తనల ద్వారా ఆనాడు వడ్డీ వ్యాపారం ఉండేదని తెలుసుకోవచ్చును. వడ్డీకి డబ్బు పుచ్చుకున్నప్పుడు పత్రం రాసిచ్చేది ఆనవాయితి. దాన్నే నేడు 'బాండు' అంటారు. ఈ పత్రం రాయడం అన్నమయ్య నాడు కూడా ఉండినట్లు (5-294) తెలుస్తుంది. వడ్డీ వ్యాపారంతో పాటు కుదువ వ్యాపారం కూడా ఆనాడు వుండేదని అన్నమయ్య కీర్తనల (10-142) ద్వారా తెలుస్తుంది.

## 1.8. ఆహారం :

అన్నమయ్య సంకీర్తనాలాధారంగా ఆనాడు వారు వరి అన్నం ఎక్కువగా భుజించేవారని తెలుసుకోవచ్చు. అరసి రాజాన్నాలు సూర్య చంద్రబింబాలవలె ప్రకాశవంతాలైన పళ్ళాల్లో వడ్డించగా అది రాశిపోసిన చుక్కలవలె ఉందని (9-10) అన్నమయ్య వర్ణించాడు. అట్లే బంగారు పళ్ళెమందు రాజాన్నాలు వడ్డించినట్లు (4-4) అనియు కొండలవలె రాశిగా పోసిన దివ్యాన్నాలు (5-22) అని అన్నమయ్య వర్ణించడం గమనార్హం.

### 1.8.1. ఇడ్డెన

దీన్ని నేడు ఇడ్లీ అనుచున్నాం. ఇడ్డీని ఆనాడు దేవునికి నైవేద్యంగా పెట్టినట్లు అన్నమయ్య కీర్తనల ద్వారా తెలుసుకోవచ్చు. మేరు మందర పర్వతమట్లు స్థూలాలు, ప్రకాశవంతాలైన ఇడ్డెనలు (9-10) దేవున కారగింపు చేసినట్లు అన్నమయ్య వర్ణించాడు.

### 1.8.2. కూరలు :

ఇడ్డెనతో పాటు దేవునికి పచ్చళ్ళు, కూరలు నైవేద్యంగా పెట్టే ఆచార మానాడు కలదని తెలుసుకోవచ్చు. పండిన పంటలవలె సరసాలు స్వాదనలు అయిన పచ్చళ్ళు, కూరలు దేవున కారగింపు చేసిరి. (9-10) కూరలకు మిరియంపు తాళింపు వేసినట్లు (5-22) అన్నమయ్య వర్ణించాడు. కూడు లేనందున కూరలనే తిని ఆకలి నివారించుకొను వారున్నట్లు (5-137) వర్ణింపబడింది. నూగుల పిండిని తెచ్చి వండుకొని కూరగా తినేవారని (17-449) తెలుస్తుంది.

### 1.8.3. నేయి, తేనె, పానకాలు :

గ్రామాల్లో సామాన్యంగా ప్రతి ఇంటా నేతికి, వెన్నకు ఉట్లుగట్టు ఆచారముంది. ఈ ఉట్లను నేయిని వెన్నను అన్నమయ్య పేర్కొనియున్నాడు. నేతికి వెన్నకు ప్రత్యేకమైన ఉట్లున్నట్లు (8-149) అన్నమయ్య వర్ణించాడు. నేయి, వెన్న, పాలు పెరుగులతో పాటు తేనెను కూడా ఉట్లపై భద్రపరచే వారని (10-141) తెలుస్తుంది. పాలు, పెరుగు ఉంచిన పాత్రలను పాన్నారు దొంతర్లుగా (10-228) పేర్చినట్లు వర్ణితం. వీనితోపాటు పానకానికి కూడా గారు ప్రత్యేకంగా ఉట్టి కట్టేవారని (8-149) తెలుస్తుంది. భోజనంతో పాటు వీరు పానకం, టెంకాయ, పాలు, ఆనవాలు (4-4) సేవించే వారని గ్రహించవచ్చు.

### 1.8.4. జున్ను :

అన్నమయ్య కీర్తనల్లో జున్ను వర్ణనవుంది. ఆవుగాని, బర్రెగాని ఈనిన మొదటి రెండు రోజుల్లో పాలను బాగా కాచిన జున్ను ఏర్పడుతుంది. ఈ జున్నులో పంచదార కలుపుకొని తింటారు. జున్నులు (4-4) గడ్డ జున్నులు పెద్ద కాగుల్లో కాగుచున్నవి (4-114) అనే విషయాన్ని అన్నమయ్య వర్ణించాడు.

### 1.8.5. గోధుమ :

వరి అన్నాన్నే కాక గోధుమను కూడా ఆ రోజుల్లో ఆహారధాన్యంగా వారు స్వీకరించినట్లు అన్నమయ్య ప్రయోగాల వల్ల తెలుసుకోవచ్చు. సైంధపు పేణులు (5-22) అని అన్నమయ్య ప్రయోగం. సైదం అనగా గోధుమ.

### 1.8.6. ఉపాహారాలు :

ఆనాడు ఉపాహారాలుగా ఆనవాలు, అటుకులు (8-149) చక్కిలాలు, నురుగులు (17-139), (10-228) నూనె బూరెలు, వడలు, పరమాన్నంబులు, అరిసెలు, గారెలు, కర్జకాయలు, పూరణ కుడుములు, ఇడ్డెన కుడుములు, అప్పాలు మొదలగునవి (4-4) గ్రహించినట్లు తెలుస్తుంది.

## 1.9. అలంకారాలు :

### 1.9.1. స్నానం :

ప్రాతః కాలాన్నే దంత ధావనం చేసే విధానం ఆనాడుండేదని

"కమల నాభుడ నీకు గంగాది నదులెల్ల
నమర మొక మజ్జనంబాయితము సేసె"

అను దాన్ని బట్టి తెలుస్తుంది. తిరుపతి కొండమీద నిత్య పారాయణం చేస్తున్న శ్రీ వేంకటేశ్వర సుప్రభాత మందైనను కానరాని ఈ ముకమర్జన ప్రసంగం యిందుండడానికి స్థానిక ఆచారమే కారణం కావచ్చు. లేక అన్నమయ్య జీవిత విధానం కారణం కావచ్చు. వారు స్నానానికి పన్నీరు, పునుగు ప్రయోగించినట్లు (8-163) తెలుస్తుంది. జవ్వాది ద్రవాలను కాచి శిరస్సును కడిగినట్లు దానివల్ల వెంట్రుకల చిక్కు వీడినట్లు (4-35) అన్నమయ్య పేర్కొనియున్నాడు. అన్నమయ్య నాడు ఆనాటి ఉన్నత కుటుంబీకులు పునుగు, జవ్వాదులు ఉపయోగించినట్లు గ్రహింపవచ్చు.

### 1.9.2. అనులేపన :

స్నానానంతరం శరీరానికి సువాసనా భరితమైన కస్తూరాదులు ఆనాడు పయోగించినట్లు అన్నమాచార్య కీర్తనల వలన తెలుస్తుంది. కస్తూరి, గంథం (13-285) పన్నీరు (4-93) తట్టు పునుగు - కప్పురము - జవ్వాది (4-15) అనునవి వారానాడుపయోగించిన అనులేపనాలని తెలుస్తుంది.

### 1.9.3. కొప్పు, తిలకం :

అన్నమయ్య కాలంనాటి స్త్రీలు తమ వెంట్రుకల్ని కొప్పుగా ముడుచుకొని చేమంతి పువ్వుల్ని పెట్టుకొన్నట్లు (4-134) అన్నమయ్య సంకీర్తనల వల్ల తెలుస్తుంది. అంతేగాక వీరు సవరాన్ని కూడా ధరించినట్లు (12-) గ్రహించవచ్చు. కమ్మని వాసన గల కస్తూరితో (4-35) చంద్రవంక వంటి తిలకాన్ని (15-90) ఆనాటి స్త్రీలు పెట్టుకున్నట్లు గుర్తింపవచ్చు. ముఖానికి లత్తుకను పూసుకొనుట (4-28) ఆనాడు కలదని తెలుస్తుంది.

### 1.9.4. వస్త్రాలు :

స్త్రీలు సామాన్యంగా సున్నితమైన వస్త్రాల్ని ధరించేవారని చెప్పవచ్చు. అన్నమయ్య కీర్తనల్లో దానిమ్మ పూవు వన్నె కలిగి సున్నితాలైన వస్త్రాలన్ని (4-42) ఆనాటి స్త్రీలు ధరించినట్లు తెలుస్తుంది.

### 1.9.5. గృహాలు :

గృహాల్లో ఆనాటి వారు నిలువుటద్దాల్ని కమలాల పాన్పుల్ని కలిగి వుండే వారని తెలుస్తుంది. (15-299) వారు దోమతెరను కూడా వాడినట్లు (17-300, 13-251, 17-403) గ్రహింపవచ్చు. గృహాల్లో చిలుకల్నీ, కోయిల్లనూ, నెమళ్ళనూ పెంచి వానికి మాటలు పాటలు నేర్పే ఆచారం ఆనాడు కలదని (13-506) గ్రహింపవచ్చు. జక్కువ పులుగుల్ని కూడా పోషించేవారని అవి శకునాల్ని తెలియజేసేవని (13-506) అన్నమయ్య వర్ణించి వున్నాడు. అన్నమయ్య కీర్తనల్లో రకరకాల వసంతాల ప్రస్తావన ఉంది. కలువల వసంతం, వెన్నెల వసంతం, గంధాల వసంతం, మంచినీళ్ల వసంతం, బంగారు వసంతం, కెందామర వసంతం, ముత్యాల వసంతం వర్ణింపబడ్డాయి.

సురవరం ప్రతాపరెడ్డి గారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'కు వారు గ్రహించిన కాలం 1336-1530 మధ్యకాలం. అనగా విజయనగర సామ్రాజ్య కాలాన్ని వారు గ్రహించారు. కాని 1424-1503 మధ్యకాలం వాడైన అన్నమయ్య కీర్తనల్ని ప్రతాపరెడ్డి గారు గ్రహింపలేదు. కారణం వీరి రచనా కాలం నాటికి అన్నమయ్య కీర్తనలు అముద్రితాలు. సాంఘిక దృష్టితో అన్నమాచార్యుల కీర్తనల్ని సమగ్రంగా పరిశీలిస్తే ఆనాటి తెలుగువారి సాంఘిక రాజకీయాది వ్యవహారాలు ఎన్నియో వెలుగు లోనికి వస్తాయి.

## 15. "రాళ్ళపల్లి సారస్వతాలోకము"

### 1. ఊరు–పేరు :

అనంత కృష్ణ శర్మ గారి జన్మస్థలం అనంతపురం జిల్లా కళ్యాణదుర్గం తాలూకాలోని రాళ్ళపల్లి గ్రామం. 23 జనవరి, 1893 (నందన సంవత్సరం మాఘశుక్ల షష్టి సోమవారం రేవతీ నక్షత్ర ద్వితీయ పాదం) వీరి జననకాలం. అనంతకృష్ణశర్మగారి పూర్వీకులు కర్నూలు జిల్లాలోని కర్నామడకల గ్రామంలో నుండి రాయదుర్గం సంస్థానానికి వచ్చి స్థిరపడినట్లు తెలుస్తుంది. శర్మ గారి తండ్రి శ్రీ. కర్నామడకల కృష్ణమాచార్యులు. తల్లి అలిమేలు మంగమ్మ. శ్రీకృష్ణమాచార్యులు గారు రాళ్ళపల్లిలో వివాహం చేసుకొన్న తర్వాత రాళ్ళపల్లి లోనే స్థిరపడినారు. కృష్ణమాచార్యుల అత్తగారు లక్ష్మమ్మ. కృష్ణమాచార్యులి ద్వితీయ సంతానమైన అనంతకృష్ణశర్మ ఇంటి పేరు రాళ్ళపల్లిగా మారింది. అనంతకష్ణ శర్మ–'రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ'గా, 'రాళ్ళపల్లి'గా సాహితీ లోకంలో ప్రసిద్ధులైనారు.

### 2. విద్య–ఉద్యోగము :

మాతామహి, పెంపుడు తల్లి అయిన లక్ష్మమ్మ గొప్ప విదుషీమణి. ఆ సంస్కారం రాళ్ళపల్లికి అబ్బింది. అనంతకృష్ణ శర్మ గారి తొలి గురువు తండ్రి కృష్ణమాచార్యులు గారే. తండ్రి దగ్గరే 13 ఏళ్ళలోపే రఘువంశం, చంపూరామాయణం, రామాయణ సంగ్రహం, చంపూ భాగవతం, విశ్వగుణాదర్శం మొదలైన సంస్కృత కృతులతో పాటు అనేక కావ్యాల్లో శ్రీ శర్మగారు పరిచయాన్ని పెంచుకున్నారు.

1906లో మైసూరు చేరిన అనంతకృష్ణ శర్మ సజ్జయ్యు తాతాచార్యుల వద్ద సంస్కృత కావ్యాధ్యయనం చేశారు. తరువాత శ్రీ కృష్ణబ్రహ్మ తంత్ర పరికాల యతీశ్వరుల దగ్గర వైష్ణవ దీక్షను పొందారు. పరకాల మఠంలో జరిగే విద్వత్సభల్లో పాల్గొనడం వారి భావి జీవితాన్ని ప్రభావితం చేసింది.

అనంతకృష్ణశర్మగారి మూడవ గురువు శ్రీ చామరాజ నగరం రామశాస్త్రి

గారు. అనర్ఘ రాఘవం, ముద్రారాక్షసం, ఉత్తర రామచరిత్ర, శాకుంతలం వీరి వద్దనే చదువు కొన్నారు. వీరి తరువాత శర్మగారి గురువు కట్టమంచి రామలింగారెడ్డి. "సాహిత్య సంస్కారమున నా కడపటి గురువు రెడ్డి గారు" అని శర్మ గారే స్వయంగా చెప్పుకొన్నారు. కట్టమంచి వారి పరిచయంతో శర్మగారు ఆధునిక ప్రపంచంలోకి అడుగు పెట్టారు. కవిత్రయ భారతంపై వీరిద్దరి మధ్య కూలంకష చర్చలు జరిగేవట. ఇరుప్రక్కల మూడవ వ్యక్తి చొరలేని ముగ్ధ మధుర సంబంధము మాది" అని శర్మగారే స్వయంగా చెప్పుకొన్నారు.

ఏ డిగ్రీలు లేకపోయినా శర్మగారి విద్వత్ ఎంతటిదో గ్రహించిన కట్టమంచి మహారాజ కళాశాలలో తెలుగు పండిత పదవిని శర్మగారికి యిప్పించారు. 19 సంవత్సరాల వయసులో (2 జూలై, 1912) పదవిని చేపట్టిన శర్మగారు 37 సంవత్సరాలు (19 డిసెంబరు, 1949) అవిచ్ఛిన్నంగా నిర్వహించారు.

## 3. సభలు - సన్మానాలు :

1957లో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమిలో శ్రీ శర్మ గారు సభ్యులు. 1961లో 'గాన కళా సింధు'అనే బిరుదును పొందారు. తరువాత ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి 'గానకళాప్రపూర్ణ' అనే బిరుదుతో సన్మానించారు. 18-10-1970న జరిగిన ద్వితీయ సంగీత సమ్మేళనానికి శర్మగారు అధ్యక్షత వహించి 'సంగీత కళారత్న' అనే బిరుదు పొందారు. 1974లో మద్రాసు మ్యూజిక్ అకాడమి వారు 'సంగీత కళానిధి' బిరుదును ప్రదానం చేశారు. 1970లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం శ్రీ శర్మగారికి గౌరవ డాక్టరేట్ పట్టానిచ్చింది.

## 4. సంగీతం :

శర్మగారు కేవలం సాహితీ అభిలాషులే కాదు, సంగీత ప్రియులు కూడా. శర్మగారికి సంగీతంతో మంచి పరిచయం వుంది. రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారు సంగీత, సాహిత్యాల్లో సమాన ప్రతిభా, పాండిత్యాల్ని కలవారు. విమర్శకులుగా వీరికున్న స్థానం ఆంధ్రులలో మరొక్కరికి లేదనుట సత్యము.

అనంత కృష్ణ శర్మగారి రచనల్లో అధిక భాగం సంగీతానికి సంబంధించినవే. ఉద్యోగ విరమణ తరువాత శర్మగారు పీఠికలు, విమర్శలు, సమీక్షలు అనేకం చేశారు. వారిని సందర్శించిన విజ్ఞాన జిజ్ఞాసువులకు జ్ఞానామృతం పంచిపెటారు.

5. సాహిత్యం :

సాహిత్య సృష్టి కవిధర్మమయితే. ఆ సృష్టి గుణదోషాల్ని విప్పిచెప్పడం విమర్శకుని ధర్మం. కావ్యతత్వ నిరూపణలో కవి, విమర్శకులు యిద్దరు భాగ స్వాములే. లోకంలో కవిగా కన్న రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మకు విమర్శకుడుగా ఎంతోగొప్ప పేరుంది. శర్మగారు శతకాలు, భావగీతాలు, ఖండ కావ్యాలు, నవల మొదలైన సృజనాత్మక రచనలు గావించారు. గ్రంథపీఠికలు, ఉపన్యాసాలు, వ్యాసాలు మొదలైన విమర్శనాత్మక రచనలు గావించారు. అనువాద రచనలు కూడా చేసారు.

విమర్శనాత్మక రచనల్లో శర్మగారికి సంగీత, సాహిత్యాల్లోగల ప్రతిభా పాండిత్యాన్ని మనం గుర్తించవచ్చు. వీరి విమర్శనాత్మక రచనల్ని సాహిత్య సంబంధమైనవి, సంగీత సంబంధమైనవి అని రెండుగా విభజించవచ్చు. సాహిత్య సంబంధమైన విమర్శనాత్మక వ్యాసాల్లో"సారస్వతాలోకము" అగ్రగణ్యం. రాళ్ళ పల్లి వారి కొన్ని ఉపన్యాసాలు, కొన్ని పత్రికల్లో వచ్చిన వ్యాసాల సంకలనమే సారస్వతాలోక గ్రంథం. "ఇందులో ఎనిమిది వ్యాసాలున్నాయి. శ్రీకృష్ణ దేవరాయ యుగానికి సంబంధించి మూడు, నాచన సోమునికి సంబంధించి రెండు, రంగనాథ రామాయణ కర్తృత్వాన్ని గురించి ఒకటి, 'త్యాగయ్య' తిక్కన - సీతమ్మను గురించి ఒకటి వ్యాసాలున్నాయి. ఒక్కొక్క వ్యాసం అతని విమర్శనాదృష్టికి, పాండితీ ప్రకర్షకు ప్రత్యక్ష సాక్ష్యం.

సారస్వతాలోకములోని మొదటి మూడు (1. రాయలనాటి రసికత, 2. రాయల వైదుష్యము, 3. నాచన సోముని నవీన గుణములు) 1932లో అనంతపురం సాధన ముద్రాలయం వారు 'సారస్వతోపన్యాసాలు' అనే పేరుతో ప్రకటించారు. ఆమూటితోపాటు ఇంకా ఐదు వ్యాసాలు (1. నిగమ శర్మ అక్క, 2. రంగనాథ రామాయణము, 3. ఆంధ్రవాఙ్మయమున నాచనసోము కీయదగిన స్థానము, 4. త్యాగయగారి నాదసుధారసం, 5. తిక్కన తీర్చిన సీతమ్మ) కలిపి మొత్తం ఎనిమిదింటిని 1954లో త్రివేణి పబ్లిషర్సు, మచిలీ పట్టణం వారు సారస్వతాలోకము అనుపేరుతో ప్రకటించారు.

"సారస్వతాలోకము"లోని మొదటి వ్యాసం రాయలనాటి రసికత. తెలుగు వాఙ్మయములోనే విశిష్టమైన విమర్శనా వ్యాసమిది. సహజంగా విమర్శకుడు ఒక కవి కావ్యాల్ని పరామర్శించడం జరుగుతుంది. లేదా ఒకే యితివృత్తం కలిగిన కావ్యాల్ని పోల్చి చెప్పడం జరుగుతుంది. ఇంకా ఒక కాలంలో వచ్చిన కావ్యాల బాగోగుల్ని పరామర్శించడం జరుగుతుంది. ఒక కాలంలో వచ్చిన

మూడు ప్రధాన కావ్యాల్ని తీసుకొని వాటిలోని ఇతివృత్తాల్ని కాకుండా ఆయా కవుల వర్ణనలాధారంగా ఆనాటి సామాజిక స్థితిని ప్రజల జీవన విధానాన్ని పాఠకుల కళ్ళకు కట్టినట్లుగా రాళ్ళపల్లి ఈ వ్యాసంలో తెలియ చేసాడు.

ఒక కావ్యాన్ని గ్రహించి అందలి ఇతివృత్త విమర్శ లేదా ఆలంకారిక విమర్శ చేయడం కన్నా ఈ విధమైన విమర్శ కావించడం సమాజానికెంతో ఉపయోగకరం. మన పూర్వీకుల జవసత్వాల్ని, జీవన విధానాన్ని మూడు ప్రబంధాలాధారంగా రాళ్ళపల్లి మనకు విప్పిచెప్పాడు. ఈ విమర్శనా విధానమే తెలుగు సాహిత్య లోకానికి వినూత్నం. ఈ పద్ధతికి రాళ్ళపల్లి వారు మార్గదర్శకులు.

శ్రీకృష్ణ దేవరాయ విరచితమైన ఆముక్తమాల్యద, పెద్దనగారి మనుచరిత్ర, తిమ్మన గారి పారిజాతపహరణ ప్రబంధాలలోని వర్ణనల్ని ఆధారంగా చేసుకొని చక్కని సమన్వయ దృష్టితో రాయల కాలంనాటి తెలుగు వారి జీవితాన్ని ప్రత్యక్షీకరింపజేసాడు అనంత కృష్ణ శర్మ.

వ్యాస ప్రారంభములో అనంత కృష్ణ శర్మ చెప్పిన యీక్రింది వాక్యాలు అక్షర సత్యాలు. "వ్రాసిన కవి సత్యమై వుండగా, అతడు జీవించి, సంచరించి, చూచి, అనుభవించిన సంఘము కన్నుల యెదుట సత్యమై యుండగా, అతడు వ్రాసిన కావ్యములలో మాత్రము అంతయునూ అసత్యమే యుండుట అసాధ్యము. తత్వశాస్త్ర సిద్ధాంతు లేమందులో గాని సాహిత్యము వారమగు మనకు సత్యములేని అసత్యము గాని, అసత్యములేని సత్యముగాని దొరుకు పదార్థము కాదు".

పై వాక్యాల్లో ప్రబంధాలలోని సత్యాసత్యాల విషయం స్పష్టం చేయబడింది. ఉదాహరణకు పెద్దన వరూధిని హిమాలయాలలో వున్న దృశ్యాన్ని వర్ణిస్తూ అక్కడ ఆకుతోటలు, కదళీ వనాలు, ఇసుక తిన్నెలు, ఉద్యానవనాలు, పూవు సజ్జలు వర్ణించాడు. హిమాలయాల్లో యివన్నీ వుండడం అసత్యమని కొందరు వాదించవచ్చు. కాని పెద్దన నివసించిన తుందభద్రా నదీ ఒడ్డున యివన్నీ వున్నాయి. కాబట్టి హిమాలయ పర్వతాలు సత్యం. ఆకుతోటలు, అరటి తోటలు, పూల సజ్జలు మొదలైన ప్రకృతి వర్ణన సత్యం. ఈ ప్రకృతి యంతా హిమాలయ పర్వతాల్లో వున్నది అని చెప్పుట అసత్యం. ఈ సత్యాసత్యాల సమ్మేళనమే రమణీయం. ఈ రమణీయమే పాఠకునికి ఆనందమయం. అది సాధించడమే కవి సృష్టియైన కావ్య ప్రయోజనం.

విమర్శకుడు కవి సృష్టిలోని సత్యాసత్యాల్ని విడదీసి సత్యంలోని పరమార్థాన్ని

పాఠకునికి తెలియజెప్పాలి. పెద్దనపై వర్ణనలు ద్వారా రాయలునాటి తోటలు, ఉద్యాన వనాల పెంపకాన్ని మనం గ్రహించాలి. అందుకే రాళ్ళపల్లి సత్యంలేని అసత్యంగాని, అసత్యంలేని సత్యంగాని కావ్యాలందు దొరుకు పదార్థం కాదని స్పష్టీకరణ చేశాడు.

రాళ్ళపల్లి రాయలనాటి రసికత వ్యాసంలో రసిక శబ్దాన్ని భోగియని, తన మనసు కానందాన్నిచ్చే భోగాలనుభవించడమే లక్ష్యంగా గలవాడని నిర్ణయిం చారు. శర్మగారు భోగల్ని ప్రవృత్తి, నివృత్తి భోగాలని రెండుగా విభజించారు. రెండింటిలోను సమానమైన ఆనందమే వుందని ఆయన భావించారు. చివరికి రసికతా ప్రాధాన్యాన్ని గూర్చి "యిది నాగరికతకు నిదానము. పౌరుషమునకు ఫలము. అభ్యుదయమునకు ఆధారము." అని అభిప్రాయ పడ్డారు. ఆయన దృష్టిలో ఎన్నిదోషములున్నా రసికత తిరస్కరింప తగింది కాదు.

శ్రీ శర్మగారు రాయలనాటి ప్రవృత్తి భోగాల్ని ముఖ్యంగా ఎనిమిదిగా ప్రాచీనుల గుర్తించినట్లు పరిశీలనలో నిగ్గు దేల్చారు. అవి 1. ఇల్లు, 2. వస్త్రము, 3. ఆభరణము, 4. గంధము, 5. పుష్పము, 6. తాంబూలము, 7. శయ్య, 8. స్త్రీ. ఒక్కొక్క భోగాన్ని గూర్చి రాయలనాడు సమాజానికి గల దృష్టిని రాళ్ళపల్లి ఈ వ్యాసంలో తెలియజేసారు. ఆకాలం వారు ఏదియైనను పోనీతే మనకేల అని తాముపట్టిన దేనిని ఉదాసీనంగా చూచు పద్ధతి కలవారు కాదు అని రాళ్ళపల్లి నిరూపించారు.

వీరి పరిశీలనలో ఆకాలం గృహ నిర్మాణంలో ప్రత్యేకంగా కోపగృహాలు వుండేవని, స్నానమంటే అభ్యంజన స్నానమని ఆనాడు వారు భావించేవారని నిరూపించారు. ఆకాలం స్త్రీలు ఎక్కువగా కోపం వచ్చినప్పుడు తెల్లని వస్త్రాలు ధరించేవారని, పురుషులు మాత్రం తెల్లని వస్త్రాలనపురూపంగా ధరిం చేవారని తన పరిశీలన ద్వారా నిరూపించారు. ఆభరణాల విషయంలో స్త్రీ, పురుషులకెక్కువ భేదాలున్నట్లు కానరాదని వీరి పరిశీలనానంతర అభిప్రాయం.

ఆనాటికీ, యీనాటికీ వచ్చిన మార్పుల్ని గూర్చి రాళ్ళపల్లి యిట్లా అభిప్రాయ పడ్డారు. "సరిగంచుల సీలము దోవతులు నేత పనకెల్లా నెత్తి పూలవంటివి-కట్టుటకు మనకు సంకోచము గలదు గాని సర్జుసూటులలో దూరుటకు సిగ్గులేదు. పింజలుపోసి అలంకారముగా, చుంగులు చుంగులుగా దోవతి కట్టుకొని బయట కనపడుటకు బిడియము. కాని చాకలివాని యిస్త్రీ రేఖలు చెడునేమోయని చేతులు, కాళ్ళు చెక్క బొమ్మల వలె ఆడించుచూ వీధులలో వెడలుటకు వెనుదీయము". వస్త్రాల్ని ధరించడంలో ప్రాచీనులకు,

మనకు గల వ్యత్యాసాల్ని రాళ్ళపల్లి సుస్పష్టం చేసారు.

సుగంధాలు తయారు చేయడంలోను, పూవుల్ని ప్రాణంగా పెంచుటలోనూ ఆకాలం వారికి గల మక్కువ మనకు లేదని రాళ్ళపల్లి ఆవేదనను వ్యక్తం చేసారు. పార్కులలో, యిండ్ల ముందర కుండలలో, మీజాలపైని గ్లాసులలో ఉత్సవ కాలమందు వచ్చిన పెద్దమనుషులకిచ్చు చేతి తురాయిలలో ఎక్కడ చూచినా నిర్గంధ కుసుమాలే నేడపురూపం. బెంగుళూరు లాల్‌బాగ్ వంటి త ›లలో మల్లెతీగ వంటి దొకటి చూతమన్నను కనిపంచదు. మనం నిర్భాగ్య దా ారిదరులం అని ఆయన నేటి అరసికత్వాన్ని గూర్చి నిశితంగా తన వ్యాసంలో విమర్శించారు.

ఏ ఋతువులోనైనా ఒకే విధమైన ఆహారాన్ని గ్రహించడం నేడు సర్వసాధారణం. కాని ఆనాడు ఏయే ఋతువులో ఏయే తినుబండారాలు. ఏయే పానీయాలు హితులో ఆయా ఋతువులలో వాని వానిని తిని త్రాగు చుండెడి వారని రాళ్ళపల్లి సోదాహరణంగా నిరూపించారు. "వారాకలికి భుజించు వారేకాని మోమాటానికి గాని, పద్ధతి ప్రకారం గాని యిష్టం లేకున్ననూ భుజించువారు గారు అని రాళ్ళపల్లి నేటి ఆహార విషయంలో మనం చూపే అశ్రద్ధను నిశితంగా విమర్శించారు. "ఆహార దోషం ఆరోగ్య నాశనమునకే కాక విజ్ఞానాంశంబునకుమూలం" అని వారు గ్రహించినట్లు మనం గ్రహించలేదని రాళ్ళపల్లివారు అభిప్రాయ పడ్డారు.

అజీర్ణ ఆహార దోషాల్ని సవరించే నిత్యౌషధమైన తాంబూలాన్ని వారు ఎంత ప్రేమగా ఆదరించారో శయ్యను ఎంత భోగ వస్తువుగా భావించారో రాళ్ళపల్లి విశదీకరంచారు. వారు స్త్రీని ఒక భోగ వస్తువుగానే గ్రహించినట్లు రాళ్ళపల్లి నిరూపించారు.

ప్రవృత్తిలో రసం లేదని తోచిన వారునివృత్తి మార్గం వైపు తిరిగి తమ రసికత్వాన్ని అక్కడ ప్రకటించేవారే గాని అరసికులు మాత్రం కాదని సోదాహరణంగా రాళ్ళపల్లి నిరూపించారు. వారు ధృఢ మనోబలం గలవారు. కార్యసాధన శక్తి గలవారు. యుద్ధాలు చేసారు. రాజ్యాలు గెలిచారు. చెరువులు, కాలువలు త్రవ్వించారు. శిల్పాలు సృజించారు. చదువు సంధ్యల్ని అభివృద్ధి చేసారు. చేతికొలది దానాలు చేసారు. రసిక జీవనాన్ని అనుభవించారు. వారి భోగతృష్ణయెట్లో అట్లే దయ, శౌర్యం, ఔదార్యం, పాండిత్యం, వైరాగ్యం అన్నీ గొప్పవే అని రాళ్ళపల్లి రాయల నాటి రసికతను రమణీయంగా సోదాహరణంగా తన వ్యాసంలో వివరించారు.

'సారస్వాత లోకం'లో రెండవ వ్యాసం రాయల వైదుష్యం. ఒక సాహితీ సభకు అధ్యక్షోపన్యాసకుడిగా రాళ్ళపల్లి ఈ వ్యాసం వ్రాశారు. రాయలు పేరుమీదుగా మనం చేసే సేవ మనకు మనం చేసుకోనేదే. మానవుడు తప్ప మిగిలిన ఏ ప్రాణికి తనకు తానుగా ఆత్మహత్య చేసుకోవడం వుండదు. వృద్ధి క్షయాలు రెండూ మానవుని చేతిలోనే వున్నాయి. మనకు ఉపేక్ష అధికం. ఈ ఉపేక్ష వల్ల కలిగే తప్పుల్ని యితరులమీదనో, లేదా ఈశ్వరుని మీదనో మోపుతూ వుంటాం. అది మన చేతకాని లక్షణం. కాని రాయలకాలం వారు ఫలమీయని తప్పుదైనముది గాని పనిచేయని తప్పు నాదిగా వుండరాదు అని ఆచరించి చూపారు. మనం పరతంత్రపు పరువు వేసుకొన్నాం. దాన్ని చుట్టిపెట్టే ఓపిక మనకు లేదు. అందుకు కూడా ఎవరో వస్తారని ఆశిస్తాం. పారతంత్ర్య రసికత మన అస్తుల కంటి యుండుట చేతనే యిప్పుడు గూడా యింటి ముంగిట మురికి గుంట ఈగలు ముసిరి క్రుళ్ళుచున్నా కూర్చుండి మునిసిపాలిటీ వారిని తిట్టగలమే గాని దోసెడు దుమ్ము దానిపై పోసి ముక్కును కాపాడుకొను యోగ్యత మనకు లేకపోయింది. అని ఉపేక్ష విషయంలో నేటి సమాజాన్ని నిశితంగా విమర్శించారు.

రాయలు పరాక్రమవంతుడే కాదు ఉదారుడు కూడా. శరణన్న వారిని వీరోచితంగా వదలడం ఆయనలో మనకు కనిపిస్తుంధి. రాయలు ధర్మార్థకామాల్లో ఒకవేళ ధర్మమునకే ఎక్కువ వెచ్చమైన సంతోషించేవాడే గాని, దుఃఖించ రాదనేది అతని మతం. శత్రు స్త్రీలు చిక్కినపుడు పుట్టింటి మర్యాదలు జరిపిన విజ్ఞాన వంతుడతడు. రాయలు తన కథానాయకుని నోటివెంటనే రాజుల్ని మెప్పించుటచే గలుగు ఖ్యాతి ఈతి అని, లాభంబు క్షోభంబని, పూజనంబు ద్వేజనంబని పలికించాడు.

ఆముక్తమాల్యదలోని కొన్ని ఘట్టాలు రాయలు వర్ణించిన తీరును బట్టి చూస్తే ఆతనికి భోగం కంటే యోగం నందెక్కువ ఆశ వుండేదని స్పష్టమౌతుంది. రాయలు ఒకవేళ మరలా ప్రత్యక్షమై మీ దారిద్ర్యాన్ని, పారతంత్ర్యాన్ని తీర్చి, శత్రువుల్ని జయించి చక్రవర్తిగా సామ్రాజ్యాన్ని పాలించి, శాంతి నెలకొల్పుతాను అని చెప్పినా మనం అక్కరలేదు మహానుభావా! నీవంటి మహాపురుషుల మనస్సును మరలా నొప్పించుటకు మాకిష్టం లేదు అని మర్యాదగా, కృతజ్ఞతతో బదులు చెప్పగల ధైర్యాన్ని, వివేకాన్ని మనం ఈ ఒక్క పూటైనా అలవర్చుకొనగలమేని ఈ ఉత్సవంచే రాయల ఆత్మకు నిజమైన తృప్తి, శాంతి కలుగుతుంది అని రాళ్ళపల్లి తన అధ్యక్షోపన్యాసంలో రాయల

వైదుష్యాన్ని చెబుతూ మనలోని ఉపేక్షా, స్వాభావాన్ని, అరసికతను, స్పష్టంగా, నిశితంగా విసర్శించారు.

రాయల మీద గౌరవంతో ఉపన్యాసాలు, ఊరేగింపులు చేయడం శర్మగారికి యిష్టంలేదు. రాయలుతో మనల్ని పోల్చుకొని మన అల్పత్వాన్ని మనం గ్రహించాలని సూచించారు. ఇప్పుడు భావదాస్యం అధికంగా వుంది. ఆభావ దాస్యాన్ని వదులు కోకపోతే మనకు మనుగడ లేదని ఆయన అభిప్రాయం.

'సారస్వతాలోకంలో'మూడవ వ్యాసం నాచనా సోముని నవీన గుణములు. సోముని జయంత్యుత్సవాల సభకు రాళ్ళపల్లి అధ్యక్షుడిగా వుండి ఈ ఉప న్యాసం చెప్పాడు. సహజంగా సోమనది ఉత్తము కవిత్వం కాదనే అభిప్రాయం రాళ్ళపల్లిది. అయితే ఈ వ్యాసంలో శ్రీ శర్మగారు నేర్పుతో సోముని నవీన గుణాల్ని అతని కావ్యానికే అన్వయించి చెప్పాడు. నన్నయ తిక్కనాదులు భావానికి, వస్తువులుకు యిచ్చిన ప్రాధాన్యాన్ని రాళ్ళపల్లి ఉదహరణ పూర్వకంగా చూపించాడు. ప్రబంధ కవులను గురించిన రచనా ప్రధానమైన కవిత్వానికీ, అర్థానికి కాక శబ్దానికి ప్రాధాన్యమివ్వడంలో ప్రబంధ కవులకు సోముడే మార్గదర్శకుడని అదే అతని నవీన గుణమని రాళ్ళపల్లి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

భావ వస్తు రచనా పరామర్శ మొదట చేసిన విమర్శకుడు రాళ్ళపల్లే. సోముని ఎంతో అభిమానించి అతనిని ఆకాశాని కెత్తవలెనని ప్రయత్నించిన విమర్శకుల కన్నా అధికంగా శర్మగారు ప్రామాణికమైన చర్చ సాగించారు. సోమునిది భావ ప్రధానమైన రచన గాక వస్తురచనకు సంబంధించిన కళయని సోముని కాలం నాటికి తెలుగు సాహిత్యానికిది నవీనమని ఆనందాన్నిచ్చే శక్తి దీనికి లేక పోయినా, తృప్తిని, ఆశ్చర్యాన్ని కలిగించి మనల్ని ఉల్లాస పరిచే సామర్థ్యం దీనికి వుందని సోముని కవిత్వాన్ని గురించి రాళ్ళపల్లి వారి భావం.

'సారస్వతాలోకంలో' నాల్గవ వ్యాసం నిగమశర్మ అక్క. తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యంలో మూడవ ఆశ్వాసంలో నిగమశర్మ అక్క ప్రసక్తి వుంది. ఇది పేరులేని ఒక చిన్నపాత్ర. ఈ చిన్న పాత్రను శ్రీశర్మగారు తన పరిశీలనా నేర్పుతో ఆమెను తెలుగువారి ఆడబిడ్డను చేసాడు.

ఈ వ్యాసంలో నిగమశర్మ అక్క పాత్ర చిత్రణని తెనాలి రామకృష్ణుడు వర్ణించిన తీరు కంటే ఆ కవి హృదయమెరిగి విమర్శకుడైన రాళ్ళపల్లి నిగమశర్మ అక్కను తెలుగు వారి ఆడబిడ్డగా అందల మెక్కించిన తీరు రమణీయంగా

వుంది. కావ్యం చదివినప్పుడు పొందే అనుభూతి కన్నా ఒక్క మెట్టు ఎక్కువ అనుభూతినే కలిగేటట్టు ఈ వ్యాసం సాగింది. ఇది సద్విమర్శకులకు మాత్రమే సాధ్యం. పైపై మెరుగులు కాకుండా నిజమైన పాండిత్యం కలిగిన ఒక మహోన్నత విమర్శకుడు ఈ వ్యాసంలో మనకు కనిపిస్తాడు.

రాళ్ళపల్లి తన విమర్శనా వ్యాసంలో తెనాలి రామకృష్ణుని గూర్చి "చాపల్యమును వదలి తెనాలి రామకృష్ణుడు పనిచేసిన ప్రతి విషయమును అమోఘంగా ప్రదర్శించు సూత్రధార విద్య గలవాడు" అనుటకు ఈ పాత్ర ఉదాహరణమన్నాడు. ఈ విమర్శనా వ్యాసం ముగింపు బహు చమత్కారంగా వుంది. "పరిహాసము పవిత్ర వస్తువును గూడా గమనింపదేమో!"అని వ్యాసాన్ని ముగించడంలో రాళ్ళపల్లి రచనా విధానం మనకు ద్యోతకమవుతుంది.

'సారస్వతాలోకం'లో ఐదవ వ్యాసం రంగనాధ రామాయణం. ఒకనాడు సాహితీ లోకాన్ని అట్టుడికించిన విషయాలు గ్రంథ కర్తృత్వ వివాదాలు కుమార సంభవం నన్నెచోడునిది కాదను కొందరి వాదన, క్రీడాభిరామము శ్రీనాధునిదా, వల్లభామాత్యునిదా అన్న చర్చ; ఎర్రన అరణ్య పర్వమును రచించినా? పూరించెనా? అన్న మీమాంస; భాస్కర రామాయణ కర్తృత్వం. ఆముక్తమాల్యద కర్త విషయాలతో పాటు రంగనాధ రామాయణ కర్తృత్వ విషయం సాహితీ లోకంలో బహుళ చర్చలకు ఆస్పదమైంది. పరిశీలించి, పరిశోధించి నిగ్గు తేల్చవలసింది విమర్శకులే. అట్టి విమర్శకులలో అగ్రగణ్యులు

రంగనాధ రామాయణం గోనబుద్ధారెడ్డి విరచితమని రాళ్ళపల్లి సాహితీ గురువు కట్టమంచి రామలింగా రెడ్డి, అతనికి అండగా పింగళి లక్ష్మీకాంతం, పరిష్కరణ యందు తెరమరుగున వేటూరి ప్రభాకర శాస్త్రి గట్టిగా వాదించారు.వీరినందరినీ తన విమర్శనా శక్తితో ఎదిరించిన కీర్తి రాళ్ళపల్లిదే. జాతి, మతాలనాధారంగా తీసుకొని చేసే విమర్శల్ని తీవ్రంగా నిరసించారు. వ్యంగ్యంగా కట్టమంచిని విమర్శించారు.

రామలింగారెడ్డిగారు గోనబుద్ధారెడ్డే రంగనాధ రామాయణ కర్తయని చెబుతూ దానికి ఉపపత్తిగా అనేకానేక ఉదాహరణల్ని చూపించాడు. రాళ్ళపల్లి అన్నిటికన్ని సమాధానాలు చెప్పి రంగనాధుడనే కవే రంగనాథ రామాయణ కర్తయని నిరూపింప ప్రయత్నించాడు.

'సారస్వతాలోకము'న ఆరవ వ్యాసం ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమ

నాథుని కీయదగిన స్థానము. సాహితీ లోకమున సోమన, ఎఱ్ఱనలు ప్రత్యేకంగా చర్చించదగినవారు. ఇంచుమించు వీరిద్దరూ సమకాలికులు. ప్రత్యేకించి ఒకే యితివృత్తాన్ని గ్రహించి కావ్య నిర్మాణం గావించారు. ఎఱ్ఱన హరివంశాన్ని వ్రాస్తే, సోముడు ఉత్తర హరివంశాన్ని వ్రాసాడు. ఒకరిది యితిహాస దృష్టి, మరొకరిది కావ్యదృష్టి. ఒకరిది వర్ణనాత్మక సృష్టి. మరొకరిది రసాత్మక సృష్టి. రాళ్ళపల్లి ఎఱ్ఱన కవిత వైపు మొగ్గు చూపాడు. కవిత్రయంలోనివాడు ఎఱ్ఱన. కవిబ్రహ్మను గురువుగా నెంచి అతని ప్రక్కన స్థానాన్ని పొందదల్చినవాడు సోముడు. ప్రపంచంలో ఏ యిరువురి వ్యక్తిత్వాలు ఒకేవిధంగా వుండడమనేది సాధ్యంకాదు. అటువంటప్పుడు రెండు భిన్నదృక్పథాలతో కావ్య నిర్మాణాలు గావించిన ఇద్దరు వ్యక్తుల తారతమ్యాన్ని చెప్పడం సరియైన పద్ధతి కాదని కొందరి వాదన. ఈవాదంతో రాళ్ళపల్లి అంగీకరించలేదు. రాళ్ళపల్లి ఎంతగా ఎఱ్ఱన కవిత గొప్పది అన్నారో, శతావధాని వేలూరి శివరామశాస్త్రి, నడుకుదుటి వీర్రాజు పంతులు, అంతగా సోముని కవిత గొప్పది అన్నారు. ఆ రోజుల్లో వీరి వాగ్యుద్ధం, పత్రికాముఖంగా జరిగిన యుద్ధాలు ఆంధ్ర లోకంలో పెద్ద కలకలాన్ని సృష్టించాయి. ఈ వాదనలు రాళ్ళపల్లిని తిరుగులేని విమర్శకుడిగా నిలిపాయి. ఒకరిమీద అభిమానంతోనో, మరొకరి మీద దురభిమానంతోనో విమర్శ చేయక కవితను నిగ్గు తేల్చుటలో వీరివాదనలు అనన్య సామాన్యాలు. ఏ సోమనాధుని కవిత ఎఱ్ఱన కవితకంటే తక్కువదని రాళ్ళపల్లి వాదించారో ఆ సోముని నవీన గుణాల్ని సోముని అభిమానుల కంటే మిన్నగా రాళ్ళపల్లి ఆవిష్కరించారు. ఇది సద్విమర్శకుని లక్షణం.

'సారస్వతాలోకం'లో ఏడవ వ్యాసం త్యాగయ్యగారి నాదసుధారసం. రాళ్ళపల్లి దృష్టిలో త్యాగయ్య ప్రపంచానికి ప్రసాదించిన వరం గంగానదివలె మూడు మార్గాలతో ప్రవహించింది. అది ఒకటి శ్రీరామభక్తి, రెండు కవిత, మూడు గానం. ఈ మూడు గూడా త్యాగయ్య మానవ ప్రయత్నంతో సంపాదించినవి కాక పూర్వజన్మ సుకృతాలని రాళ్ళపల్లి భావన. త్యాగయ్య గారి భక్తి సంస్కారం నాలుగు తరాలది. నావంటివాని యోగ్యతకు చాలా దూరం మించిన మహాతత్వం అని త్యాగయ్య భక్తిని కొనియాడినాడు. నిర్గుణైక బ్రహ్మవాదులైన స్మార్త బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి దేవతలందరికీ సమానంగా మొక్కులు చెల్లించే సంప్రదాయంలో పెరిగినవాడు త్యాగయ్య. అటువంటి త్యాగయ్య రాముని మీద భక్తి పెంచుకొని ముక్తికోసం ప్రాకులాడినాడు. వ్యక్తి, సంఘం, జాతి, మతం, మొదలైన కట్లు, కంచెలు అన్నీ విచ్చుకొని తోసుకొని పోగల్గిన ఏ ఒకరిద్దరు మహానుభావులకో తప్ప సామాన్యులకు త్యాగయ్య గారి భక్తి మార్గం

అందరాని పండు. అందినా తినలేం. తిన్నా జీర్ణించుకోలేం. అని త్యాగయ్య భక్తిని రాళ్ళపల్లి విశ్లేషించాడు.

రాళ్ళపల్లి గుర్తించిన త్యాగయ్యగారి రెండవ వరం కవిత్వ కళ. భావాలలో ఆర్జవం నిండి ఏ మాట చెప్పినా వర్చస్సుతో చెప్పగలవాడు త్యాగయ్య. కృత్రిమ భావాలు ఆయన రచనలో లేవు. త్యాగయ్య కవిత భావాల విలాసంతో ధారాళత కలిగిన భాషతో యితరులనాకర్షించకలిగేది. ఆయన కవిత పల్లెటూరి పడుచువలె అకృత్రిమంగా నిలిచింది. ఆయన భావాలు ఎన్నోచోట్ల అపక్వతనే సూచిస్తున్నాయి. త్యాగయ్యకు శక్తి, అభ్యాసం రెండూ సమృద్ధిగా వున్నా కావ్యాదుల పరిశీలన తక్కువయని రాళ్ళపల్లి అభిప్రాయం. త్యాగయ్య రచనల్లో చెప్పవలసిన భావాలు స్పష్టంగా, సరళంగా చెప్పగల ఓర్పో, శక్తియో లేక వాక్యమూ, ఛంధస్సు ముగిస్తే చాలునని ముందుకు పోయిన రచన ఎంతో వుంది. అందుకే ఆయన కీర్తనల్లో కొన్నిటికి అర్థమిప్పటికీ అస్పష్టంగానే నిలబడింది. తెలుగు సాహిత్యంలో యితర మహాకవుల రచనలు చవిచూచిన నాలుకకు త్యాగయ్య కవితలోని రసం చాలదు అని త్యాగయ్య కవితను గూర్చి రాళ్ళపల్లి అభిప్రాయం.

త్యాగయ్యలో రాళ్ళపల్లి మహాప్రసాదంగా గ్రహించింది గానం. ఆ గానం యొక్క వైశాల్యం, గాంభీర్యం, విలాసం, వైదగ్ధ్యం, వైవిధ్యం అనిర్వచనీయమని రాళ్ళపల్లి భావం. త్యాగయ్య అంతరంగంలో సాధించింది రామభక్తి యోగం, బహిరంగంలో సాధించింది నాదయోగం, ఈ రెంటి పొత్తు కలిపిందే కవిత్వం. భక్తి, నాదం అనే రెండు మహాద్రవ్యాల ఒత్తిడిలో సన్నగిల్లి మసక మసకై పోయింది కవిత్వం అని త్యాగయ్య గానాన్ని మెచ్చుకున్నాడు రాళ్ళపల్లి. త్యాగయ్య నాదరచన భాషారచనను చాలా దూరం మీరిపోయిందని రాళ్ళపల్లి అభిప్రాయం.

రాళ్ళపల్లి ఈ వ్యాసంలో చివరిగా సమాజానికి ఒక హితోక్తి చేశాడు. మనకు రామభక్తి వున్నా, లేకపోయినా తెలుగు, సంస్కృతాలు రుచించినా రుచించకపోయినా త్యాగయ్యగారి కీర్తనలు దొరికినన్ని భద్రపరిచి ఆగాన గాంభీర్యాన్ని ఆ అంతస్థులో మనమనుభవించి యితరులనుభవించేటట్లు చేయడం మన కనీసధర్మం. యిది కులధర్మం కాదు, మత ధర్మంకాదు, జాతి ధర్మం కాదు - అన్నిటికీ మించిన మానవ ధర్మం. త్యాగయ్య కవిత అర్థం తెలిస్తే తెలుగువారానందించగలుగుతారు. నాదసుధ దొరికితే హిందువులేకాదు, మానవజాతి తరించిపోతుంది. త్యాగయ్య కళ నారాయణాస్త్రం వంటిది.

దానికి నమస్కారం తప్ప ఎదురేదీ లేదు అని త్యాగయ్య నాదసుధారసాన్ని మనం అనుభవించి యితరులనుభవించేటట్లు చేయాలని రాళ్ళపల్లి సమాజానికి సూచించారు.

'సారస్వతాలోకం'లో చివరిది, ఎనిమిదవది తిక్కన తీర్చిన సీతమ్మ. సారస్వతా లోకంలో రాళ్ళపల్లి గ్రహించిన అనేక విమర్శ వ్యాసాలలో పాత్ర చిత్రణకు సంబంధించిన వ్యాసమిది. ఇది కవిబ్రహ్మ సృష్టి సీతమ్మ కథ. వ్యాసప్రారంభంలోనే రాళ్ళపల్లి తిక్కన తీర్చిన పాత్రల్ని పరిశీలించడం న్యాయం కాదన్నారు. ఎందుకంటే తిక్కన తీర్చిన రామాయణ పాత్రలు వాల్మీకి సృష్టి, భారత పాత్రలు వ్యాస సృష్టి, అయినా ఉత్తర రామాయణంలో సీత పాత్ర తిక్కన స్వతంత్ర పాత్ర కాకపోయినా తిక్కన తీర్చిన తీరు అనన్య సామాన్యమని రాళ్ళపల్లి సోదాహరణంగా వివరించి చూపించారు.

రసానుభవ దృష్టికి, ధర్మ దృష్టికి ప్రధానమైంది సీతా పరిత్యాగ ఘట్టం. తిక్కన తన మార్పులు, చేర్పులతో తెలుగువారు సీతమ్మను మరచిపోలేకుండా తీర్చాడు. తిక్కన వాల్మీకి కన్నా స్వతంత్రించి కావించిన మార్పుల్ని చేర్పుల్ని స్పష్టంగా తెలియజేశారు.

రాగం, ధర్మం అన్యోన్య బీజభూతాలు. సమరసంగా పెరగవలసినవి. ఇవి విరుద్ధంగా ప్రవర్తించడం సృష్టిలోని మాయలలో ఒకటి. ఇది వున్నన్ని నాళ్ళు సీతారాముల నాటకం జరుగుతూనే వుంటుంది అని చివరగా లోకధర్మంగా రాళ్ళపల్లి తేల్చి చెప్పినారు.

రాళ్ళపల్లి వివిధ సందర్భాలలో వివిధ విషయాలమీద చేసిన విమర్శల యొక్క సంకలనమే "సారస్వతా లోకము". తెలుగు సాహితీ సారస్వతము ఈ సారస్వతా లోకము. మూడు ప్రబంధాలాధారంగా రాయలనాటి రసికతను ఆంధ్రావళికి అందించారు రాళ్ళపల్లి. దానితోపాటు మనం ఎంతటి అరసికులమో స్పష్టంగా చెప్పారు. రాయలు వైదుష్యాన్ని వివరిస్తూ సమాజానికి ఏది అవసరమో సూచించారు. ఎర్రన కవిత గొప్పది అంటూనే సోముని నవీన గుణాల్ని వివరించారు. తెలుగు ఆడబిడ్డకు పుట్టింటిపై గల మమకారాన్ని కనులకు కట్టినట్టుగా తన విమర్శనా వ్యాసంలో చెప్పారు. తాను నమ్మిన సిద్ధాంతాన్ని వ్యక్తీకరించడానికి వెనుకాడక గురువుతోనే పోటీపడినారు. త్యాగయ్యలో గానం ఎంత గొప్పదో వివరిస్తూ కవితా లోపాల్ని చెప్పడానికి వెనుదీయలేదు. సీతమ్మ విషయంలో వాల్మీకికి, తిక్కనకు గల వ్యత్యాసాన్ని వివరించడానికి సంకోచించలేదు.

రాళ్ళపల్లి విమర్శనావ్యాసాలు చదివితే సాహిత్యంపై ఆయనకున్న అభినివేశం ద్యోతకమవుతుంది. కావ్యాల్లోని లోపాలోపాల్ని చెప్పడానికి, ఔచిత్య, అనౌచిత్యాల్ని వివరించడానికి, కావ్య భావ గంభీరతను, శయ్యాసౌభాగ్యాన్ని, ధ్వని విశేషణాన్ని, రస దృష్టిని, పాత్ర పోషణని వేయేల కావ్యంలోని అన్ని విషయాలని కూలంకషంగా చర్చించడంతోపాటు సమాజం ఆ కావ్యంలో ఏది గ్రహించాలో ఏది విడనాడాలో పక్షపాత దృష్టి లేకుండా నిర్భయంగా అవసరమైతే సమాజాన్ని హెచ్చరిస్తూ వ్యాసాల్ని వ్రాసిన రాళ్ళపల్లి విమర్శకులలో అగ్రగణ్యుడు, అమరజీవి.

# 16. విశ్వనాథ "ఆంధ్రవాఙ్మయ చరిత్ర" రేడియో రూపకాలు

## I.

### (1) విశ్వనాథ :

10-9-95 తేదీతో కవిసామ్రాట్టు బ్రతికి వుంటే నూరేండ్లు నిండి, నూట ఒకటవ జయంతి చేసుకోనుండేవారు. ఈ సంవత్సరం ఆంధ్రదేశం నలుమూలల ఎంతో ఉత్సాహంతో విశ్వనాథ వారి శతజయంతి సంవత్సర ఉత్సవాలు జరుపుకున్నారు. శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారు అన్నట్లు 1890-1900 మధ్యకాలంలో కాలపురుషుడు ఎంతో ఉల్లాసంగా, ప్రసన్నంగా వున్నట్లు తెలుస్తుంది. ఎందుకంటే ఆ మధ్య కాలంలోనే విశ్వనాథ, కాటూరి, బాపిరాజు, జాషువా వీళ్ళంతా జన్మించారు. ప్రత్యేకించి 1895 మన్మథనామ సంవత్సరంలోనే వీరందరి పుట్టుకలు జరిగాయి.

10-9-1895లో జన్మించినది మొదలు 18 అక్టోబరు 1976లో కన్ను మూసేంతవరకు విశ్వనాథ చరిత్రే ఆంధ్రసాహితీ చరిత్ర. విశ్వనాథకు శిష్యులు, ప్రశిష్యులు, మిత్రులు, శ్రేయోభిలాషులు ఘనంగా వున్నారు. అతనికి సాహితీ శత్రువులు గూడా అధిక సంఖ్యలోనే వున్నారు. రాజకీయ నాయకునికి ఎక్కువమందికి శత్రువులు వుండవచ్చు. ఒక కవికి ఎంతమంది శత్రువులు ఎక్కువ వుంటే అన్ని వందల రెట్లు అభిమానులున్నట్లే. ఒక కవి వ్రాసిన కావ్యాన్ని చంపాలని దుర్విమర్శ చేస్తే సత్తా కల్గిన కావ్యము రోజు రోజుకూ సాహితీ అభిమానులను పెంచుకుంటుంది. విశ్వనాథ విషయంలో ఇదే జరిగింది. ఈర్ష్య, అసూయ కారణంగా కొందరు ద్వేషిస్తే అతని కావ్యాల్లోని అంతర్భాగాన్ని గ్రహించే శక్తిలేక మరికొందరు ద్వేషించారు. కవిని కవిగా చూడాలి. కవిని మహాకవిగా చూడాలి. కవిని ఋషిగా చూడాలి. ఆ కవి కావ్యాన్ని అతడు ఋషియై ప్రవచించాడో, మహాకవిగా వినిర్మించాడో, కవిగా వ్రాశాడో, సహృదయంతో పరిశీలించి తెలుసుకోవాలి. అభిమానం కొద్దీ కవిని మహాకవియని గాని, మహాకవిని కవి అనిగాని చెప్పడం మనపక్షపాత వైఖరికి నిదర్శనమే గాని, ఆ కవులకు వచ్చే లోపమేది లేదు.

"నా నృషిః కురుతే కావ్యమ్" ఇది ఆర్యుల మతం. అంటే కవి కావడానికి

ముందే అతనికి ఋషిత్వం కావాలి. ఋషి అంటే సాక్షాత్కృత ధర్మం కల వాడు అని అర్థం. అంటే తత్త్వాన్ని దర్శించేవాడు. ఋషితత్త్వాన్ని దర్శించిన ఋషి తాను దర్శించినదాన్ని వర్ణించేటప్పుడు కవి అవుతాడు. అంటే కవికి కావలసిన ప్రథమ లక్షణం తత్త్వ దర్శనం. ఆ కవి దర్శించినదాన్ని వర్ణించి చెప్పేనేర్పునుబట్టి కవి సుకవి అవుతున్నాడు. ప్రతిభ, ఉత్పత్తి, అభ్యాసం కలగలసి తాను దర్శించిన తత్త్వాన్ని సాక్షాత్కారం చేసే కవి మహాకవి అవుతున్నాడు. ఈ మహాకవే వాక్కును కూర్చే నేర్పుతో ఋషి అవుతున్నాడు.

## (2) బ్రహ్మర్షి విశ్వనాథ :

ఒక విమర్శకుడు అన్నట్లుగా విశ్వనాథ కవి కానే కాదు. ఆ మహాపండితుడు విశ్వనాథ కావ్యాల్ని గూర్చి వ్రాస్తూ విశ్వనాథను నేను కవిగా అంగీకరించలేదు అన్నాడు. అతను ఏ దృష్టితో అన్నా అతని వాక్యాలు మాత్రం సత్యములేనని నా విశ్వాసం. ఎందుకంటే ఆయన కేవలం కవికాదు. ఏడు ఖండకావ్యాలు, నాలుగు శతకాలు, నాలుగు గీతాలు, ఒక ఉదాహరణ వీటిలో విశ్వనాథ కవి కన్పిస్తాడు. మూడు గేయకవితలు, మూడు నాటికలు, నాలుగు పౌరాణిక నాటకాలు, రెండు చారిత్రక నాటకాలు, ఏడు సాంఘిక నాటకాలు, రెండు రాజకీయ నాటకాలు ఈ మొదలగు వాటిల్లో విశ్వనాథ సుకవి కన్పిస్తాడు. రెండు చరిత్ర, మూడు పౌరాణిక కావ్యాల్లో విశ్వనాథ మహాకవి కన్పిస్తారు. నాలుగు సాంస్కృతిక నవలలు, 14 సాంఘిక నవలలు, ఆరు ఆంధ్ర చారిత్రక నవలలు, రెండు దాక్షిణాత్య చారిత్రక నవలలు, 12 భారత చారిత్రక నవలలు, ఆరు కాశ్మీరు చారిత్రక నలలు, ఆరు నేపాలీ చారిత్రక నవలలు, నాలుగు రాజకీయ నవలలు, ఒక వ్యంగ్య నవల, కథల్లో ఆధునిక కవిసామ్రాట్టు విశ్వనాథ కన్పిస్తారు. నాలుగు సంస్కృత కావ్యాలు, రెండు సంస్కృత నాటకాలు, ఒక సంస్కృత నాటిక అనేక విమర్శల్లో విశ్వనాథ విశ్వరూపం కనిపిస్తుంది. మహాకావ్యం శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో ఋషితుల్యుడు కాదు సాక్షాత్తు మహర్షి కాదంటే బ్రహ్మర్షి విశ్వనాథ కన్పిస్తారు. అందుకే ఆ విమర్శకుడు అన్నట్లు విశ్వనాథ కవికాదు అనే విషయాన్ని నేను అంగీకరిస్తున్నాను.

## (3) అనుకూల వాతావరణము :

శ్రీ పేరాల భరతశర్మ గారు అన్నట్లు (1) ఒక మహాకవిగా మహాభావకుడుగా విశ్వనాథ సంస్కృత లోకంలో అవతరించడానికి హేతువు ఆయన జన్మాంతర సంస్కారం. (2) లౌకికంగా కూడా కొన్ని పరిస్థితులు. ఒకానొక

అధిశైవ వాతావరణం ఆయన కుటుంబ జీవనం ఆయనను మహా మేధావిగా, మహాకవిగా తీర్చిదిద్దినవని చెప్పవచ్చు.

విశ్వనాధకు ముందు తెలుగు సాహిత్య సామ్రాజ్యంలో ఎదురులేని చక్రవర్తులుగా ఏలినవారు తిరుపతి వేంకటకవులు. వీరిలో వేంకటశాస్త్రి విశ్వనాథకు ప్రత్యక్ష గురువులు. విశ్వనాథలోని వాక్పటుత్వం గాంభీర్యం, వావదూకత గురుపరంపరా ప్రాప్తమైనవే.

## (4) ధర్మనిష్ఠ :

విశ్వనాథ మాటల్లోనే అతని ధర్మనిష్ఠ ఎంతటిదో మనం గుర్తించవచ్చు "మా నాయన గారు పురాణములు మా వూళ్ళో చెబితే నేను వింటే అవన్నీ నాలో జీర్ణిస్తే ఆ దేవతలందరూ నా గుండెలో కూర్చొని ఏం చేస్తారు" అని జాగృతితో ఆయన తెలిపారు. ఏ మహాపురుషుని మహోన్నతమైన జీవిత మనుగడపైనైనా అతని బాల్యం యొక్క ప్రభావితం తప్పకుండా వుంటుంది. విశ్వనాధ తండ్రి కాశీక్షేత్రం నుండి తెచ్చిన శివలింగాన్ని 1902లో స్వగ్రామంలో ప్రతిష్ఠించాడు. ఈ మహోన్నత కార్యం బాలుడైన విశ్వనాథ హృదయంలో ధర్మనిష్ఠకు అంకురార్పణ చేసి వుంటుంది. ఆ ధర్మనిష్ఠ ప్రభావం ఆయన కావ్యాల్లో వెదికి తెల్సుకోవాల్సిన అవసరం లేదు. సహృదయ పాఠకునికి స్పష్టంగా కనిపిస్తూనే వుంటుంది.

## (5) దేశభక్తి :

నాకూ దేశభక్తి వుందని పదేపదే చెప్పుకోవడం విశ్వనాథ స్వభావానికి విరుద్ధం. భారతీయ సంప్రదాయాన్ని, సంస్కృతిని, వ్యాఖ్యానించి చూపడం విశ్వనాథ ప్రత్యేకత. విశ్వనాథ తన శతాధిక కావ్యాలలో స్వజాతి, స్వభాష, స్వసంస్కృత, స్వసంప్రదాయం మొదలగు విషయాల్ని బాహ్యాభ్యంతరంగా నిరూపించాడు. విశ్వనాథలో దేశభక్తి త్రివేణీ సంగమంగా కనిపిస్తుంది. ఒకటి గురువువద్ద సేవచేసే భారతీయ సంప్రదాయాభిమానం. వేదశాస్త్ర పురాణాలపై గాఢ నిష్ఠ. రెండవది తండ్రిచే ప్రోదుచేయబడిన ధర్మనిష్ఠ. మూడవది ప్రాచీనాంధ్ర భారతీయ చరిత్ర నాగరికత వాటి విలువలపై అభిమానం ఇదే నిజమైన దేశభక్తి.

## (6) నాటకరంగం :

విశ్వనాథ నాటక రచన మొదలు పెట్టక పూర్వమే తెలుగు నాటక రంగం బాగా శక్తిపుంజుకొని వుంది. అప్పటికే త్రిపురనేని, తిరుపతి వేంకటకవులు, కందుకూరి, చిలకమర్తి, పానుగంటి, గురజాడ, ధర్మవరం, కోలాచలం, వేదం, నాదిల్ల మొదలగు మహానుభావులు విరివిగా నాటక రచన చేసివున్నారు.

విశ్వనాథ దృష్టిలో నాటకం సొగసు కేవలం మాటల చమత్కారం కాదు. ఒక ప్రగాఢమైన ప్రబోధన వుంటే తప్ప నాటక రచనా శిల్పం కుదరదు.

## (7) పుట్టపర్తి వారి అభిప్రాయం :

విశ్వనాథ నాటక రచనపై పుట్టపర్తివారి అభిప్రాయం గమనింపదగి వుంది "నాటకకారుడు సహస్రాక్షుడు కావలెను. హృదయము సంపూర్ణముగా అదుపులో వుంచుకొన్న ఋషికి నాటక రచన సాధ్యం. తన్ను మరువనేని తన్మయీ భవనము కావలెను. ఈ రెండు ధర్మాల్ని ఆవేశపరులకు సామాన్యంగా అంటవు. ఈ రెంటినీ సమన్వయించుకున్న వారు నాకు తోచినంతవరకు బాస, కాళిదాసులు, దిఙ్నాగుని వంటి మరికొందరు" దీనినిబట్టి పుట్టపర్తి వారి దృష్టిలో విశ్వనాథ బాస, కాళిదాసు, దిఙ్నాదులంతటివాడు. విశ్వనాథ ఆవేశపరుడు గనుక నాటక రచన కుదరలేదని కొందరి అపోహ. ఆ ఆవేశం లౌకికమైంది కాదు. రసలోకంలోనిది. కాబట్టి విశ్వనాథ సంభాషణ బాగా రక్తికడుతుంది. ఇది అందరికీ అర్థం కాకపోవచ్చు. సంభాషణా శిల్పి అయిన సహృదయునికి మాత్రం తప్పకుండా తెలిసి తీరుతుంది.

## (8) తనను గూర్చి తాను :

విశ్వనాథ తనను గూర్చి తాను చెప్పకుంటూ నాకు విరోధులెక్కువ ఎందుకో నాకు అర్థం కాదు. నన్నెరగనివారు నేను దుర్జనుడను అంటారు. నన్ను ఎరిగినవారు నేను చాలా మంచివాన్ని అంటారు. నేను చాలామందికి నాచేతనైనచో ఉపకారమే చేస్తాను తప్ప అపకారం చేయను. నాది ఒక వ్రతం. అవతలివారికి అపకారం జరిగెడి అబద్దం చెప్పనే చెప్పను. నేను ఎవరినైనా ఏదైనా అంటే వాళ్ళు నాకు చాలా అపకారం చేస్తే అంటాను. ఒకటి మాత్రం వుంది నేను అనటం అంటూ జరిగితే ఘాటుగా వుంటుంది. ఘాటుగా వుంటుంది గనుకనే తర్వాత దానిని గురించి జ్ఞాపకం వుండదు. ఎవరి కర్మన వారు పోతారు. ఈ మాటలు ఆయనను తెల్సిన వారందరు అక్షర

సత్యాలంటారు. ఆయన మంచివాడో చెడ్డవాడో ఈ మాటలలో మనందరం అర్థం చేసుకోవచ్చు.

## (9) కవిత్వంపై విశ్వనాథ అభిప్రాయం :

కవిత్వం ఛందస్సులోనే వుండాలి అన్నది విశ్వనాథ గట్టి నమ్మకం. అట్లని ఆయన గేయాలు, వచనాలు రాయలేదని కాదు. ఆయన ఛందస్సును అమితంగా ఆదరించాడు ఛందస్సు శబ్దం రెండుధాతువుల కలయికచే ఏర్పడింది. అందు మొదటి ధాతువు 'ఛంద్'. 'ఆహ్లాదము'ని దీని అర్థం. అందుకే వేదానికి ఛందస్సని పేరు. జీవుని మాయను కప్పుచూ ఆహ్లాదంగా పాడబడునది వేదం. కాబట్టి కవిత్వం ఛందోబద్ధంగా వుంటే ఆహ్లాదము, రసానందం రెండూ కలుగుతాయి. అందుకే మనవాళ్ళు 'కప్పిచ్చేది కవిత్వం, విప్పిచ్చేది విమర్శ' అన్నారు. విశ్వనాథ శ్రమ పడడానికి వెనకాడే వ్యక్తికాదు. అందుకే ఆయన కవిత్వ విషయంలో నేనుబడ్డ శ్రమ అందరూ పడలేరు అంటారు. వచనా శిల్పులైన కొందరు విశ్వనాథను పూర్వాచార పరాయణుడు, ప్రవాహంనకు ఎదురీదుతున్నాడు అని విమర్శిస్తారు. కాని నేను మాత్రం ఏదిచేసినా సర్వంకుశంగా లోతుపాతుల్ని తెల్సుకొనే చేస్తాను. అని విశ్వనాథ బల్లగుద్ది చెప్పారు.

## (10) కావ్యముపై విశ్వనాథ అభిప్రాయం :

కావ్యం వ్రాయడానికి ప్రబోధకాలుగా విశ్వనాథ మూడు విషయాలు గుర్తించాడు అందు మొదటిది ఎవరికోరిక మీదనో వ్రాయడం. రెండవది అంతః ప్రబోధం. మూడవది మనసులో తేరుకొన్న భావాల్ని ఒక కావ్యరూపంలో నిర్మించడం. ప్రస్తుత పరిశీలనాంశం అయిన ఈ రేడియో నాటికలు ఒకరి కోరికమీద వ్రాసినవే అయినా అందులో ప్రతిరూపకంలోను విశ్వనాథ మనసులోని భావాలు ప్రస్ఫుటంగా కనిపిస్తూనే వున్నాయి.

## II

## (1) రూపకము :

దృశ్యకావ్యము, ప్రేక్ష్యకావ్యము, నాట్యము, రూపము, రూపకము అను పదాలు స్థూలంగా ఒకే అర్థాన్ని సూచించేటట్లు గోచరిస్తాయి. ప్రదర్శనా ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పడం వల్ల దృశ్య ప్రేక్షకములు పర్యాయ పదములు

అనవచ్చు. 'అవస్థాను కరణం, నాట్యం' అవి దృశ్యమాన మగుటచే 'రూపం' అనబడుతుంది. భరతుని నాట్యశాస్త్రమందు 'రూపము' అనే పదముందేకాని 'రూపకం' అనేపదం లేదు. పది పదకొండో శతాబ్దాల తర్వాత రూపం అనుపదం ఈ అర్థంలో మాయమయిపోయింది. 'అభినవ భారతి' అందు "రూప్యతే=ప్రత్యక్ష క్రియతే యోఽర్థః సరూపం" అని వుంది. అనగా ఏ అర్థము ప్రత్యక్షంగా చేయబడునో ఆ అర్థరూపం అని భావం. క్రమక్రమంగా 'క' ప్రత్యయం చేరి రూపం కాస్తరూపకం అయింది.

## (2) దశరూపకాలు :

సంస్కృతంలో ఒక అంకం మొదలుకొని పది అంకముల వరకుగల రూపకాల్ని పదివిధాలుగా చెప్పారు. ఈ వైవిధ్యం వస్తు స్వభావాల్ని బట్టి, నాయక లక్షణాల్ని బట్టి, రసరూపాన్ని బట్టి ఏర్పడింది. దశరూపకాల్లో సర్వలక్షణ సంపన్నమగు రూపకానికి 'నాటకం' అని పేరు. ఈ నాటక శబ్దం జాతి వాచికంగా కూడా ప్రయోగింపబడుటచే రూపకాలన్నింటినీ నాటకాలనే వ్యవహరిస్తున్నారు. అందుకే విశ్వనాథ రేడియో నాటకాలన్నా, రేడియో రూపకాలన్నా ఈ వ్యాసంలో ఒకే అర్థంలో గ్రహించడం జరిగింది.

## (3) శ్రవ్యనాటికలు :

గొల్లపూడి మారుతీరావు అన్నట్లు మనదేశంలో రేడియో నాటికకు వయసు తక్కువ. ఈ ప్రక్రియను ప్రత్యేకంగా చేపట్టి మహోన్నతమైన ప్రతిభను చాటినవారు తక్కువ రేడియో నాటిక శ్రవణేంద్రియానికి రసపిద్ధిని కలిగించాలి. శ్రోత ఆలోచనకు భావనకు అవకాశం కల్పించాలి. వీటన్నిటికి రచయితకున్న ఏకైక ఆయుధం భాష. రేడియో నాటిక రాయడం పదునైన కత్తిమీద సాము. అయితే రేడియోకున్న విస్తృత పరిధి రంగస్థల నాటిక కుండదు. సహారా ఎడారి, హిమాలయ పర్వతాలు, గంగానది, ప్రేయసి మనసు, విమానం ఎక్కడం మొదలగు విషయాల్ని రేడియో నాటికల్లో చొప్పించవచ్చు. దృశ్య నాటికల్లో ఈ విషయాల్ని ప్రవేశ విష్కంభాల ద్వారా తెలుపాల్సిందే.

రంగస్థలం మీద ఒక నాటకం ప్రదర్శించేటప్పుడు ప్రేక్షకుల్ని ఎలా దృష్టిలో వుంచుకోవాలో ఉపన్యాసకుడు సభాసదుల్ని ఎలాదృష్టిలో వుంచుకోవాలో, కథగాని, నవల గాని, రాసేటప్పుడు రచయిత పఠితుల్ని ఎలా దృష్టిలో వుంచుకోవాలో అలాగే రేడియో ప్రసారానికి రచన రూపొందించునప్పుడు

దృష్టిలో వుంచుకోవాలి. రేడియో ప్రసారానికి వ్యవధి తక్కువ వుంటుంది. ఆ వున్న వ్యవధిలో కూడా శ్రోతల్ని ఆకట్టుకోడానికి ఒకటి రెండు నిముషాలు ప్రసంగరచన వుంటుంది. అందుకే రేడియో నాటికల్లో ప్రతి సంభాషణ కథను కాస్త ముందుకు తోస్తున్నదిగా వుండాలి. నవల రాయడానికన్నా ఆ నవలలోని విషయాన్ని కథలో రాయడం ఎంత కష్టమో మామూలు నాటికల్ని రాయడం కన్నా ఆ విషయాన్ని రేడియో నాటికలో కుదించడం అంత కష్టం.

## (4) విశ్వనాథ రేడియో రూపకాలు పూర్వరంగం :

విశ్వనాథ రేడియో రూపకాలు 1961లో ప్రసారమయినట్లు తెలుస్తుంది. ఇవి మదరాసు, విజయవాడ, హైదరాబాదు కేంద్రాల నుండి ప్రసారం అయినాయి. ఇందులో కొన్ని పత్రికలలో కూడా ప్రచురింపబడ్డాయి. విశ్వనాథను 1961లో ఆంధ్ర వాఙ్మయ చరిత్రను రేడియో రూపకాలుగా రాయమని హైదరాబాదువారు కోరారు. అప్పట్లో హైదరాబాదు కేంద్రంలో దేవులపల్లి, నాయని బుచ్చిబాబు, మునిమాణిక్యం, దాశరధి, త్రిపురనేని గోపీచంద్ లాటి పెద్దలు కార్యక్రమ నిర్వాహకులుగా వుండేవాళ్ళు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రను పది రూపకాలుగా ప్రసారం చేయదలచిన కార్యనిర్వాహకులు విశ్వనాథను ఏడు రూపకాలు, కృష్ణశాస్త్రిని మూడు రూపకాలు సమకూర్చమని కోరారు. అయితే అందుకు అంగీకరించని విశ్వనాథ ఆంధ్రవాఙ్మయ రూపకాలన్నిటినీ ఒక్కడే రాయాలని సూచించారు. అందుకు అంగీకరించిన కార్యనిర్వాహకులు విశ్వనాథను పదీ రాయమని కోరినారు. విశ్వనాథ ఈ రూపకాల్ని రాయగా గోపీచంద్ రేడియోలో సమర్పించేవారు. ఈ రూపకాలు ఆనాటి సాహిత్య రూపకంలో గొప్ప సంచలనాల్ని రేకెత్తించాయి.

## III

## (1) ఆంధ్రభారతావతరణము :

ఇది 1961 సెప్టెంబరు 24న రేడియోలో ప్రసారమయింది. ఇందులో బ్రహ్మ సరస్వతీ మొదలగు దేవతలు మేనకలాంటి అప్సరసలు వాల్మీకి, వ్యాస, భవభూతి, కాళిదాసు లాంటి సంస్కృత మహాకవులు, ఆదికవి నన్నయ్య ముగ్గురు బ్రాహ్మణులు ఇందులో పాత్రధారులు. నన్నయ్య భారత గ్రంథావిష్కర్ణ సందర్భాన్ని తెలిపే ఘట్టం ఇందు వర్ణితం. గోదావరి నదిలో స్నానం చేస్తున్న

ఒక బ్రాహ్మణుడు చోళదేశం నుంచి వచ్చిన మరో బ్రాహ్మణునితో జరిపే సంభాషణతో నాటిక ప్రారంభం అవుతుంది. రాష్ట్రాల మధ్య నేడున్న అవగాహ నాలోపం ఆనాడు దేశాలమధ్య వుండేదన్నట్లుగా వ్యంగ్యంగా విశ్వనాథ ఇక్కడ తెలిపాడు. మూడవ బ్రాహ్మణుడు వచ్చి కలిసి వారి మధ్య సంభాషణ నన్నయ్య మీదికెళుతుంది. తెలుగులో భారతం రాయడం సరస్వతికి చెడ్డదినాలని ఒక బ్రాహ్మణుడు అంటాడు. మరో బ్రాహ్మణుడు చెడ్డదినాలు సరస్వతికి వాల్మీకి రామాయణం రాసినప్పుడే వచ్చాయంటాడు. శ్రోతలు ఈ వ్యంగ్యాన్ని అర్థం చేసుకోవాలి.

రెండవ రంగం బ్రహ్మలోకం సరస్వతీ, మేనక, పరిచారికులు, భవభూతా దికవుల మధ్య జరిగే సంభాషణ ఎంతో నర్మగర్భంగా సాగుతుంది. కాళిదాసు భవభూతాదులు తెలుగు భారతంలోని కొన్ని పద్యాలు విని ఆంధ్రులైపోవాలని ఆశిస్తారు. ఆంధ్రపశస్తిని, ఆంధ్రభారత చిరస్థాయిని ఈ నాటకంలో విశ్వనాథ ఎంతో హృద్యమంగా అభివర్ణించాడు.

ఈ నాటికలో మనకు కనిపించే ముఖ్య విషయాలు భారతంలో నన్నయ్య జానపదులలో వాడుకగానున్న భాషకు వైశాల్యాన్ని కల్పించినట్లు అధికారికంగా చేసి అందు ఒక మహాకావ్యం నిర్మించి కవితార్ణుడైనట్లు చెప్పబడింది. కాళిదాస, వ్యాసాది మహాకవులు కూడా ఆంధ్ర భారత సొగసునకు తలలూచినట్లు చెప్పబడింది.

## (2) పాల్కురికి శివభక్తి :

ఇది 1961 అక్టోబరు 15న రేడియోలో ప్రసారమయింది. ఇందులో కొందరు భక్తులు. ప్రతాపరుద్ర చక్రవర్తి, పాల్కురికి సోమనాధుడు మొదలగు వారు పాత్రలు. ఈ నాటిక ముఖ్యంగా పాల్కురికి యొక్క అమితమైన శివభక్తిని తెలియజేయడానికి ఉద్దేశించినది. తెలుగు సాహిత్యంలో నన్నయ్య ప్రారంభించిన సాహిత్య, సారస్వత నదిని పల్లెపల్లెకు పంపినవాడు పాల్కురికి సోమన. అతను మహాపండితుడు. సామాన్య ప్రజానీకంలో వుండే పదజాలాన్ని సాహిత్యంలోకి చొప్పించిన భక్తుడు ఇతను. కాని నేడు ఆ కవికి రావలసినంత కీర్తి రాకపోవడానికి ప్రధానకారణం అతను పాటించని మతసామరస్యం. ఆ మత ద్వేషం కారణంగానే అతని రచనలు పొందాల్సినంత కీర్తి పొందలేక పోతున్నాయి. ఓరుగల్లు రంగస్థలంగా ఈ నాటిక రూపొందించబడింది. సోమాధుని రచనల్లో భాషాదోషాలు, వ్యాకరణ దోషాలు కోకొల్లలని పాత్రల

ద్వారా చొప్పిస్తూనే అతని శివభక్తి చాటడానికి ఇవేవీ అడ్డంకులు కావని విశ్వనాథ పాల్కురికి యొక్క రచనా ఉద్దేశాన్ని స్పష్టం చేశారు.

## (3) ఉభయకవి మిత్రము :

ఇది 1961 అక్టోబరు 1న రేడియోలో ప్రసారమయింది. తిక్కనను పాల్కురికి కంటే ముందు వాడుగా భావించాడో ఏమో తెలీదుగాని పాల్కురికి శివభక్తి కంటే ముందే దీనిని ప్రచారం చేశారు ఇందులో తిక్కన, కేతన మొదలగు కవులు. గణపతి దేవుడు, కాటమరాజు మనుమసిద్ధి మొలగు రాజులు కొందరు భటులు పాత్రధారులు. తిక్కన గణపతితో రాయభారం నడిపి మనుమసిద్ధిని సింహాసనంపై కూర్చోబెట్టాడన్న సత్యం మనకు తెలుసు. అలాగే ఖడ్గతిక్కన కాటమరాజుతో యుద్ధం చేసి మరణించడం మనకు తెలుసు. ఈ రెండు ప్రధాన ఘట్టాల్ని ఈ నాటికలో విశ్వనాథ తెలియజేశారు. విశ్వనాథ సంభాషణాచాతుర్యంతో పెద్ద ఇతివృత్తాన్ని కుదింపు చేశాడు. నిర్వచనోత్తర రామాయణంలోని భారతంలోని కొన్ని పద్యాల్ని తీసుకొని సందర్భానుసారంగా పాత్రల ముఖం ద్వారా పలికిస్తూనే తిక్కన, ఖడ్గ తిక్కనల వ్యక్తిత్వాల్ని కన్నులకు కట్టినట్లుగా చేశారు. కేతన తన దశకు మార చరిత్రను తిక్కనకు అంకితం ఇచ్చిన విషయం ఖడ్గతిక్కన, భార్య చేసిన అవమానం ఈ చిన్న నాటికలో స్పష్టం చేయడం విశ్వనాథ నాటిక రచనా శిల్పానికి చక్కని ఉదాహరణ.

## (4) నందికంత పోతరాజు :

ఇది 1961 అక్టోబరు 24న రేడియోలో ప్రసారమయింది. ఇది శ్రీనాథునికి సంబంధించిన నాటిక. ఇందులో శ్రీనాథుడు, వల్లభామాత్యుడు మొదలగు కవులు దండి, మమ్మట మొదలగు లాక్షణికులు అవచతిప్పయ్యశెట్టి వంటి వ్యాపారస్థుడు, అల్లాడ వేమారెడ్డి, పెదకోమటి వేమారెడ్డి ప్రౌఢ దేవరాయలు మొదలగు రాజులు పాత్రధారులు. ఈ చిన్న నాటికలో విశ్వనాథ ఎన్నెన్నో చారిత్రక సత్యాల్ని శ్రోతలకి తెలిపాడు. నందికంత పోతరాజు అన్నది రెడ్డిరాజ్యము చిహ్నమైన కత్తిపేరు. ఈ కత్తిని రెడ్డిరాజుల వద్ద నుండి వారిని జయించి రాజమహేంద్రవరపు రాజు తీసుకుపొయ్యాడు. శ్రీనాథుడు అల్లాడ వేమారెడ్డిని కవిత్వంతో మెప్పించి ఆ కత్తిని తిరిగి వేమారెడ్డికి చేర్చినట్లుగా మార్గమధ్యలో మిత్రుడు అవచితిప్పయ్యతో మాట్లాడినట్లు ఒక రంగాన్ని విశ్వనాథ చెప్పాడు. అటు తర్వాత మామిడి సింగన కోరికపై ప్రౌఢ దేవరాయలు వద్దకెళ్ళి

'గౌడడిండిమ భట్టు'ను ఓడించి, బందీగా వున్న సోమదేవుని విడిపించుక తీసుకొచ్చినట్లుగా విశ్వనాథ ఈ నాటికలో చెప్పారు. ప్రౌఢ దేవరాయల వద్ద కెళ్ళి మార్గమధ్యలో వల్లభామాత్యునితో కలిసినట్లు విశ్వనాథ వివరించారు. ఈ నాటికలో విశ్వనాథ అభిప్రాయం క్రీడాభిరామాన్ని వల్లభామాత్యుడే రాసినట్లు దాన్ని శ్రీనాథుడు సవరించి మెరుగులు దిద్దినట్లు చెప్పారు. శ్రీనాథుని కవితా వైభవాన్ని అవచతిప్పయ్య, వల్లభామాత్యుల విషయాల్ని కొంతకు కొంత రెడ్డిరాజుల చరిత్రని విశ్వనాథ ఈ చిన్న నాటికలో పొందుపరచారు.

## (5) అద్వైత శేఖరము :

ఇది 1961 అక్టోబరు 29న రేడియోలో ప్రసారమయింది. ఇందులో భాగవత కవులైన పోతనాదులతోపాటు, తిప్పయ్య, సదానంద కవులు పాత్రలు. ఇదులో ఒక స్త్రీ పాత్ర కూడా వుంది. ఆమె భాగవత కవులలో ఒకడైన గంగన్న కూతురు. ఈ నాటకం ప్రధానంగా పోతనను గూర్చి రాసింది. భాగవతం ఏకకర్తృత్వం కాకపోవడానికి అనేక కారణాలు విమర్శకులు భావిస్తున్నారు. ఇందులో సత్యాసత్యము ఎలావున్నా విశ్వనాథ ఒక కొత్త కల్పన చేసినాడు. పోతన గారి అనుమతితోనే వెలుగొందుల నాగయ్య వేర్పూరి సింగన్న, గంగన్నలు భాగవత ఐదు, ఆరు, పదకొండు స్కందాల్ని వ్రాసినట్లు విశ్వనాథ చెప్పారు. పోతన కవితా లక్షణాల్ని నిస్సంశయంగా ఈ నాటకం ప్రకాశింపచేస్తూ వుది. అంతేకాక ఆయా కవుల మధ్యగల కవితా తారతమ్యాల్ని విశ్వనాథ సుస్పష్టంగా తెలియజేసారు. కృష్ణకథను వ్రాసి పోతన రామభక్తుడుగా వుండే విషయాన్ని విశ్వనాథ స్పృశిస్తూ రామకృష్ణులకు అభేదాన్ని చెప్పారు. మాటల సందర్భంలో భాగవతంలోని మందార మకరంద మొదలగు రమ్యమైన పద్యాల్ని చెబుతూ భాగవత కావ్య విశిష్ఠతని శ్రోతలకు చక్కగా అందించారు. పోతన చివరలో భాగవతాన్ని నరాంకితం చేయాలనుకోవడం సరస్వతి ప్రత్యక్షమై ఏడవడం పోతన తన అభిప్రాయాన్ని మార్చుకోవడంతో ఈ నాటిక ముగుస్తుంది. ముగింపుగా

"కాటుక కంటి నీరు చనుకట్టు పయింబడనేల యేడ్చెదో
కైటభదైత్య మర్దనునిగాదిలికోడలు! యోమదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్లక
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!"

### (6) వసంతోత్సవము :

ఇది 1961 నవంబరు 5న రేడియోలో ప్రసారమయింది. ఇది ప్రబంధ యుగానికి సంబంధించిన నాటిక. ఇందులో శ్రీకృష్ణదేవరాయలు ఆయన భార్యలు వసుభందుడు ముఖ్యపాత్రలు - తిరుమలదేవి, చిన్నాదేవి సంభాషణల ఆధారంగా ప్రబంధముగ కవులైన పెద్దన, తెనాలి రామకృష్ణుడు, నంది తిమ్మన, పింగళి సూరన, రామరాజ విభూషణుడు మొదలగు కవులు కవితాగుణాల్ని దూర్జటి శివభక్తిని, శైవుడైన దూర్జటిని శ్రీకృష్ణదేవరాయలు ఆదరించడాన్ని దేవరాయలు యొక్క మత సామరస్యాన్ని మొదలగు అనేక విషయాలు ఈ నాటికలో వివరించబడ్డాయి. హరిభట్టు మల్లారెడ్డిలను గూర్చిన ప్రసక్తి తాళ్ళపాక తిమ్మక్క సుభద్రాపరిణయ ప్రసక్తి ఇందులో వస్తాయి.

### (7) కనకాభిషేకము :

ఇది 1961 నవంబరు 12న రేడియోలో ప్రసారమయింది. ఇందులో సూత్ర ధారుడు కేతినాయుడు, రంగాజమ్మ, విజయరాఘవ నాయకుడు పాత్రధారులు. ఇందలి కథావస్తువు నాయకరాజు యుగానికి సంబంధించినది. తంజావూరును పరిపాలించిన నాయక రాజులలో విజయరాఘవ నాయకుడు అగ్రగణ్యుడు. ఈ కాలంలో యక్షగాణాలు ఎంతో అభివృద్ధి చెందాయి. ఇతని ఆస్థానంలోని రంగాజమ్మకు కనకాభిషేకం జరిగింది. ఆ సమయంలో అనేకమంది యక్షగాన కవులు సభారంజికతను కలిగించిన తీరు యక్షగాన రూపమైన నాటకముగా ప్రదర్శించుటే ఈ నాటిక యందలి విషయం. ఇందలి కేతినాయుడు హాస్య సృష్టికర్త. విశ్వనాథ ఈ నాటికలో ముఖ్యంగా యక్షగాణాలు గొప్పతనాన్ని చక్కగా వర్ణించాడు. తాళము పల్లవులను గూర్చి కూడా ప్రస్తావించాడు.

### (8) నాటకోత్సవము :

ఇది 1961 నవంబరు 19న రేడియోలో ప్రసారమయింది. ఈ నాటకం కేవలం 'హరిగిరి' అను రెండు పాత్రల మధ్య మాత్రమే నడిచింది. ఈ ఇద్దరూ స్నేహితులు. ఇదులో 'హరి' యనుపాత్రధారికి సాహిత్య పరిచయంతోపాటు వివిధ ప్రక్రియా వైవిధ్యాలు తత్ కర్తలు అభివృద్ధికారికలు. వారి చరిత్రములు, వారి గ్రంథాలు, వారి పరమార్థాలు మున్నగు విషయాలతో క్షుణ్ణంగా పరిచయం వుంది. 'గిరి' అనువాడు సాహిత్యం నందు విశేషించి నాటకములందు అభిరుచి వున్నవాడు. హరివెంట వెళ్ళి నాటిక ఉత్సవాల సమయాన అనేక నాటకములను గూర్చి గిరి తెల్సుకొన్నట్లుగా విశ్వనాథ నాటకములపై తనకున్న అనుభవసారాన్ని తెలియజేశాడు.

కందుకూరి వీరేశలింగంను గూర్చి ఆయన యుగపురుషుడు అనే విషయాన్ని గూర్చి, ఆంధ్రభాషకు ఆయన చేసిన సేవను గూర్చి, ఆయన ప్రహసనాల్ని గూర్చి అనేక విషయాలు ఈ రెండు పాత్రల మధ్య చర్చించబడ్డాయి. తిరుపతి వేంకటకవులు వారినాటకాలు, వారి రసస్ఫూర్తి, పాత్ర పోషణ శయ్యా సౌభాగ్యాన్ని ఈ రెండు పాత్రల ఆధారంగా విశ్వనాథ ఎంతో చక్కగా వివరించారు. అట్లే చిలకమర్తి, ధర్మవరం వారి నాటకాల్ని గూర్తి, వడ్డాది సుబ్బరాయుడు నాటకాల్ని గూర్చి ఇదీ అది అననేల ఆ కాలంలో వచ్చిన యించుమించు అన్ని నాటకాల్ని గూర్చి ఈ రెండు పాత్రల ఆధారంగా విశ్వనాథ ఈ నాటికలో వివరించారు.

## (9) ఆతిథ్యము :

ఇది 1961 నవంబరు 26న రేడియోలో ప్రసారమయింది. ఇందులో భావకవితా సరస్వతీ, ఆమె తమ్ముడు, అతిథి మూడు పాత్రలు. ఇందులో కవితాదహాస్య భోజనానికై వచ్చిన ఒక అతిథికి భావకవితా సరస్వతి ఆతిథ్యమివ్వడానికి అంగీకరించి అర్ఘ్యపాద్యాదులను ముందుగా అందిస్తుంది. తమ్ముని చేత వచ్చిన అతిథికి భావకవితాయుగపు సమాహార మనెడి భోజనం పెట్టించి తృప్తిపరచి పంపిస్తుంది. ఇది యిందలి విషయం. ఇందులో ప్రారంభంలో కొడవటిగంటివారి గేయంతో సరస్వతి వచ్చిన అతిథికి ఆహ్వానం పలుకుతుంది. తరువాత 'దేశమును ప్రేమించుమన్న' గురజాడవారి గేయం, 'ఏదేశమేగినా ఎందుకాలిడినా' అను రాయప్రోలు గేయంతో అతిథికి మర్యాదలు చేయడం జరిగింది. అతిథి సరస్వతి ఆమె తమ్ముడు పాత్రల ద్వారా విశ్వనాథ అటు రాయప్రోలు, ఇటు గురజాడ కవితల్ని గూర్చి అనేక విషయాలు చెప్పాడు. తర్వాత భావకవితా మార్గాన్ని గూర్చి ప్రస్తావిస్తూ దేవులపల్లి వారిని 'ఎవహో' అన్న గేయాన్ని ప్రస్తావించారు. భావకవిత్వాన్ని గూర్చి విశ్వనాథ సరస్వతి తమ్ముని పాత్ర ద్వారా భావ కవిత్వమనేది అర్థమయ్యే విషయం కాదు. హృదయానికి అవగతమయ్యే విషయం నీ హృదయంలో ఏదో తారాడుతుంది. అది బాధగా ఉంటుంది. ఆ బాధలో ఒక సుఖం ఉంటుంది. జీవుణ్ణి అలా కదిలిస్తుంది. ఇదమిత్థమని మనం చెప్పలేంది. అదే భావ కవిత్వం అంటే. అది వ్రాయగల వాడొక్కడే. అతనిపేరు కృష్ణశాస్త్రి. అతని ననుసరించి చాలామంది వ్రాస్తారు. ఎవ్వడూ అతన్ని అందుకోలేదు. అతని కాంతే మా సౌధం అంతా వ్యాపించి వుంది. అట్లే బసవరాజు అప్పారావును గూర్చి ప్రస్తావించారు. మాటల్లో మాటగా గ్రాంథిక వ్యవహారిక భాషా చర్చ కూడా జరిగింది. ఇంకా అనేకమంది భావకవుల్ని గూర్చి ఇందులో సవివరంగా

చెప్పబడింది. విశ్వనాథను గూర్చి అనేక విధాలుగా విమర్శించేవాళ్ళు ఒక్క విషయం గమనించాలి. భావకవుల్ని గూర్చి, భావకవిత్వాన్ని గూర్చి ఒక రేడియో నాటికలో ఇంత స్పష్టంగా చెప్పడం మరొకరికి సాధ్యమయ్యే పనికాదు.

## (10) హేతువాద యుగము :

ఇది 1961 డిసెంబరు 3న రేడియోలో ప్రసారమయింది. ఇందులో నాటకోత్సవంలోని హరి, గిరి పాత్రలే వుంటాయి. ఈ యిరువురి సంభాషణ ఆధారంగా విశ్వనాథ హేతువాద నిర్వచనాల్ని వాటి పూర్వపరాల్ని చక్కగా వివరించారు. ఇందులో శ్రీరంగం శ్రీనివాసరావును గూర్చిన పరిచయంతో ఈ నాటిక ప్రారంభం అవుతుంది. హేతువాద కవిత్వాన్ని గూర్చి విశ్వనాథ హరి పాత్ర ద్వారా ఇట్లా అనిపిస్తాడు. కడచిన మానవ జాతి చరిత్ర అది క్రమక్రమంగా మారుతున్నది. ఒక మార్పు ఇంకొక మార్పునకు కారణం. ఇప్పుడు ఒక మార్పు వచ్చింది. దీనికి తొలినాటి మార్పులు కారణం. ఇప్పటి మార్పులన్నింటికి ప్రమాణం. అదే హేతువు. దానిని పురస్కరించుకొని చేసేది హేతువాదం. తత్సంబంధమైన కవిత్వమంతా హేతువాద యుగ కవిత్వం. ఈ హేతువాద యుగ కవులలో పలుమంది పలురకాలుగా వుంటారు. కొందరు విప్లవాదులు, కొందరు యుద్ధవాదులు, కొందరు సంప్రదాయ నిర్మూలన వాదులు, కొందరి విప్లవం వట్టి ఛందస్సునకు మాత్రమే సంబంధించి వుంటుంది. తర్వాత పఠాభిని గూర్చి విప్లవ కవుల్ని గూర్చి బెల్లంకొండ రామదాసును గూర్చి ఇకా అనేకమందిని గూర్చి ఇందులో వివరంగా చెప్పబడి వుంది.

## IV ఉపసంహారం :

పై పదినాటికల్లో విశ్వనాథ ఎన్నో విషయాల్ని క్లుప్తంగా, స్పష్టంగా వివరించారు. నన్నయ్య నుండి నేటివరకు వుండే వాఙ్మయచరిత్ర నంతటిని అద్దంలో చంద్రునిలా చూపించగలిగారు. వాక్య నిర్మాణానికి పద్యరచనకు మాటల్ని ఎతుక్కొనే మామూలు కవు..ు యిటువంటి రచన సాధ్యం కాదు. నేను రచన చేయాలనుకుంటే నాముందు మాటలు పక్షుల్లా ఎగురుతూ వుంటాయి అనేవాడట విశ్వనాథ. అందుకే సూటిగా భావాన్ని చెప్పగలిగే క్లుప్తమయిన మాటల్తో మహోన్నతమైన ఉద్గ్రంథం రాయవలసినంతటి ఆంధ్రవాఙ్మయాన్ని పది చిన్న రేడియో రూపకాల్లో నిర్మించిన కవిసామ్రాట్ కవి, సుకవి, మహాకవి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షి. అందుకే ఆయన జన్మించి నూరేండ్లయినా మరణించి ఁ 'దాపు ఏడెనిమిది ఏండ్లయినా ఆయన జీవించే వున్నాడు. సూర్యచంద్రాదులున్నంత వరకు నన్నయాది మహాకవుల వలె ఆ మహామనిషి బ్రతికి వుంటాడు.

# 17. జాషువ దృశ్య కావ్యాల సమీక్ష

## 1. జాషువ :

28 సెప్టెంబరు 1995కు జాషువ బ్రతికి వుంటే వంద సంవత్సరాలు నిండి నూట ఒకటవ జయంతి చేసుకొనెవాడు. ఈ సంవత్సరం ఆంధ్రదేశం నలుమూలల ఎంతో ఉత్సాహంగా జాషువ గారి శతజయంతి ఉత్సవాల్ని జరుపుకున్నారు. *శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారన్నట్లు 1800 - 1900ల మధ్య కాలంలో కాలపురుషుడు ఎంతో ఉల్లాసంగా, ప్రసన్నంగా ఉన్నట్లు తెలుస్తుంది.* ఎందుకంటే ఆ మధ్యకాలంలోనే *విశ్వనాథ, కాటూరి, బాపిరాజు,* జాషువ మొదలైన వాళ్ళంతా జన్మించారు. ప్రత్యేకించి *1895* మన్మథనామ సంవత్సరంలో వీరందరి పుట్టుకలు జరిగాయి.

## 1.1. జననీజనకులు :

జాషువ తండ్రి *గుఱ్ఱం వీరయ్య గారు.* ఇతడు యాదవకులానికి చెందినవాడు. గొల్లసుద్దులంటే చిన్నప్పటి నుండి ప్రత్యేకమైన అభిమానం గలవాడు. చదువు మీద మమకారంతో స్వకులస్థులు ఎంతవారించినా వినకుండా వినుకొండలోని మిషన్ స్కూల్లోని హాస్టల్లో చేరాడు. ఆకాలంలోనే వీరయ్యకు *చాట్రగడ్డపాడు* గ్రామానికి చెందిన *లింగమాంబతో* పరిచయమేర్పడింది. ఆమె ఆది-ఆంధ్ర కులానికి చెందింది. ఆమెను వివాహం చేసుకోవాలనే వీరయ్య కోర్కెను మిషన్ అధికారులు అంగీకరించలేదు. క్రైస్తవ మతాన్ని స్వీకరిస్తే తప్ప ఆమెను పెళ్ళి చేసుకోవడానికి వీలులేదని అధికారులు పట్టుబట్టారు. వీరయ్య క్రైస్తవమతాన్ని స్వీకరించాడు, ఆపైన వారి వివాహం నిర్విఘ్నంగా జరిగింది.

పితృ వ్యవస్థ ప్రాధాన్యం వహించిన హైందవ సమాజంలో తండ్రిని బట్టి సాధారణంగా కులం సంక్రమిస్తుంది. లోక వ్యవహారంలో వర్ణాంతర వివాహం చేసుకొన్న వధూవరుల్లో ఎవరి కులం అధిక సాంఘిక ప్రతిపత్తిని కలిగి ఉంటుందో ఆ కులమే వారి సంతానానికి సంక్రమిచడం జరుగుతుంది. కాని లింగమాంబ వీరయ్యల వివాహం దీనికి అపవాదు. వీరయ్య లిగమాంబల

సంతానానికి లింగమాంబ కులమే సంక్రమించింది. జాషువా గారి మాటల్లో చెప్పాలంటే "వీరయ్య లింగమాంబలది వర్ణాంతర వివాహం అందుచేత ఇరువైపుల బంధువుల ఆదరణ వారికి లభించలేదు. ఒకప్రక్క దారిద్ర్యం, మరోపక్క కులమతాల పోరు, అయినా ఆ దంపతులిద్దరు తమ బిడ్డలను ప్రేమగా పెంచారు. తాము అనుభవిస్తున్న దారిద్ర్యపు కోరలలో బిడ్డల్ని చిక్కకుండా చూడాలని ఆ తల్లిదండ్రులు ఎంతగానో ప్రయత్నించేవారు. దాన్ని వారు జయించినా కులమతాల కుమ్ములాటలలో ఈ లేగలు నలుగక తప్పలేదు."

## 1.2. జన్మభూమి :

*"నను గాంచి పెంచి నాలో*
*గొనబుంగవనమును పాదుకొల్పిన తల్లీ*
*నను మరచిన నిను మఱువను*
*వినుకొండా నీకు నా పవిత్ర ప్రణామముల్"*

అని జాషువ వినుకొండను కుశలప్రశ్నలు వేసి పరామర్శించడంతో అతని ఆత్మకథ ప్రారంభమవుతుంది. దీనిని బట్టి జాషువ జన్మస్థలం వినుకొండ అనుటలో సందేహమేమి లేదు. జన్మభూమిపైన ఆయనకున్న మాటలు పరిశీలింపదగి వున్నాయి. "తాను కవికోకిలగా, నవయుగకవి చక్రవర్తిగా బిరుదులు పొంది ప్రసిద్ధుడైన తరువాత కూడా ఎన్నోమారులు వినుకొండను చూచి వచ్చేవారు. *'ఆ వేపతోపులో తిరిగి రావాలి; గుండ్లకమ్మ బండలపై కూర్చోవాలి; ఆ మసీదు; ఆ శ్మశానవాటిక వాటిని పరామర్శించాలి'* అంటూ వుండేవారు. వినుకొండ, చాట్రగడ్డపాడు వారు వచ్చారు అంటే ఆయనలో యెక్కడలేని ఉత్సాహం, ఆనందం కనిపించేవి."

## 1.3. బాల్యం

*చెలికాండ్రతో నుండ విలుబట్టి విహరించి*
*పొన్నంగి పిట్టల పొడవడంచి*
*చిలుకల గోరువంకల కూనలను బట్టి*
*పంజరంబుల నుంచి బందిజేసి*
*చెట్టు చెట్టున కెక్కి శృంగార మొలికించు*
*ఉడుతల కంఠాల కుచ్చులొడ్డి*
*కంటికింపై ముద్దుగా బొద్దుగా నున్న*
*కూన కుక్కలను మక్కువను బెనిచి*

కూర్మి కాం(డతోడ కుస్తీలు బట్టుచు
కొట్టుకొనుచు నలిగి తిట్టుకొనుచు
చీకుచింతలేని చిన్నారి స్వర్గంబు
ననుభవించినాడ చినతనమున"

చిన్నతనంలో చీకుచింత లేని చిన్నారి స్వర్గాన్ని జాషువ అనుభవించినట్లు "నాకథ" (గంథంలో రాసుకొన్నారు. కొంత వయస్సు వచ్చేటప్పటికి జాషువ తన చుట్టూ బుసలుకొడుతున్న కులమత వ్యాళాల పొడను గుర్తించాడు. కులం వల్ల కల్గిన అవమానం, దారి(ద్యం వల్ల కల్గిన దైన్యం జాషువ లేతమనస్సును గట్టిగా గాయపరిచాయి. అతనిలో వయస్సుతోబాటు తిరుగుబాటు ధోరణి కూడా బాగా పెరిగింది. నాకథలో జాషువ ఇట్లా చెప్పుకున్నాడు.

"విను మొకనాడు నేను బురవీథిని బోవుచునుండ వైశ్యనం
దనులొ ధరామరాత్మజులొ నన్నని ముట్టకుమంచు వెన్కకున్
జని రపుడేను కోపమున నల్వురి ముగ్గురి గొట్టి పేరె మె
త్తిన ఘటనంబు నేడును మదిం బెడబాయదు దొడ్డగాయమై"

## 1.4. విద్యాభ్యాసం :

అయిదవ ఏట జాషువాను తల్లిదం(డులు వినుకొండలోని పాదిరి బడికి పంపారు. గురవమ్మ పంతులమ్మ జాషువ అల్లరిని సహించి ఒకటి రెండు తరగతులు దాటించింది. జాషువ అల్లరి చిల్లరి పనులకు ఊరు బడి కలిపి 'కటికపోకిరి' అనే బిరుదు (ప్రసాదం చేసాయి. మరికొందరు "కాలాంతకుడనే" పేరు కూడా (ప్రసాదించారు. అయిదవ తరగతి అయిందనిపించిన జాషువ హిందూ సోదరుల కళాలయంబులో [Higher grade board elementary school] అడుగుపెట్టాడు. అక్కడ కులవ్యవస్థ కొట్టొచ్చినట్లు కనిపించింది. పంచమజాతికోసం ఒక బెంచి క్లాసు చివరలో (ప్రత్యేకంగా ఉండేది. మిగిలిన పిల్లలందరు కలిసి ఆడుకున్నా ఈ పంచమ జాతీయ పిల్లల్ని వారిలో కలువనిచ్చేవారుకాదు. ఈ ఘటన జాషువ మనస్సును కలచివేసింది. ఆయన మాటల్లోనే

"అన్ని కులాల బాలు రిసుమంతయు భేదము లేక స్వేచ్ఛగా
అన్నలు దమ్ములట్లెదుట నాటల పాటల నొప్పుచుండగా
కన్నుల జూచి నా చిఱుత గర్భములో నపుడెంత బాధయు
త్పన్నము నందెనో యదుగవచ్చు కళాసద నాంగనామణిన్"

జాషువ మనస్సు తిరుగుబాటు ధోరణిని అలవరచుకొంది. అందుకే ఒకనాడు క్లాసులో ప్రధానోపాధ్యాయుణ్ణి (గుడిమల్ల సుబ్బారాయుడు) అగ్రకులాల వాళ్లు మాంసం తింటే తప్పేమి? అని ప్రశ్నించాడు. ఆయన తెలివిగా తినకపోతే తప్పేమి? అనే ప్రశ్నకు సమాధానంగా చెప్పాడు. వాదన పటిమ గలిగిన జాషువ ఆవుపాలను తాగుతున్నారు కదా! అది గోరక్తమే కదా! అని మొండిగా ప్రశ్నించాడు. తెలివైన ఆ ఉపాధ్యాయుడు నీవు నీతల్లిపాలను తాగుతున్నావుకదా, మీతల్లి రక్తాన్ని నీవు తాగినట్టేనా? అని ప్రశ్నించి జాషువాను నిరుత్తరుణ్ణి చేశాడు. ఈ సంవాదంతో జాషువ తరగతి నుండి మూడురోజులపాటు బహిష్కరింపబడ్డాడు. ఈ విషయాన్ని అతని సహోధ్యాయి దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు డా॥ బి. భాస్కర్ చౌదరికి చెప్పినట్లు భాస్కర చౌదరి వ్రాశారు.

## I. 5. కవితా పరిశ్రమ :

జాషువ నా గురువులిద్దరు. ఒకటి పేదరికం, రెండు కులమతభేదం. మొదటిది నాకు సహనాన్ని నేర్పింది. రెండవది నాలో ఎదిరించే శక్తిని పెంచిందేగాని బానిసగా మాత్రం మార్చలేదు. దారిద్ర్యాన్ని కులభేదాన్ని చీల్చి నేను మనిషిగా నిరూపించుకోదలచాను. వాటిపై కత్తి కట్టాను. అయితే నా కత్తి కవిత. నాకత్తికి సంఘంపై ద్వేషంలేదు. దాని విధానంపై ద్వేషం అని జాషువ వెలుగెత్తి చాటుకున్నాడు. అసమానతలకు ఆలవాలమైన అప్పటి సమాజం జాషువాను కవిగా తీర్చిదిద్దింది.

## I. 6. జంటకవిత్వం :

జాషువ కాలంలో తిరుపతి వేంకటకవులు తమ అవధానాలతో ఆంధ్రదేశంలో కవనాన్ని ఒక మల్లవిద్యగా ఊరూరా ప్రదర్శిస్తున్నారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారన్నట్లు వారు "ప్రాచీన సరణికి భరతవాక్యం, నవీన సరణికి నాందీవాక్యం" పలికారు. "శతావధానం కారణంగా తిరుపతి వేంకటకవులు కవితా జైత్రయాత్ర చేయకపోయినచో ఆంధ్ర సాహిత్యానికి నేటి ఉజ్జీవం కలగక పోయేదేమో అనిపిస్తుంది. రాజసభల్లో పండిత వశంవదమై పాతపాటలే పాడుకుంటూ పల్లెల్లో ముదికరణాల పురాణ పఠనాల్లోతప్ప మరోచోట మొగం చూపలేక కాలం వెళ్లద్రోస్తున్న ఆంధ్రశారద మళ్ళీ పల్లకీలెక్కి ఊరూరా ఊరేగటానికి ఆస్కారం ఈ శతావధానం వల్లనే లభించిందని చెప్పవచ్చు." అని కాటూరి పేర్కొన్న విషయం గమనార్హం. సరిగా ఈ సమయంలోనే వినుకొండలోని Higher grade board elementary schoolలో సహోధ్యాయులైన

జాషువ, దీపాల పిచ్చయ్యశాస్త్రి జంటకవిత్వం రాయడానికి పూనుకొన్నారు. కాని వీరి పేర్లు కలవలేదు. 'గుఱ్ఱం దీపాల' అన్న దీపాల గుఱ్ఱం అన్నా, 'జాషువా పిచ్చయ్య' అన్నా పిచ్చయ్య జాషువ అన్నా ఏదిగాని శ్రవణ శుభగంగా లేదు. అట్లే వీరి కవితాధోరణి కూడా కలువలేదు. దానికి తగ్గట్టుగానే 1915లోనే దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు వినుకొండను వదిలేశారు. జంటకవిత్వం రాయలనుకోవడానికి తెరపడింది.

## I. 7. అవధానం :

జాషువ కవిత్వంతోపాటు అవధాన విద్యను కూడా ప్రదర్శించాలనుకున్నాడు. తమ్ముడైన ఇజ్రాయల్‌తో కలసి నేత్రావధానంలో ఉత్తీర్ణుడైనాడు.

## II. 1. సంఘ బహిష్కరణ :

జాషువగారి కవితా పరిశ్రమ ఈకాలంలో ఒడిదుడుకులకు లోనైంది. సవర్ణ హిందువులు జాషువను నిరసించారు. స్వమతస్థులు తిరస్కరించారు. సంఘంనుండి మత బోధకులు జాషువను వెలివేశారు. వినుకొండలో జాషువ భార్యబిడ్డల్ని వదలి ఊరికి దూరంగా ఉండక తప్పలేదు. ఈ సాంఘిక బహిష్కారం జాషువపై ప్రగాఢ ప్రచారాన్ని చూపింది.

## III. ఉద్యోగప్రస్థానం :

"ఉదరార్థంబు ధరించినాడమును పెన్నో వేషముల్" బ్రతుకు తెరువుకై జాషువ ఎన్నో ఉద్యోగాలు నిర్వహించాడు. అతని "నాకథ" చదివితే జాషువ నడిచింది పూలబాట కాదని స్పష్టమౌతుంది. *1910-1911* సంవత్సరముల మధ్యకాలంలో వినుకొండ దగ్గర చాట్రగడ్డపాడులో బడిపంతులుగా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించాడు. మతబోధకుల ఆగ్రహానికి గురై ఆ ఉద్యోగాన్ని ఊడగొట్టించుకున్నాడు. తరువాత టూరింగ్ సినిమాలో కథావాచకుడుగా అవతారమెత్తాడు. తరువాత మూకీ చిత్ర కథావాచకుడిగా *1915-16* సంవత్సరాల మధ్యకాలంలో రాజమహేంద్రవరం చేరాడు. మిత్రుల సహాయంతో ఆ సినిమా ఉద్యోగాన్ని వదలి కోటిలింగాలలోని ప్రాథమిక పాఠశాలలో పంతులుగా కుదిరాడు. వచ్చే జీతం అద్దెకు, ముద్దకు, చాకలి పద్దుకు చాలక యుద్ధంలో సైనికుడిగా చేరడానికి సిద్ధపడ్డాడు. కాని ఆరోజుతోనే మొదటి ప్రపంచ యుద్ధం విరమణ జరగడంతో జాషువ సైనికుడు కాలేకపోయాడు. జాషువకు తోలేటి వేంకట సుబ్బారావుగారితో పరిచయం అతని జీవిత మలుపునకు కారణమైంది.

అతని కోరికమేరకు జాషువ చింతామణి నాటకమండలి నిర్వాహకులైన సత్యవోలు గున్నేశ్వరరావు గార్ని దర్శించాడు. ఈ పరిణామం జాషువను నాటకకర్తగా మార్చింది. ఇది జాషువ ఉన్నతికి మొదటి మెట్టు. ఈ కాలంలోనే నాటక మండలికై "రుక్మిణీ కల్యాణం" అనే నాటకాన్ని రూపొందించాడు. విధి వైపరిత్యం నోట్లకేసు విషయంలో గున్నేశ్వరరావు ఇరుక్కోవడం వల్ల జాషువ ఆలంబనాన్ని కోల్పోయాడు.

*1919*వ సంవత్సరంలో ఫిలిప్స్ లైసనరింగ్ అనే కళాకాముకుణ్ణి ప్రోత్సాహంతో గుంటూరులోని యునైటెడ్ లూథరన్ క్రిస్టియన్ మిషన్ పాఠశాలలో జాషువ తెలుగు పండితునిగా జేరాడు. *8* సంవత్సరాలపాటు ఆ ఉద్యోగం నిర్వహించాడు. ఈ కాలంలోనే *1923* భారతి మాసపత్రిక ఆవిర్భవించింది. తద్వారా జాషువ కృషి వెలుగులోకి వచ్చింది. 1928లో జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి సన్మాన సభలో పద్యాలు చదివి జాషువ చౌదరి మెప్పును సన్మానాన్ని అందుకున్నాడు. తరువాత కొంతకాలం బాపట్లలోను ఆపైన *వినుకొండలోను తెలుగు పండితుడిగా ఉద్యోగం నిర్వహించాడు. 1942లో* జాషువ ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి యుద్ధప్రచార శాఖలో చేరాడు. ఈకాలంలోనే *అతని దేశభక్తిని శంకిస్తూ అనేక విమర్శలు వచ్చాయి. 1957-59* మధ్యకాలంలో జాషువ *మద్రాసు ఆలిండియా రేడియో తెలుగు విభాగంలో పనిచేశాడు. చివరలో జాషువ గుంటూరులో స్థిరపడి జూలై 24, 1971లో మరణించాడు.*

## IV. బిరుదులు :

### IV. 1. కవితా విశారద :

1913లో ఆంధ్రా యూనివర్శిటీ రీసెర్చి సొసైటీ వసంతోత్సవంనాడు జయపుర సంస్థానాధీశ్వరులైన విక్రమదేవవర్మ గారిచే 'కవితా విశారద' బిరుదులభించింది.

### IV.2. కవికోకిల :

1963వ సంవత్సరం వినుకొండ పురవాసులచే లభించింది.

### IV. 3. కవి దిగ్గజ - నవయుగ చక్రవర్తి :

1947వ సంవత్సరంలో విజయవాడలో జరిగిన సన్మాన సభలో చెళ్ళపిళ్ళ వేంకట శేషశాస్త్రిగారి ద్వారా ప్రధానం చేయబడింది.

## IV. 4. మధుర శ్రీనాథ :

1952 ఫిబ్రవరి 17వ తేదీ తిరుపతి కళాసమితి ఆధ్వర్యంలో డాక్టరు జీరెడ్డి చెన్నారెడ్డి అధ్యక్షతన జరిగిన సభలో ఈ బిరుదు ప్రధానం చేయబడింది.

## IV. 5. విశ్వకవి సమ్రాట్ :

1964 ఆగష్టు 23వ తేదీన ఏలూరు హిందూ యువజన సంఘ భవనంలో తెలుగు దర్బార్ యాజమాన్యం జరిపిన సమావేశంలో త్రిపురనేని వేంకటేశ్వరరావు గారి ద్వారా ఈ బిరుదు ప్రధానం చేయబడింది.

## IV. 6. కళాప్రపూర్ణ :

1970లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఈ బిరుదును బహుకరించింది.

## IV. 7. పద్మభూషణ్ :

1970వ సంవత్సరం రిపబ్లిక్ వం సందర్భంగా భారత ప్రభుత్వం ఈ బిరుదును ప్రధానోత్సవం చేసింది.

## IV. 2. సన్మానాలు :

1. *గుంటూరు పొగాకు వ్యాపారుల సన్మానం :* 1953 జనవరి 29వ తేదీ గుంటూరులో జరిగిన సత్కార సభలో సన్మాన సంఘం వారు జాషువకు 2ఎకరాల మాగాణి పొలాన్ని గోపాలకృష్ణయ్య తోటలో ఒక డాబా యింటిని సమర్పించారు. 'నాకథ' కృతి భర్త రాజయ్యగారు జాషువకు సువర్ణ స్నానం చేయించారు.
2. 1964వ సంవత్సరంలో కేంద్ర సాహిత్య అకాడెమి వారు 'క్రీస్తు చరిత్ర' గ్రంథానికి రు.5000/- బహుకరించారు. 1965 ఫిబ్రవరి 15వ తేదీ జాషువ గారు అప్పటి రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ ద్వారా ఈ బహుమానాన్ని అందుకున్నారు. 1964లో జాషువను శాసనమండలి సభ్యునిగా నియమించారు. ఇలా ఎన్నో సన్మానాలు జాషుగాగారు అందుకొన్నారు.

**V. రచనలు :**

"ఈదితి వాఙ్మయాంబునిధి నేబది యేడులు సర్వపండితా
మోదముగా రచించితిని ముప్పది కావ్యములిట్టి నీవు ని
ర్వేదము గల్గు దిఃకృతి లభించెడు దేశములోన నీకు నా
కేది శరణ్యమంచు తలయెత్తక చింతలె కావ్యకామినుల్"

జాషువ చెప్పుకున్నదానికంటే ఆయన కావ్యాలు అధికంగానే ఉన్నాయి. నేడు మనకు ఉపలబ్ధమైన జాషువ కృతుల్ని మూడు రకాలుగా వర్గీకరించుకోవచ్చు

1. పద్య కావ్యాలు
2. గద్య కావ్యాలు
3. దృశ్య కావ్యాలు

**V. 1. పద్యకావ్యాలు :**

పద్యాకావ్యాల్ని తిరిగి కావ్య ఖండికలు, ఖండకావ్యాలు, లఘు కావ్యాలని మూడు విభాగాలుగా విభజింపవచ్చు.

**V. 1.1. కావ్యఖండికలు :**

ఇవి ఏడు భాగాలుగా ఉన్నాయి.

**V. 1.2. ఖండకావ్యాలు :**

1. అనాథ, 2. స్వప్నకథ, 3. గబ్బిలం[1,2], 4. కాందిశీకుడు, 5. నేతాజీ, 6. బాపుజీ, 7. స్వయంవరం, 8. రాష్ట్రపూజ, 9. కొత్తలోకం, 10. ముసాఫరులు, 11. నాగార్జున సాగర్.

**V. 1.3. లఘు కావ్యాలు :**

1. పిరదౌసి, 2. ముంతాజ్ మహల్, 3. క్రీస్తు చరిత్ర.

**V. 2. గద్య కావ్యాలు :**

1. కుశలవోపాఖ్యానము, 2. చిన్ననాయకుడు.

## V. 3. దృశ్యకావ్యాలు :

1. రుక్మిణీ కల్యాణము, 2. చిదానందప్రభాతము, ధ్రువ విజయము, వీరాబాయి, తెరచాటు ముద్రితాలుగా గుర్తించవచ్చు. ఈ దృశ్య కావ్యాల్ని సమీక్ష చేసేటప్పుడు నాటక రచనా కాలం, ప్రకటిత కాలం గుర్తించవలసి ఉంది.

| నాటకం పేరు | రచనా కాలం | ప్రకటితమైన కాలం |
|---|---|---|
| 1. రుక్మిణీ కల్యాణము | 1918-1919 | 1923 |
| 2. మదాలస | 1919 | అముద్రితం |
| 3. దావీదు చరిత్ర | 1920 | ,, |
| 4. చిదానందప్రభాతము | 1921 | 1921 |
| 5. ధ్రువ విజయము | 1925 | 1925 |
| 6. వీరాబాయి | 1926 | 1946 |
| 7. తెరచాటు | 1935 | 1946 |

వస్తు భేదాన్ని బట్టి ఈనాటకాల్ని మూడు రకాలుగా విభజించవచ్చు.

**1. పౌరాణిక నాటకాలు :**

1. రుక్మిణీ కల్యాణము
2. చిదానంద ప్రభాతము
3. ధ్రువ విజయము

**2. చారిత్రక నాటకాలు :**

1. వీరాబాయి.

**3. సాంఘిక నాటకాలు :**

1. తెరచాటు

ఈ నాటకాలు ఒక్కొక్క దాన్ని విడివిడిగా పరామర్శించ వచ్చు.

## V. 3.1. రుక్మిణీ కల్యాణము :

*1918-19* మధ్య కాలంలో రుక్మిణీ కల్యాణము నాటక రచనజరిగింది. *1923*లో ప్రథమంగా ప్రచురింపబడింది. రాజమహేంద్రవరంలో చింతామణి నాటకమండలి వ్యవస్థాపకులైన సత్యవోలు గున్నేశ్వరరావుతో కలిగిన పరిచయం ఈ నాటక సృష్టికి దారి తీసింది. విజయవాడ తాలూకా తెన్నేరు గ్రామస్థుడైన గుళ్ళపల్లి వెంకట్రామయ్య చౌదరి గారికి ఇది అంకితమీయబడింది.

ఆరు అంకాలతో కూడిన ఈ నాటకం నాందితో ప్రారంభమై భరతవాక్యంతో అంతమౌతుంది. ప్రవేశిక, విష్కంభాలు ఇందులో ప్రయుక్తం కాలేదు. అంకాలు సీనులుగా విభజించబడ్డాయి. ఉద్యానవనం, రాజసభలు ఇందులో ప్రధాన దృశ్యాలుగా చోటుచేసుకొన్నాయి. ఇందులో ఇంచు మించుగా *102* పద్యాలున్నట్లుగా తెలుస్తుంది. పార్శీ పద్ధతిలో కూర్చబడిన *26* కీర్తనలు కూడా పొందపరచబడ్డాయి.

**V. 3.1.1. మూలకథ–కల్పనలు :**

ఈనాటకానికి మూలం పోతన భాగవతంలోని దశమ స్కంధాగ్గతమైన రుక్మిణీ కల్యాణ ఘట్టం. కృష్ణుడు, రుక్మిణీ, శిశుపాలుడు భాగవత పాత్రలే అయిన రుక్మిణీ చెలికత్తెలైన తరల, లలిత, చతురికలు, శిశుపాలుని కొలువులోని విధూషకుడు కవి కల్పిత పాత్రలు. దక్షిణాంధ్ర సాహిత్యంలో వెలసిన రాధాపాత్ర ఈనాటకంలో ఉండడం గమనార్హం.

**V. 3.1.2. సమకాలీన దృక్పథం :**

ఇరవైవ శతాబ్ది ఆరంభంలో ఏకవి ఏమి రాసినా అది ప్రత్యక్షంగానో,పరోక్షంగానో స్వాతంత్ర్య ఉద్యమానికి చేదోడు వాదోడుగా ఉండేది. జాషువ కూడా ఈ పౌరాణికనాటకంలో సహితం స్వరాజ్య కాంక్షనువ్యక్తం చేశాడు. ఈ నాటకంలోని నాయిక రుక్మిణీ భారత స్వాతంత్ర్య లక్ష్మిగాను, శ్రీకృష్ణుడు జాతీయ నాయకుడు గానూ శిశుపాలునికి రుక్మిణిని కట్టబెట్టాలని ప్రయత్నించిన రుక్మి జరాసంధ దంత వక్త్రి పౌండ్రక సాల్వ విదూరదులు దేశ విద్రోహులుగాను చిత్రింపబడడం ముఖ్యవిశేషం.

జాషువ ఈ నాటకంలో కొన్ని శ్లేష పద్యాలు రాశాడు. ఒక అర్థం నాటకానికి సంబంధించినది కాగా రెండవ భాగం ఆనాటి స్వాతంత్ర్య కాంక్షను తెలియజేసింది. ఉదా:-

ఉదా పరుల మంచి కసహ్యపడ చిత్త మెఱియంగ
లోలోనఁగ్రుళ్లెదు లోభిమతులు
అబ్బిన జుట్టును నబ్బకుండినఁగాళ్లు
బట్టి యత్నించు నపాత్రమతులు

యెదుట గొప్పగఁబల్కిమది నీర్ష్యఁబూనికు
ట్రలు వన్నుచుండెదు తులువమతులు
తమరాజ్య మొరుల హస్తముల నిల్పి శరీర
ముల నమ్ముకొనియెదు మూఢమతులు

అరుల దురుమంగ లేక దేహములఁదాచు
కొనుచు జేనెడు పొట్టకై ఘొరదాస్య
మునకు లోనైనవారు కాబోలు నిట్లు
ప్రబలుచున్నారు కలియుగారంభవేళ. (రుక్మి.తృ.అం.పు.57)

తన బంధువులె తన్నుఁగొనిపోయి యన్యదే
శీయుల కీయఁజూచెదు విధంబు
జాతి మతాచార సరణిఁదప్పి చరించు
యగ్రజన్ముల నిందితాభి మతము
మలినులై లోకమాన్యుల మిత్రులను గౌర
వింపని రాజుల వెజఁగుఁదనము
విమత రాజాగమ విప్లవం బెఱుఁగక
తలలెత్తి చూచు నింతుల తెఱంగు
యరసి కన్నటి ధారలు గురియు ధరణి
కన్యకా దుఃఖ మడగించుగాత!యుర్వి
భాసిలు మహోత్కుఁదేగి కైలాస మెక్కి
కాంచు మా తండ్రి బాల గంగాధరుండు

ఈ నాటకంలో 'రుక్మి' స్వగతములోని ఒకని గోరెదు పిల్ల నొకనికి నర్పించి గొంతులు గోసెడు క్రూరులారా...... అబ్బకైన, బ్రహ్మకైనను కన్యల స్వాంతములను గనక బెండ్లి సేయగ హక్కు గలుగదెందు" అన్న మాటలు ఆనాటి మహిళాభ్యుదయాన్ని వెలుగెత్తి చాటుతున్నాయి. ఈ నాటకంలోని భరతవాక్యం స్వదేశం మీద భక్తి భావాన్ని చాటి చెబుతుంది.

కలుషమతుల కరంబులు దొలఁగి లోక
మాత రుక్మిణి భర్తతో మను విధాన
మా భరతఖండ బహుళ సామ్రాజ్యలక్ష్మి
యలరుగాత! మనోనాథు నంకసీమ.

## V. 3.2. చిదానంద ప్రభాతము :

ఇది జాషువ రచించిన నాటకాల్లో నాల్గవది. ప్రచురించిన వాటిలో మూడ వది. క్రీస్తు చరిత్రకు సంబంధించిన వాటిలో రెండవది. జాషువ 1921 రేపల్లె తాలూగా కూచనపూడి గ్రామవాసులైన కర్రా యేసేపుగారి సాయంతో ఈ నాటకాన్ని వెలువరించారు. ఇది మూడంకాల నాటకం.

### V. 3.2.1. ఇతివృత్తం :

ఇది క్రీస్తు జనన మహాత్మ్యాన్ని తెలిపే నాటకం. యేసేపుకు మేరి అనే కన్యను ఇచ్చి వివాహం చేయాలనుకుంటారు. కాని ఆమె పరిశుద్ధాత్మ సంకల్పం వల్ల అప్పటికే గర్భం ధరించింది. యేసేపు మానసిక వ్యధకు లోనవుతాడు. గాబ్రియేలు దూత యేసేపుకు సత్యాన్ని విశదీకరిస్తుంది. నిండు చూలాలైన మేరిని తీసుకొని యేసేపు బెత్లహేము చేరుతాడు. అక్కడొక పశువుల కొట్టంలో మేరి క్రీస్తుకు జన్మనిస్తుంది. ఈ విషయాన్ని దేవదూత ద్వారా తెలుసుకొన్న గొల్లల కాపరులు బాల ఏసును దర్శిస్తారు. బేత్లహేములోని రెండేండ్లలోపు పిల్లలందరిని చంపమని భటులను ఆజ్ఞాపిస్తాడు. గాబ్రియేలు దూతద్వారా ఈ విషయాన్ని తెలుసుకొన్న యేసేపు భార్య పుత్రులతో ఐగుప్తుకు వెళ్లిపోతాడు.

### V. 3.2.2. నాటక మర్యాద

జాషువ సువార్తలలోని అంశాలను నాటకోచితమైన దృశ్య విభజనకు సరిపడేటట్లు మలచుకొన్నాడు. బైబిల్‌లోని సన్నివేశాలు నాటకీకరించడానికి అంతగా కుదరదు. సంస్కృతరూపక మర్యాదను అనుసరించి ఈ నాటకం నాందితో ప్రారంభించబడింది. అట్లే ఆముఖంలో వసంత ఋతువు వర్ణన చేయబడింది. పాశ్చాత్య రూపక సంప్రదాయమునమసరించి స్థల కాల ఐక్యాలను పాటించి జాషువ ఈ నాటకంలోని అంకాలను రంగాలుగా విభజించాడు. ఇందులో జాషువ సుమారు *65* పద్యాలు, *15* పాటలు కూర్చినాడు.

తన కులాన్ని, తన మతాన్ని అంగీకరించి ఒక సంకుచిత పరిధికి కట్టుబడిన జాషువ తొలినాటి వ్యక్తిత్వానికి, క్రైస్తవ మతాన్ని స్వీకరించిన తరతరాల నుండి బయట పడని క్రైస్తవ మిత్రుల అభిరుచి ననుసరించి జాషువ వెలయించిన కవిత్వానికి ఈనాటకమొక మచ్చుతునక.

### V. 3.3. ధ్రువ విజయము :

*1925*వ సంవత్సరంలో ప్రకటించబడిన ఈ నాటకం నాలుగు అంకాలతో కూడిన పౌరాణిక నాటకం. ఇది రాధాకృష్ణ విలాస సభ వారి ప్రోత్సాహంతో రచింపబడింది.

## V. 3.3.1. పీఠిక :

ఈ నాటకానికి పీఠికాముఖంగా జాషువ కొన్ని మాటలు రాశాడు. దానిని బట్టి ఆనాటి ప్రేక్షక హృదయాల్ని మనం గుర్తించవచ్చు. నాటకంలో పద్యాల సంఖ్య ఎక్కువ కాకూడదని కొందరు. పద్యాలు లేకపోతే మూతి ముడుచుకునేవారు. కొందరు, అందర్ని మెప్పించడానికి తాను ప్రయత్నిం చేసినట్లు జాషువా చెప్పుకున్నారు. ఇందులో 49 పద్యాలుమాత్రమే ఉన్నాయి. నాంది, ప్రస్తావనలతో నాటకం ప్రారంభమయ్యింది. రసం, అంక పరిమితి మొదలైన విషయాల్లో ఈ నాటకం సంస్కృత నాటక లక్షణాలతో సంవధించబడలేదు.

## V. 3.3.2. మూలకథ-కల్పనలు :

ఈ నాటకానికి మూలం ఆంధ్రమహాభాగవతంలోని చతుర్థ స్కంధంలోని ధ్రువోపాఖ్యాన ఘట్టం. "గాథ మిక్కిలి చిన్నదగుటచే మూలమునకు భిన్నమైన మాయా సునీతిని ప్రవేశపెట్టి ధ్రువోత్తములు బంతులాట ఆదిగా గల విషయములను కల్పించితిని" అని జాషువయే పేర్కొనడం గమనింపదగిన అంశం. చతుర్థాంకంలో ధ్రువుని తపోదీక్షను భగ్నం చేయడానికి ఒక రాక్షస స్త్రీ మహావిష్ణువుచే నియోగింపబడుతుంది. అయిదు సంవత్సరాల బాలుని మనస్సును ఏకాగ్రత నుండి మళ్లించడానికి రంభాదులను ప్రవేశపెట్టడానికి బదులు రాక్షస స్త్రీ ప్రవేశ కల్పన చక్కగా ఉంది. జాషువ భాగవతంలోని ధ్రువోపాఖ్యాన కథని చదవడం కాదు బాగా జీర్ణించు కున్నాడు.

తండ్రి తొడ నెక్కు వేడుగ దగిలెనేని
పూని నాగర్భమున నాఁపుట్టు కన్య
గర్భమునఁ బుట్టఁగోరవఁగలదె నేఁడు
జనకు తొడ యెక్కు భాగ్యంబు సవతి కొడుక

తండ్రి యంకాన మందు చిత్తంబు గలగఁ
దొలుత నాగర్భమున నాఁడు బుట్టకల సునీతి
గర్భమునఁబుట్టనేల బింకాననింత
సంచరింపగ నేలరా సవతి కొడుక!

భాగవతంలోని శరణాగతి రూపమైన భక్తికి నిధానంగా భావించబడే ధ్రువుని పాత్ర ఈనాటకంలో కొంత ఉదాత్తతను కోల్పోయిందని చెప్పక తప్పదు. "ఈతడు నాకు దండ్రియా! తండ్రియని పిలిచిన నా నాలుక చీలికలు కాకున్నది" మొదలైన మాటలు ధ్రువుని యొక్క ఉదాత్త స్వభావానికి గొడ్డలి

పెట్టులాగున్నది ఇందులోని నారదుడి పాత్ర కూడా కేవల కలహాభోజనుడిగా కన్పిస్తాడు. కవి పండిత లోకంలో తానొక కవిగా గుర్తింపబడాలన్న దీక్షతో జాషువ చేసిన ప్రయత్నంగా ఈ నాటకాన్ని గుర్తించవచ్చు.

## V. 4. వీరాబాయి :

*1926*లో రచింపబడి *1946*లో ప్రకటించబడింది. ఇది చారిత్రక నాటకం. ఇందులో అయిదు అంకాలున్నాయి.

## V. 4.1. నాటక రచనోద్దేశం :

ఈ నాటక రచనోద్దేశాన్ని గూర్చి జాషువయే ఇట్లా చెప్పుకున్నాడు. *"నాటకము చరిత్రాత్మకము. హిందు ముస్లిం మైత్రిని మనస్సున నుంచుకొని నేనీ నాటక రచనకుపక్రమించితిని. ఉదయ సింహుని హృదయేశ్వరి వీరాబాయి శౌర్య ప్రతాపము లిందు వర్ణితములు. కులమత ద్వేష దూషితుడు కాని యక్బరు చక్రవర్తి గుణగ్రహణ పారీణత, బనవీరుని శత్రుసంహారదీక్ష, చిత్తూరు రాజ వినాశార్థమతడు పన్నిన పన్నాగములు, మొగలు రాజును వివాహమాడి తన సర్వసమతా పవిత్రాశయాన్ని ప్రకటించిన మధురాదేవి శీలము వీలయినంత మట్టుకే నాటకమున పోషించితిని".*

## V. 4.2. చారిత్రక విషయం :

కొన్ని చారిత్రకాంశాల్ని జాషువ ఇందులో మార్చేశాడు. ముఖ్యంగా చిత్తోడ్గడ పతనమైన నాలుగు సంవత్సరాలకు ఉదయసింహుడు ఆరావళీ పర్వత శ్రేణిలోని గోగుండ ప్రాంతంలో మరణించినట్లు చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. *1540* ప్రాంతంలో బనవీరుని కుట్రలను భగ్నంచేసి ఉదయసింహుడు చిత్తోడ్గడ స్వాధీనం చేసుకున్నట్లు, *1567* సంవత్సరంలో చిత్తోడ్గడను అక్బరు వశపరుచుకొన్నట్లు చరిత్రకారుల అభిప్రాయం. అక్బరు చిత్తోడ్గడను ఆక్రమించుకోవడంలో బనవీరనికి ఎలాంటి సంబంధమున్నట్లు లేదు. కాని జాషువ బనవీరుని వల్లనే అక్బరు ఉదయసింహుల మధ్య వైరము వచ్చినట్లు బనవీరుడే ఉదయసింహుని వధించినట్లు నాటకంలో పేర్కొన్నాడు.

నాటకంలో వీరాబాయి ఉదయసింహుల పుత్రుడుగా అరివీర భయంకరుడు అని పేరుగాంచిన పట్టరాణా చరిత్ర ప్రకారం శిశోదియా క్షత్రియ కులానికి చెందిన వీరుడు. చరిత్రలో ఉదయసింహుని పుత్రులుగా పేర్కొనబడిన రాణా ప్రతాప్, శక్తిసింహుల ప్రస్తావన ఈనాటకంలో లేదు.

### V. 4.3. భాష విషయము :

ఈ నాటకంలో తెలుగు-ఉర్దూ మిశ్రమ బాష వాడబడింది. ఈ కాలానికి ఇటువంటి ప్రయోగం కొంత వింతగా కనిపించవచ్చునేమోగాని ఈ నాటక రచనాకాలం నాడు మాత్రం అక్కడక్కడా మిశ్రమభాష ప్రయోగాలున్నట్లు తెలుస్తోంది. ప్రతాపరుద్రీయ నాటకంలో వేదం వేంకటరాయశాస్త్రి గారు కూడా ఇలాంటి ప్రయోగమే చేసి వుండడం మనం గమనించవచ్చు. ఈ నాటకంలోని మిశ్రమ భాషకి చిన్న ఉదాహరణ "భైమ్మ దేముడు నాకి మొఖం మీద హిస్మంటిరాత చేశాడ్. అగ్బర్ సర్కార్కి దగ్రమాకి బదిసమచ్చరాల్ నుంచి కొలువు చేస్తాం. నాకీ ఘాచారం యియ్యాల సర్కార్కి కోపం చేసింది."

### V. 4.4. జాతీయోద్యమ ప్రభావం :

*1915-25* ప్రాంతంలో తెలుగులో దేశభక్తి ప్రబోధకాలై నాటకాలు పుంఖాను పుంఖాలుగా వెలువడినాయి. జాషువ గారు కూడా హిందూ ముస్లిం మైత్రిని దృష్టిలో వుంచుకొని ఈ నాటకం రాశాడు. ఈ నాటకంలో మధురాదేవి మాటలు గమనింపదగియున్నవి.

> "పౌరుషహీనులై పరుల పంచలఁగూటికి వేచి యుండుని
> స్సార నరస్వరూప తను జన్మల గన్నది గాదు వీరని
> త్తూరు ప్రుంధ!విక్మ నిధుల్గరి యించెడు పోతుగడ్డమా
> భారత మాత కాపురముపై నభిమానము మెండు భువరా!"

వీరబాయి మరణానంతరం అక్బరు నోటి వెంట జాషువ పలికించిన మాటలు జాతీయ భావానికి అద్దం పడుతున్నాయి. "ఈశ్వర సృష్టి యందు మానవు లెల్లరు సమానులే. ప్రతివాని కగ్రస్థానమీయబడినది. హీనుడు ఘనుడు తారతమ్యమే ప్రళయ జాడ్యములను పుట్టించు క్రిములు".

### VI. తెరచాటు :

ఇది సాంఘిక నాటకం. మీదుమిక్కిలి విషాదాంత నాటకం. ఇందులో నాలుగు అంకాలున్నాయి. *1938* ప్రాంతంలో రచింపబడ్డ ఈ నాటకం *1946*లో ప్రప్రథమంగా ప్రచురితమైంది. తాను ఈ నాటకాన్ని గూడవల్లి రామబ్రహ్మం గారు ఏర్పాటు చేసిన సాంఘిక నాటకాల పోటీకి రచించినట్టు జాషువయే చెప్పుకున్నాడు.

**VI. 1. నాటక రచనోద్దేశం**

నాటక రచన ప్రధానోద్దేశం కూడా జాషువ చెప్పుకున్నాడు. "నా మనస్సు వేధిస్తూ యున్న పెక్కు విషయాలను సమకూర్చుకొని నేనీ నాటకాన్ని వ్రాసినాను. సంస్కరణాభిలాష నాకు మిక్కుటంగా కలదు. కథకేవలం కల్పితము. బాల వితంతువుల హృదయావేదన, తత్ఫలితంగా కలుగు ననర్థాలు, నేటి యింగ్లీషు వైద్యుల నిష్కరుణ, సనాతనుల స్వార్థపర్వతం, ముసలి మగళ్ళు పడుచు పెండ్లాలతో అనుభవించు కష్టాలు మున్నగు విషయాలను లోకానికి వెల్లడించడమే నా ముఖ్యోద్దేశం."

**VI. 2. సామాజిక విషయాలు :**

జాషువ ఈ నాటకంలో కొన్ని సామాజిక స్థితుల్ని చక్కగా వర్ణించారు. బ్రహ్మశాస్త్రి ప్రమోదకుమారుల పాత్రలమాటల ద్వారా ఆనాటి స్థితిగతుల్ని ప్రేక్షకుల ముందుంచాడు. ఉదాహరణకు

బ్రహ్మ : *"ఆ ఏదోవేశాం అయిపోయింది. స్వరాజ్యం స్వరాజ్యమని అంతా అంటుంటే ఆశపడ్డా. పుటిక్కిన వస్తుందేమో నెనొక ప్రక్క యేంవ చ్చుగదా అని. స్వరాజ్యం స్వరాజ్యమని గోలపెట్టిన ముండా కొడుకు మధ్య హరిజనోద్ధరణము, దేవాలయ ప్రవేశమని చొప్పించాడేమిటి? వర్ణ సంకరం వేయడానికి.*

ప్రమో : *స్వరాజ్యమేమో కావాలి కాని, దేవాలయాల్లోకి మాత్రం హరిజనులు రాకూడదూ? అప్పుడు వర్ణ సంకరమౌతుంది. ఎంత క్రూరమైంది నాన్నా మన సంఘం! ధర్మమో ధర్మమో అని అఘోరిస్తారు మళ్లా. మన ధర్మమిలా తగులబడిపోతుంది. ధర్మదేవతకు నాలుగు కాళ్లని శాస్త్రాలలో రాశారే ఆ పోల్కి మహాకుదిరింది పశుధర్మం గనుక"*

ఈ నాటకంలో పాత్రోన్మేళనలో కొన్ని లోపాలున్నట్లు డా. ఓ. భాస్కర చౌదరిగారు సోదాహరణంగా నిరూపించారు. ముఖ్యంగా కవి కిశోర్ కుమారుని పాత్రను మొదట *ఉదాత్తంగా చిత్రించి క్రమక్రమంగా నాటకంలో అతని పాత్రను అనుదాత్త పాత్రగా చిత్రించడం లోపమని డా. చౌదరి గారి అభి ప్రాయం అయితే "కావ్యశిల్పమునకన్నా అభిప్రాయప్రకటనమే నా పరమావధి"* అన్న జాషువ దృక్పథానికి ఈ నాటక మొక చక్కని లక్షణంగా గుర్తించవచ్చు.

**VII. సమన్వయం :**

**VII. 1.** జాషువ మొదట పౌరాణిక తరువాత చారిత్రక ఆపైన సాంఘిక వృత్తాలను నాటకాలకు ఇతివృత్తాలుగా గ్రహించాడు. ఈ విషయం

ఒక విధంగా ఆంధ్రనాటకరంగంలో కన్పించే ఇతివృత్తానికి సంబంధించిన పరిణామమని మనం భావించవచ్చు.

**VII. 2.** జాషువ భిన్న నాటక సమాజాల వారి కోర్కెమీదనే కవి పండిత లోకంలో నిలదొక్కుకోవడానికి నాటక రచన చేసినట్లు మనం గుర్తించవచ్చు.

**VII. 3.** జాషువ మొదట నాటకాలలో పద్యాలు, పాటలు అధికంగా కనిపిస్తాయి. తరువాత వాటిలో వీటి సంఖ్య తగ్గింది. దీనికి కారణం ఆంధ్ర నాటకరంగంలో వచ్చిన మార్పు కావచ్చు.

**VII. 4.** రుక్మిణీ కల్యాణము, చిదానంద ప్రభాతం, ధ్రువవిజయాలలో నాంది, ప్రస్తావనలున్నాయి. ఇది ప్రాచ్య సంప్రదాయం. పాశ్చాత్య పద్ధతి ననుసరించి అంకాలు రంగాలుగా చెప్పబడ్డాయి. అర్థోపక్షేపకాలు కనిపించవు. అంటే మొదటి మూడు నాటకాల్లో జాషువ ప్రాశ్చ పాశ్చాత్య మర్యాదల్ని అవలంభించినట్లు తెలుస్తోంది.

**VII. 5.** భాష విషయానికొస్తే ఒక్క 'తెరచాటు' తప్ప మిగిలినవన్నీ గ్రాంథిక భాషలోనే రాయబడ్డాయి. 'వీరాబాయి'లో మిశ్రమభాష కన్పిస్తుంది.

**VII. 6.** చిదానందప్రభాతంలో జాషువ హైందవ మత సంప్రదాయాలను చెప్పాడు

**VII. 7.** పౌరాణిక నాటకాల్లో ఇతివృత్తాన్ని మూలభిన్నంగా జాషువ చెయ్యలేదు. అయితే చారిత్రక నాటకమైన వీరాబాయిలో కొన్ని చారిత్రక అంశాల్ని మార్చి వేశాడు.

## VIII. ఉపసంహారం :

కవిగా, భావకుడుగా అత్యున్నత శిఖరాన్ని అధిరోహించిన జాషువ నాటక రచయితగా అంత ఎత్తుకు ఎదగలేదు. దానికి కారణాలు జాషువ అపరిపక్వమైన వయస్సున నాటక సృష్టికి పూనుకోవడం, ఒక కారణం. రెండవది నాటక రచన చేసిన కాలంలో కాక అది తరువాత ఎప్పుడో ముద్రించబడడం, అది ముద్రించే నాటికి అతను నాటకంలో ప్రతిపాదించబడిన సమస్యకు కాలదోషం పట్టడం. ఏది ఏమైనా జాషువ ఉన్నతమైన కవిగానే గాకుండా ఒక నాటకకర్తగా కూడా మనం గుర్తించు కోవలసిన మహా మనీషి.

# 18. ఉపాధ్యాయ వృత్తి నవలలు

## I. శీర్షిక వివరణ :

"ఉపాధ్యాయ వృత్తి నవలలు" అనే శీర్షికకు ఉపాధ్యాయ వృత్తిని గూర్చి ప్రస్తావించిన నవలలు అని అర్థం. 'ఉపాధ్యాయుడు వృత్తి' అనే పదాల్ని గూర్చి కొంత ఆలోచించవలసి వుంది.

## II. 1. ఉపాధ్యాయ శబ్దానికి పర్యాయ పదాలు :

ఉపాధ్యాయ శబ్దానికి గురువు, ఆచార్యుడు, పండితుడు, శ్రోత్రియుడు, ఋత్విజుడు, పురోహితుడు అనునవి పర్యాయ పదాలు. పరిశీలించి చూస్తే వీటి మధ్య కొంత అర్థభేదం కన్పిస్తుంది.

### II. 1.1. గురువు :

గర్భదానాది సంస్కారాల్ని శాస్త్రోక్తంగాచేసి విద్యార్థికి అన్నంపెట్టి పోషించేవాడు గురువని స్మృత్యార్థం. 'గు' అంటే అజ్ఞానమనే చీకటి 'రు' అంటే జ్ఞానమనే వెలుగు అనగా శిష్యులలో వున్న అజ్ఞానమనే చీకటిని తొలగించి అతడికి జ్ఞానమనే వెలుగును ప్రసాదించేవాడు గురువు.

### II. 1.2. ఆచార్యుడు :

శిష్యునికి ఉపనయనం చేసి కల్పరహస్య సహితంగా వేదంలో ఒక శాఖను బోధించేవాడు ఆచార్యుడు. ఇతడు పదవాక్య ప్రమాణజ్ఞుడు వ్యాకరణం, వేదాంతం, తర్కం, బాగా తెలిసినవాడై వుంటాడు. వేదంలో పూర్వభాగమైన యజ్ఞవిద్యను, ఉత్తరభాగమైన ఉపనిషత్తుల్ని గూర్చి ఆచార్యుడు విధిగా చెప్పాలి.

### II. 1.3. పండితుడు :

'పండ' శబ్దానికి వున్నది వున్నట్లుగా తెలుసుకోవడం అని అర్థం. పండగలవాడు పండితుడు శ్రద్ధ విషయపరిజ్ఞానం, నిరంతర ప్రయత్నం, సహనం మొదలైనవి పండితునికుండాల్సిన గుణాలు.

### II. 1.4. శ్రోత్రియుడు :

శ్రుతిని అధ్యయనం చేసేవాడు శ్రోత్రియుడు. వేదాలలో ప్రత్యేక అభినివే

శంగలవాడు శ్రోత్రియుడు.

## II. 1.5. ఋత్విజుడు :

శరత్ వసంతాలలో యాగాన్ని చేసేవాడు ఋత్విజుడు.

## II. 1.6. పురోహితుడు :

శాంతి, కపాష్టికాది క్రియలలో ముందుండి యజమాని మేలుకోరేవాడు పురోహితుడు.

## II. 1.7. ఉపాధ్యాయుడు :

ఉపాధ్యాయ శబ్దానికి వేదంలోని మంత్ర బ్రహ్మణాల్లో ఒక భాగాన్ని కాని, వేదాంగాల్ని గాని జీవనం కోసం బోధించేవాడు ఉపాధ్యాయుడు అని చెప్పబడింది. ఇవే కాకుండా లోక వ్యవహారంలో అయ్యవారు, మాష్టారు, టీచరు, పంతులు మొదలైన పదాలు ఉపాధ్యాయపరంగా మనకు కనబడుతున్నాయి. ఉపాధ్యాయుడంటే దగ్గరుండి అధ్యయనం చేయించేవాడని అర్థం చెప్పవచ్చు.

## III. విద్య :

విద్య మూడు స్తంభాల మండపం. అందులో ఉపాధ్యాయుడు ఒక స్తంభం. శిష్యుడు మరొక స్తంభం. బోధ్యాంసం మూడవ స్తంభం. దేశకాలాదుల్నిబట్టి ఒక్కొక్క స్తంభానికి అధిక ప్రాధాన్యత ఏర్పడుతూ వస్తూవుంది. ఉపాధ్యాయుని, విద్యార్థిని కలిపేది విద్య. ఒకనాటి శిష్యుడు కొంతకాలానికి గురువు కావచ్చు. గురువు నిత్య విద్యార్థి. ఉపాధ్యాయుడు మార్గదర్శకుడు, బోధకుడు, పర్యవేక్షకుడు, పరీక్షకుడు కావాలి.

## VI. విద్యార్థి :

ఉపాధ్యాయుని వద్ద భక్తి ప్రవక్తులతో విద్యనభ్యసించేవాడు విద్యార్థి లేక శిష్యుడు.

## V. శిష్యుడు పర్యాయ పదాలు :

శిష్యుడు శబ్దానికి పర్యాయపదాలున్నాయి. శిష్యుడనగా శిక్షింప తగినవాడు. దీనికి 'అనూచారుడు' అనే పర్యాయ పదం వుంది. అనగా గురువు దగ్గర షడంగయుక్తమైన వేదాన్ని అధ్యయనం చేసేవాడు. 'క్షాత్రుడని' మరొక పర్యాయ పదం వుంది. గురువు యొక్క దోషాన్ని కప్పిపుచ్చేవాడు క్షాత్రుడు. సమావృత్తుడనేది శిష్యశబ్దానికి మరొక పర్యాయపదం. కొంతకాలం

గురువు దగ్గర విద్యనభ్యసించి తర్వాత గృహస్థ ఆశ్రమాన్ని స్వీకరించేవాడు సమావృతుడు. 'అంతేవాసి' అన్నది కూడా శిష్యశబ్దానికి పర్యాయ పదమే. గురువు యొక్క సమీపంనందువుండేవాడని అర్థం. బ్రహ్మచారి అన్నది కూడా శిష్య శబ్దానికి పర్యాయ పదమే. వేదాధ్యయన వ్రతమును ఆచరించేవాడు బ్రహ్మచారి. ఈవిధంగా ఉపాధ్యాయ శిష్య శబ్దాలు అనేక పర్యాయపదాలు కలిగివున్నా, సామాన్య లోక వ్యవహారం ఉపాధ్యాయుడు, విద్యార్థి (TEACHER - STUDENT) అర్థంలోనే మనం గ్రహిస్తున్నాం.

## VI. వృత్తి :

వృత్తి శబ్దానికి జీవనోపాయం, నడవడిక అని నైఘంటికార్థాలున్నాయి. జీవనోపాయం నాలుగు విధాలు అవి కృషి, పాశుపాల్యం, వాణిజ్యం, సేవ. ఉపాధ్యాయ వృత్తి అన్నప్పుడు ఉపాధ్యాయుడు చేయు కృషి, సేవ అని గమనించాలి. అంటే ఉపాధ్యాయుడు నిత్య సాహిత్య కృషీవలుడు కావాలి. ఈ వృత్తి ద్వారా లభించే ధనంతో జీవనాన్ని సాగించే వాడు కావాలి. అప్పుడే ఉపాధ్యాయుడు తన వృత్తికి తాను న్యాయం చేసినవాడవుతాడు.

## VII. విద్యా విధానము :

విద్యా విధానాన్ని గూర్చి P.L. రావుత్ గారు చక్కని పరిశీలన చేశారు. తొలి వేదయుగంలో, ఋగ్వేద కాలంలో ఋషులు నడిపే గృహ పాఠశాలలుండేవి. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ రావుత్ గారు. "In the Rigveda era, there existed small domestic schools run by the teacher himself. The pupils would lodge and boara at the house of their teacher. Their mode of living was strictly guided by the prescribed disciplinary rules. Higher education was confined to those who proved worthy of it."

ఆనాటి విద్యార్థికి గురువుల ఇండ్లే విద్యాలయాలు. ఉపనయనం జరిగిన తర్వాతనే శిష్యులకు గురుకులంలో ప్రవేశముంటుంది. విద్యార్థి నడవడిక బాగాలేకపోతే వెంటనే బయటకు పంపించేవారు. బ్రహ్మచర్యం పాటించి తీరాలి. గురుసేవ, భిక్షాటనం, మొదలైనవి శిష్యులు పాటించేవారు. ఆనాడు అనుకరణం (Imitation), ధారణం (Memorisation) అనేవి బోధనాపద్ధతుల్లో పాటించేవారు. గురువు చెప్పిన దానిని చెప్పినట్టుగా పలకడం అనుకరణం, అవసరమైనపుడు అప్పచెప్పడం ధారణం.

### VII. 1. ఉపనిషత్తుల కాలము :

ఉపనిషత్తుల కాలంనాటికి విద్యావిధానంలో మార్పు వచ్చింది. వేదమం

త్రాలకు వ్యాఖ్యాన రూపంలో వుండే వచన గ్రంధాలు వచ్చాయి. అవే బ్రాహ్మణాలు. వాటికి అనుబంధమైన గ్రంథాలు వెలశాయి. అవి అరణ్యకాలు. అరణ్యాలలో గురువుకు సమీపమున శిష్యుడు అధ్యయనం చేసే పద్ధతి వచ్చింది. రామాయణంలో మనకు ఈ సత్యం గోచరిస్తుంది. రామలక్ష్మణులు కారణం ఏదైనా విశ్వామిత్రుని వెంట అరణ్యాలకు వెళ్ళి అతని దగ్గర కూర్చొని విద్య నభ్యసించినట్లు చెప్పబడివుంది. రామపుత్రులైన 'లవకుశులు' కూడా వాల్మీకి దగ్గర విద్యను అభ్యసించినట్లు ఉత్తర రామాయణం చెబుతుంది.

ఈ యుగాల్లో విద్య బహు కొద్దిమందికి మాత్రమే పరిమితం చేసినట్లు స్పష్టంగా తెలుస్తుంది. విద్య పరిమితి కాలం పన్నెండేండ్లు. క్రమక్రమంగా విద్యను ప్రణాళికాబద్ధంగా నేర్చుకోవడం జరిగింది. ఈ యుగంలో ఆరు రకాలుగా బోధనాపద్ధతులున్నట్లు పండిత విమర్శకుల అభిప్రాయం. విద్యార్థులకు విషయాన్ని కథల ద్వారా బోధించడం ఒక పద్ధతి. దీన్నే ఉపాఖ్యాన పద్ధతి అంటారు. సంవాద పద్ధతిలో కూడా విద్యను బోధించేవారు. ఆలంకారిక పద్ధతి ద్వారా ఆచార్యుడు శిష్యునికి విద్యాభ్యాసం చేయించేవాడు. చర్చా పద్ధతి కూడా విషయాన్ని బోధించడానికి గురువులు గ్రహించేవారు. ఘోష్ఠి పద్ధతిద్వారా కూడా విద్యార్థులకు ఆచార్యులు బోధనచేసే విధానం వుండేది. ప్రయోగ పద్ధతి అత్యంత ఆదరణీయమైనటువంటిది. గురువు శిష్యునికి చెప్పే ప్రతి విషయాన్ని తాను ఆచరించి చూపేవాడు. ఇదే ప్రయోగపద్ధతి.

## VII. 2. భారతీయ విద్యావిధానము :

భారతీయ విద్యా విధానాల్ని పరిశీలిస్తే అది ఎన్నో మార్పులకుగురైనట్లు స్పష్టంగా తెలుస్తుంది. ఆయాదేశ కాలానుగుణంగా, ఆయాసమాజాల అవసరాల్నిబట్టి విద్యావిధానంలో మార్పులు వచ్చాయి. ఎన్ని మార్పులొచ్చినా ఆనాటినుండి నేటివరకు కూడా ప్రధాన ధ్యేయం ఒక్కటే. విద్యార్థి అతని అవసరానికి తగినట్లు ఆయా విద్యల్ని నేర్చుకొన్న సమాజశ్రేయస్సుకు తన వంతు కృషిచేసే మంచినడవడికను నేర్చుకోవడం విద్యార్థి ప్రథమ కర్తవ్యం. ఆ మార్గంలోనే శిష్యుల్ని పయనింపచేయడం ఉపాధ్యాయుని వృత్తి ప్రధాన ధర్మం. చదువుతోపాటు సంస్కారాల్ని అందించటం ఉపాధ్యాయుని విద్యుక్తధర్మాల్లో ఒకటి. నేటి విద్యావిధానంలో 'గురు-శిష్య' సంబంధం మృగ్యం. ఉపాధ్యాయ-విద్యార్థి సంబంధాలు కూడా అంతంత మాత్రంగానే వున్నాయి. "పెళ్ళైతేగాని పిచ్చి కుదరదు, పిచ్చి కుదిరితేగాని పెళ్ళికాదు" అన్న సామెతలాగా విద్యార్థుల్లో చదువు సంస్కారం నేర్చుకోవాలనే ఆసక్తి లేదని ఉపాధ్యాయులు, ఉపా

ధ్యాయులు వృత్తి ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించలేదని విద్యార్థులు ఒకరిమీద ఒకరు నింద వేసుకొంటున్నారు తప్ప సమాజానికి తమద్వారా జరుగుతున్న నష్టాన్ని గుర్తించలేక పోతున్నారు. ఏ వృత్తిలో లోపం జరిగినా అది క్షమిం చవచ్చునేమోగాని, ఉపాధ్యాయ - విద్యార్థి విషయాల్లో లోపం క్షమించరానిది. ఎందుకంటే ఒక డాక్టరు తన వృత్తిని సక్రమంగా నిర్వర్తించలేకపోతే ఒకరిద్దరి ప్రాణాలు పోతాయి. ఆయనకొచ్చే పేషెంట్లు తగ్గిపోతారు. ఒక లాయరు తన వృత్తిని సక్రమంగా నిర్వర్తించలేకపోతే ఒకరిద్దరికి నష్టం కల్గుతుంది. అతనికొచ్చే కేసులు తగ్గిపోతాయి. ఈ విధంగా ఏవృత్తిలో నిర్లక్ష్యం చేసినా కొంత నష్టం మాత్రం నిజమేకాని ఉపాధ్యాయ వృత్తి నిర్లక్ష్యం చేస్తే సమాజంలో ఒక భాగమే దెబ్బతింటుంది. మానవుడు మానసిక ఋజుగ్రస్తుడు అనే విషయాన్ని మనం అంగీకరిస్తే ఆ మానవుని మానసిక స్థితిని ఋజుస్థితి నుండి పరిపూర్ణమైన ఆరోగ్యస్థితికి చేర్చవలసిన బాధ్యత చేర్చే అవకాశం ఒక్క ఉపాధ్యాయ వృత్తిలోనే వుంది.

## VIII. నవల :

నవల ఆవిర్భావ వికాస పరిణామ ప్రయోజన లక్షణాది విషయాల్ని గూర్చిన వివరణలెన్నింటినో విమర్శకులు, పరిశోధకులు అనేక విధాలుగా వింగడించి, వివరించి తెలుగు సాహితీలోకానికి అందించియున్నారు. కాబట్టి వాటిని గూర్చి మళ్ళీ చెప్పడం చర్విత చరణమే అవుతుంది.

ఇరవైవ శతాబ్దంలో అనేక అంశాలు ఇతివృత్తంగా నవలలు వెలిశాయి. అందులో కొన్ని వృత్తులను ఇతివృత్తంగా స్వీకరించిన నవలలు కూడా ఉన్నాయి. ఉదా:- వైద్యవృత్తిని ఆధారంగా చేసుకొన్న నవలలు, లాయర్ల వృత్తిని ఆధారంగా చేసుకొన్న నవలలు తెలుగు సాహిత్యంలో వచ్చాయి. అంతేగాకుండా ఇతివృత్తంలో ప్రాసంగికంగా వృత్తులను గూర్చి ప్రస్తావించిన నవలలు కూడా వున్నాయి.

సమాజంలో దినదిన ప్రవర్ధమానమౌతున్న శాస్త్ర విజ్ఞానమాధారంగా నవ లల్లోని ఇతివృత్తం కూడా అనేక మార్పులకు లోనౌతుంది. సమాజంలో ఉత్పన్నమౌతున్న సమస్యల్ని రచయితలు, రచయిత్రులు తమ నవలల ద్వారా పాఠకలోకానికి పరిచయం చేస్తున్నారు. కొందరు సమస్యల పరిష్కారానికి మార్గాలను కూడా సూచిస్తున్నారు. ఇలా మార్గాలను సూచించే నవలలను మనం ఉత్తమ నవలలుగా భావించవచ్చు.

## IX. పరిశీలించిన నవలలు :

తెలుగు సాహిత్యంలోని అనేక నవలల్లో ఉపాధ్యాయ వృత్తికి సంబంధించిన విషయాలు ప్రస్తావించబడ్డాయి. వ్యాస విషయ క్లుప్తీకరణ కోసం మూడు నవలల్లోని విషయాన్ని మాత్రమే నేనిక్కడ ప్రస్తావించదలచాను. మొదటిది కొడవటిగంటి కుటుంబరావు గారి 'చదువు'నవల. ఇందులో ప్రధాన పాత్ర సుందరం. వీధి బళ్ల నుంచి కాశి హిందు విశ్వ విద్యాలయ విద్యార్థిగా ఎదిగినంత వరకు గల విషయాలు వివరించడం జరిగింది. రెండవది వీరపల్లి వీణావాణి దండకారణ్యం. ఇందులో విశ్వ విద్యాలయంలోని విషయాలు వివరించబడివున్నాయి. మూడవది ద్వారక (పి.హెచ్.వెంకటరత్నం)గారి 'పల్లె పిలిచింది'. రెండువందల అరవై పేజీల ఈ నవల్లో పూర్తిగా ఉపాధ్యాయ వృత్తిని గూర్చి విపులంగా వివరించడం జరిగింది. 1989వ సంవత్సరం ఆంధ్ర ప్రభ వార పత్రిక నిర్వహించిన దీపావళి నవలల పోటిల్లో ఈ నవలకు ద్వితీయ బహుమతి లభించింది. మొదటి **రెండు** నవలల్లో ఉపాధ్యాయులు, విద్యార్థులు, స్కూళ్ళు, కాలేజీలు వీటితో పాటు అనేక పాత్రల స్వభావాలు, అనేక విషయాలు చర్చించబడ్డాయి. 'పల్లె పిలిచింది'నవల్లో మాత్రం కేవలం ఉపాధ్యాయుల, హైస్కూళ్ల విషయాలను మాత్రమే అన్ని కోణాల నుంచి వివరించడం జరిగింది.

## X. చదువు:

1910-1935 మధ్య కాలంలోని సాంఘిక, రాజకీయ ఆర్థిక పరిస్థితులతో పాటు ఆనాటి విద్యా విధానాన్ని కూడా కొడవటిగంటి కుటుంబరావు తన చదువు నవలలో పరామర్శించారు. ఇది 1951లో ఆంధ్రజ్యోతి మాసపత్రికలో సీరియల్‌గా వచ్చింది.

## X. 1. స్వాతంత్ర్యానికి పూర్వం విద్యావిధానం :

స్వాతంత్ర్యానికి ముందు సమాజంలో పిల్లలకు చదువు చెప్పే పద్ధతి ఎంత నిరర్థకంగా వుండేదో అందులోను ఆ పిల్లలను శిక్షించే విధానం ఎంత అమానుషంగా వుండేదో కుటుంబరావు గారు చిత్రించారు. విద్యాలయాల్లో ఆరోజుల్లో అస్పృశ్యత ఒక సాంఘిక ఆచారంగా వుండేది. అంటరానివారనే ఒక వర్గంవారి పిల్లల్ని తరగతి గదిలో చివరన ఒక ప్రక్కగా కూర్చోబెట్టేవారని ఈ నవల ద్వారా తెలుస్తుంది. ఈ నవల్లో ప్రధాన పాత్ర సుందరం. సుందరాన్ని రచయిత ఒక వ్యక్తిగా, ఒక సామాజిక శక్తిగా తీర్చిదిద్దాడు. ఆలోచనాపరుడై సామాజిక పరిస్థితుల్ని విశ్లేషించుకోగలిగి చైతన్యవంతమైన జీవితం గడపడానికి చదువే ప్రధాన కారణమని రచయిత స్పష్టం చేశాడు.

**X. 1.1. అక్షరాభ్యాస ప్రక్రియ :**

చిన్నప్పుడే చదువనగానే భయపడి పోయేటట్లుగా ఆనాటి విద్యావిధానం వుండేది. ఉపాధ్యాయుల శిక్షావిధానం పిల్లలకు సింహస్వప్నం. ఆ ఉపాధ్యాయులు వేసే శిక్షలు భరించలేక బడికి పోవటమంటే పిల్లలు భయపడేవారు. అందుకే ఓనమాల దగ్గరే చాలమందికి చదువు ఆగిపోయేది. ఆనాటి విద్యావిధానంలోని ఆచారాలు మనకు ఇపుడు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. అక్షరాభ్యాసం చేయించటం ఆనాటి ఆచారాల్లో ఒకటి. ఇది ఒక పెద్ద తంతు. ఒక బ్రాహ్మణున్ని పిలిపించి ఇంటిలో ఒక పండుగలాగ నిర్వహించేవారు. బియ్యంలో ఓనమాలు రాయించేవారు. వాయిద్యాలు కూడా ఉపయోగించేవారు. బడి పిల్లలకు పప్పుబెల్లాలు, ఉపాధ్యాయులకు కొత్త బట్టలు, పురోహితునికి దక్షిణలు వారి వారి శక్తికొలది కానుకలు, అదొక హంగామాగా జరిగేది. ఇంకొక రకంగా చెప్పాలి అంటే బలిపీఠం దగ్గరకు తీసుకెళుతున్న బలిజంతువును అలంకరించినట్లుగా అలంకరించి, బడి అనే వధ్యశాలకు పిల్లలను తీసుకెళ్ళుతున్నట్లుగా ఈనాటి మనకు భావం కలిగేటట్లు ఆనాటి ఆచారముండేది.

నిప్పును సెగ చూపించి ఇది కాలుతుంది, కాలుతుంది అని పిల్లవానికి పదేపదే చెబితే వాడికి నిప్పంటే భయము ఏర్పడుతుంది. మంచినీరు లేదా పాలు త్రాగు మంచిది అని పదే పదే మంచిది అని చెబితే వానికి దాని మీద మమకారం ఏర్పడుతుంది. అట్లే చదువు విషయం కూడా. ఫలానావారు చదువుకొని గొప్పవారయ్యారని చదువుకుంటే మంచిది అనే జ్ఞానం, బడికి వెళ్ళితే బాగుంటుందనే జిజ్ఞాసను పిల్లల్లో కలిగించటం ఎంతైనా అవసరం. అట్లా కాకుండా ఇంట్లో అల్లరి చేసినపుడు బడికి పంపితే నీ పొగరు అణగుతుందని పదేపదే అనడంవల్ల పిల్లలకి బడి అంటే నిప్పులాంటిదనే భావం, భయం ఏర్పడుతాయి.

**X.1.2. శిక్షా విధానము :**

చదువు నవలలో శ్రీ కుటుంబరావుగారు ఆనాడు ఉపాధ్యాయులు పిల్లల్ని శిక్షించే విధానాన్ని కొంత వివరించారు. పరమ అహింసావాదులున్న ఈ భారతదేశంలో ఈ శిక్షావిధానం ఒళ్ళు జలదరింప చేస్తుంది. బడిలో 'అ ఆ' దిద్దపెట్టడమూ, శిక్షించడమూ అన్నవి ఒకదానినుండి ఒకటి విడదీయలేము అనే భావం ఆనాటి పంతుళ్ళకున్నట్లు తెలుస్తుంది. ఆనాటి పాఠశాలలు పంతుళ్ళగారి ఇళ్ళే. ఒక్కొక్క ఊరిలో వీధిబడి ఒకటి వుంటే ఈ పంతుళ్ళ బళ్ళు అనేకం వుండేవి. ఈ పంతుళ్ళ ఇళ్ళ పెరటిలోనూ, వసారాలోనో, అరుగు

మీదనో పాఠశాల నిర్వహించబడేది. ఆ పాఠశాలకు ఆ పంతులే సర్వాధికారి. మన కథానాయకుడు సుందరాన్ని అక్షరాభ్యాస కార్యక్రమం ముగిసిన తర్వాత రాఘవయ్య పంతుల బడిలో వేస్తుంది వాళ్ళమ్మ. రాఘవయ్య పంతులు ఒకనాడు ఎక్కడికో పోయివచ్చి కునుకుతూవున్న ఒక బాలుని కేకలు వేసి మూర్ఛపోయేంతవరకు కొడతాడు. అది చూచిన సుందరానికి అప్పటివరకు బడిమీద వున్న శ్రద్ధ నశించిపోయి బడంటే భయం ఏర్పడుతుంది. దానికి తోడుగ సహచరులు ఆ ఊరిలోనే వున్న మార్కండేయుల బడి ప్రస్తావన తెస్తారు. అక్కడ మార్కండేయులు పిల్లల తల పగలగొట్టడం, డొక్కల్లో తన్నడం, ఒకమూలనుండి మరొకమూలకు జుట్టుపట్టి విసిరేయడం, ఇష్టమొచ్చి నట్లు చేతులు తిప్పడం చేస్తుంటాడు. సుందరానికి శిక్షా పద్ధతుల్లో బండకొయ్య వేయడం కూడా ఒకటని తెలుస్తుంది. ఇంకా క్రూరమైన విధానం. 'కోదండం వేయడం'. దూలానికి తాడు కట్టి పిల్లవాన్ని ఆ తాడును పట్టుకొని వేలాడమని వాడు కిందకు దూకకుండా క్రింద రెండు కంపలు వుంచడం కోదండం వేసే పద్ధతి. ఇది ఒకప్పుడు 'రోమ్'లో బానిసల్ని శిక్షించే విధానం. ఈ కార్యక్రమాలలో కొన్నింటిని చూచి మరికొన్నింటిని గూర్చి విని బడికి వెళ్ళాలనే ఆశను ఒదులుకొన్నాడు సుందరం. ఇంటిదగ్గర తల్లి ప్రోత్సాహంతో తక్కువ వ్యవధిలోనే అక్షరాల్ని నేర్చుకొంటాడు సుందరం.

### X.1.3. అస్పృశ్యత :

ఆనాటి విద్యా విధానంలో అస్పృశ్యత కొట్టవచ్చినట్లు కనిపిస్తుండేది. అస్పృశ్యులని కొందరికి కొన్ని కులాల వారికి పాఠశాలలో ప్రవేశం నిరాకరించేవారు. చివరికి సుందరం మేనమామ 'శేషగిరి' జాతీయ పాఠశాలలు ప్రారంభించినప్పటికీ అస్పృశ్యుల్ని పాఠశాలలో చేర్చుకోవాలా వద్దా అన్న విషయం మీద తీవ్ర వాదోపవాదాలు జరిగి చివరికి వారిని చేర్చుకోవడానికి వీలు లేదనే నిర్ణయానికి వస్తారు.

సుందరంతోపాటు అతని ఇంటికి వచ్చిన 'మేదర' పిల్లవానికి గ్లాసుతో నీళ్ళివ్వడాన్ని అంగీకరించదు సుందరము తల్లి. సుందరానికి ఇది ఎంతో వ్యధను కల్గిస్తుంది. సుందరం బాధను చూడలేక వాళ్ళమ్మ గ్లాసుతో నీళ్ళిచ్చి పైకెత్తి తాగమంటుంది. అంతేగాక గ్లాసును మళ్ళీ తొలుచుకోవాలంటుంది.

### X.1.4. ఉపాధ్యాయులు కాని ఉపాధ్యాయులు :

ఉపాధ్యాయ శబ్దానికి పిల్లల్ని దగ్గర పెట్టుకొని విద్య నేర్పించడం అనే అర్థాన్ని మనం చెప్పకుంటే చదువు నవలలో మచ్చునకు ఒక ఉపాధ్యాయుడు

కూడా కనిపించదు. 'రాఘవయ్య', సుబ్రహ్మణ్యం, మార్కండేయులు, ద్దరూ తలా ఒక పాఠశాలను నిర్వహించారే కాని ఉపాధ్యాయ వృత్తిని మాత్రం క్రమంగా నిర్వహించలేకపోయారు. కొట్టడమే ధ్యేయంగా పెట్టుకొన్నారు. ఎంత ఎక్కువగ శిక్షిస్తే పిల్లలు అంత బాగా భయపడతారని పిల్లలు ఎంత ఎక్కువగా భయపడితే వాళ్ళకు అంత బాగా చదువు వస్తుందని భ్రమపడి భయపెట్టుకొన్నారు. 'ఉప' అనగా సమీపమునకు. అంటే పిల్లవాని హృదయ సమీపమునకు వెళ్ళి మనసును రంజింప చేసేటట్లుగా విద్యను చెప్పినవారు చదువు నవలలో మచ్చుకైనా కనిపించరు.

## X.1.5. విద్యా విధానంలో మార్పు :

సుందరం తనకున్న ఆస్తిని ధారపోసి పై చదువులు చదువుతాడు. కాని ఉద్యోగం రాలేదు. అయినా సుందరం ఎంతో మనోనిబ్బరంతో పుస్తకాలు చదవడం అనే అలవాటు మాత్రం మానుకోలేదు.

సుందరానికి ఒక కొడుకు కలిగి ఆ కొడుకుకు సుందరం భార్య అక్షరాల్ని నేర్పడం మొదలు పెట్టినపుడు సుందరం తన చిన్ననాటి రోజుల్ని జ్ఞాపకం చేసుకొంటాడు. ఆనాటి అమానుషమైన శిక్షావిధానాన్ని ఈనాటి మమతతో పోల్చుకొంటాడు. ఈనాడు బడిలో అస్పృశ్యులు కూడా వీరి అందరితో కలిసి చదువు కోవడాన్ని చూచి ఆనందిస్తాడు. విద్యావిధానంలో వచ్చిన మార్పుకు అతనెంతో ఆనందిస్తాడు.

## XI. దండకారణ్యం :

1985 Oct. చతురలో ఈ నవల ప్రచురితమైంది. వీరపల్లె వీణావాణి అనే కలం పేరుతో ఆంజనేయుల నాయుడు ఈ నవల నిర్మించాడు. రచయిత రసపరిపుష్టి కోసం కొన్ని కల్పనలు చేసినా చాలా వరకు ఇందులోని విషయాలు రచయిత అనుభవాలే.

## XI.1. నవల నేపథ్యం :

తల్లి, తండ్రిలేని రచయిత మేనమామ వద్ద పెరుగుతుంటాడు. ఆ మేనమామ ఒక బడిపంతులు విద్యార్థుల మీద ఏమాత్రం పట్టులేని ఉపాధ్యా యుడితడు. ఆప్యాయత, అనురాగం, ప్రేమ, వాత్సల్యం అనువానికి అతని హృదయంలో చోటులేదు. ప్రయివేట్ చెప్పి ధనం సంపాదించడమే జీవిత ధ్యేయం. విద్యను నమ్ముకున్నవాడిగా కాకుండ అమ్ముకున్నవాడుగా ఈ పాత్ర కన్పిస్తుంది. ఆ పూర్లోనే మాధవరావు అనే మరొక ఉపాధ్యాయుడుంటాడు.

విద్యమీద అభిమానం, చదువుకోవాలనే ఆసక్తి గల విద్యార్థుల మీద ప్రేమ మాధవరావుకు పుష్కలంగా వుంటాయి. ఈ నవలలో కథానాయకుని పేరు సారథి.

### XI.1.1. నవల ప్రారంభం :

నవల ప్రారంభమగునప్పటికే B.A. పూర్తిచేసిన సారథి బడిపంతులైన తన మేనమామ ఇంటిలో పశువుల కాపలాగా వుంటాడు. మేనమామకు చెప్పకుండానే M.A.లో చేరడానికి విశ్వవిద్యాలయానికి apply చేస్తాడు. విశ్వవిద్యాలయం నుండి ఇంటర్వ్యూ రావడంతో నవల ప్రారంభమౌతుంది.

### X.1.2. సారథి నిరుత్సాహం :

చెరువులో పశువులు మేపుతున్న సారథికి టీచరు మాధవరావు M.A. Interview Card తెచ్చియిస్తాడు. ఆనందంతో Interview Card అందుకొన్నా వాళ్ళ మామ పైచదువులకు పంపడని సారథి నిరుత్సాహపడుతాడు. ఉత్తమ ఉపాధ్యయ ప్రవృత్తి కలిగిన మాధవరావు ఎన్నో రకాలుగా సారథిని ప్రోత్సహిస్తాడు. ఆ ప్రోత్సాహంతో సారథి ఒక నిర్ణయానికి వచ్చి వాళ్ళ మామను పై చదువులకు పంపమని అడిగి మామ అత్తల దగ్గర అవమానం పాలౌతాడు.

### XI.1.3. సారథి నిర్ణయం :

నిరుత్సాహమే మిగిలిన సారథి మరుసటి రోజు కూడా పశువులను మేపుటకు వెళతాడు. ఆరోజు నిండు చూలైన ఒక ఆవు పాడుబావిలో పడి మరణిస్తుంది. పై చదువులకు పంపలేదని ఉక్రోషం కొద్ది ఆవును సారథి చంపేశాడని అత్తమామ యిరువురు సారథిని చాలా నీచంగా మాట్లాడుతారు. "వీడుపుట్టి నా చెల్లెల్ని చంపేశాడు. బ్రతికి మమ్మల్ని చంతుతున్నాడు. వీని తల్లితో వీడు చచ్చి వుంటే మాకు ఈ తిప్పలు వుండేవికావు." అన్న మేనమామ మాటలు సారథి హృదయాన్ని బాగా దెబ్బతీశాయి. దానికి తోడు అత్త శాపనార్థాలు సారథి మనసును కలచివేసాయి. అందుకే అర్థరాత్రి మాధవరావు సార్ దగ్గర 200/- రూపాయలు అప్పతీసుకొని, యూనివర్శిటీలో చేరడానికి బయలుదేరాడు సారథి. పిల్లలకు tuitions చెప్పి కాలం గడుపుతూ M.A. పూర్చి చెయ్యాలన్నది అతని ధ్యేయం.

### XI.1.4. విశ్వ విద్యాలయం :

జీవితంలో మొట్టమొదటిసారిగా విశ్వవిద్యాలయ ప్రాంగణంలో అడుగుపెట్టాడు. అతనికో మిత్రుడు కలిశాడు. అతని పేరు రాజు. ఇద్దరు కలసి Hotelకు

వస్తారు. ఇంటర్వ్యూ సమయంలో, విశ్వవిద్యాలయాల్లో జరిగే తంతు రచయిత చక్కగా వివరించాడు. Final Year వాళ్ళు, కొత్తగా చేరేవారిని ఆకట్టుకోడానికి చేసే ప్రయత్నాలు స్పష్టంగా వున్నాయి.

**XI.1.5. ఇంటర్వ్యూ :**

ఇంటర్వ్యూలో ఒక అధ్యాపకుడు విద్యార్థులకు ఇవ్వవలసిన కనీసపు గౌరవం కూడ ఇవ్వకుండ మాట్లాడడం సారధికి చాలా ఎబ్బెట్టుగా కన్పిస్తుంది. ఊరు, పేరు అడగడం, B.A. ఎక్కడ చదివావని అడగడం, Private గా ఎందుకు B.A. పాసయ్యావని అడగడం, M.A. Private గా ఎందుకు కట్టలేదని ప్రశ్నించడం ఇవే ఇంటర్వ్యూలో ప్రధాన ప్రశ్నలుగా యున్నాయి. కాని Subjectను గూర్చిన ప్రశ్నలు ఆ ఇంటర్వ్యూలో లేవు.

**XI. 1.6. హాస్టల్ :**

M.A.కు Fees కట్టి Hostel Seat సంపాదించి Hostelలో Roomకు వెళతాడు సారథి. వారివారికి allot చేసిన రూముల్లో వారు వారు వుండడం ఆ Hostelలో లేదు. ఆయా Subjectల వారు ఆయా రూముల్లో వుండడం లేదు. ఇక్కడ అదొక ప్రత్యేకమైన వాతావరణం. అక్కడ అంతా కులాల వారిగా విభజన. పేరు చివర కుల సూచి లేకపోతే అతని కులాన్ని గూర్చి తెలుసుకోవడానికి ఎన్నో ప్రయత్నాలు చేసేవారు. ఒక కులంవారు మరొక కులం వారితో స్నేహం చేయడం మహానేరమేమో అనేటట్లుగా వుంటుంది ఆ Hostel.

**XI.1.7. తరగతి గది :**

ఎప్పుడు తరగతులు జరుగుతాయో, ఎప్పుడు ఎందుకు జరగవో ఎవ్వరికీ తెలియదు. కారణం సరైనది అయినా, కాకపోయినా, ఎవ్వరో పదిమంది సమ్మె చేయాలంటే అందరు వారిని అనుసరించడమే తప్ప ఎందుకు అని ప్రశ్నించేవారులేరు. ఎవ్వడైనా అలా ప్రశ్నిస్తే, వాడిది ఏ కులమో తెలుసుకొని ఆ కులానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తారు. ఇది సారథి ఆనాడు చూసిన సంస్కృతి.

**XI.2. ఉపాధ్యాయ వర్గం :**

అక్కడ ఉపాధ్యాయుల ధోరణి చాలా చిత్రంగా, విచిత్రంగా అన్పించింది సారథికి.

## XI.2.1. హరినారాయణ :

హరినారాయణ అనే ఉపాధ్యాయుడు మహామేధావిగా గుర్తింపబడినాడు. నేనే మహాపండితుడననే భావం ఆయన అణువణువులో నింపుకొన్నాడు. వాడికేం తెలియదు, వీడికేం తెలియదు అని క్లాసులో మిగతా ఉపాధ్యాయులను గూర్చి తిట్టుకుంటూ ఉండడం ఆయనకున్న ఒక ప్రత్యేక గుణం. ఆయన క్లాసులో ఇష్టం వున్నా లేకపోయినా, పాఠం అర్థం అయినా, కాకపోయినా విద్యార్థిని విద్యార్థులు చాలా నిశ్శబ్దంగా వుంటారు. కారణం ప్రతిచిన్న విషయానికి ఆ హరినారాయణ పిల్లల మనసు నొప్పి కలిగేటట్లుగా మాట్లాడుతాడు. "మీకేమిరాదు. అయినా మీకు M.A. degreeలు వచ్చేస్తాయి. Researchలో Seat కూడ వస్తుంది. తర్వాత అదిగో ఆ వరండాలో Files పట్టుకొని మేధావులుగా తిరుగుతుంటారు. మీలాంటివాళ్ళకు పాఠాలు చెప్పడం నా ఖర్మ" ఇలాంటి మాటలు హరినారాయణ నిత్యం అంటుంటారు. ఆయనకు ప్రాచీన సాహిత్యమంటే వల్లమాలిన అభిమానం. గ్రాంధిక భాష మహాఇష్టం. అందుకే ఆధునిక కవుల్ని, వ్యవహారిక భాషను నిత్యం తరగతిలో నిందించడం అలవాటుగా పెట్టుకున్నాడు.

## XI.2.2. మరో అధ్యాపకుడు :

ఈయన తరగతిలో "అమృతం కురిసిన రాత్రి" పాఠం చెప్పే అధ్యాపకుడు 1. "వెలుగును వెనుక్కు నెట్టుతూ రేపటి రోజుకు, 2. పదివేల సం॥రాలనాటి పాతముఖాన్ని అతికించేందుకు, 3. ఒక ఆహా, హూహూ, వూ ప్రయత్నిస్తున్న ప్రాతఃకాలాన" అన్న పంక్తులలోని ఆహా, హోహో అన్నవి ధ్వని విశేషణంగా ఆ అధ్యాపకుడు Classలో శెలవిచ్చాడు. సారథిలేచి ఇది ధ్వని విశేషం కాదు, విశ్వనాథ సత్యనారాయణ నవల పేరని చెబితే ఆ అధ్యాపకుడు ఆ విషయాన్ని సహృదయంతో స్వీకరించకపోతాడు. ఆ అధ్యాపకుని మాటకు ఎదురుచెప్పావు కాబట్టి, M.A. Pass కావడం కష్టమని సారథికి మిగిలిన విద్యార్థులు చెబుతారు.

## XI.2.3. మరో అధ్యాపకుడు :

తరగతిలో పాఠాలు చెప్పడం అలావుంచి అలా అలా తిరుగుతూ, కాలేజి అమ్మాయిలతో, తన దగ్గర పరిశోధన చేసే విద్యార్థినులతో లాడ్జీలను పావనం చేయడం ఈ అధ్యాపకునికి నిత్యకృత్యం. ఇతను నీతులు చెప్పడంలో మంచిదిట్ట. అందుకు భిన్నంగా ప్రవర్తించడంలో ఆరితేరినవాడు.

### XI.2.4. ఓ ఆచార్యుడు :

విశ్వవిద్యాలయంలో ఒక చిన్న విషయానికి రెండుకులాల మధ్యవైరం ప్రారంభమైంది. ఆ సందర్భంలో ఈ ఆచార్యుడు తన కులం విద్యార్థులందరిని ఒక చోట చేర్చి "ఇక గమ్మున వుంటే లాభం లేదు. ఈ రాత్రికి మీరు Hostelలో వున్న మనవాళ్ళ అందరితోను కలసి మాట్లాడండి. రేపు ఉదయం ఆ గ్రూపుతో ఎదుర్కొనడానికి సిద్ధంగా వుండాలి. రేపు ఉదయం University సైరను, మ్రోగే సరికల్లా Main Building దగ్గర అన్ని వైపులనుండి మీరంతా ఒక్కుమ్మడిగా ఆగ్రూపు వాళ్ళని ముట్టడి చేయండి. అన్నట్లు వట్టిచేతులతో వెళ్ళకండి. అని ఈ ఆచార్యుడు విద్యార్థులను ఉసిగొల్పుతాడు. పాఠాలు చెప్పడంతోపాటు తన కులం వారికి ఉక్రోషాన్ని కలిగించడం ఈ ఆచార్యుల విధి నిర్వహణలో ఒకభాగం."

### XI.2.5. ప్రః ఉపన్యాసం

పేరుమోసిన ఆచార్యుని ఉపన్యాసం ఇవ్వవలసిందిగా విశ్వవిద్యాలయం ఆహ్వానిస్తుంది. అతను సరిగ్గా ప్రిపేరు కాకుండ వచ్చి ఏమి చెప్పాలో తెలియక విషయ అవగాహన లేకుండా, నోటికి వచ్చినట్లు విషయాల్ని చెబుతాడు. దానిపై సారథి రెండు, మూడు ప్రశ్నలు వేస్తాడు. అది సహించలేని ఆ ఆచార్యుని కులంవారు గొడవను ప్రారంభిస్తాడు. ఇక్కడ విషయం తెలుసుకోవాలనే ఆతురతకన్న తనకులంవాడే గొప్పవాడు, అతన్ని ఎవరు ప్రశ్నించకూడదనే సంకుచిత భావం పిల్లల్లో కన్పిస్తుంది. ఆచార్యునిలో కూడ, తాను విద్యార్థులకు విద్య నేర్పాలనే తపన కన్న తన ఆధిక్యతను చాటుకోవడానికే ప్రయత్నించినట్లు కన్పిస్తుంది.

### XI.2.6. రచయిత అభిప్రాయం :

ఈ నవల ముగింపులో సారథి పాత్ర ద్వారా రచయిత ఈ క్రింది భావాలు వెల్లడిస్తాడు. కులాలను రెచ్చగొట్టే ఆచార్యులు, తెలివైన విద్యార్థుల్ని చూచి అసూయపడే రీడర్లు, రీసెర్చ్ స్కాలర్స్‌తో లైంగిక సంబంధం పెట్టుకునే Lecturers డబ్బులు యిస్తే M.Phil., Ph.D., వ్రాసియిచ్చే మేధావులు, శీలాన్ని యిచ్చి ర్యాంకు సంపాదించే అమ్మాయిలు, బిడ్డకు పాలిచ్చే తల్లిని కూడా కాముక దృష్టితో చూసే పరిశోధక మేధావులు, కలం బలంతో కాకుండా కులం బలంతో ర్యాంకులు సంపాదించే ఉత్తర కుమారులు, ఆచార్యులు, యూనివర్శిటీ పాలకవర్గాన్ని బట్రాజులా పొగిడి U.G.C. Fellowship సంపాదించే

పరిశోధక విద్యార్థులు కులతత్త్వం ఆసరాతో లెక్చరర్ పోస్టు సంపాదించాలని డిపార్ట్‌మెంట్‌నే అంటిపెట్టుకొని వుండే డాక్టరేట్ హోల్డర్‌లు - వీళ్ళందరూ నివసించే విశ్వవిద్యాలయం ద్విపాద సంచార దండకారణ్యం అని అనుకొన్న సారధి M.A.ను మధ్యలోనే ఆపేసి Bank ఉద్యోగానికి వెళ్ళిపోతాడు.

## XII. పల్లెపిలిచింది :

1989 దీపావళి నవలల పోటీలలో ద్వితీయ బహుమతిని పొందిన ఈ పల్లె పిలిచింది నవల రచయిత ద్వారక. ఈ నవల ఆద్యంతం యితివృత్తంలో, సన్నివేశాల్లో, పాత్రచిత్రణలో, నేపథ్యచిత్రణలో, శైలిలో వాస్తవికతను కలిగివుంది. నేలవిడిచి సాము చేసే పద్ధతులు ఇందులో లేవు. ఒక మామూలు మధ్యతరగతి ఉపాధ్యాయుడు ఆత్మపరిశీలనముంటే ఓ మనిషి తాను పనిచేస్తున్న ఊరిలో విద్యార్థులతోపాటు ఆఊరి జనానికి కూడ చదువు, సంస్కారం నేర్పాలని ప్రయత్నించడమే ఈ నవలలోని ముఖ్యాంశం.

ఆ పల్లెలో ధనవంతులు లేరు. బడాభూస్వాములు లేరు. రాజకీయ నాయకులు అసలే కనిపించరు. ఆ ఊరిజనమంతా సాదాసీదావారే.

ప్రసాద్ అనే యువకుడు ఆ ఊరికి Head Masterగా వచ్చి అయిష్టంగా ఉద్యోగంలో చేర్తాడు. అతడు అంతకుముందు కలకడలో ఉద్యోగం చేస్తూ అక్కడి ఊరి పెద్దలు బిల్డింగ్ ఫీజులు వసూలు చేస్తుంటే వద్దని చెప్పినందుకు పనిష్మెంటుగా ప్రసాదును తమిళ దేశపు సరిహద్దులో వుండే జంబాడ గ్రామానికి బదిలీ చేస్తారు.

డ్యూటీలో చేరిన ప్రసాదు చేరిన రోజే చిత్తూరు చేరి రెండు మూడు మాసాలు జీతాల రోజు మాత్రమే జంబాడ వెళ్ళి వస్తాడు. ఆ తర్వాత క్రమంగా ఆ ఊరిలో ఉండడానికి అలవాటు పడి ఏడో తరగతి వరకున్న ఆ పాఠశాలను పదో తరగతి వరకు పెంచడానికి అనేక విధాలుగా కృషిచేస్తాడు. ఊరి వారి సహకారంతో క్లాసు గదులు నిర్మిస్తాడు. ఆ ఊరిలో వీథినాటకాలు వేయించి ఊరివారి మనస్సులను చూరగొంటాడు. ఆ ఊరి వారినుండి త్రాగుడు మానిపిస్తాడు. చివరకు బదిలీ అయి వెళ్ళేటప్పుడు ఊరు ఊరంతా కన్నీళ్ళు పెట్టుకొని వీడ్కోలు చెబుతుంది. ఇంతే ఈ నవల్లో వున్న కథ.

నవల ఆద్యంతము ఎక్కడ కాని మోసాలు, దగాలు, రచ్చలు, రంపులు, ఇలాంటి వర్ణనలు ఏమీ లేకుండా కేవలం ఒక్క ఉపాధ్యాయుని ఉపాధ్యాయ వృత్తిని మాత్రమే ఈ నవల్లో చిత్రించి వుండడము గమనింపదగిన అంశం.

**XII.1. ఉన్నతాధికారులు :**

చదువు నవల ప్రాథమిక విద్యావిధానాన్ని వివరిస్తుంది. దండకారణ్యం ఉన్నత విద్యావిధానాన్ని తెలియజేస్తుంది. పల్లెపిలిచింది మాధ్యమిక విద్యావిధానాన్ని తెలియజేసే నవల. చదువు నవల్లోని రాఘవయ్య లాంటి ఉపాధ్యాయులను అధికారుల బెడద ఏమీ వుండదు. ఆ పాఠశాలకు వారే సర్వస్వతంత్రులు. దండకారణ్యం నవల్లోని ఆచార్యులు, రీడర్లు, లెక్చరర్లు తమంత తాముగా వేరొక విశ్వవిద్యాలయానికి ఉన్నత పదవులకై వెళ్ళాలనుకుంటే తప్ప బదిలీలు లేవు. నిర్ణీత సమయంలో ఒక గంట పాఠం. వారు ఏమి చెబుతారో అడిగే అధికారులు లేరు. కాని పల్లెపిలిచింది నవల్లోని మాధ్యమిక పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయుల్ని శిక్షించే అధికారులు ఎందరో వున్నారు. కొన్ని పనిష్మెంటు ఏరియాలు వుంటాయి. ఉపాధ్యాయుడు ఏదైనా తప్పుచేస్తే ఆ ఏరియాకు బదిలీ చేయడం అధికారుల చేతిలో వుంటుంది. కాని అధికారులు అవినీతిపరులు అయినప్పుడు తప్పుచేయని వారినిగూడ తమ స్వార్థంకోసం పనిష్మెంటు ఏరియాలకు బదిలీ చేస్తారు.

కలకడలో ఎంతో పేరు ప్రఖ్యాతులతో ఉన్నత ఉపాధ్యాయుడనిపించుకొన్న ప్రసాదును పనిష్మెంట్ ఏరియా అయిన జంబాడకు మారుస్తారు. వృత్తినే దైవంగా భావించే ప్రసాదు మూడు మాసాలు అసలు బడికే వెళ్ళడు. వెళ్ళక పోగా చిత్తురూ లోనే వుండి తనను బదిలీ చేసిన అధికారికి రోజూ కావాలనే కన్పిస్తాడు. అయినా ఆ అధికారి అవినీతిపరుడు కాబట్టి నువ్వు ఎందుకు బడికి వెళ్ళలేదని అడగలేదు. ఇలాంటి అధికారుల వల్ల సున్నితమైన మనస్సు గలిగిన ఉపాధ్యాయులు తమ వృత్తిపైన అభిమానాన్ని పోగొట్టుకుంటారు.

**X.2. వసతులు :**

విద్యార్థులు విద్య నేర్చుకోవడానికి సరైన వసతి అవసరం. ఇంటి వసారాలు, వీథి అరుగులు, చదువు నవలలో ప్రాథమిక విద్య నేర్చుకునే వారికి వసతులుగా మనకు కన్పిస్తాయి. చక్కని భవనాలు, మంచి ఫర్నిచర్ కలిగిన తరగతి గదులు, హాస్టల్ రూమ్‌లు, మెస్‌లు ఉన్నత విద్య నేర్చుకునే వారికి దండకారణ్యంలో మనకు కన్పిస్తాయి. ఒక్క పూట సర్వర్ నీళ్ళ గ్లాసు దొర్లించాడని సర్వర్‌ను చితకబాదిన సన్నివేశాలు విశ్వవిద్యాలయాల్లో వున్నట్లు దండకారణ్యం చెబుతుంది. జంబాడ గ్రామంలో అటు ఉపాధ్యాయులకుగాని ఇటు విద్యార్థులకు గాని వసతులు ఏమీలేవు. ఆ పాఠశాల కంతటికీ కలిపి ఒక కొయ్యపెట్టె ఒక కూర్చీ మాత్రమే వున్న ఒక పాకలోనే మధ్యలో తడక గట్టి ఒకవైపు ప్రధానోపాధ్యాయుడు వంటి మరొక వైపు పిల్లల పాఠాలు, పలక

బలపాలు కావాలన్న నోట్స్, పెన్సిల్ కావాలన్న వారపు సంతరోజు వరకు ఆగి, నాలుగు మైళ్ళు నడిచి, తెచ్చుకోవలసిందే. విశ్వవిద్యాలయంలో మెస్ బిల్ ఎంత మంది కడుతున్నారో తెలియదు. కాని వారికి భోజనానికి ఇబ్బంది లేదు. జంబాడ పాఠశాలలో అపూట భోజనం కూడ పిల్లలకు సమయానికి పెట్టలేని వారు ఎందరో. ఇది ఆ స్కూల్ దుస్థితి.

## X.3. ఉపాధ్యాయ వర్గం :

శిల్పి తన పని నేర్పుతో ఒక రాతిని చూడముచ్చటైన విగ్రహంగా చెక్కుతాడు. ఉపాధ్యాయుడు తాను శిల్పియై ప్రాణమున్న మనిషి మేధస్సును అనువైన రూపంలోకి మలచాలి. అదే నిజమైన ఉపాధ్యాయుని వృత్తి. శిష్యుల్ని భయపెట్టి, భ్రమపెట్టి ఉపాధ్యాయుడు మేధావుల్ని తయారు చేయలేడు. విద్యార్థుల హృదయాలలోనికి చొచ్చుకొని పోయి వారి మేధస్సును సమాజానికి అనువైన రీతిలో మలచుకోవడానికి ఉపాధ్యాయుడు ప్రయత్నించాలి. చదువు నవల్లో ఉపాధ్యాయులు విద్యార్థుల్ని భయపెట్టటమే కలిగి వున్నారు. దండకారణ్యం నవలలో విశ్వవిద్యాలయ అధ్యాపకులు విద్యార్థులను ఒక భ్రమలోనికి నెడుతున్నట్లు తెలుస్తుంది. పల్లె పిలిచింది నవలలో జంబాడ పాఠశాలలోనే ఉపాధ్యాయులు మొదట భిన్న స్వభావాలు కల్గి వున్నప్పటికీ చివరికి ప్రసాద్ కృషివల్ల అందరు అధ్యాపకులు అంకిత భావంతో పనిచేసేటట్లుగా తయారు అవుతారు.

ఇక్కడ వున్న శ్రీనివాసులు అనే టీచరు ఏదోవిధంగా పూరందరి దగ్గర మెప్పుపొందాలని తాపత్రయ పడతాడే కాని, వృత్తికి న్యాయం చేయాలనే ఆలోచన లేదు. ఒక టీచరు మరొక టీచరు కార్యక్రమాలపై విద్యార్థుల్ని వేగులుగా ఉపయోగిస్తుంటాడు. ఇంకొక అధ్యాపకుడు వేరొక గ్రామం నుంచి తీరుబడిగా 11-00లకు పాఠశాల వచ్చి, సంతకం పెట్టి 12-00లకు తిరుగుముఖం పడతాడు.

## XII.4. ప్రధానోపాధ్యాయుడు :

హైస్కూల్‌లో ప్రధానోపాధ్యాయుడు విశ్వవిద్యాలయాల్లో ఆచార్యులు, ఇంచుమించు ఒక కోవకు చెందిన వారే. ప్రధానోపాధ్యాయుని యోగ్యతను, నడవడికను బట్టి ఆ స్కూల్ భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. ఆచార్యుడు లేక శాఖాధ్యక్షుని నడవడిక, యోగ్యతను బట్టి విశ్వవిద్యాలయాల్లో ఆ శాఖల బాగోగులు వుంటాయి. దండకారణ్యం నవల్లో ఒక ఆచార్యుడు తనకులం వారి నందరిని ఒకచోట చేర్చి వేరొక కులం వారిపైకి వుసిగొల్పి విశ్వవిద్యాలయాల్లో జరిగిన భీకర పోరాటానికి మార్గదర్శకుడైనాడు.

జంబాడలోకానికి అయిష్టంగా ప్రధానోపాధ్యాయునిగా ప్రవేశించిన ప్రసాదు కొంత కాలం ఆ పాఠశాలపై మక్కువ చూపకపోయినా తరువాత ఆ ఊరి పిల్లలకు, ఆ ఊరి ప్రజలకు దేవుడులాంటి వాడవుతాడు. సభ్యత సంస్కారాలు కల్గిన ప్రసాదు ఒక్క అధ్యాపకుని మనస్సు నొప్పించకుండా వారికి మార్గదర్శకుడిగా, తాను కష్టించి పనిచేస్తాడు. తన పనిని చూచిన మిగిలిన ఉపాధ్యాయ వర్గం తమంతట తాముగా కష్టపడి పాఠాలు చెప్పే ఉపాధ్యాయులుగా తయారవుతారు. ఈ మార్పు తేవడానికి ప్రసాదు ఎంతో కృషి చేస్తాడు. ఇదే ఉత్తమ ఉపాధ్యాయుని కర్తవ్యం.

దండకారణ్య నవల్లోని ఆచార్యులు, ప్రాచార్యులు, క్లర్కుల్ని, అటెండర్లని తమ స్వవిషయాలకు ఉపయోగించుకోవడం కనబడుతుంది. జంబాడా పాఠశాలలో తాగితందనానలాడే పాఠశాల వాచ్‌మేన్‌లో మానసిక మార్పును తెచ్చి అతనినొక ఉత్తమ వ్యక్తిగా ప్రధానోపాధ్యాయుడు ప్రసాదు మారుస్తాడు. మెత్తని మాటలతో మందలింపులే కాని కలంవేటు కఠోర నిర్ణయాలు తీసుకోవడం ఇక్కడ కనిపించదు. మనిషిని శిక్షించడానికన్నా మనిషిలో మార్పు తేవడం సమాజానికి అవసరం. మారిన వాచ్‌మేన్ ఆ పాఠశాల, ఆ ఊరు అభివృద్ధి చెందడానికి ఎంతో కృషి చేస్తాడు.

## XII.5. దుష్టాచారాలు :

ఎవ్వరు ఏపని చేసినా పర్వాలేదు కాని ఉపాధ్యాయుడు కొన్ని పనులు ఎట్టి పరిస్థితుల్లోను చేయకూడదు. ఎందుకంటే భావి భారత పౌరుల్ని తీర్చిదిద్దేవాడు ఉపాధ్యాయుడు. తాను దొంగతనం చేస్తూ, విద్యార్థులకు దొంగతనం చేయకూడదని చెప్పలేడు. అందుకే ఉపాధ్యాయుడు తన వ్యక్తిత్వాన్ని పవిత్రంగా కాపాడుకోవాలి. దండకారణ్యం నవల్లో మనకు కనిపించే విశ్వవిద్యాలయాల్లోని అధ్యాపకులు కొందరు బస్‌స్టాండులోను, రైల్వే స్టేషన్‌లలోనూ, బిడ్డలకు పాలిస్తున్న తల్లుల వైపు కామదృష్టితో చూచినట్లు చెప్పబడింది. అంతేకాకుండా వారికొందరు నిత్యం వ్యాపారాల్లో మునిగిపోయి వుండడం తెలుస్తుంది. జంబాడ పాఠశాల్లోని ఉపాధ్యాయులు ఇలాంటి దురాచారాలకు లోనుకాలేదు. కాని మొదట అధ్యాపకులు పాఠశాలకు సక్రమంగా రాకపోవడం, ఏవో చిన్న చిన్న వ్యాపారాలు చేసుకోవడం వుంటుంది. అయినా ప్రసాదు నడవడికతో అలాంటి చిన్న చిన్న దురాచారాల్ని కూడా వదిలిపెట్టి వారందరు మంచి నడవడిక కలిగిన ఉపాధ్యాయులుగా తయారవుతారు.

చదువు నవలలో ఉపాధ్యాయుల మధ్య ఐక్యత మనకు కన్పించదు.

దండకారణ్యం నవలలో ఉపాధ్యాయవర్గం మధ్య కులభేదమెంతో పనిచేసినట్లు కన్పిస్తుంది. జంబాడ పాఠశాల్లో ఉపాధ్యాయులు మొదట ఎవ్వరంతకు వాల్లున్న ప్పటికి ప్రసాదు కృషి వల్ల వారందరు ఎంతో ఐక్యతతో నూతన భవన నిర్మాణం చేసి ఊరివారందరి దగ్గర ఉత్తమ ఉపాధ్యాయులుగా గుర్తింపబడతారు.

## XII.6. సత్సంప్రదాయాలు :

చదువు నవలలో ప్రాథమిక విద్య నేర్పించే ఆ ఉపాధ్యాయులలో సత్సం ప్రదాయం ఎక్కడా కనిపించదు. అస్పృశ్యత, అహంకారం, అనాలోచిత చర్యలు వారిలో మనకు కన్పిస్తాయి. దండకారణ్యం నవలలో విశ్వవిద్యాలయ అధ్యాపకులలో రచయిత తెలియజేసిన ఏ అధ్యాపక పాత్రలోనూ కొంచమైన మంచి కనిపించలేదు. కాని జంబాడ పాఠశాలలోని అధ్యాపకులు ఆ పాఠశాల విషయమే గాకుండ ఊరి విషయంలో కూడా ఎన్నో మార్పులు తీసుకొని వస్తారు. ఆ ఊరిలోని వారికి వీధి నాటకాలు నేర్పి, త్రాగుడు మాన్పించి ఆ ఊరిని ఒక ఆదర్శప్రాయంగా మార్చడానికి ఆ ఉపాధ్యాయ వర్గం ఎంతో కృషి చేస్తుంది.

## XIII.ముగింపు :

స్వాతంత్ర్యానికి పూర్వం ప్రాథమిక విద్యావిధానం ఎలా వుండేదో 'చదువు' నవల చెబితే, స్వాతంత్ర్యానంతరం విశ్వవిద్యాలయాల్లో విద్యావిధానం ఎంత దారుణంగా వుందో దండకారణ్యం చెప్పింది. రెండు నవలల్లోను వాస్తవికత ఎంత వున్న కల్పనలు లేకపోలేదు.

సమాజంలోని సమస్యల్ని ఎత్తి చూపడానికి సమాజంలోని అత్యున్నత వర్గ మైన ఉపాధ్యాయ వర్గంలోని లోటుపాట్లను నిశితదృష్టితో ఇద్దరు రచయితలు పరిశీలించారు. కాని ఆ నవలలు చదివితే ఆ విధానాల మీద పాఠకులకు విపరీతమైన ఏహ్యాభావం కలుగుతుంది కాని అంతకుమించి ఏమికాదు.

'పల్లె పిలిచింది' నవలలో రచయిత ఒక మహాద్భుతం సృష్టించాడు. సమాజంలో అత్యున్నత వర్గానికి చెందిన ఉపాధ్యాయుడు ఎలా వుండాలో ఈ నవల చాలా చక్కగా చెప్పింది. అది తప్పు, ఇది తప్పు అని చెప్పడం చాలా సులువు. ఏది సక్రమమో చెప్పడం చాలా కష్టం. ప్రతివాడు సమాజశ్రే యస్సుకు తనవంతు కృషితాను చేస్తే, సమాజం దానంతకు అది ముందుకు వెళుతుంది. ఈ సత్యాన్ని చక్కగా చెప్పిన నవల పల్లె పిలిచింది. అధికారులు అన్యాయంగా ప్రవర్తించినప్పుడు కూడా ఉపాధ్యాయుడు మనోనిబ్బరంతో అటు అధికారుల మెప్పునే కాకుండా, పల్లెజనాల నీరాజనాల్ని అందుకోవడం

ఈ నవలలోని ప్రధానపాత్ర సాధించిన ఘనవిజయం. పల్లె పిలిచింది నవల చదివితే ప్రతి ఉపాధ్యాయుడు తాను ప్రసాదులాంటి ఉపాధ్యాయునిలాగా వుంటే ఎంత బాగుంటుందో అని అనుకొంటాడు. మనిషిలో ఈ ఆలోచన రేకెత్తించినప్పుడే నవల ప్రయోజనం నెరవేరుతుంది. అన్ని సదుపాయాలు వున్నప్పుడే కాక ఏ సదుపాయాలు లేనప్పుడు, అధికారులు మొదలైనవారు ఏ సహాయ సహకారాలు అందించనప్పుడు అనవసరంగా వారు వ్యతిరేకించినా కూడా సహనంతో పరిస్థితుల్ని తన కనుకూలంగా మార్చుకొని ఈ నవలలో ప్రధాన పాత్రధారి ప్రసాదు మనకు మార్గదర్శకుడుగా నిలచాడు. రచయిత ద్వారక స్వయంగా ఉపాధ్యాయుడు కాబట్టి ఉపాధ్యాయులు కానివారు చెప్పలేని ఎన్నో ఉపాధ్యాయ వృత్తిలోని విషయాల్ని ఈ నవలలో పొందుపరచాడు. సమస్యల్ని చెప్పడం ప్రతి రచయిత చేస్తాడు. సమస్యలకు మార్గాల్ని చెప్పడం చాలా కష్టం దాన్ని సాధించినవాడు ద్వారక. నవలలో సమస్యల్ని సృష్టించి నిర్ణయాన్ని పాఠకులకు వదలకుండా సమస్యల్ని సరిదిద్దుకొనే మార్గాల్ని చేపట్టిన నవల పల్లెపిలిచింది. ఉత్తమ ఉపాధ్యాయులకు పల్లె పిలిచింది నవల ఒక మార్గదర్శకంగా వుంటుందనడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు.